కనకరాజు, గోటేటి

ఆంగ్లేయ రాజ్యాంగ నిర్మాణచరిత్ర

మచిలీపట్టణము, 1910

Record no. 470

Kanakarāju, Gōṭēṭi

Āṃglēya rājyāṅga nirmāṇacaritra

Macilīpaṭṭaṇamu, 1910

Record no. 470

## Bibliographic Record Target

కనకరాజు, గోటేటి.

ఆంగ్లేయ రాజ్యాంగ నిర్మాణచరిత్ర : ప్రథమభాగము / గోటేటి కనకరాజు గారిచే రచియింపఁబడినది.- మచిలీపట్టణము : ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము, 1910.

iii, vii, 310, iv, 6, iii p. :ills., maps, port. ;19 cm.

Record no. 470

Kanakarāju, Gōṭēṭi.

Āṃglēya rājyāṅga nirmāṇacaritra : prathamabhāgamu / Gōṭēṭi Kanakarāju găricē raciyimpam̐baḍinadi.- Macilīpaṭṭaṇamu : Āṃdhrabhāṣābhivarthanī saṅghamu, 1910.

iii, vii, 310, iv, 6, iii p. :ills., maps, port. ;19 cm.

Record no. 470



ఆంధ్రభాషాభివర్ధనీ ప్రచురణలు -10.

# ఆంగ్లేయ రాజ్యాంగ నిర్మాణచరిత్ర

—— ::o:: ——

## ప్రథమ భాగము.

———

మదరాసు గవర్నమెంటు ట్రాన్స్లేటరుగారగు

గోటేటి కనకరాజు బి. ఏ., బి. ఎల్., గారిచే

రచియింపఁబడి

——— :o; ———

ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము (లిమిటెడ్) వారిచే

ప్రకటింపబడియె.

1910

కృష్ణాస్వదేశి ముద్రాక్షరశాల

మచిలీపట్టణము.



మూల్యము. 1—4—0

గురుభ్యోన్నమః



లోకోపకార దీక్షారతుడును

ఆంధ్రగద్య కవితాపితామహుండును

విశుద్ధచారిత్ర మహామహిముడును

ఏకేశ్వర మానసికారాధనా ప్రతిపాదకుండును

అనాథ సుందరీ శోకాపనోదకుండును

ప్రభుప్రసాదిత రావు బహద్దరు బిరుదాంకితుడును

అస్మజ్జ్ఞాదాన గురుడును

నగు

కందుకూరి వీరేశలింగం పంతుల వారికి

గురుదక్షిణగా

నీగ్రంథము సమర్పింపఁబడినది.



# విషయసూచిక

::o::




# ఉపక్రమము.

హిందూదేశము విశుద్ధస్వరాజ్యభాగ్యము ననుభవించిన పూర్వకాలము నందు మతసాంఘిక రాజకీయాచారములు శ్రుతిస్మృత్యనుసారములుగా రాజులచేఁ బాలింపబడుచుండినవి. పారమార్థిక విషయమునమనలో సనాతనముగ స్థిరపడిన మూలసిద్ధాంతములు జనులలో నాచంద్రార్కముగ వర్థిల్లునట్లు జాగరూకులై యప్పు డప్పుడు శిష్టులు ప్రాచీనాచారములను మార్చుకొని నూతనాచారముల నవలంబించి పురోవృద్ధికి మార్గప్రదర్శకులగుచుండిరి. స్వదేశరాజులపాలనమునకు భంగము కలుగనియెడల మనయాచారము లిట్లు కాలానుగుణ్యములుగమారి దేశాభివృద్ధి కనుకూలసాధనములుగా నమిరియుండును. మనదేశమందు క్షాత్రసంపద యంతరించి విద్యాసంపద వృద్ధియగుట వలన విదేశరాజులపాలనము సంప్రాప్తమై పారతంత్ర్యము సిద్ధమయ్యెను. మహమ్మదీయుల రాజరికము మనదేశమున స్థిరపడిననాటనుండి నేటివఱకును రాజులు మనమత సాంఘికాచారములను ప్రజలకు విడిచిపెట్టి తమకు యుక్తమని తోఁచినట్లు రాజ్యతంత్రమును మార్చుకొని దేశమును బాలించుచున్నారు. అందుచేఁబూర్వము రాజులచే వహింపఁబడిన దేశాచార సంరక్షకభారము ప్రజలపైఁబడెను. విలక్షణాచారాభిమానులగు విదేశరాజులకాలములోవారు స్వదేశాచారముల విషయమున జోక్యముపుచ్చుకొనకపోవుట మన దేశమునకు క్షేమకరమని చెప్పుటకు సందేహములేదు. అయినను, ధర్మమురాజానుమతముగ జరుగవలసినదగుటచేతను, బరిపాలకు లవలంబించిన మహమ్మదీయ క్రైస్తవమతముల వ్యాప్తికొఱకా మతప్రవర్తకులు దొరతనమువారి బలమునూఁతగొని తీవ్రసంకల్పులై ప్రయత్నములు చేయుచుండుటచేతను, పారతంత్ర్యదైన్యోపహతులగు హిందువులు విదేశవిలక్షణాచార సంసర్గము చొరకుండఁ దమ యాచారములను గాపాడుకొనుటకే పరితపించవలసినవారైరి. సముద్రయానము నిషేధింపఁబడుటచే విదేశవాసుల యాచారపరిజ్ఞానమునకు దూరగులైరి. విలక్షణాచారవంతులగు విదేశరాజులుతమ మత[illegible]

చారములకు విరోధులుగఁ గన్పట్టుటచే వారి సంసర్గము వలన మనదేశస్థులాచారవిషయములందు లాభము నొందఁ జాలకపోయిరి. ఫ్రాన్సురాజ్యనిపాతకాలమున, వాదేశవాసు లవలంబించిన నిర్మూలసంస్కార ప్రయత్నము లాంగ్లేయులకుఁగూడఁ బ్రాకుననిభయభ్రాంతులై యాంగ్లదొరతనమువారు స్వదేశరాజకీయ సంస్కారముల మాట కట్టిపెట్టి వానినిగూర్చి తలపెట్టినవారిని ఘోరశిక్షల పాలుచేయుటకు శాసనములనుజేసి, తమ కున్న రాజ్య పద్ధతులను గాపాడుకొనుట కెన్నియోపాట్లుపడిరి. ఆకాలమునవట్టి నిర్బంధన శాసనములవసరములని ప్రజలు సహించియూరకుండిరి. ఇట్లు ప్రబలమగు దేశోపద్రవము తటస్థించి నప్పుడు జనులను భయకంపము లావహించి, కాలానుగుణ్యముగఁ జేసికొనవలసిన సంస్కారముల విషయమున వివేకమును జంపివేయును. ఈ కారణములచే ననేక శతాబ్దములనుండి మనయందాచారములలో నివృత్తిధర్మము మితిమీరివృద్ధియై మనదేశమును శ్రేయోభివృద్ధులకు దూరము చేసినది.

ఆంగ్లేయులు మనదేశమునందు నెలకొల్పిన రాజ్యతంత్రము కొనసాగుటకు మనదేశస్థుల కాంగ్లవిద్య నేర్పుట యావశ్యకమైనందున దొరతనమువారు విద్యావిషయమునఁ బనికలుగఁజేసికొని యాంగ్లవిద్యాభ్యాసము వృద్ధిచేసిరి. రాజ సంరక్షణము లేక స్వదేశవిద్య నానాటికిక్షీణదశకు వచ్చినది. విదేశచారిత్రపరిశ్రమము చేసిన యాంగ్లవిద్యామహితులు మన యాచారములను మార్చి దేశము నభివృద్ధికిఁ దీసికొనివచ్చుట కనేక ప్రయత్నములు చేయుచున్నారు. కాని, వర్తమానస్థితి గతులను బట్టి సువ్యక్తములుగాఁ గనఁబడు నాచారలోపములను మాత్రము వీరు గణనచేయుచుందురు స్వదేశవిద్యావివేకములేనివారగుటచే వీరు సంస్కరింపఁదలఁచిన యాచారములు మన మతాచారములకు మూలబీజములగు శ్రుతిస్మృతి ధర్మములను గాపాడుటకుఁ గాలగతిననుసరించి పుట్టినవని కాని, అట్టి ప్రధానప్రయోజనమునకు భంగము లేకుండ సంస్కరించుట యావశ్యకమని గాని వీరు తలపెట్టరు. అందుచే వీరు సంకల్పించిన సంస్కారములు దేశాచారముల పూర్వసందర్భములను బెడఁ



ఆంగ్లవిద్యాధికులకు స్వదేశ జ్ఞానసూత్రములను స్వధర్మవిద్వాంసులకు విదేశధర్మసూత్రములను సూచించుటయే యీగ్రంథరచనయొక్క ముఖ్యోద్దేశ్యము. ఉభయభాషాపండిత మండనులిట్టి సూత్రగ్రహణమున కీగ్రంథము పురికొల్పి యీవిషయములనుగూర్చి చర్చించు విస్తృతగ్రంథరాజముల నుజదువునట్లు వారి నవహితులఁ జేయఁ గలిగినయెడల, సంకల్పసిద్ధినొందినవాఁడనై సంతసిల్లుచున్నాఁడను.

ఏలూరు<br>12-9-09

గోటేటి కనకరాజు





# ఆంగ్లేయరాజ్యాంగనిర్మాణచరిత్ర.

## అధ్యాయము 1

### ప్రాచీనవృత్తాంతము.

**449—1066**

—:o:—

ప్రస్తుత మింగ్లండని పిలువఁబడు దేశము పూర్వకాలమందు బ్రిటానియా యని వాడఁబడుచుండెను. ఇందలి యాదిమనివాసు లెవ్వరో తెలిసికొనుటకు విశ్వాసార్హ్వమైన యాధారము లేవియుఁ గానఁబడవు. కెల్టులనఁబడు నొకజాతివారు కడుప్రాచీనకాలమందే యీ దేశస్థులను జయించి దేశము నాక్రమించుకొన్నట్లును, వారిని రోమురాష్ట్రనివాసు లగు రోమకు లోడించి మూఁడువందల యేఁబది సంవత్సరములు రాజ్యముచేసినట్లును జారిత్రములవలనఁ దెలియవచ్చుచున్నది. వారిరాకకుఁ బూర్వము దేశ మరణ్యమయమైయుండఁగా, రోమకులే బాటలేర్పఱచియు, పట్టణములను నిర్మించియు, కృషి వాణిజ్యాదులను వృద్ధిచేసియు, ననేకవిధముల దేశమును బాగుచేసిరి. రోమకులును కెల్టులును గాక పిక్టు లను నాటవికులు కొందఱు రోమకులకు లొంగక దైవమిచ్చిన కొండలే కోటలుగా బ్రిటనున ఉత్తర దిశను స్వతంత్రులై మనుచు, అప్పుడప్పుడు బ్రిటనుమీఁదికి దండెత్తి వచ్చి కొల్లఁగొనుచు నుండిరి. బ్రిటనునకుఁ దూర్పుదిననున్న జర్మనీ దేశములో ఆంగిలులు, జూటులు, సాక్సనులు నను మూఁడు తెగల మోటుజనులు నివసించుచు నీటిదొంగలై పడవలమీఁద నితర దేశములమీఁదికి దండెత్తి కొల్ల

పెట్టుచు జీవించుచుండిరి. ప్రపంచ చరిత్రములోఁ గడు ప్రాచీన కాలమందే మిక్కిలి నాగరికతనొంది స్పానియా, ప్రాన్సు, ఆఫ్రికా మొదలగు సామంతరాజ్యములను దన యేలుబడిలోనికిఁ దెచ్చుకొని రోమక రాజ్యము మిక్కిలి ప్రఖ్యాతి గాంచినది. రాజ్యము వృద్ధియైనకొలఁది సామంత భూముల నితరుల దండయాత్రలనుండి కాపాడుకొనుట దుర్ఘటమయ్యెను. ఐదవశతాబ్దము చేరఁబడువాటికి సామంత దేశములన్నియు రోమక రాజ్యమునుండి విడిపోయి తుదకు స్వదేశమగు ఇటలీ దేశము నిలుచునో లేదో యను భయముఁ గలిగెను. ఈ సమయమునందు పిక్టులొకవంకను జర్మను దేశమునుండి శాక్సనులు మఱియొకవంకను బ్రిటానియాను ముట్టడించిరి. బ్రిటానియా సంరక్షణార్థ మా దేశమున రోమక ప్రభుత్వము వారు నిలిపిన రక్షకభటుల నదివఱకే ఇటలీని గాపాడు నిమిత్తము వారు తీసికొనిపోయిరి. మూఁడు శతాబ్దములు రోమక ప్రభుత్వమునకుఁ దలయొగ్గి స్వాతంత్ర్యభాగ్యము నెఱుఁగక మనిన బ్రిటానియాప్రజ లీ పిక్టులను శాక్సనులను మార్కొనలేక, తమ యాపదలను రోమక ప్రభువులకు నివేదించుకొని సాహాయ్యముకోరి విఫలమనోరథులైరి. అందుపై వీరు జర్మనీదేశమునకే పోయి మడిమాన్యము లిచ్చుట కొడఁబడి జూటులను దేశమునకుఁ దెచ్చుకొని వారి సాయమున శత్రువుల నోడించిరి. (క్రీ. శ. 449.)

నాటనుండియు జర్మనీదేశమునుండి ఆంగిలినులు శాక్సనులును జూటులును బ్రిటానియాకుఁ దెగలు తెగలుగాఁ బెక్కుమాఱులు దండెత్తివచ్చి బ్రిటనులతో యుద్ధముచేసి వారినోడించి దేశము నాక్రమించుకొనిరి. వీరిలో నాంగిలిలు తక్కినవారికంటె బలగమునందును బలమునందును నధికులై దేశమును బాహుళ్యముగ నాక్రమించుకొని కాలక్రమమున జూటులను శాక్సనులను దమలో నిమిడించుకొనిరి. ఇట్లు విజృంభించిన యాంగ్లేయులను బట్టియే దేశమునకు బ్రిటానియా యను పేరు మాసిపోయి యింగ్లాండు అను పేరు వాడుకలోనికి వచ్చినది.



ఆంగ్లేయుల యాచారవ్యవహారములను గూర్చియు రాజ్యాంగధర్మములను గూర్చియుఁ గొంత విచారింపవలసియున్నది. ఆంగ్లేయాదు లింగ్లాండునకు సతీసుతదాసపశుసంతానములతో వచ్చియుండుటచే, తమ తొల్లిటి నివాసస్థానమగు జర్మనీదేశములోని రాజకీయ సాంఘికాచారములనే ఇంగ్లాండున వాడుకొనుచుండిరి. వీరు దేశమునఁ గాలుపెట్టకమునుపే రోమకులు స్వదేశమునకుఁ బోయియుండుటచే రోమకసంపర్కము వీరి కంటలేదు. వీరిచేఁ బరాజితులగు బ్రిటనులు దేశమునకుఁ బశ్చిమభాగమున నొదిగియుండి కొంతకాలము తలదాచుకొని, విజయదీక్ష వహించి మీఁదమీఁదకు వచ్చుచున్న యాంగ్లేయాదుల ధాటికాగలేక తుదకు వేల్సు కంబ్రియా మండలములను మాత్ర మాధారము చేసికొనవలసినవారైరి. ఆంగిలేయులతోఁ జిరకాలము నడచిన యీయుద్ధములలో బ్రిటనులలోని బలపరాక్రమ మహితులగు ప్రముఖులు హతులైరి. కొందఱు విదేశములకు వలసపోయి ప్రాణములు దక్కించుకొనిరి. పిఱికిపందలు జేతలపాలిటి బానిసలై యూడిగములు చేయుచుండిరి. నష్టశేషులగు కెల్టు లాంగిలాదులతో నన్యోన్య వివాహము లాడి వారిలో నిమిడిపోయి పేరుమాసిరి. అందుచే జర్మనుల యాచారములు మార్పుఁ జెందక యాంగ్లదేశమున వర్ధిల్లినవి.

చారిత్రముల కందని కడుప్రాచీన కాలమందు జనులు స్థిరనివాసములు లేక, పశువులే ధనముగాఁ గలిగి వాటిసంరక్షణకు వలయు పచ్చికబయళ్ళు గల ప్రదేశములం దనువగునంతవఱకు నిలుచుచు, అనువుదప్పిన వెనుక మఱియొకచోటును వెదకికొనుచు సంచారశీలురై యుండుచు వచ్చిరి. కొంతకాలమునకీ సంచారవృత్తి మాని యొక్కొకచోట స్థిరపడి నివాసమేర్పఱచుకొనిరి. జర్మనీదేశములో జనులిట్లు స్థిరనివాసములను గుదుర్చుకొని, స్వతంత్రులై మనెడు కొన్ని జాతులుగా విడిపోయి యుండిరి. అన్నిజాతులవారును భూమిని సాముదాయముగా నంచుకొని అందలి పచ్చికబయళ్ళను సమష్టిమీఁద జనులందఱు ననుభవించుచు సేద్యభూమిని సంవత్సర

మున కొకసారి పంచుకొని పంట లయినతరువాత నేకముచేసికొనుచుండిరి. ఈ భూములను వీరిలో స్వతంత్రు (Freemen) లగు వారే పంచుకొను నధికారముగలిగి యుండిరి. ఏకజాతివా రందఱు నొక సభగాను, అందఱు జాతులును గలసి యొక సభగాను నేర్పడియుండిరి. రాజకీయవ్యవహారముల విషయములోఁ గొందఱు ప్రభుకోటివా రనియు కొందఱు ఉమ్మరావులనియు (Aristocracy) మిగిలినవారు ప్రజాకోటియనియు వేఱుపడియుండిరి. రాచఱికము స్వతంత్రులయందే యుండుచు వచ్చినది. కొన్నిజాతులవారు ప్రత్యేకముగఁ గొన్ని గొప్పకుటుంబములనుండి రాజును నియమించుకొనుచు వచ్చిరి. అయినను రాజు సర్వాధికారిగాక కులపెద్దయై యుండెడివాఁడు. అన్నిజాతులవారికిని మొత్తముమీఁద నొక ప్రజాసభ యున్నది. ఈ సభవారు న్యాయవిచారణనిమిత్త మొక పెద్దను నియమించుకొనుచు వచ్చిరి. ఈ న్యాయకర్తకు న్యాయనిర్ణయమునందు సాయము చేయుటకై యొక్కొక్క మండలమునకు నూఱుగురు చొప్పున సహకారు (Assessors) లేర్పఱుపఁబడుచుండిరి. యుద్ధసమయములం దన్నిజాతులవారిని నడపుట కొక నాయకుని ప్రజాసభవారు పరాక్రమ విశేషమును బట్టి నియమించుచుండిరి. ప్రతిమండలమునుండియు నూఱుగురు భటులీతని నాయకత్వమునకు లోఁబడి సేనగా నేర్పడుచుండిరి. సాధారణముగా న్యాయాధిపతియే సేనానాయకుఁడుగా నుండుచువచ్చెను. ఈ నాయకుని యుద్ధసమయమం దంగరక్ష సేయుచుఁ గాపాడుటకును యుద్ధాభావమం దాతని గౌరవమును ఘనతను గాపాడుటకును, పరిజనులు కొందఱు ఉండుచువచ్చిరి. ఈనాయకునకు నధికారము బహు స్వల్పము. దేశీయ రాజకార్యము లన్నియు స్వతంత్రులతోఁ గూడియున్న ప్రజాసభవారు నిర్ణయించుచుండిరి. ఆ యా మండలముల కేర్పడిన న్యాయకర్తలు కలసి యొకసభకూడి సామాన్యవ్యవహారములను బరిష్కరించుచు అవసరమును బట్టి ప్రజాసభవారి తీరుమానమునకు వారి యెదుటఁ బెట్టుచుండిరి.



బానిసలకును స్వతంత్రులకు మధ్యతరగతివారు కర్షకులుండిరి. వీరికి రాజకీయ స్వాతంత్ర్యములు లేవు. స్వతంత్రుల మాన్యములను గుత్తపుచ్చుకొని వీరు సేద్యము చేయుచువచ్చిరి. యుద్ధములోఁ బట్టుకొనఁబడినవారును నేరముచేసి పదభ్రష్టులైన స్వతంత్రులును బానిస లగుచు వచ్చిరి.

స్వతంత్రులలో నాభిజాత్యముచే నుత్తమతరగతివారనియు, తదితరులు సామాన్య తరగతివారనియు రెండుభేదము లేర్పడియున్నవి. కాని యీ భేదమునుబట్టి వీరనుభవించు రాజ్యాంగస్వాతంత్ర్యములలో వ్యత్యాసము లేదు. జర్మను లందఱు సామాన్యముగా రణశూరులై ప్రసిద్ధి వడసిరి. రక్తసంబంధమునుబట్టి కులభేదమును అధికారభేదమును, ఏర్పడుచువచ్చినవి.

ఆంగ్లదేశమునకు జర్మనులు తెచ్చిపెట్టుకొన్న యాచారములు సంక్షేపముగా నిచట సూచింపఁబడినవి. ఈ విదేశదండయాత్రవలన జర్మనుల యాచారములు కొంతవట్టు మార్పుఁ జెందినవి. ప్రప్రథమమున బ్రిటానియాయందు నివాసము లేర్పఱచుకొన్న యాంగిలేయాదుల నాయకునకు రాజను పేరు వాడుకలో లేదు. ఆతని నాయకత్వమే యిట్టి విదేశవాసమునకుఁ బ్రధానమైనందున ఈనాయకులు రాజనామమును బెట్టుకొనుచువచ్చిరి. ఐనను నీరాజశబ్దమునకు భూమితో సంబంధములేక జర్మనుప్రవాసుల (Colonists) నాయకుఁడనిమాత్రము సూచించుచువచ్చినది. మనదేశములో రాజులు సూర్యవంశము వారమనియు, చంద్రవంశము వారమనియుఁ జెప్పుకొన్నట్లే జర్మనురాజులును వోడెను అను దేవతాంశసంభూతుల మని చెప్పుకొనుచువచ్చుటచే, రాజశబ్దము పవిత్రవంతమై ఆ నామధారులయెడఁ బ్రజలకు భయభక్తులు పెంపొందించి యాతనిశక్తి యనంతమని తోఁపింపఁజేసెను. ప్రజాబాహుళ్యముచే నియమింపఁబడిన వాఁడే రాజను యథార్థము కాలక్రమమున మఱుగుపడిపోయెను.

ఆంగ్లదేశమునకు రాకపూర్వము జర్మనులు బహుదేవతారాధనపరులు. రోమకదొరతనము వారాఱుశతాబ్దమున క్రైస్తవ మతబోధకుల నిగ్లాండునకు

బంపిరి. అప్పటి యాంగ్లరాజు భార్య క్రైస్తవమతాభిమాని యగుటచే రోమకమతబోధకుల నాదరించి కాంటుబరీ నగరమున నొక క్రైస్తవదేవాలయమును గట్టించెను. నేటివఱకును ఇంగ్లాండునకంతకును నీ యాలయమే ప్రధానాలయమై వర్ధిల్లుచున్నది. క్రైస్తవమతబోధకులు పనిచేయుచు రాగా మొదట రాజును పిమ్మట ప్రజలును మతమును మార్చుకొనిరి. తుదకీ మతము దేశమంతట వ్యాపించి బహుదేవతారాధనమును రూపుమాపెను. ఈ మతము నవలంబించుటకుఁ బూర్వము జర్మనులు తామసప్రధానులై, ఆభిజాత్యగర్వ భూయిష్ఠులై, అన్యోన్య కలహములు పెట్టుకొని వివాదశీలురై యనాగరికులై యుండుచువచ్చిరి. క్రైస్తవమత మహాత్మ్యము వలన నాఁగిలేయాదుల తామసప్రవృత్తి పోయి సాత్త్వికధర్మము వారి యందభివృద్ధిపొంది నాగరికత హెచ్చి వినయ వివేకములును నైకమత్యభావమును నలవడినవి. మతముతోఁబాటు రోమకుల యుత్తమరాజ్యపద్ధతులును విద్యాసంపదయు న్యాయవిధులును నాంగ్లేయుల కలవడినవి. కొంతకాలమునకుజర్మనుల ప్రాచీనరాజకీయాచారములుకూడ మాసిపోయినవి. ఆంగ్లేయులలో మతవిషయమున నాచారభేదము లేర్పడఁగా, ఈభేదములను సవరించి ధర్మనిర్ణయముచేయుటకై రాజులు మతధర్మజ్ఞసమితి (Ecclesiastical synod) ని గూర్చుచు పరిష్కరించుచు వచ్చిరి. ఈ సమిత్సభలను మార్గప్రదర్శములుగాఁగొని వేర్వేఱు రాజ్యములుగా విడిపోయి తగవులాడుచున్న యాంగ్లరాజ్యముల వారేకీభావమును నేర్చుకొనిరి. మొదటనుండియు మతవ్యవహారములు రాజకీయవ్యవహారములోఁ గలిసిపోయినవి. ఆంగ్లదేశమందలి వేర్వేఱు రాజ్యముల మతసాంప్రదాయము లన్నియు 668 లో నేకముఖముగాఁ జేయఁబడి కాంటరుబరి ప్రధానాలయముయొక్క నాయకత్వముక్రిందికిఁ దేఁబడినవి. అందుచే దేశమందలి వేర్వేఱు రాజ్యములలో లౌకికవిషయములం దెట్టి తగవులుండినను మతవిషయము లందుమాత్ర మైకమత్యము గలిగియున్నవి. ఈ



మతాచారైకమత్యమే రాజకీయ విషయములందుఁ గూడ వేర్వేఱు రాష్ట్రములకు సంఘీభావమునకు దారిచూపినది. దేశమునకువచ్చిన మొదటిమతబోధకుల తరువాత రాజకుటుంబమువారే మతాచార్యులుగ దేవాలయములం దేర్పడిరి. అందుచే రాజకీయవ్యవహారములకును మతవ్యవహారములకును స్థిరసంబంధ మేర్పడినది. రాష్ట్రవిదుషసభ (witenagemote) లో నీ మతాచార్యులు ప్రముఖులై రాజునకు ముఖ్య మంత్రులుగా నుండుచు వచ్చిరి. న్యాయవిచారణయందుఁ గూడ మతాచార్యులే యెక్కుడుగా జోక్యముపుచ్చుకొనుచు వచ్చిరి.

ఆంగ్లేయదేశమునకు వచ్చిన జర్మనువీరులందఱు నొక్కసారిగా బ్రిటానియా నాక్రమించుకొనక మూఁడువందల సంవత్సరములవఱకు కొన్ని శతములుగను సహస్రములుగను సేనలతో నప్పుడప్పుడు వచ్చుచు దేశమునుస్వాధీనపఱుచుకొనుటచే, ఒక్కొకసారి గెలువఁబడిన భాగమొక్కొక్క రాజ్యముగా నేర్పడినది. ఇట్లేర్పడిన రాజ్యములుపైనివివరించిన కారణముల వలన నానాటికి సంఘీభవించి వెస్సెక్సు మెర్సియా నార్తంబర్లాండు నను మూఁడురాజ్యములుగాఁ గొంతకాలమునకు స్థిరపడినవి.

ఈవేఱుపడినరాజ్యములు మూఁడును నేకమై వెస్సెక్సు రాజ్యముక్రిందికి వచ్చుటకు డేనులదండయాత్ర దారితీసినది. డేనులు ఇంగ్లాండునకుఁ దూర్పుదిశనున్న నార్వేస్వీడను దేశవాసులగు నీటిదొంగలు. ఎడతెగని దండయాత్రలు నడపి డేనులు దేశమును గొల్లఁగొనుచు రాగాఁరాగా వారివలని బాధను నివారించుకొను నిమిత్తము చిన్నరాజు లప్పుడు బలాఢ్యుఁడుగానున్న వెస్సెక్సు రాజునాధిపత్యము నంగీకరించిరి. డేనులును నాంగ్లేయులును బూర్వకాలమున నొకకూటస్థుని వంశమువారేయైనందున వారియాచారసాంప్రదాయము లంతగా భేదించి యుండవు. ఎనిమిదవ శతాబ్దాంతమందు డేను లాంగ్లదేశము మీఁదికి దండయాత్ర లారంభించిరి. మొదట నెనుబది వత్సరములవఱకు దేశమును గొల్లఁగొని చేతికందినదానిని దీసికొనిపోవుటతో

డేనులుతృప్తిపొందిరి. కాని పిమ్మట వారీ దేశము నాక్రమించుకొన నారంభించి యింగ్లాండునకు దక్షిణముననున్న వెస్సెక్సుమండలము తక్కఁదక్కిన దేశమంతయు స్వాధీనము చేసికొనిరి. క్రీ. వె. 871 నుండి 901 వఱకు వెస్సెక్సును బాలించిన ఆల్ఫ్రెడ్డు చుట్టుప్రక్కల రాజ్యములనుండియొక సేననుపోగుచేసి డేనుల నోడించి ముందువారివలన దేశోపద్రవము కలుగకుండఁ దనసేనకు యుద్ధవిద్య నేర్పియు సముద్రపువంకనుండి దండయాత్రలు రాకుండ దేశమును గాపాడు నిమిత్తమొక నావికాసైన్యమును గూర్చియు, అంతవఱకాచార శరణ్యములై కర్ణపరంపరగా వచ్చుచున్న రాజకీయతంత్రములను సూత్రబద్ధము చేసియు, వాడుకభాషలో గ్రంథములను రచించి వచనకావ్య సౌభాగ్యముచే నాంగ్లభాష కలంకారము పెట్టియు, ఎన్నో విధముల దేశమునకు యశోవర్ధకుఁడై రాజ్యమేలెను. ఐననాతఁడు దేశము నుండి డేనులను దఱుమలేకపోయెను. వెస్సెక్సున కుత్తరముననున్న దేశమంతయు డేనుల స్వాధీనమందేయుండెను. ఆల్ఫ్రెడ్డుయొక్క పుత్రుఁడును, పౌత్రుఁడును, ప్రపౌత్రుఁడును, వీరశిరోమణులై డేనులయాక్రమణలో నున్న దేశమునుగూడ వెస్సెక్సుమండలాధిపత్యము క్రిందికిఁ దెచ్చిరి. పిమ్మట రాజ్యము చేసిన యెడ్గారురాజు వెసెక్సు మెర్సియా నార్తంబ్రియా యను మూఁడురాజ్యములు కూడిన యింగ్లాండునకు రాజై 959 లోఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. కాలక్రమమున నాంగ్లదేశమున నివసించు డేనులాంగ్లేయులలో నిమిడిపోయి వేఱుపేరు లేనివారైరి.

ఎడ్గారురాజు 975 లోఁ బరంపదించునాటి కాతని కొమారుఁడు మైనరును నసమర్థుఁడును నగుటచే నార్వేస్వీడను దేశములందలి డేనులకు మరల దండయాత్రలమీదికి బుద్ధిపోయెను. డేనులు పూర్వమువలె నీటిదొంగతనమే వృత్తిగాఁగల మోటుజనులుగారు. ఆంగ్లేయులవలెనే వారును క్రైస్తవ మతావలంబులై యుద్ధనైపుణ్యమును బహుజన సమీకరణశక్తిని నలవరచుకొని దేశమును సంపాదించుకొనుటయే ముఖ్యోద్యమముగా గలిగి యీ



దండయాత్రకుఁ బ్రారంభించిరి. దేశము డేనుల స్వాధీనమై యాంగ్లరాజకుటుంబమువారికి సింహాసనము దూరమయ్యెను. ఐనను విజయులగు డేనులకంటె బరాజితులగు నాంగ్లేయులే యధిక సంఖ్యాకులై యుండుటచే నాంగ్లరాజ్యపద్ధతులు మాత్రము మారఁబడలేదు. 1042 లో డేనులరాజగు కెన్యూటు పరంపదించిన తరువాత నాంగ్ల సింహాసనము తిరుగ నెడ్గారు రాజపౌత్రుఁడగు నెడ్వర్డునకు స్వాధీనమయ్యెను. ఈతనితరువాత నీతని మేనమామయగు విలియము 1066 లో నాంగ్లదేశముపై దండెత్తి దేశమును స్వాధీనము చేసికొనియెను. ఈవిలియము ఫ్రాన్సుదేశములో నొకమండల మగు నార్మండీకి డ్యూకు(అనగా ప్రభువు) ఈతని విజయమునుబట్టి యీతనికి „విజయభూపుఁడు„ (the Conqueror ) డను పౌరుషనామము వచ్చెను. ఈతఁడాదిగా నింగ్లాండు నేలిన రాజులు నార్మనురాజులనఁబడుదురు. మొదటి నలుగురు నార్మనురాజులును రెండవ హారోల్డును దప్ప తక్కినరాజు లందరును నేటివఱకు నాంగ్లవంశము వారే సింహాసన మునలంకరించిరి.

——— :o: ———

# అధ్యాయము—2

## నార్మనురాజులకుఁబూర్వము రాజ్యతంత్రము.

---

ఆంగిలేయాదులు జర్మనీనుండి బ్రిటానియాకువచ్చునప్పటికి వారిలో వాడుకలోనున్న రాజకీయాచారములు పూర్వాధ్యాయమున వివరింపఁబడినవి. బ్రిటానియాకు వచ్చినతరువాత కులపెద్ద రాజయ్యెను. డేనుల రాచరికము వలనఁగాని నార్మనురాజుల రాచరికమువలనఁగాని యాంగ్లేయ రాజకీయాచారములు పూర్ణముగామారిపోయి స్వరూపముచెడక, కాలక్రమమున స్వభావసిద్ధమైన సంస్కారములకులోఁబడుచు నేటివఱకు నవిచ్ఛిన్నముగా నాంగ్లదేశమున వెలయుచున్నవి. అందుచే వాని విచారణ యీ సందర్భమున నవసరమైయున్నది.

జర్మనువీరు లింగ్లాండునఁ గుదురుపడినప్పుడు తమకు స్వాధీనపడిన దేశము నెట్లు తమలోఁ బాలుపంచుకొనిరో తెలిసికొనుట కాధారములంతఁగాలేవు. రక్తసంబంధమునుబట్టి యొక్కొక్క కులముగా నేర్పడినవారినుండి నూఱుగురుచొప్పున జర్మనులలోని యన్నికులములనుండి యుద్ధభటులు సమకూడి సేనగా నమరి ఇంగ్లాండు నాక్రమించుకొన్నవారయినందున నిట్లు చేరిన కులములవారందఱు సమముగా భూవిభాగము చేసికొనియుందురని చెప్పుటకు సందేహములేదు. ఒక్కొక్క కులములోఁ జేరిన నూఱుగురు యుద్ధవీరులును దమ పాలికివచ్చిన భూమిని మిక్కిలి దగ్గరచుట్టరికముగలిగి తమలో నిమిడియున్న కుటుంబములవారికిఁ బంచిపెట్టియుందురు. ఈ కుటుంబమునకు వచ్చినభూమిలోఁ గొంతభాగము కుటుంబయజమానికి సంపూర్ణ హక్కుభుక్తములతోఁ బ్రత్యేకించి, తక్కిన భూమిని కులమువారందఱును సామాన్యముగా భుక్తపఱుచుకొనుచు సాముదాయకభూమిగా నుంచుకొనిరి. ఇట్లు కుటుంబములకుఁ బంచిపెట్టఁబడఁగా మిగిలిన భూమిలోఁ గొంత



భాగము దండయాత్ర నడపిన కులనాయకుఁడు తనస్వంత యుపయోగార్థము విడఁదీసికొనును. ఆతనిక్రిందఁ బనిచేసిన యుపనాయకులును దండనాథులును గూడ నిట్లే కొంతభూమిని విడఁదీసికొనిరి. ఈ విధముగా విభాగమైన భూములుగాక మిగిలియున్నభూమి కులమువారికి సాముదాయకభూమిగా భుక్తముజరుగును. అప్పుడప్పుడు వేఱువేఱు దండయాత్రలవలన నేర్పడిన కాలొనీలు (వలసభూములు) కలిసి పెద్దవైనకొలఁదిని, వెస్సెక్సు రాజ్యము బలవంతమై తక్కినరాజ్యములను దనలోనిమిడించుకొని యింగ్లాండు దేశముగా వృద్ధిపొందినకొలఁదిని, ప్రత్యేకమండలముల సాముదాయకభూమి ప్రత్యేకరాజ్యముల సాముదాయకభూమిగాను, ప్రత్యేక రాజ్యములభూమి ఆంగ్లేయుల సమిష్టిసాముదాయకభూమిగాను పరిణమించినది. ఐనను ప్రత్యేక భూస్వాములు స్వంతహక్కుగా భూమి ననుభవించునాచారమే యంతకంతకు బాహుళ్యమైనది. అందుచే నింగ్లాండునందలి భూమియంతయు నార్మను రాజులకుఁ బూర్వము సాముదాయక భూమి యనియు, ప్రత్యేకభూస్వాస్థ్యభూమియనియు రెండువిధములుగా నుండుచువచ్చినది.

సాముదాయక భూమివలననే దొరతనమువారికి భూమిపన్ను వచ్చుచుండును. రాష్ట్రసభవారి ( National Council ) యనుమతిలేక ఈ భూమికిఁ గ్రయవిక్రయములు చేయఁగూడదు. శిస్తు నిర్ణయించిగాని కొంతకొలువుచేయ నొడఁబఱచిగాని, దొరతనమువారీ భూమి నితరులకియ్య వచ్చును. సాముదాయక భూమినుండి మాన్యములను గొన్నవారు దొరతనమువారిచే నిర్మింపబడిన దుర్గములను వారధులను బాగుచేయవలెను. రాజుగాని రాజకీయోద్యోగులుగాని సంచారము చేయునప్పుడు కావలసిన సామాగ్రిని సన్నాహము చేయవలెను; వారికిఁ గావలసిన బండ్లను గుఱ్ఱములను సిద్ధముచేయవలెను. భూస్వాముల భూస్వాస్థ్యముల మీఁద నిట్టి బాధ్యతలులేవు. రాజు కోరినప్పుడే భూస్వాములు యుద్ధము చేయవలెను. దుర్గములను వారధులను మరమ్మతు చేయవలెను.

భూస్వాముల భూమి యన్యాక్రాంతము చేయఁబడవచ్చును. వంశపరంపరాధీనముగా వారసులకు సంక్రమించవచ్చును. రాజు సామాన్యభూస్వాములవలెనే తన స్వంతభూములను విక్రయించవచ్చును. కాలక్రమమున సాముదాయకభూములు చాలవఱకు మాన్యములుగాఁ బ్రజలకియ్యఁబడి భూస్వాముల స్వాధీనమైపోయెను. దేవాలయములకు విశేషముగా మాన్యదానము లీయఁబడెను. జర్మదేశమునఁగల పెద్ద యనఁబడువాని నాంగ్లదేశమున రాజనిపిలుచు నాచారము ప్రబలినకొలఁది సాముదాయకభూమియే దివాణపుభూమిగా మారిపోయెను. నార్మనురాజులు రాజ్యమునకు వచ్చినతరువాత సాముదాయకభూమి యంతయు రాజుగారి దివాణపుభూమియై ప్రాఁత పేరును మొదలే పోఁగొట్టుకొనెను.

పూర్వము రక్తసంబంధమును బట్టి యేర్పడిన వంశముల యొక్క గౌరవాగౌరవములను బట్టి రాజకీయ స్వాతంత్ర్యము లేర్పడియున్నవి. వీరికి భూమితో సంబంధము పెరిగినకొలఁది భూమిసంబంధములను బట్టి రాజకీయ విభాగములు చేయబడుచు వచ్చెను. పూర్వము రక్తసంబంధమునుబట్టి కులములని వాడఁబడు వానికిప్పుడు స్థలసంబంధమునుబట్టి గ్రామమని వాడుకయేర్పడెను. గ్రామమునకొక్క గ్రామసమితియు ఒక గ్రామాధ్యక్షుండును నుండెను. నూఱుగ్రామములు కలిసి యొకశతకూట ( hundred )మును, నూఱుశతకూటములు కలిసి యొకమండలము ( shire ) ను నయ్యెను; మండలము లన్నియు గలిసి రాజ్యమేర్పడెను. ఒక్కశతకూటములోఁ జేరినవారి సివిలు క్రిమినలు వ్యవహారములను జక్కఁబెట్టుటకు శతకూటసమితి ( the hundred gemot ) యనఁబడు సభయొకటి గలదు. శతకూటమునఁ జేరిన గ్రామములనుండి గ్రామమునకు నలుగురు ప్రతినిధులచొప్పున నేర్పడినసభికులు గలిసి యొక శతకూటసమితి (the hundred gemot ) గా నేర్పడుచుండిరి. ఈశతకూట సమితివారిని సభ చేయుటకును వారితీరుమానముల నమలుజరుపుటకును నొక పెద్ద (Ealdorman) యేర్పడియుండును. ఈపెద్దను శతకూటము వారంద



ఱును వోటుచేసి నియమించుకొనుచుండిరి. జర్మనువీరులు దండయాత్రలు నడిపి యప్పుడప్పు డేర్పఱుచుకొన్న రాజ్యము లన్నియు వెసెక్సురాజ్యములో నిమిడిపోయినతరువాత నీ చిన్న రాజ్యములు మండలము (shire) లయ్యెను. మండలరాజకార్యములను జక్కఁబెట్టుటకు నొక పెద్దయు ఒక షరీపు (sheriff) అను నుద్యోగస్థుఁడును నుండిరి. మండలసభవారు కొంతకాల మీపెద్దను నియమించుచుండిరి. ఇటీవల నీ యుద్యోగము కొన్ని గొప్ప కుటుంబములలో వంశానుక్రమముగా స్థిరపడెను. రెండవ యుద్యోగస్థుఁడగు షరీపు రాజప్రతినిధి యైనందున రాజే వానిని ప్రాయికముగా నియమించుచువచ్చెను. ఈతఁడే మండలసభలో న్యాయాధికారియు, న్యాయము నమలుజరుపువాఁడును, దివాణపు భూములను గాపాడువాఁడును నైయుండెను. మండలములోని యుద్ధభటులకు మాత్రము మండల పెద్ద నాయకుఁడైయుండెను. మండలపెద్దవలె నీ షరీపు వంశానుక్రమముగా వారసత్వముచే నుద్యోగమునకు వచ్చినవాఁడు గాక రాజుచే నియమింపఁబడిన వాఁడగుటచేతనే భావిచారిత్రములో రాజులు సెంట్రలు గవర్నమెంటు పద్ధతి నేర్పఱచుకొని అన్ని మండలములను దమచేతియం దుంచుకొని దొరతనమువారి బలమును బెంపుచేసి దేశమం దల్లరులు పుట్టకుండఁ గాపాడుకొనఁగలిగిరి.

సామాన్యజనులు కాపురముండుటకు గ్రామములును (tun) రాజు మేజస్ట్రీటు, ఉమ్మరావులు (nobles) మొదలగువారు కాపురముండుటకు (burg) పట్టణములును నేర్పడినవి. సిరిసంపదలు వృద్ధియైనకొలఁది గ్రామములే పట్టణములుగ మాఱుచువచ్చినవి. సాముదాయక భూములమీఁదఁ గ్రొత్తపట్టణములు బయలుదేరుచు వచ్చినవి. పట్టణములలోని స్వతంత్రు లందఱును గూడియుండు నగరసమితి (burg-gemot) యొకటి యుండి దానికి ముఖ్యమేజస్ట్రీటే యధ్యక్షుఁడు (gerepa) గా నుండును. అనేక పేటలతోఁ గూడుకొన్న గొప్ప పట్టణములలో నీ సమితి ప్రచారము శతకూటమునందున్న ప్రకార ముండును.

దుర్వినీతులవలన సంఘమునందు దల్లరులు పుట్టకుండఁ గాపాడుకొను నిమిత్తము కొన్ని సంఘరక్షక సమితులును వర్తకుల రక్షణార్థము వణిక్సమితులునుగూడ నుండుచు వచ్చినవి. నగరసమితివారితో సంబంధము లేకుండ నీ వణిక్సమితులు వేఱుగాఁ గొంతకాల ముండుచు వచ్చినవికాని యిటీవల నగర సమితిలో నిమిడిపోయినవి.

లండనుపట్టణము కడుఁ బ్రాచీనకాలమునుండియు నితరపట్టణములకంటె ఘనతవహించి రాజకీయ స్వాతంత్ర్యములను గలిగియున్నది. సామాన్య పట్టణముల రాజకీయాచారములు శతకూట సమితిని బోలియున్నవి గాని లండను నగరముయొక్క యాచారములు మండలసభవారి రాజకీయాచారములను బోలియుండును. మండలములో శతకూటములు వేఱుపడియున్నట్లే లండనుపట్టణము కొన్ని వార్డుల (wards) క్రింద విభజింపఁబడినవి. శతకూటమున కొక సమితి యున్నట్లే వార్డునకు వార్డుసభ (wardmoot) యొకటి యేర్పడి, దానికి వార్డు మెంబరులు నియమించుకొను వార్డుపెద్ద (ealdorman) యొకఁడుండెను. లండనున కంతకును మొత్తముమీఁద నొక మునిసిపలు కోర్టుండెను. నార్మను రాజులలో మొదటివాఁడగు పిలియము లండనునకు మొదటపట్టా నిచ్చెను. ఆ కాలమునకు మతవిషయముల కొక మతాచార్యుఁడును (bishop) లౌకికవిషయముల కొక నగరముఖ్యుఁడు (part-reeve) ను నగరబాహుళ్యముమీద ముఖ్యాధికారులై యుండిరి.

క్రైస్తవమతము దేశమున బాగుగ వ్యాపించి ప్రతిగ్రామమందును దేవాలయములు వెలసినతరువాత, మతవ్యవహారసౌకర్యార్థము దేశము కొన్ని భాగములుగా విభజింపఁబడినది. చిన్న యూళ్ల (parishes) కొక్కొక మతాచార్యుఁడు (priest) చొప్పునను, శతకూటము మొత్తమున కంతకంటె గొప్పమతాధికారియగు డీను (dean) ను, మండలమున కంతకంటె ఘనుఁడును (Archdeacon) నగరముల కంతకంటె ఘనుఁడును (Metropoliton)



ఇట్లు స్థలగౌరవమునుబట్టి మతాచార్యులేర్పడి మతవ్యవహారములను సమర్థించుచుండిరి.

ఇఁక జనులలోని న్యూనాధిక విభాగములనుగూర్చి చెప్పవలసియున్నది. అందఱికంటెను నికృష్టపదవిలో నున్నవారు సేవకులు (slaves.) వీరిలో వంశపరంపరగా బానిసలై వచ్చువారు కొందఱును, కాలవక్రతచే నట్టి దుర్గతికిఁ బాలైనవారు కొందఱును రెండువిధముల వారు గలరు. ప్రప్రథమమున జర్మనులు బ్రిటనుల నోడించి వారిని బానిసలను జేయఁగా వారి సంతతివారు వంశపరంపరగా బానిసలై వచ్చుచుండిరి. జర్మను దేశమునుండి స్వతంత్రులతోఁ గూడివచ్చిన బానిసల సంతతివారును మొదటి తరగతిలోని వారే. కుటుంబపోషణమునకు దారిలేక యజమానులచే విక్రీతులైన దారపుత్రాదులును, ఋణదాతలకు ఋణముతీర్చుకొనలేక యూడిగమున కొడఁబడు వారును, నేరములుచేసి స్వాతంత్ర్యమును గోలుపోయిన వారును బానిసలై రెండవ తరగతిలోఁ జేరుచువచ్చిరి.

తక్కిన జనులలో సత్కుల ప్రసూనత్వముచేఁ గొందఱు ఘన గౌరవములనే బొందుచు వచ్చిరి. ఇటీవల దేశమును సంపాదించుకొనుకాలమున బలపరాక్రమములే గౌరవనిదానము లయినందున యోధులకే గౌరవము సంప్రాప్తమగుచు వచ్చినది. మొదట దండయాత్రనడపి బ్రిటానియామందు రాజ్యమును సంపాదించిన రాజున కాత్యంతిక సహకారులకే ఘనత యబ్బినది. ఈ సహకారిభటులపై నాయకుఁడు లార్డు అని పిలువఁబడెను. ఈ సహకారులే నోబిలులు ( ఆంధ్రభాషలో వీరి నుమ్మరావు లందురు ) అని వాడఁబడుచు కడుగౌరవపదవి ననుభవించుచుండిరి. రాజపరివారకులు గాక, లార్డులకుఁగాని, మండల పెద్దలకుఁ (ealdorman) గాని, మండల మతాచార్యులకుఁ (bishops) గాని, పరివారకులుగా నుండు వారు కూడ నోబిలు పదవినుండి, రాజపరివారకులకంటెఁ గొంచెము తక్కువ తరగతిలో

నుందురు. ఈ యున్మరావు లందఱును మాన్యములు గలవారే యైయుండుటం గొంతకాలమునకు భూస్వామ్యము గలిగియుండుటయే గౌరవనిదాన మయ్యెను. అయిదు నాగళ్ళ (నాగలిభూమి యనఁగా సుమారు 100 యకరములు) భూమిగల స్వతంత్రుఁడు నోబిలు అనఁబడును. ఇట్లు భూస్వామ్యమునుబట్టి గౌరవపదవి తటస్థించుటవలన జర్మనుల పూర్వపు రాజకీయాచారములు మాఱిపోయెను. పూర్వము జర్మనులలోఁ సత్కులమందుఁ బుట్టిన కారణముచేఁ గుల పెద్దకును ఉన్మరావులకును గౌరవమెంతయున్నను కులసభలలోఁ స్వతంత్రజనుల సంఖ్యయే యధికముగ నుండుట వలన ప్రజాబాహుళ్యము వారి యిష్టానుసారమే రాజకార్యములు నడచుచుండుట తటస్థించెను. ఇప్పుడు రాజును రాజపరిపాలకులగు నున్మరావులును సంఘమందు ఘనులై ప్రజాశక్తిని దిగద్రొక్కి తమకుఁ దోచినట్లు వ్యవహరించుటకారంభించిరి. పూర్వము గౌరవముకొఱకు రాజపరిచర్య నభిలషించి యుత్తమకులమునఁ బుట్టినవాఁడెవ్వరో యొకలార్డునకుఁ బరిచర్యచేయక తప్పదని యేర్పడినది. ఒకసారి యొకలార్డు పరివారములోఁ జేరిన తరువాత మరియొక లార్డువొద్దకుఁ బోవుటకీ నోబిలునకు స్వాతంత్ర్యములేదు.

దేశజను లందఱకును నాయకమణి రాజు. ప్రజలే సర్వాధికారులు. రాజు ప్రజలను నడపువాఁడుకాని వారిపై యధికారి కాఁడు. రాష్ట్రసభ (witan) వారు రాజును నియమించుకొందురు. అందుచే రాజు ప్రజాప్రతినిధి. రాష్ట్రసభవారి తీరుమానములే రాజశాసనములు. సాముదాయక భూములు రాజభూములై, రాజు ప్రజానాయకుఁడేగాక దేశమునకును బ్రజలకును గూడ ప్రభువై మాఱిపోఁగానే రాజున కధికార మధికమయినది. రాజద్రోహమునకుఁ బూర్వము జుల్మానా యేర్పడియున్నది; ఇప్పుడు శిక్ష విధింపఁబడినది. దేశసంచారము చేయునప్పుడు రాజునకును బరివారమునకును భూతాదికమును ప్రజలే సిద్ధముచేయవలెను. భూమిలోనున్న పాతులును, సంతపన్నులును, బండిపోసీలు పన్నులును, గనులును, కోర్టులలో విధింపఁ



దేశమునొక్క సమష్టిరాజకార్యములను దీర్చుటకు రాష్ట్రసభ (witanagemot) యొకటి గలదు. ఇది జర్మనుల ప్రజాసభలనుబోలి యుండును. దీనినిప్పటి పార్లమెంటునకు మాతృకయని చెప్పవచ్చును. పూర్వకాలమందు దేశము భిన్నరాజ్యములుగా విడిపోయియున్నప్పుడు మండలసభలే యొక్కొక్క రాజ్యమునకుఁ జాలియున్నవి. మండలసభకు మండలములోఁ జేరియున్న ప్రతి గ్రామమునుండియు గ్రామాధ్యక్షుఁడును (Ealderman) నలుగురు గ్రామప్రతినిధులును రావలసియున్నది. చిన్న రాజ్యముల సమీకరణమువలన నేర్పడిన గొప్పరాజ్యములో నిట్టి మండలసభలనేకములు చేరియుండుటచే, గ్రామములనుండి కూడ ప్రతినిధులు రాష్ట్రసభకు వచ్చుట సాధ్యముకానందున నొక్కొక మండలమునుండి గ్రామాధ్యక్షులును, మండలమతాచార్యులును, రాజకుటుంబమువారును, రాజ పరివారకులును మాత్రము రాష్ట్రసభకుఁ జేరుచుండిరి. కాఁబట్టి ప్రస్తుతపు పార్లమెంటువలె రాష్ట్రసభ ప్రజాప్రతినిధిసంఘమని పూర్ణముగాఁ జెప్పుటకు వీలులేదు. కాని ప్రజాభిప్రాయమును దెలిసికొనుట కిదియే ముఖ్యాధారముగ నెన్నఁబడెను. పదుమూడవ శతాబ్దమున మొదటి యెడ్వర్డు రాజ్యముచేయునప్పుడే ప్రజాప్రతినిధి పద్ధతి బాహుళ్యముగా నవలంబింపఁబడి పార్లమెంటుసభ గూర్పఁబడెను.

రాష్ట్రసభవారి (witan) కిప్పటి పార్లమెంటువారికి లేని యనేకాధికారము లుండుచు వచ్చినవి. దుష్పరిపాలనము చేసిన రాజులను వారు పదభ్రష్టుని జేయఁగలిగి యుండిరి. వెసెక్సు, నార్తంబ్రియా, మెర్సియా యను మూఁడు రాజ్యములుగా దేశము విడియున్నప్పుడు రాష్ట్రసభవారు నార్తంబ్రియా రాజులను దుష్పరిపాలనమున కనేకపర్యాయములు పదభ్రష్టులను జేసిరి. వెసెక్సురాజును ముమ్మారు తొలఁగించిరి. నార్మనుల ప్రభుత్వము తరువాత నాంగ్లరాజు నీ సభవారు (అప్పుడు వీరికి పార్లమెంటు అను వాడుకవచ్చినది.) ముమ్మారు పదచ్యుతుని జేసిరి. 1327 వ సం॥లో

రెండవ యెడ్వర్డును, 1399 వ సం॥లో రెండవ రిచార్డును 1688 వ సం॥లో రెండవ జేమ్సును నాంగ్లపార్లమెంటువారు సింహాసనమునకు దూరము చేసిరి.

రాజును నియమించు నధికార మీ రాష్ట్రసభవారియందే యున్నది. దేశ మనేకరాజ్యములుగా విడియున్నప్పుడు గూడ రాజు ప్రజాప్రతినిధిసభవారి చేతనే నియమింపఁబడుచు వచ్చెను. ప్రతి రాజ్యమునందును రాజకుటుంబ ముండుచువచ్చినది. ఆ కుటుంబమువారిలో సమర్థుఁడగు వానిని సభవారు రాజత్వమునకు నియమించుచు, అసమర్థులను మైనర్లను దిగవిడుచుచు వచ్చిరి.

దొరతనమువారు చేయు ప్రతిపనిలోను రాష్ట్రసభవారికిఁ బనిగలిగి యుండెను. రాజుతోఁగలిసి యీ సభవారు చట్టములను జేసియు, యుద్ధమునకు సేనను సమకూర్చియు, శత్రువుతో సంధిచేసియు, సాముదాయక భూమినుండి మాన్యము లిచ్చియు, మతాచార్యులను మండలపెద్దలను నియమించియుఁ దీసివేసియు, నేరస్థులయొక్కయు నిస్సంతులై చనిపోయిన వారియొక్కయు సొత్తులను రాజున కిప్పించియు, సివిలుక్రిమినలు కేసులలో న్యాయవిచారణ చేసియు నన్నివిధములను బనిగలిగియుండిరి. ఒక్కొకప్పుడు ఆల్ఫ్రెడ్డువలె రాజు బుద్ధిశాలియైనచో నాతఁడు సభవారి యనుమతిని గూడఁగట్టుకొని రాచకార్యముల నన్నిటి నాతఁడే చక్కఁబెట్టుచు వచ్చెను. ఒక్కొకప్పు డిట్లు జరిగినను మొత్తము మీఁద రాష్ట్రసభవారి యాలోచనయు నంగీకారమును బుచ్చుకొనకుండ రాజులు క్రొత్త శాసనములను జేయలేదు; క్రొత్తపన్నులను గట్టలేదు.

నేరముచేసిన వానిపై నేరమును నేరము జరిగిన చోటికిఁ దూరముగా నొక పట్టణమున విచారించుటవలన లాభము లేదని యెంచి, నేరవిచారణనిమిత్తము గ్రామములలోను శతకూటములలోను సభలను జేసి నేరముజరగిన



చోటునకు జుట్టుప్రక్కలనుండు జనులందఱి యెదుట న్యాయవిచారణపూర్వకాలమందుఁ జేయుచువచ్చిరి. ఒక కుటుంబములోనివాఁ డెవ్వఁడైన నేరము చేసినప్పు డా కుటుంబమువా రంద ఱాతనిని బట్టితెచ్చుటకు బద్ధులైయుండిరి. ఇందువలన బాగుగాఁ బని జరుగనందున గ్రామములోనివా రీ పనికిఁ బూనుకొని రక్షకసమితుల నేర్పఱచుకొనిరి. ఇంతకంటెను సుకరముగా నేరస్థులను బట్టుకొను నిమిత్తము మిటీపల శతకూటము లనేకభాగములుగా విభజింపఁబడినవి. తుద కీ పద్ధతికూడ మాఱిపోయి, స్వతంత్రులలోఁ బదిమంది కొక్కసమాజముగా నేర్పఱచి, వారిలో నెవ్వరి నెప్పుడు హాజరు పెట్టవలసివచ్చినను నందఱు సమానబాధ్యులై యుండునట్లు ప్రమాణములు చేయించుకొనిరి (frank pledge). ఈ పదిమంది సమాజమునకు నొకపెద్ద యుండెను. నేరస్థుఁడు బయటపడి శిక్షితుఁడైనయెడల నాతఁడు తన యాస్తినుండి పరిహారమియ్యవలెను, లేక స్వయముగా శిక్ష ననుభవింపవలెను. ఆతఁడట్లు చేయక పాఱిపోయినయెడల, ఆతఁడు చేరియున్న సమాజము వా రాతఁడుచేసిన నేరముతోఁ దమకు సంబంధము లేదని రుజువు చేసికొనవలెను; తప్పిన యెడల నాతఁడు చేసిన నేరమున కేర్పడిన జుల్మానా యీసమాజమువా రిచ్చుకొనవలెను.

సివిలు క్రిమినలు వ్యవహారములను బరిష్కరించుటకు శతకూటసమితియు, (the hundred moot) మండలసభయు (the shire moot) నేర్పడియున్నవి. శతకూటసమితి శతకూటపుపెద్ద (calderman) యొక్క యధ్యక్షతక్రింద నెలకొకసారి సభకూడును. ఇందు సమకూడిన స్వతంత్రు లందఱు న్యాయాధికారులై న్యాయవిచారణ చేయుచుండిరి, ఇట్లు పనిచేయుట కష్టముగాఁ దోఁచినందునఁ గొంతకాలమునకు సభవారు తమలోఁ బండ్రెండుగురిని న్యాయవిచారణకు నియమించుకొనుచుండిరి. సివిలు క్రిమినలు వ్యవహారములు గలవారు ముందు శతకూటసమితికి రాకుండ హైకోర్టులకుఁ బోరాదు. ఈ సభవారు వసూలుచేయు జుల్మానాలు రాజునకు రావలెను గనుక వానిని జమచేయుటకు రాజప్రతినిధి సంవత్సరము

నకు రెండుసారు లీ సభకు వచ్చుచుండెను. ప్రాచీనకాలమునుండియు నీ శతకూటములోఁ జేరిన కొంత భాగముపై నధికారము మతాచార్యులకో, అందుండు గొప్పభూస్వాములగు లార్డులకో రాజులిచ్చుచుండుటయు, వారుతమ నగరులందు కోర్టులు పెట్టి తామే సివిలు క్రిమినలు వ్యవహారములను బరిష్కరించుటయుఁ గలదు. అందుచే నానాటికి శతకూట సమితికి బలము తగ్గిపోయినది.

నూఱు శతకూటములుకలిసినమండలమున కొక మండలసభయేర్పడి సివిలుక్రిమినలు వ్యవహారములను బరిష్కరించుచుండెను. శతకూట సమితిలో న్యాయముపొందని వారీసభవారియెదుట నప్పీలు చేసికొనుచు వచ్చిరి. వీరివలనను న్యాయము దొరకని యెడల రాజున కప్పీలు గలదు. ఈ మండలసభవారిని షరీపు సంవత్సరమునకు రెండుసారులు సమావేశము చేయుచుండును. మండలపెద్ద (Ealderman)యు, మండలమతాచార్యుఁడు (Bishop) ను, తక్కిన రాజకీయోద్యోగస్థులును, భూస్వాస్థ్యములుగల లార్డులును, గ్రామములనుండి నలుగురేసి స్వతంత్రులును గ్రామపురోహితులును, ఈ మండలసభ నలంకరించి న్యాయవిచారణచేయుచు వచ్చిరి. కాని శతకూట సమితులయందువలెనే యీ మండలసభలయందుఁ గూడ పండ్రెండుగురు ప్రతినిధులు న్యాయవిచక్షణ చేయుచు తీరుమానములను జెప్పుచుండిరి. ఈ ప్రతినిధులు నేరముమోపఁబడినవాఁడు నేరము చేసినాఁడా లేదా యని విచారించుటలేదు. వచ్చిన నేరమును గూర్చియే శిక్షవిధింపవలెనని మాత్రమునిర్ణయించుచువచ్చిరి. పిమ్మట నేరము మోపఁబడినవాఁడు ప్రమాణముమీద నేరముచేసినదియు లేనిదియుఁ జెప్పవలెను. ఈతఁడు సత్యసంధుఁడును నమ్మదగినవాఁడును నని పండ్రెండుగురు సాక్షులు ప్రమాణము చేసినయెడల నేరము రుజువైన ట్లెంచఁబడును. శతకూట పెద్దగాని మండలపెద్దగాని ప్రమాణము చేసినయెడల నాలుగు రుమ్మరావుల ప్రమాణముతో సమానము. ఒక్కయుమ్మరావుయొక్క ప్రమాణము పండ్రెండుగురు సామాన్యజనుల ప్రమాణముతోఁ దుల్యము. నేరము మోపినవాఁడును మోపఁబడినవాఁడును గూడ క్రోధ



ముచేతను పాక్షికముచేతను బనిచేయమని ప్రమాణముచేయవలెను. ఒకానొకప్పుడు నేరము చేయుచుండగాఁ బట్టుకోఁబడినప్పుడును, నేరము నిశ్చయముగా జరగినట్లితర సాధనములు ప్రబలముగా నున్నప్పుడును పండ్రెండుగురు సాక్షులను సంపాదించుకొన లేనప్పుడును, వెనుక ఘోరమయిన యసత్యమున కొడిగట్టినప్పుడును, నేరము మోపఁబడినవాఁడు స్వతంత్రులలోనివాఁడు గానప్పుడును కాగిన యినుముకాని సలసల కాగిననీళ్లుగాని చేతఁబట్టుకొని కాలకుండ నిలువవలెను. నేరము చేయనివానిని దేవుఁడు కాల్చకుండఁ గాపాడుననియు, నేరస్థుఁడైనయెడలఁ గాల్చుననియుఁ దలఁచి యీ పద్ధతిని వారవలంబించి యుందురు. సివిలుకేసులలో సాక్ష్యమిచ్చు నిమిత్తము పట్టణమునకు ముప్పది ముగ్గురును, చిన్నపట్టణములకు పండ్రెండుగురును, కని విని యెఱిఁగినసంగతిని యథార్థము తప్పక చెప్పెద మని ప్రమాణములు చేయించి, యేర్పాటుచేయుచువచ్చిరి. క్రయ విక్రయములలో నిద్దఱుముగ్గురు సాక్షుల ప్రమాణములనుబట్టి తీరుమానములు చేయఁబడుచు వచ్చినవి.



# 3 వ అధ్యాయము.

—:o:—

## విదేశ రాజుల పరిపాలనము.

—:o:—

1066 - 1154

—:o:—

ఎడ్వర్డుదికన్ఫెసర్ రాజు 1066 సం॥లోఁ బరంపదించు నాఁటి కాతని తరువాతి రాజ్యార్హుఁ డగు నాతని యన్న మనుమఁడు పైన రగుటచేతను, కాల స్థితిని బట్టి విక్రమశాలి యగు రాజు కావలసి వచ్చుటచేతను, తన బావమఱఁది యగు హారోల్డు తన వెనుక రాజు కావలె నని ఎడ్వర్డు చెప్పి చనిపోయెను. ఆంగ్ల రాష్ట్రసభవా రిందున కనుగుణ్యముగా నాతనినే రాజుగా నియమించుకొనిరి. అంట ఫ్రాన్సులో నెడ్వర్డు మేనమామ ఆంగ్లసింహాసనముపైఁ జిరకాలము నుండి కన్ను వేసికొని యుండెను. పూర్వ మెప్పుడో యెడ్వర్డుతరువాతఁ దాను రాజగున ట్లాతనిచే నియమింపఁబడి యుండఁగా రాష్ట్రసభవారు మఱియొకనిని నియమింపఁగూడదని విలియము మిషపెట్టి యింగ్లాండుపై దండెత్తి హారోల్డు నోడించి రాజ్యము నాక్రమించుకొనెను. ఆతని విజయాట్టహాసమునకు వెఱచి రాష్ట్ర సభవా రతని కీ పట్టము గట్టిరి. విజయభూపుఁ డను పౌరుషనామముతో నీతఁడు నాఁటనుండియు రాజ్య మేలెను.

విలియముతోడి యుద్ధమునకుఁ బూర్వము, దేశమునందలి చిన్నరాజ్యము లన్నియు ముందు వెసెక్సు రాజ్యమునకు లోఁబడె ననియు, ఈ సమీకరణమువలన నాంగ్లదేశమంతయు నేకరాజ్య మైనదనియు, అటుపిమ్మట నీచిన్నరాజ్యముల ఘనతపోయి యవి మండల (shire) ప్రాయము లైనవనియు, పూర్వము రాజులుగా నుండుచువచ్చిన నీ మండలాధికారు లాంగ్లరాజపరివారకు లై లార్డు లైరనియు వారికింద నోబిలులనఁబడు నమ్మరావులు బయలు దేరి గౌరవభాజను లైరనియుఁ బూర్వాధ్యాయమునఁ జెప్పియుంటిమి. విలియము తోడజరిగిన యుద్ధములో నీ మండలాధిపతులు విశేషము గాహతు లైరి. కొందఱు దేశమునుండి వెడలఁగొట్టఁబడి వారిజమీలు దివాణమునకుఁ గలుపఁబడెను. ఇట్లే యుమ్మరావులభూములుకూడ దివాణమునకుఁ జేరెను. వారిలోఁ గొందఱు కొంతభూమిని విలియమునకర్పించి మిగిలినదానిని నిలఁబెట్టుకొనిరి. విలియముతోడ నార్మండినుండి వచ్చిన పరివారములో బలపరాక్రమశాలురకును, మంత్రులకును, సామంతులకును, ఈ దివాణపు భూముల నుండి జమీలను బోషకభృతిగ విలియము మాన్యము లిచ్చెను. అందుకుఁ బ్రతిఫలముగ వారు యుద్ధములలో రాజునకుఁ జేయూఁతయై నిలిచిపోరుటకును రాజునకుఁ గానుకలిచ్చుటకును నొడఁబడిరి. ఇట్లుమాన్యములను బొందిన వారీ చారిత్రమందు బారనులని వాడఁబడుదురు. అదనుగలిగినప్పుడు విలియము బారనులను బిలువనంపినయెడల బారనులు తమక్రిందిరయితులను బోగుచేసి యచిరకాలములోఁ దలఁచినప్పుడు వేలకొలఁది యుద్ధభటులను సమకూర్చుచుండిరి. ఈబారను జమీదారు లేకమై రాజునెదిరించుట కవకాశము లేకుండఁ జేయుటకై యొక్కొక జమీలోని భూము లన్నియు నొక్కచోట నుండక దూరస్థము లగు ననేకస్థలము లందుండున ట్లమర్పఁబడెను. ఈ యేర్పాటుచే మండలమం దొక్క బారనునకనేక భూములు లేకపోవుటచే ఆతఁడొక్కఁడే నొక్కరాజుపైఁ దిరుగఁబడుట కవకాశములేక యితరబారనులను ప్రజాసామాన్యమునుగూడఁ, గూడఁగట్టుకొనుట యావశ్యకమయ్యెను. విలియము తరునాత రాచఱికమునకు వచ్చినరాజులు నిరంకుశాధికారము వహించి రాజకీయాచారములకు వ్యతిరేకముగాఁ బనిచేసినప్పుడు బారనులు ప్రజలపక్షమునుండి రాజునుబ్రతిఘటించుట కిదియే కారణము.

ఆంగ్లసింహాసనమునకు రాకపూర్వము విలియము ఫ్రాన్సులో నొక మండలమునకుఁ బ్రభువై (duke) యుండుటచే విదేశరాజ్యపద్ధతుల కల

నాటుపడిన వాఁడయ్యెను. ఆ యాచారములలోని లోపముల నెఱిఁగిన వాఁడు గనుక వానినాంగ్లదేశమునఁ దెచ్చిపెట్టక యాంగ్లరాజకీయ పద్ధతులనే యవలంబించి రాజ్యముచేసెను. చిన్నరాజ్యము లన్నియుఁ గలిసిపోయి యేకరాజ్య మగుటవలన రాజ్యములు మండలప్రాయము లైనను ఆ రాజ్యములోని రాజకుటుంబముల వారికి విశేషముగా జమీ లుండుచువచ్చినవి. వారే సివిలుక్రిమినలు వ్యవహారములను దీర్చుటకు న్యాయాధికారులై వారిజమీలలో కోర్టులనుబెట్టుకొని శతకూటసమితుల యొక్కయు మండలసభల యొక్కయు బలము తగ్గించివేసిరి. వీరిగర్వ మడఁచినఁ గాని దేశమునకు క్షేమముగలుగదనియెంచి విలియము వీరి యధికారమును దగ్గించివేసి తిరుగా శతకూటసమితులను మండలసభలను నెలకొల్పెను; ఈ సభలకును జమీందారులకోర్టులకును నొక్కొకపరీక్షను నియమించి ఆతఁడే న్యాయకర్తయై వ్యవహరించున ట్లేర్పఱచెను. ఈ పరీక్షను నియమించు నధికారము తనయందే యుంచుకొనుటచే, మండలసభవారితో నిమిత్తము లేకుండ విలియము తన శాసనముల నమోఘముగఁ జెల్లించుకొనుచుండెను. జమీలపైఁ గప్పమువిధింపఁబడి దివాణమునకుఁ జెల్లుచుండు దేశాచారమునే రాజు బలపఱచి, గ్రామములందలి కొందఱు పెద్దమనుష్యులను జూరీలనుగ నియమించి, వారుప్రమాణముమీఁదఁ జెప్పినచొప్పున గ్రామగుడికట్టు యొక్కయు గ్రామమందలి ప్రత్యేకమాన్యముల యొక్కయు పరిమిత స్వభావములను వానివలన దివాణమునకుఁ జెల్లవలసిన పన్నులను దెలిపెడు రిజిష్టరు (Domesday book) నొకదానిని వ్రాయించి భూమిపన్నులను స్థిరపఱచెను. పూర్వమువలెనే రాష్ట్రసభను (witan) నిలిపి సంవత్సరమునకు మూఁడుసారు లా సభ చేయుచు రాజు దేశాచారమును బట్టి శాసనములను నమలుజరపుచు వచ్చెను. ఇటీవల నీ ప్రజాసభకు రాష్ట్రసభ యనుపేరు తప్పిపోయి రాజుగారికోర్టు (Curia Regis )అనుపేరు వాడుకలోనికివచ్చెను. ఎడ్వర్డుమొదలగు పూర్వపురాజులు చేసిన శాసనములలో నవసరమైన మార్పులను మాత్రముచేసి, శాసనబద్ధముగాక యాచారశరణ్య



ములై యున్నవానిని నిర్ధారణచేయునిమిత్తము విలియము మండలమునకుఁ బండ్రెండుగురు ప్రతినిధులను నియమించెను; నార్మనులకు నార్మనుల పద్ధతులను ఆంగ్లేయుల కాంగ్లేయుల పద్ధతులను నడిపించెను. తమ్మును బాధించు జమీందారులను జంపివేసి యాంగ్లేయులు పగతీర్చుకొనుచుండిరి. ఈ యాచారమువలన నార్మనులకా పగ గలుగకుండ, ఏ శతకూటములో నార్మను దేశస్థుఁడు చంపఁబడిన నా శతకూటములోని జను లందఱు జవాబుదారులగునట్లు విలియము శాసించెను. జమీలను మాన్యములుగాఁ గొన్ననార్మనులు రాజుపైఁ దిరుగఁబడకుండఁ గాపాడుకొనుట కుపాయముగా నాంగ్లరాజులు పూర్వము దేశరక్షణార్థము నిలఁబెట్టిన యాంగ్లమూలసైన్యములనే (standing army) విలియముకూడ నిలిపి ఆంగ్లపీరులు తిరుగఁబడిన నార్మను బారనులను, నార్మనుబారనులు తిరుగఁబడిన నప్పు డాంగ్లపీరులను సహాయముచేసికొని ప్రజ లందఱను దనవశమం దుంచుకొనఁగలిగెను. ఈ జమీందారులు తమ జమీలను విభజించి రయితుల కమర్చుకొని, తాము కోరినప్పుడు యుద్ధములలోఁ దమనిమిత్త మా రయితులు బోరునట్లు నిర్ణయించుకొని రయితుల యర్థములను బ్రాణములను జమీందారులు తమచేతిలో నుంచుకొనియుండిరి. రయితు లీ జమీందారులతోఁ గలిసిరాజుపైఁ దిరుగఁబడుదు రను భయముగలిగి, యజమానుని యెడలనే కాక రాజునెడలఁగూడ రయితులుభక్తిగలిగి యుండునటుల వారిచే విలియము ప్రమాణములు చేయించుకొనెను.

ఆంగ్లేయులు క్రైస్తవమత మవలంబించిన నాఁటనుండియు, ఆంగ్లరాజపదవికి వచ్చిన రాజుల కధికారము తననుండియే వచ్చిన దని రోమకపీఠాధిపతి యగు పోపు చెప్పుకొనుచు వచ్చెను. విలియము పారమార్థిక విషయములందు పోపుయొక్క యధికారమును మన్నించు వాఁడైనను, రాజకీయవిషయములందు మాత్రము పోపుయొక్క ప్రమేయమునకవకాశమియ్యక, తన యంగీకారములేనిది ఆంగ్లమతాచార్యులకు శ్రీముఖములైనఁ బంపఁ

గూడదని శాసించెను. ఇంతవఱకు మతాచార్యులు స్వతంత్రులై యుండిరి. విలియము వీరికి స్వాతంత్ర్యము నీయక వారిచేఁ దన శాసనములకు దాసోహములఁ జేయించుకొనుచు, వెనుకటి మతాచార్యుల స్థానమున నార్మనుపురోహితులను నియమించుచువచ్చెను. రాజువలన మాన్యములను గొన్నవారిని రాజానుజ్ఞ లేక బహిష్కారము చేయుటకు మతాచార్యులకు స్వాతంత్ర్యము లేదు. మతధర్మజ్ఞపరిషదులు (synod) రాజానుమతము లేక యే చట్టమును జేయరాదు; అట్టి యనుమతి పూర్వకముగఁ జేయఁబడినచట్టమున కైనను, రాజు చేసినది స్థిరపఱుపఁబడు వఱకు, ప్రజ లా చట్టములకు బద్ధులు కారు. ఇంతకుఁ బూర్వము మతసంబంధము లగు నపరాధములను ఇతర సివిలు తగాదాల వలెనే షరీపు యొక్క సాయమున మతాచార్యులు మండలసభలలోను గ్రామసభలలోను విచారించుచుండిరి. అట్టి యధికారము మండల సభలనుండి తొలఁగించి రాజు మతవిషయకాపరాధశిక్ష నిమిత్తము ప్రత్యేకముగ మతాచార్యసభ (spiritual court) ల నేర్పఱచెను. ఈసభలు గాక సివిలు క్రిమినలు వ్యవహారములను దీర్చుటకుఁ బూర్వపు గ్రామసభలును, శతకూట సమిత్సభలును, మండల సభలును బారనుల కోర్టులును బనిచేయుచుండెను. రాష్ట్రసభ రాజుగారి కోర్టుగా (Curia Regis) మాఱి యీ మండలసభలనుండి యప్పీళ్లను విచారించుచుండెను. నార్మండిలోనున్న మండలముయొక్క రాజకార్యములను జక్కబెట్టి కొనుటకు విలియ మప్పుడప్పుడు ఫ్రాన్సు దేశమునకుఁ బోవలసివచ్చుటచే నాతనిస్థానమున నాంగ్లరాజ్యవ్యవహారములను సమర్థించు నిమిత్త మొక ప్రతినిధి (justicer) నేర్పఱచుకొనుచుండెను.

విలియ మిట్లు దేశమునకు దృఢపరిపాలనము నేర్పఱచుట యందు బనిఁ గలిగియుండఁగా, 1074 వ సం॥ లో నిద్దఱు నార్మను జమీందారు లాతని నెదుర్కొనిరి. వారిని వెంటనే సులభముగా నతఁ డోడించెను గాని, నార్మండిదేశమునం దీతని కొమారుఁ డగు రాబర్టు ఫ్రాన్సురాజుయొక్క సాహాయ్యమును చేపట్టి, తండ్రిపైఁ దిరుగఁబడెను. ఇట్లుతండ్రియుం గొడుకును



గొంతవడి పోరి సంధి చేసికొనిరి. ఇంతట పరాసురాజు సంధికొడఁబడక మఱింత కలహమునకుఁ గాలు ద్రవ్వఁగా నాతనితోడి సంగరమందు విలియ మెక్కిన గుఱ్ఱము బెదరెను. విలియము జీనుపై ముందరకుఁ బడి యా దెబ్బచేఁ బ్రాణములఁ గోల్పోయెను.

విలియముయొక్క ముగ్గురు పుత్రులలో మొదటివాఁ డగు రాబర్టు బలహీనుఁడును జంచలజిత్తుఁ డగుటచే నాతనిని నార్మండిరాజ్యమునకును, పరాక్రమశాలి యగు రెండవపుత్రుఁడు విలియమును నాంగ్లరాజ్యమునకును విజయభూషణుఁడు నియమించి హెన్రీ యను మూఁడవపుత్రునకుఁ గొంతధన మిచ్చెను. ఆంగ్లరాష్ట్రసభవారి విలియమునకుఁ బట్టముగట్ట నొడంబడుటచే నీతఁడు రెండవ విలియ మనుపేర రాజ్యము చేసెను. విలియము తండ్రివలె బలపరాక్రమములుగల వాఁడే కాని, ఆతని నలంకరించిన సుగుణము లీతనికి లేనందున ఈతని రాజ్యమందు దేశము మిక్కిలి కంపించెను.

ఈతఁడు రాజ్యమునకు వచ్చిన కొలఁదికాలములో నార్మను బారను లీతనియన్న రాబర్టును బురస్కరించుకొని యాయుధహస్తులై యెదిరించిరి. దేశస్థు లగు నాంగిలేయులకు బహుమానము లిచ్చెద నని విలియము కపటవాగ్దానములఁ జేయఁగా వారందఱు రాజునెడల భక్తియుక్తులై రాజుపక్షమునఁ బోరి బారనుల నోడించిరి. కేశము చల్లారినవెనుక విలియము నిర్భయముగా జనులఁ బీడింపఁ జొచ్చెను. విజయభూషణుఁడు (Conqueror) బారనులకు జమీలను మాన్యమిచ్చినప్పుడు వారితో నొక నిర్ణయము చేసెను. బారను చనిపోయినప్పు డాతని వారసు మైనరయినయెడల, మేజ రగువఱకును ఆతని జమీవలన వచ్చినయాదాయము దివాణపు బొక్కసమునకుఁ జేరుచుండుట కేర్పాటుజరిగెను. మేజరయినవెనుక కిశోరుఁడగు బారను రాజునకుఁ గానుక నర్పించి జమీ పుచ్చుకొనుచుండెను. రెండవ విలియము ధనకాంక్షాపీడితుఁడై జమీలను జమీదారులను బీల్చి పిప్పిచేసి మితిలేని ధనమును గూడఁబెట్టెను. ఈ మైనరు కన్యక యైనయెడల విశేషధనము శుల్కముగాఁ

బుచ్చుకొని వసూ కిచ్చుచుండెను. దేవాలయములకు మతాచార్యుల నేర్పఱచు నధికారము రాజుచేతిలోనే యుండుటచేత ఆచార్యుఁడు పరంపదించగా నాతని స్థానమున మఱియొకని నియోగించుటకుఁ దడవు చేసి, ఆమధ్య కాలములో దేవస్థానమాన్యముల వలన వచ్చు నాదాయమును విలియము దానే యనుభవించుచు, క్రొత్త యాచార్యుఁడు రాఁగానే యాతని వలనఁ గానుక లందుచుండెను. నార్మండి యందుఁ గూడ విలియమునకుఁ గొన్ని జమీలుండుటచే నచ్చటి కప్పుడప్పుడు పోవలసినవాఁడై తనస్థానమున నింగ్లాండులోనుండి రాజకార్యములను జక్కఁబెట్టుట కొక రాజప్రతినిధి (Justice) ని తండ్రివలెనే యేర్పఱుచుకొనుచుండెను. ఇంగ్లాండునకు మరలివచ్చినపిదప కూడ నీ యుద్యోగము నిలుపఁబడుటచే నది స్థిరమయ్యెను. ఈ యుద్యోగస్థుఁడే రాజున కాంతరంగికమంత్రికుఁ డగుటచే నీతఁడు కాలక్రమమున ప్రధాని యయ్యెను.

రెండవవిలియము తండ్రివలె మృగయావినోది యగుటచే 1100సం॥లో నొకనాఁడు వేఁటఁ దగిలియుండ బాణహతుఁడై కాలధర్మము నొందెను. విజయభూషణు (The Conqueror) నకు రాబర్టు అను నార్మండి ద్యూకొకఁడును రెండవ విలియ మొకఁడును, హెన్రీయనువాఁ డొకఁడును ముగ్గురు పుత్రు లుండి రని వ్రాసియున్నాము. ఆంగ్లరాజు మరణము హెన్రీచెవినిఁబడగానే యాతఁ డింగ్లాండునకు వచ్చి పట్టాభిషిక్తుఁడై మొదటి హెన్రీ యను పేరుతో రాజ్యముచేసెను. ఈతఁడు తండ్రిని సోదరుని బోలిన పరాక్రమ మహత్వముఁ గలవాఁడగుటచే నార్మను బారనులు విక్రమప్రభు ముంగలఁ దమయాటలు సాగవని యుద్దేశించి దుర్బలుఁడగు రాబర్టును బురస్కరించుకొని యాతనికి రాజ్యాధిపత్య మిప్పింప సమకట్టి రాజుపైఁ దిరుగఁబడిరి. విజయభూషణునకుఁ బూర్వమాంగ్లేయులకుఁ బన్ను లంతగాలేవు. నార్మను ప్రభువుల కాలములలోఁ బన్ను లధికమై ప్రజలు మిక్కిలి బాధల నొందియుండిరి. మొదటి విలియము క్రొత్తపన్నులుకట్టినను బ్రజల క్షేమముకోరి రాజ్యము చేసినందున నాతని



యెడఁ బ్రజలకు భక్తి గలిగెను. ఆతని కొమారుఁ డగు రెండవ విలియము కూడ తండ్రివలె సత్పరిపాలనముఁ జేయునని యాశపడి యాతని యండఁ జేరి వైరులతోఁ బోరినప్పటికి పన్ను లెక్కువజేసి యాతఁడు ప్రజలఁ బీడించెను. అందుచేఁ బ్రజలు తన పక్షమునుండి బారనుల కలహ మడఁచుటకు సాయముచేయుదు రను నమ్మకము హెన్రీకి లేక ఆంగ్లరాజపరిపాలనా పద్ధతుల నెలకొలిపెద ననియు న్యాయ విరుద్ధమైన పన్నులను గానుకలను బుచ్చుకొన ననియు, దేవస్థానవ్యవహారములలోఁ దా నడ్డమువచ్చి మతాచార్యుల బాధపెట్ట ననియు జమీదారులు వారికి లోఁబడిన రయితులవలనఁ గూడ నెక్కుడు శిస్తులు వసూలు చెయ్యఁగూడదనియు, మొదలగు నిర్ణయములను జేసి ప్రజలకొక స్వాతంత్ర్యరక్షకపత్రిక (Charter of liberties) నిచ్చెను. అందుచేఁ బ్రజ లత్యంత రాజభక్తితో రాజుపక్షమునఁ జేరి బారనుల నడఁచిరి. ఇంతియకాక వెనుకటి యాంగ్లరాజ వంశ రాజులును స్కాట్లండు రాజపుత్రికయుఁ నగు యువతిని హెన్రీ వివాహ మాడుట వలన దేశమునకుఁ బ్రభుభక్తి మిక్కుటమయ్యెను. ఇప్పుడు రాజ్యముచేయుచున్న యెడ్వర్డు చక్రవర్తి గారీమె సంతతివారే. ఈకారణములచే 1101 సం॥ లో నార్మండి నుండి రాబర్టు ఆంగ్లరాజపదవిని యుద్ధములో జయింపఁ దలంచి దండెత్తఁగా ప్రజలసాహాయ్యముచే హెన్రీ వాని నోడించి దేశము విడిచి పోవునట్లు రాబర్టును సమ్మతి పరుపఁ గలిగెను. ఫ్రాన్సుదేశములోని ఆంజవ (Anjou) మండలాధికారియు ఫ్రాన్సురాజును గలిసి నార్మండిలో హెన్రీ యెడల నయిష్టులుగానున్న బారనులకు సాయముచేసి కలఁతపెంచిరిగాని, హెన్రీ 1128 వ సం॥ వారిని బరిమార్చి నార్మండి మొయిను మండలములను నాంగ్లరాజ్యమునకు సామంత దేశములనుగాఁ గలిపెను.

క్రైస్తవు లందఱకును బీఠాధిపతియైయున్న రోమకపోపునకు నాంగ్ల మతాచార్యు లందఱు లోఁబడి యుండవలయు ననియు, వారి నిమంత్రణాధి

కారము లౌకికప్రభుమాత్రుఁ డగు రాజువశమందుఁ గాక పీఠాధిపతియందుం డవలెననియు నాకాలమున మతాచార్యుల కొకపట్టుదల యుండుటచే, హెన్రీకిని వీరికిని యభిప్రాయభేద మేర్పడినది. దేవస్థానపుమాన్యముల విషయమున మాత్రము రాజశాసనములు చెల్లునట్లును, వానితో సంబంధించినంతవఱకు మతాచార్యులు రాజునెడల భక్తియుక్తులై యుండునట్లును, మతాచార్యపదవికిఁ గ్రొత్తగవచ్చినవారు తచ్చిహ్నములగు నుంగరమును సిలువప్రతిమను పీఠాధిపతి యగు పోపువలనఁ బొందునట్లును, రాజు మతాచార్యులతో సమాధానముచేసికొనెను. ఆచార్య నియమంత్రిణాధికారము పూర్వమువలెఁ బ్రత్యేకముగ రాజునందే యుండక తద్విషయమున పోపునకుఁ గొంతసంబంధము కలుగఁజేయఁబడెను. చిరకాలము దేశమున కరిష్టదాయకమై దానినెన్నియో వెతలపాలుచేసిన యీ పోపుయొక్క యధికారమున కీ రాజుకాలమునందే బీజము నాటఁబడి విజృంభించినది.

రాజుతో వైరముపెట్టుకొని ప్రతిఘటించిన బారనుల జమీలు దివాణమునకుఁ గలియుటచే అవి రాజభృత్యు లగువారికి మాన్యములుగ నియ్యఁబడెను. అందుచే రాజువశమం దుండుటకు సమ్మతింపక నిరంతరము స్వతంత్రులగుటకుఁ దరివేచుచు కలహములు పెంచుచున్న బారనుల మూలపట్టులు కదలి, వారిస్థానమున రాజవిధేయులై రాజ్యమునకితర కారణముల వలనవచ్చిన కష్టములను పోఁగొంచుటకు రాజునకు సహకారులై వర్తించు పిల్లజమీఁదారులు బయలుదేరిరి. వీరినే హెన్రీ మఱింత సన్మానించి మండలకరగ్రాహు లగు షరీపులుగను న్యాయాధికారు లగు జడ్జిలుగను నియమించుచుండెను. రాజుదేవతాపూజచేసికొనుట కేర్పడిన దేవాలయమందలి పురోహితులను హెన్రీమంత్రిమండలనుగా నేర్పఱచుకొని వారిపై చాన్సెలరు అనునొకయధ్యక్షుని నియమించెను. రాజు నార్మండికి వెళ్లినప్పుడుగాని రాజధానిని విడిచినప్పుడుగాని రాజస్థానమునందుండి రాజ్యతంత్రమును నడపించు రాజప్రతినిధి (Justice) మంత్రిమండలికిఁ బైయధికారి. రాజపరివారకు లగు బారనులను



జేర్చి రాజప్రతినిధియొక్క యధ్యక్షతకింద వారిని సుప్రీముకోర్టుగా నేర్పఱచెను. దీని నేరాజసభ (The Curia Regis or King's Court) యందురు. అంతవఱ కమలులో నున్న చట్టములలో నవసర మగు మార్పులఁజేసి రిజిస్టరుచేయుటయు, గ్రామమండలసభలలో నేర్పడిన క్రొత్తచట్టములకు రాజాంగీకారమిచ్చి స్థిరపఱచుటయు, కక్షిదారుల విజ్ఞాపనపయిని క్రిందికోర్టులలో విచారణజరుగుచున్న దావాలను దమకోర్టునకుఁ బిలిపించుకొని న్యాయముచేయుటయు, కడపటి అప్పీలుకోర్టుగా సివిలుతగాదాలను దీరుమానములుచేయుటయు నీ కోర్టువారి పని. వివిధమండలములందుఁ బనిచేయుచున్న షెరీపులను సుప్రీముకోర్టుజడ్జిలకు షుబేదారులుగఁజేసి వారి యోగక్షేమములను విచారించునటు లేర్పాటుచేయుటచే సుప్రీముకోర్టునకును మండలస్థములగు తక్కినకోర్టులకును సంబంధ మేర్పడినది. దివాణముయొక్క ఆదాయవ్యయములను జక్కఁబెట్టుటయు, కట్టవలసినపన్నుల నిర్ణయించుటయు, దివాణపు రివిన్యూ వసూలగునట్లు జాగ్రత పెట్టుటయు మొదలగు రివిన్యూవ్యవహారముకూడ వీరిమీఁద నెయుండెను. ఆఱునెలల కొకసారి ప్రతిమండలము నుండియు షెరీపువచ్చి, భూమిపన్ను, కోర్టులలో వసూలుచేయఁబడిన జుల్మానాలు, జమీలనుండి చెల్లవలసిన కానుకలు మొదలగు వానిని వసూలుచేసి దివాణమునకుఁ జెల్లించుచుండెను. భూమిపన్నులఁగూర్చి ప్రజల విన్నపములను విచారించుటకి రాజసభలోని కొందఱు దేశసంచారము చేయుచుండిరి. వీరు కాలక్రమమున న్యాయవిచారణలుకూడ చేయుచువచ్చుటచే సర్క్యూటు జడ్జీ లయిరి.

ఇష్టానుసారము చేయఁబడుమార్పులకు లోఁబడియుండు పూర్వపు రాజ్యతంత్రముకంటె హెన్రీయేర్పఱచిన పద్ధతి స్థిరమైనదై మార్పులేని మామూలుత్రోవ గలదగుటచే, నీతనిరాచఱికమునఁ బన్నులు బలమై భారముగలిగించినను, క్షామములచేతను సాంక్రామికరోగములచేతను బ్రజలు బాధలపాలైనను, దేశమందలి యల్లరులు మట్టుపడి శాంతిగలిగెను. అందుచే నార్మను

లకును నాంగిలేయులకును మైత్రి వర్ధిల్లెను. రాజధానియందలి కోర్టులతో మండలసభలకును శతకూటములకును నింతవఱకును నిత్యసంబంధ మేర్పడక పోవుటచే, ఏకరాజశిక్షితులమై కష్టసుఖములను సమముగాఁ బంచుకొనవలసిన యేకజాతివార మను సమష్టిజాత్యభిమానము పెంపొందుట కింతవఱకవకాశము లేకపోయెను. అట్టి జాత్యభిమానమును బ్రజాసామాన్యముయొక్క హృదయసీమలందు దృఢముగఁ బాదుకొల్పిన దీ హెన్రీయొక్క పరిపాలనమే యని చెప్పవచ్చును. వేల్సుమండలమున నేటికిని వెల్షుజాతివారను పేరనున్న యాదిమనివాసులును ఐర్లాండు స్కాట్లాండు మండలములం దుండు పిక్టులును నార్మను ప్రభువులతో వలసవచ్చిన నార్మనులును, ఆంగిలేయులును కొందఱు డేనులును ఇట్లొకరితో నొకరు సంబంధములేని యైదుజాతులవారు దేశమువం దున్నను దేశీయ రాజ్యతంత్రములను బాలించురాజుల పాలనమువలనను, ఇంగ్లాండునే కాపురముగాఁ జేసికొని దేశస్థుల క్షేమమే రాజునకు క్షేమమని యేలిన విదేశరాజుల వలనను, సమష్టి జాత్యభిమానము పుట్టి విదేశీయుల దండయాత్రలకుఁ జోటు దొరకక దేశమునకుఁ దుదకు మేలే కలిగెను. ప్రపంచచరిత్రలో వివిధజాతులవారు కాలక్రమమున నేకదేశవాసులై పరస్పర భేదములను దేశసమష్టి ప్రయోజనము వచ్చినప్పుడు మఱచిపోయి, అందఱు నేకఫలాపేక్షులై అందఱి సామాన్య లాభముకొఱకును వ్యవహరించవలెనను వివేకమును నేర్చుకొన్నారు. ఇంగ్లాండుదేశమునందు స్థిరపడిన పంచజాతులవారును నిట్టి సమష్టి జాత్యభిమానమును నేర్చుకొనుట కీ రాజు నెలకొల్పిన రాజ్యపద్ధతులే కారణములు. ఈజాత్యభిమానమే యింగ్లాండును నాంగ్లేయుల చెయిదాటకుండఁ గాపాడినది.

హెన్రీ యేకపుత్రికా సంతానవంతుఁడు. ఇంతవఱకు నారీరాచరికము నెఱుఁగని వారగుటచే, నాంగ్లేయు లామెకుఁ బట్టముగట్టరను భీతినొంది



ఈవార్త చెవినిబడగానే, హెన్రీ మేనల్లుఁడును, విజయభూషణునకు దౌహిత్రుఁడును నగు స్టీఫెనుపక్షమును బ్రజ లవలంబించి యాతనికిఁ బట్టాభిషేకముచేసిరి. ఇష్టానుసారము రాజును నియమించుకొను స్వాతంత్ర్య మాంగ్లేయులకుఁ గ్రొత్తదికాదుగదా! స్టీఫెను దుర్బలప్రభువగుటచే నార్మను బారనులు సంతసించి, హెన్రీకొమార్తె యగు మాటిల్డారాణిఱికము విషయమునఁ జేసిన ప్రమాణముల నుల్లంఘించి, దేశమునకు రాజే లేఁడనునట్లు నిరంకుశముగ వర్తించుచు దొంగలగుంపులఁ గూర్చుకొని, వారికి వాసయోగ్యముగ భయంకరదుర్గములను గట్టి ప్రజలను బడరాని బాములపాలు చేసిరి. వెనుకటి రాజులవలె నాంగ్లభటుల సహాయ్యము నపేక్షించినయెడల బారనుల గర్వమును స్టీఫెను అనాయాసముగ నడఁచియుండును. ఈతఁడు మాఱుత్రోవ ద్రొక్కి, కూటికాసించి యుద్ధముచేయు విదేశభటులఁ బోగుచేసి బహుకష్టముతో హెన్రీ కూడఁబెట్టిన ధనమును వెచ్చఁబెట్టి దివాణమునకు దారిద్ర్యమును దెచ్చిపెట్టెను. అంట మాటిల్డారాజ్యము జయింప నుద్యమించి విఫలమనోరథయై నార్మండికి మరలెను. ఆమె కొమారుఁడగు హెన్రీ నార్మండీ మొదలగు ననేక ఫ్రాన్సుమండలముల కధిపతియై యింగ్లండుపై దండెత్తగా స్టీఫెనుయొక్క పీడాకరమయిన దుష్టపాలనమునకు విసికి, ప్రజ లాతని విడిచి హెన్రీపక్షముపట్టిరి. మరియొకదారిఁ గానక స్టీఫెను జీవితాంతము వఱకు నాంగ్లరాజ్య మనుభవించునట్లును పిమ్మట హెన్రీ పట్టాభిషిక్తుఁడగునట్లును సమాధానపఱచుకొని దేశమున గర్వించియున్న బారనుల నాతని సాహాయ్యమున నడఁచి వారి దుర్గములను బూడిదలోఁగలిపి 1154 లోఁ గాలధర్మమునొందినందున రెండవ హెన్రీయను నామముతో హెన్రీరాజ్యమునకు వచ్చెను.



## అధ్యాయము 4.

—:0:—

### ఆంజవ వంశరాజులు.

### రెండవ హెన్రీ 1154-1189.

నార్మండీలో నున్న యీ హెన్రీని యింగ్లాండుపై యుద్ధయాత్రకు బురికొల్పి, స్టీఫెనుతో సంధిచేసి, ఆతనివెనుక పట్టాభిషేకము చేసినవాఁడు కాంటరుబరి ప్రధానాచార్యుఁడు. ఆతని ప్రియశిష్యుఁడగు థామసుబెకెట్టు హెన్రీకి బహిఃప్రాణమని చెప్పఁదగిన యాంతరంగికమిత్రుఁడు. వీరి సాహాయ్యముచేతనే పూర్వాధ్యాయాంతమందుఁ జెప్పఁబడినవిధమున దేశమందలి కల్లోలమడఁచి శత్రుదుర్గములను బూడిదపాలుగఁ గలిపి హెన్రీ మరల రాజసభ (the King's Court) ను రివిన్యూకోర్టు (Exchequer) ను బునరుద్ధారణము చేసెను. బెకెట్టును ఛాన్సెలరు పదమందు నిలిపి ఆతని మంత్రనముతో మొదటి హెన్రీ ప్రారంభించిన రాజ్యపద్ధతులను వృద్ధిచేసెను. స్టీఫెను తెచ్చి పెట్టుకొన్న కూలిపదాతులు దేశమునుండి సాగనంపఁబడిరి. ఱొమ్ముపై గుంపటివలె బారనులు దేశమునకు నిత్యము పీడాకరులగుటచే, వారిబల ముడిఁగించుటకుఁ గొన్ని మార్పులు చేయఁబడెను. జమీలయందుండు బారనుకోర్టులలో బారనులే న్యాయాధికారులై తీరుమానములను జేయు పూర్వాచారము మాన్పింపఁబడి రాజుగారి రివిన్యూకోర్టునుండి సంచారిజడ్జిలు ఆకోర్టులకుఁ బోయి న్యాయపరిష్కారము చేయుపద్ధతి నెలకొల్పఁబడెను. రాజునకుఁ జెల్లవలసిన కప్పములను బారనులనుండి వీరే స్వీకరించుచు దివాణమునకుఁ జేర్చుచుండిరి. మఱియుఁ బూర్వపు పద్ధతిచొప్పున కొంతభూమి గలవాఁడొక్కొక భటునిచొప్పున రాజుకొలువునకుఁ బంపవలెను. ఈభారము బారనులమీఁద నుండుటచే, వారు కొందఱు భటులను జీతబత్తెములిచ్చి



యెల్లప్పుడు తమ వశమందుంచుకొనుచు, రాజు దుర్బలుఁడైనప్పుడు వారి సాహాయ్యమున నాతనిపైఁ దిరుగఁబడుచుండిరి. ఈపద్ధతి నీరాజు మాన్పించి, భటులను బంపుటకు బదులుగ నింత భూమిగలవాఁడింత చొప్పునఁ గప్పము గట్టవలెనని మార్పుచేయుటవలన, బారను లుపదాతులను కూర్చుకొనుట కవసరము తప్పిపోయి వారు రాజు నెదిరించుట కవకాశము లేకపోయెను.

మతవిషయక వ్యవహారములను బరిష్కరించుటకు సివిలుకోర్టుల యాధికారమునకు లోఁబడని మతకోర్టులను విజయభూపుఁడేర్పఱచెను గదా. మతాచార్యులును బురోహితులును నేరములను జేసినప్పుడు వారిని విచారించుటకీ కోర్టువారే యధికారము నవలంబించి క్రిమినలుకోర్టుల యధికారమును నిరాకరించిరి. ఈ మతకోర్టులలోని యధికారులు మతాచార్యులగుటవలన నరహత్య కురిశిక్ష విధించుటకుఁ జంకి నేరమునకుఁ బ్రాయశ్చిత్తమును, ఉద్యోగభంగమును శిక్షలుగా నేర్పఱచుకొనిరి. అందుచే నేరమునకుఁ దగిన శిక్షలేక మతప్రవర్తకులు నేరములను నిర్భయముగాఁ జేయుచుండిరి. వీరు క్రిమినలు కోర్టుల యధికారమునకు లోఁబడునట్లు చట్టమును జేయవలెనని హెన్రీ సంకల్పించి, బెకెట్టును కాంటరుబరి ప్రధానాచార్యునిగా నియమించి, తన యుద్యమమును గొనసాగించుకొనఁ జూచెనుగాని, బెకెట్టు రాజునకు మతవిషయములలో లేశమును సంబంధముండఁ గూడదను పట్టుదలగలవాఁడగుటచే, రాజున కాతనిపై ద్వేషము పెరిగి, క్లారెండను నగరమున 1164 లో నొక సభను గూర్చి మతాధికారులమీఁదను, దేవస్థానమాన్యములమీఁదను రాజునకుఁ గల యధికారముయొక్క పరిమితిని నిర్ణయింప నియమించెను. విజయభూపుఁడేర్పఱచిన పద్ధతు లాతని రాచఱికము నాటనుండి స్థిరపడియుండుటచే, వానినాధారపఱచుకొని యీసభవారు ధర్మనిర్ణయము చేసి రిపోర్టువ్రాసిరి. నేరము చేసిన మతప్రవర్తకులను దండించు నధికారము క్రిమినలు కోర్టువారిదనియు, మతకోర్టుల తీరుమానములపై నప్పీళ్లను రాజే విచారింపవలెననియు, రాజానుమతి పొందకుండ రోమకపీఠాధిపతి యగు పోపునకు నప్పీళ్లఁ బంపఁగూడ

దనియు, రాజభృత్యులను రాజుగారి దేవాలయ పురోహితులను రాజాజ్ఞ లేక బహిష్కారము చేయఁగూడదనియు మొదలగు నియమములు రిపోర్టులోఁ బరిష్కరింపఁబడెను. బెకెట్టు వాగ్రూపకముగ వీని కంగీకారమును సభలో సూచించినను, బిమ్మట వానిని దిరస్కరించుటచే, రాజాగ్రహమునకుఁ బాత్రుఁడై యింగ్లాండువిడిచి ఫ్రాన్సుదేశమునకుఁ బలాయనుఁడయ్యెను. రాజు అతనిపక్షమువారిని 400 మందిని దేశమునుండి వెడలఁగొట్టెను. ఇంతటితో బెకెట్టువలని ప్రతికక్షి రాజునకు వదలదయ్యెను. హెన్రీ తన జ్యేష్ఠపుత్రుఁడు ముందు రాజు గావలెనను సంకల్పముగల వాఁడై, తనపిమ్మట నిందునకవరోధము రాకుండఁ జేయవలెనని యాతనికిఁ దన జీవితకాలము లోనే యార్కు ప్రధానాచార్యునిచేఁ బట్టాభిషేకము చేయించెను. పట్టాభిషేకము జేయించు నధికార మింతవఱకుఁ గాంటరుబరి మతాచార్యులయం దుండుటచే, బెకెట్టు ఫ్రాన్సుదేశమునుండియే యార్కు దేవాలయ పురోహితులనందఱను వెలివేసెను. హెన్రీ తనకొమారుని పట్టాభిషేకము వ్యర్థమగునని భీతినొంది, బెకెట్టునోడఁబఱచి దేశమునకు రప్పించుకొని, ఫ్రాన్సుమండలముల యోగక్షేమములను జూచుకొనుట కచ్చటికి వెళ్లియుండఁగా, బెకెట్టుపూర్వము వలెనే రాజాజ్ఞావిద్వేషియై పోపుపక్షము పట్టియున్నట్లు రాజు విని దురాగ్రహావేశముచే బెకెట్టునుఁ గొన్ని కఠినోక్తు లాడెను. ఆ వాక్యములనుబట్టి బెకెట్టును జంపుటకు రాజాజ్ఞయైనదని భ్రమపడి రాజభటులు ఫ్రాన్సునుండి కాంటరుబరీకివచ్చి 1172 లో బెకెట్టునుజంపిరి. పోపు రాజుపై నీ నేరము మోపి బహిష్కారము చేసెదనని శ్రీముఖము నంపెను.

బెకెట్టువలని యాటంక మాతఁడు పరదేశగతుఁడు కాఁగానే తొలఁగుటచే, హెన్రీ రాజ్యతంత్రములో నవసరమైన మార్పులను జేయఁగలిగెను. ప్రతిసంవత్సరమును రాష్ట్రసభవారిని సభగూర్చి చట్టములలోని లోపములను సవరణచేసెను. గ్రామకంఠము దాటిపొలిమేరలో నైనను బరదేశి బసచేయఁగూడదు; గ్రామమందు బసచేయుటకైనను, ఆతనియుక్తప్రవర్తనకుఁ బూ



చీపడు జామీనుదారు లుండవలెను. అట్టిపరదేశుల వివరణపట్టిక సంచారిజడ్జీల యెదుట దాఖలుకావలెను. గ్రామమునకు నలుగురును నూఱుగ్రామముల మొత్తముమీఁదఁ బన్నెండుగురును పెద్దమనుష్యులు ఆ యా దేశవాసులచే జూరీలుగా నియమింపఁబడి, వారు రాజభక్తితోఁ బనిచేయునట్లు ప్రమాణము చేయుటకును, వారు కాపురముండు ప్రదేశమందు నేరముచేసినవారిని విచారణ కప్పగించుటకును జట్టమేర్పఱుపఁబడెను. నేరస్థులుచేసిన నేరముయొక్క స్వభావమును నిర్ణయించు న్యాయాధికార మీ జూరీలయందేయుండినను, వారే నేరమును రుజువుచేయుచు సాక్షులై యుండిరి. నేరము మోపఁబడిన వానిబంధువులును జుట్టుప్రక్కలవారును నాతఁడు నేరము చేయలేదని ప్రమాణముచేసిన యెడల నిర్దోషి యని తీర్పు చేయు పూర్వాచారము రద్దుపఱుపఁబడెను. జూరీలవిచారణ ముగిసినవెనుక కాలిన యినుపకణికను నేరస్థుఁడు చేతితోఁ బట్టుకొనఁగలిగినను, నీటఁ జొచ్చి తేలక మునిఁగినను, వానిని నిర్దోషి యని హెన్రీకాలమందు వదలిపెట్టుచుండిరి. 1216 లో నీయాచారము పరిహరింపఁబడువఱకు నవలంబనములో నుండెను. అటు పిమ్మటజూరీల తీర్మానముచొప్పున నేరస్థులకు శిక్ష విధింపఁబడుచు వచ్చెను. మండలసభలలో షెరీఫు అను పేర రాజుచే నియమింపఁబడిన యుద్యోగస్థుఁ డొకఁడుండి మండలవ్యాపారములను దీర్చుచుండెనని మొదటిహెన్రీ చారిత్రమందుఁ జెప్పఁబడినది. ఇట్టి షెరీఫు పనియందు రెండవహెన్రీకాలములోఁ జాలవఱకు బారనులే యుండిరి. ఈతఁడు నార్మండీ మొదలగు ఫ్రాన్సుమండలముల రాచకార్యములను జక్కఁబెట్టుకొనుటకుఁ బోయియున్నప్పుడీ బారనుషెరీఫులు క్రమముగా బలి చేయునందున, వారి వర్తనమును గూర్చి విచారణచేసి వారినందఱ నాపదవినుండి తొలఁగించి వారికంటె దక్కువమర్యాదఁగల వారయ్యును రాజుగారి రివిన్యూ కోర్టునకు సంబంధించిన విధేయుల నాస్థానమునకు నియోగించి కడఁది బారనుల మగఁటిమిఁ దూలించెను.

హెన్రీ రాజ్యమునకు వచ్చునప్పటి కింగ్లాండునకుఁ బశ్చిమోత్తరదిశనున్న యైర్లాండు ద్వీపముయొక్క స్థితి మిగుల శోచనీయముగనుండెను. అచ్చటి దేవాలయములు క్రమమైన కట్టుబాటులు లేకయుండెను. పశ్చిమండలి ద్వీపము లన్నియు రోమక పీఠాధికారమునకు లోఁబడినవే యని యొక స్వత్వము నాపీఠాధికారి యగు పోపు తనయం దారోపించుకొని ప్రభుత్వము నెఱపుచుండుటచే, నైర్లాండును హెన్రీకిఁ బోపు బహుమానమిచ్చెను. ముష్కరు లగునా ద్వీపవాసులచే నవమానితుఁడై వెడలఁగొట్టఁబడిన యొకమండలాధిపతి హెన్రీని శరణు చొచ్చి యాద్వీపము పయికి దాడివెడల రాజును బురికొల్పెను. ఈ కారణములచేఁ గొందఱాంగ్ల బారనుల సాహాయ్యమున హెన్రీ యా ద్వీపముపై దండెత్తి దానిని జాల వఱకు వశపఱచుకొనెను. యుద్ధయాత్రకుఁ బోయిన యా బారను లాద్వీపమున నిత్యనివాసములఁ గూర్చుకొని యచ్చటనే స్థిరపడిరి. వీరిట్లు స్వతంత్రులైన యెడల రాజుపై నెదురొడ్డఁగలరని యూహించి హెన్రీ మఱింత వరూధినీసమూహమును జేర్చుకొని యాద్వీపముపయిఁ గవియఁగా నచటివా రాతని యాధిరాజ్యమున కొడఁబడిరి. ఇట్లు రాజు ద్వీపమునంతను గ్రమక్రమముగా స్వాధీనపఱచుకొన సమకట్టియుండ, నార్మండీలోఁ గొమాళ్లవైరము బలమైనందున రాజచటికిఁ బోవలసి వచ్చెను. బెకెట్టుయొక్క బలాత్కారహత్యకుఁ గినుకవహించియున్న పోపును సమాధానపఱచుకొను తలంపుతో, ఫ్రాన్సునకుఁ బోకపూర్వ మైర్లాండు మతప్రవర్తకులలోఁ బోపుయొక్క యిష్టానుసారముగఁ గొన్ని మర్యాదల నేర్పఱచి పిమ్మట ఫ్రాన్సునకుఁ బోయి యచ్చటి పోపు ప్రతినిధియొక్క క్షమార్పణ గోరి బెకెట్టుమరణమువలని దోషమును బాపుకొనెను.

అచ్చటఫరాసు (France)లో హెన్రీయొక్క జ్యేష్ఠపుత్రుఁడు, పట్టాభిషేకముతో దనకు రాజ్యాధికారము సద్యస్సిద్ధమై ! యలవడిన ట్లూహించి దర్పితుఁడై ఫ్రాన్సు దేశాధిపతియొక్క బలము నూఁతగాఁ గొని, స్కాట్లండు



రాజుయొక్కయు, నార్మను బారనులయొక్కయు, తనసోదరులు మొదలగు వారియొక్కయు సాయము చేపట్టి తండ్రిపైఁ దలపడెను. ఇట్టి యిక్కట్టైన నాంగ్లప్రజలు రాజభక్తి యతిశయిల్ల రాజునకుఁ దోడైనిలుచుటచే, హెన్రీ శత్రుమూకల తుమును దూలింపఁగలిగెను. స్కాట్లండురాజును జెఱపట్టి, తనకు లోఁబడియుండి కప్పమిచ్చు పద్ధతిమీఁద నాతని విడిపించి యాతని రాజ్య మాతని కిచ్చివేసెను. ఈ యనుభవముచేఁ దెలివి తెచ్చుకొని హెన్రీ విదేశ వరూధినులఁగాని, పూర్వపు పద్ధతి ననుసరించి కూర్చఁబడిన స్వదేశ పదాతులను గాని నమ్ముకొనుట ప్రమాదమనియు, దేశప్రజాసామాన్యమునంతను నమ్మినఁగాని దేశమునకు శత్రుభయము దొలఁగదనియు నిశ్చయించి రాష్ట్రరక్షక సైన్యము నీ క్రొత్త పద్ధతి నవలంబించి సమకూర్చెను. ఇంతట హెన్రీ కొమాళ్లు తండ్రిపైఁ గలహించి యాతనిని కడుకష్టముల పాలుపఱచిరి. రిఛార్డు అను మధ్యముఁడును జాను అను కనిష్ఠుఁడును దక్క తక్కిన పుత్రు లందఱు పరంపదించిరి. 1189 లో హెన్రీ స్వర్గస్థుఁడు కాఁగా, సింహవిక్రముఁడను బౌరుషనామమును వహించిన రిఛార్డు రాజ్యమునకు వచ్చెను.



## అధ్యాయము-5

—:0:—

## ఆంజవ వంశరాజులు.

—:0:—

### మొదటి రిచ్చర్డు;—జాను; 1189-1216

(రిచ్చర్డు అనుపేర నాంగ్లదేశము నేలిన రాజులలో నీతఁడు మొదటి వాఁడగుటచే నీతనిని మొదటి రిచ్చర్డు అనివాడుదురు. ఈతఁడు సింహవిక్రముఁడు (The Cour-de Lion) అను బిరుదునకుఁ దగినట్లు వాసికెక్కిన బలపరాక్రమశాలియనుటకు సందేహములేదు. కాని, రాజ్యతంత్రమును జక్కఁగా నడపుసామర్థ్యముఁగల బుద్ధిశాలి కాఁడు. క్రైస్తవమతమువారి కందఱకును జగదేక పవిత్రస్థానమైన జెరూసలేము దేవాలయమును ముష్కరతురుష్కులా కాలమున ముట్టడించి యాధీనముచేసికొని అచటికిఁ దీర్థయాత్రకుఁ బోవు క్రైస్తవభక్తులను బడరానిబాములఁ బెట్టుచుండుటచే నప్పటి వివిధ దేశాధీశు లేకమై తురుష్కక్రూర గ్రహణమునుండి యాదేవళమును విడిపింప సమకట్టిరి. ఆ రాజమండలితోఁ గూడి జెరూసలేమునకుఁ బోయి తనపరాక్రమ మహత్వమును బ్రకటింప నుత్సుకుఁడై రిచ్చర్డు అందులకు వలయు ధనమును గడుదుర్నీతి నవలంబించి ప్రజలనుండి స్వీకరించెను. జీసస్ మహర్షి యొక్క మహిమను గాని, ఆతని శాంతివాక్యములను గాని నమ్మక బైబిలులోని ప్రాచీనకాండను నమ్మెడియూదులు (Jews) మిక్కిలిభాగ్యవంతులై ఋణములిచ్చి వడ్డిరూపమున విశేషముగ ధన మార్జించుచుండిరి. ఆకాలమున వడ్డికి బదులిచ్చుట క్రైస్తవమత సాంప్రదాయికులకు విరుద్ధమని యెంచఁబడుటచే, కేవల రాజానుగ్రహముచేఁ గాక క్రైస్తవమత సంకులమైన నాంగ్లదేశమున యూదులు కాలుపెట్టుటకే యర్హతలేకపోయెను. అందుచే రిచ్చర్డు వారిని దేశమున నుండనిచ్చినందులకు మితిమీఱినధనమును బుచ్చు



కొనెను. తండ్రికాలమునఁ గప్పముగట్టుట కొడఁబడి రాజ్యమును గొన్న స్కాట్లండురాజు నట్టి నిర్బంధమునుండి విడిపించి కొంతధనము నార్జించెను. షరీఫు మొదలగు గొప్పయుద్యోగములను వేలమువేసి యెక్కుడుధనమిచ్చిన వారి కిచ్చుచువచ్చెను. చరాస్తిపై పన్నుగట్టుటకుఁ గొత్తగాఁ బ్రారంభించి ఉన్నచరాస్తిలోఁ బదవవంతు పన్నుగాఁ బుచ్చుకొనెను. ఇట్లు పోగుచేయఁబడిన ధనరాశితోఁ జెరూసలేమునకు సమరోద్ధతుఁడై పోయెను, గాని తక్కినరాజులతో వైరముపెట్టుకొని యొంటరిగాఁ దురుష్కులతో నెదురొడ్డి యోడిపోయెను. రిచ్చర్డు ప్రచ్ఛన్నముగా దేశమునకుఁ బాఱివచ్చుచు మార్గమున రోమకచక్రవర్తిపాలఁబడి, కొంత ధనమిచ్చి విడిపించుకొని యిల్లు చేరెను. ఇంగ్లాండున రెండుమాసములు మాత్రముండి, ఆ స్వల్పకాలములో ననేకవిధముల వెనుకటివలెనే యనేకపన్నులఁ గట్టి రిచ్చర్డు ధనము పోగుచేసి, ఫ్రాన్సుదేశమున నాంగ్లరాజుల యధీనమున నున్న మండలములను స్వాధీనముచేసికొనఁ దలపెట్టియున్న ఫ్రాన్సురాజుతో నైదువత్సరములు పోరి రణనిహతుఁడై 1199 లోఁ బరమపదించెను.

రిచ్చర్డు పదిసంవత్సరములు మేరునకు రాజ్యభారమును వహించినను విదేశపర్యటనముతోఁ గాలము గడపినందున దేశమభ్యుదయము నందెను. అంతటి కఠినమైన పన్నులను గట్టినను దేశము రాజప్రతినిధులచేఁ జక్కఁగాఁ బాలింపఁబడుటచేఁ బ్రజలు సులభముగా వానిని భరింపఁగలిగిరి. సాహిత్యగ్రంథబాహుళ్యము విస్తరించెను. నేటివఱకును జగదేకప్రసిద్ధమై వెలుఁగుచున్న ఆక్సుఫర్డు సర్వకళాశాల (University) యీ కాలమునందే స్థాపింపఁబడెను. శిల్పశాస్త్ర నైపుణ్యము వృద్ధియగుటచే సంపన్నులు మ్రానితో నిండ్లు కట్టుకొనుట మాని అందముగా ఱాతితో మందిరములఁ గట్టుకొన నేర్చుకొనిరి. రెండవహెన్రీ యేర్పఱచిన రాజ్యపద్ధతి నవలంబించి రాజప్రతినిధులు రాజకార్యములను నడపించుటచే మంత్రులు గవర్నమెంటు స్థిరపడి బారనులు తిరుగఁబడి స్వతంత్రత వహించుటకు నవకాశము లేకపో

యెను. వేర్వేరు మండలములవారు కోరుకొన్న జూరీలను సెంట్రలు గవర్నమెంటువారి క్రిమినలుకోర్టులకు రప్పించి న్యాయవిచారణ చేయించుచుండుటచే ప్రతినిధుల నేర్పఱచుకొను నాచారము ప్రజాసామాన్యమున కలవాటుపడి పార్లమెంటుసభ యేర్పడుటకు మార్గమేర్పడినది.

ఆల్ఫ్రెడ్డు మొదలగు నాంగ్లరాజుల కాలమునందు వెలసియున్న గ్రామములనుగూర్చియు, శతకూటములనుగూర్చియు, వాచకులు చదివియే యున్నారు. నార్మనురాజులకాలమందు గ్రామములు పెరిగి శతకూట పరిమితిగలవై పెంపొందినవి. ఇవి రాజుయొక్క స్వంతస్వాస్థ్యముగ నెన్నబడుటచే రాజే న్యాయవిచారణచేయుచు షరీఫులమూలమునఁ బన్ను వసూలు చేయుచు వచ్చెను. షరీఫులు పట్టణములను గుత్తకుఁ బుచ్చుకొని, తమ కిష్టము వచ్చినట్లు పన్నుకట్టి వసూలుచేయుచు బాధపెట్టుటచే మొదటి హెన్రీకాలమున లండను పట్టణవాసులు షరీఫుతో నిమిత్తములేకుండ తామే రాజునకు జవాబుదారులై పన్ను చెల్లించునట్లు స్వాతంత్ర్యపత్రికను సంపాదించుకొనిరి. లండనువలె పెరిగిన యితరపట్టణములుకూడ దానివలె స్వతంత్రత వహించుటకు యత్నించుచు రిఛార్డుకాలమున నిట్టి భాగ్యమును సంపాదించుకొని మ్యునిసిపలు గవర్నమెంటు పొందిరి. ఏ పట్టణము వారా పట్టణమునకు షరీఫును నిర్ణయించుకొనుచు వచ్చిరి. పట్టణములకు వెలుపలికోర్టులతో సంబంధములేక పట్టణహద్దులలో నున్న న్యాయస్థానముల నుండే న్యాయము పొందుచుండిరి.

ప్రజాసామాన్యముయొక్క స్థితిగతులనుగూడ విచారించవలసియున్నది. నార్మనురాజుల నాటనుండియుఁ బ్రజలు ప్రభుకోటి యగు నార్మనులుగను, ప్రజాకోటి యగు నాంగ్లజనసామాన్యముగను వేర్వేఱుగ విడిపోయి స్వస్వధర్మముల ననుభవించుచుండిరి. ఆంగ్లజనబాహుళ్యమునకు గవర్నమెంటుతోడి సంబంధము సడలినది. సంపన్నులు భూస్వాస్థ్యములను, బిరుదులను, రాజకీయస్వాతంత్ర్యమును గోల్పోయిరి. ప్రజాసామాన్యము



లార్డులకు లోఁబడిన రయితులైరి. లార్డువలన విడుదలపొందిగాని యాకర్షకుఁడు స్వతంత్రుఁడు కాజాలఁడు. లార్డువలని బాధలనుండి కాపాడు రక్షలేదు. ఇట్టి నీచదశకుఁ దప్పి కొంత యాధిక్యత ననుభవించు వారాంగ్లేయ ప్రజలలో లేకపోలేదు. యుద్ధసేవకావిధికి బదులుగాఁ బన్నుల నిచ్చు స్వతంత్రభూస్వాములును, లండను మొదలగు పట్టణవాసులును, మతప్రవర్తకులును పూర్ణస్వాతంత్ర్యము ననుభవించుచు తమ రాజకీయవ్యాపారములను దామే దీర్చుకొనుచుండిరి.

ఆంగ్ల ప్రజాసామాన్యమునకుఁ దొలఁగిపోయిన స్వాతంత్ర్యమును, రాజకీయస్వత్వమును (Political Rights) బిరుదులును, భూములును, ఉన్నత రాజకీయోద్యోగములును ప్రభుకోటివారగు నార్మనుల పాలయ్యెను. రాజుతో సరితము పోరుపెట్టుకొని నిరంకుశముగ నేలవలెనని యీ నార్మనులు తగవులాడుచుండె మొదటి విలియమాదిగా మొదటి హెన్రీకాలము వఱకుఁ గొంతవఱకు రాజునకులోఁబడి యుండవలసిన వారయ్యెను, స్టీఫెను కాలములో నన్యోన్యజయేచ్ఛాగ్రస్తులై యొకరినొకరు చంపుకొని, నామమాత్రావశేషులైరి. నార్మనుల ప్రాభవ మిట్లు పడటఁగలసియుంటచే, వారి స్థానమున నాంగ్లఘనులు కుదురుపడి. దేశక్షేమము కొఱకు పాటుపడు దేశభక్తులై స్వాతంత్ర్యభాగ్యము మొక్కపోక వర్ధిల్లఁజేసిరి.)

రిఛార్డు మరణానంతర మాతని కనిష్ఠసోదరుఁడగు జాను రాజయ్యెను. ఇతఁడు కడుక్రూరుఁడై దుష్పరిపాలనము చేసినందున, నార్మండీ మొదలగు ఫ్రాన్సుదేశములోని మండలముల ప్రజలు ఫ్రాన్సురాజును శరణు చొచ్చిరి. అతఁడు నార్మండీ మొదలగు మండలములమీఁదికి దండెత్తి యనాయాసముగా వానిని స్వాధీనపఱచుకొనెను. విదేశమండలము లిట్లు నష్టమైపోవుట యాంగ్లదేశమునకు మిక్కిలి క్షేమకరము. ఫ్రాన్సుమండలముల బలమునుజూచుకొని నిరంకుశముగఁ బాలించుటకు మునుపటివలె రాజున కవకాశము తప్పిపోయి, ఆంగ్లదేశ క్షేమమే తనక్షేమమని దేశాభిమానముఁగలిగి యేలుటకు

రాజునకును రాజునందుఁ బూర్ణవిశ్వాసముఁ గలిగి మనుటకు ప్రజలకును సమయము వచ్చెను.

తన దుర్బలత్వముచేఁ గొంత రాజ్యమును నష్టపఱచుటయే గాక రోమక పీఠాధిపతి యగు పోపునకుఁ బాదాక్రాంతుఁడై నీచసఖ్యముచేసికొని జాను దేశమునప్రఖ్యాతి తెచ్చిపెట్టెను. కాంటరుబరి ప్రధానాచార్య స్థానమునకుఁ గ్రొత్తవానిని నియమింపఁగలసివచ్చి, తన నియమమునకు నంగీకరింపక ప్రతిపక్షులై యున్న మతాచార్యులను వంచలేక, పోపును దగవరిగాఁ గోరెను. పోపు ఉభయపక్షములవారి నియమనము నంగీకరింపక వేరొక యాచార్యుని నియమింపఁగా జాను వాని నిరాకరించెను. పోపు ఇందున కాగ్రహించి, జాతస్నానమృతస్నానములు తప్ప తక్కిన మతసంస్కారము లేవియు జనులకు జరుగకుండునట్లు నిషేధించి, దేశమందలి దేవాలయములను గట్టిపెట్టించెను. అందునకుఁ బ్రతిక్రియగా రాజు దేవాలయములను గొల్లవెట్టెను. ఆంగ్లదేశముపై దండెత్తి జానును సింహాసనభ్రష్టునిజేసి రాజ్యమును గానుకగాఁ బుచ్చుకొనుమని పోపు ఫ్రాన్సురాజును హెచ్చరించెను. ప్రజలకు భక్తి యున్నయెడల, రాజీ యాపదను తొలఁగించుకొనియుండును. ఆంగ్లబారను లీతని క్రౌర్యమును భరింపఁజాలక రాజుపై నెదురొడ్డిరి. కొందఱిని దేశమునుండి వెడలఁద్రోచియుఁ గొందఱి పుత్రసంతానమును గారాగృహబద్ధులఁజేసియు, చంపివేసియు ననేకవిధముల రాజు దేశకంటకుఁడయ్యెను. అందుచే వేఱుగతి గానక జాను కడునీచవృత్తి నవలంబించి పోపునకు బాదాక్రాంతుఁడై రాజ్యము నాతని పీఠమున కర్పణఁజేసి, ఆపీఠమునకు వశవర్తియై సామంతరాజుగ దేశము నేలుట కొడఁబడి తిరుగ పోపువలన రాజ్యమును బరిగ్రహించెను. పోపుతోడి వివాదము బలముగానున్న కాలమున జానువలన దేవస్థానములకు వచ్చిన నష్టమును నిర్ధారణ చేయుటకును, ప్రజల కష్టసుఖములను నిరూపించుటకును బారనులుసభలు చేసి, మొదటి హెన్రీ ప్రజలకిచ్చిన స్వాతంత్ర్య[illegible]కపత్రిక నాధారము చేసికొని దేశక్షేమకరమగు



పాలనాపద్ధతులను స్థిరపఱచి యొకశాసనమును వ్రాసి రాజునకు నివేదించుకొనిరి. అతఁడు ప్రజలకోరికల నెఱవేర్పనందున బారనులును నగరజనబాహుళ్యమును నేకమై యాయుధములధరించి రాజుపైఁ గవిసిరి. తప్పించుకొను సాధనములేక జాను 15 వ జూను 1215 తేదీని స్వాతంత్ర్య మహాశాసనమును ప్రజలకిచ్చెను. దీని కింగ్లీషున ‘ చార్టర్ ’ రను పేరున్నందున, వ్యవహార సౌకర్యార్థము దీనిని చార్టరనియే వాడుదుము. ఇందలి నిర్ణయముల నిచట సంగ్రహముగా వివరించెదము.

దేవస్థానముల కాచార్యనియామకము క్రొత్తగఁజేయవలసివచ్చినప్పుడు మతాచార్యులే నిర్ణయకర్తలు; రాజునకు ప్రమేయము లేదు. గొప్పజమీలు వారసులకు సంక్రమించినప్పుడు, రాజునకుఁ జెల్లవలసిన పన్ను స్థిరపఱుపఁబడెను. అట్టివారసు మైనరయినయెడల జమీను రాజుకాపాడి, మామూలుగా వచ్చు రాఁబడిమాత్రము వసూలుచేయవలెను. మైనరు వారసులకు దంపతులఁ గూర్చునపుడు వారి పరువుమర్యాదలను గాపాడవలెను; వితంతువులను స్వేచ్ఛాన్యతిరేకముగ వివాహమాడునట్లు రాజు బలవంతపెట్టఁగూడదు. రాష్ట్రసభవారి పూర్వాంగీకారము పొందకుండ రాజునకేయితరపన్నుకూడ జమీలనుండి వసూలు చేయుటకు నధికారములేదు. నలువది దినములకు ముందే ప్రధానాచార్యులకును, గొప్పజమీందారులకును, ఇతరభూస్వాములకును దెలియఁజేసి యొకచోట సభాస్థలిని నిర్దేశించి అట్టిరాష్ట్రసభను గూర్చవలెను. లండను మొదలగు గొప్పపట్టణముల కిదివరకున్న స్వాతంత్ర్యములు నిలఁబెట్టఁబడెను. న్యాయసభలమూలమున రాజు ద్రవ్యార్జన చేయఁగూడదు. క్రమమయిన న్యాయవిచారణ జరుగకుండ రాజు స్వేచ్ఛానుసారముగ నెవ్వరిని దండింపరాదు. కర్షకులకుండు వ్యవసాయపు బశువులు మొదలగు వ్యవసాయోపకరణములనుగాని, వర్తకులకుండు వర్తకద్రవ్యములనుగాని, స్వతంత్రులకుండు భూస్వాస్థ్యమునుగాని నష్టపఱచులాగున జరిమానాలను విధింపక, నేరమునకుఁ దగినయట్లు దండన జరుగవలెను. విలుతగాదాలు సుకరముగా

దీరుమానమగునట్లు క్రొత్తగ సివిలుకోర్టులు స్థాపింపవలెను. భూమి హక్కును గురించి వచ్చు తగాదాలను సంవత్సరమునకు నాలుగుసారులు జడ్జిలు దేశము తిరిగి పరిష్కరింపవలెను. రాజు వేటకొఱకు క్రొత్తగఁ బెంచిన యడవులు నేల బాలు చేయబడవలెను. యుద్ధములు లేని కాలమందు విదేశములనుండి వర్తకులు నిర్బంధకరమయిన పన్నులులేకుండ దేశమునకువచ్చి వర్తకము చేసికొని యిష్టమువచ్చినప్పుడు వెళ్ళవచ్చును. తగిన వెలకుఁ గొనకుండ రాజునిమిత్తమయినను ప్రజలనుండి యేవస్తువు పుచ్చుకొనరాదు. రాజీశాసన నిబంధనలను మీఱకుండఁ గనిపెట్టుటకు జమీందారులు తమలోఁ దగువారి నిరువదియైదుగురిని నియమించుకొనుటకును, శాసన నిబంధనలకు వ్యతిరేకములు జరిగినట్లు వీరిలో నలుగురికిఁ దోచినప్పుడు రాజు వెంటనే సవరణచేయుటకును, నలువది దినములలో నిట్టిసవరణ జరుగనియెడల నీయిరువదియైదుగురును రాజుయొక్కయు, రాణియొక్కయు, సంతానముయొక్కయు స్వాతంత్ర్యమునకు భంగములేకుండ వారిమందిరములను భూవసతులను జప్తుజేసిగాని మఱియేయితరోపాయములచేతఁగాని నిర్బంధించి రాజుచే సవరణచేయించుటకు బారను జమీందారులకు స్వాతంత్ర్య మీయఁబడెను.

దేశీయ ప్రజలంతఱీ శాసనమును సంపాదించుకొనుటకుఁ బాటుపడినందున నిందలినిబంధన లందఱిలాభముకొఱకు నేర్పడియున్నవి. పూర్వపు రాజపద్ధతులప్రకారము, దొరతనమువారి బలము దృఢముగ నుండకపోవుటచే బారనులు స్వలాభాపేక్షులై రాజుపై నెదుర్కొనుచువచ్చిరి. రెండవ హెన్రీ యేర్పఱచిన రాజ్యతంత్రము బారనుల తిరుగబాటునకుఁ గంపించుపాటిదికాక స్థిరపడినందున, రాజు బలము నిరంకుశమై జనులను రాజు బాధించుట కవకాశముగలిగెను. రాజును లొంగదీయుటకు నొక్క బారనులేకాక ప్రజాబాహుళ్యముకూడ నైకకంఠ్యముగ దేశసామాన్యలాభముకొఱకు కలిసినఁగాని, రాజున కెదురొడ్డ వలనుపడదయ్యెను. బారనులకుఁ బ్రజాసాహాయ్య మిట్లనివార్యమగుటచేతనే, పెద్దజమీందారుల నిష్టానుసారము



రాజు బాధించుట కవకాశములేకుండ నిబంధన లేర్పడినట్లే, ఆజమీందారుల క్రింది రయితులను వీరు బాధించకుండ నియమము లేర్పఱుపఁబడినవి.

నిరుపాయమైన నిర్బంధవశమున జాను ఈశాసనమున కంగీకరించినను, దానిని నెఱవేర్చుట కాతని కిష్టములేదు. పోపుకూడ నీతనికి సాయపడి యీశాసనమును రద్దుపఱచెను. అందుచే జాను తన్ను నిర్బంధించిన బారనుల దండింప మొదలుపెట్టఁగా ప్రజలు దీనులై ఫ్రాన్సురాజపుత్రునకు సింహాసన మిచ్చుటకొడఁబడి జానువలన పీడను బరిహరించుకొనుటకా రాజును బిలుచుకొనివచ్చిరి. ఈ యుద్ధములో విజయపక్షము స్థిరపడకపూర్వమే జాను రోగగ్రస్తుఁడై 1216 లోఁ గాలగతి నొందెను.



# అధ్యాయము 6.

—:o:—

## స్వాతంత్ర్య మహాశాసనము. 1216-1307

## ఆంజవ రాజులు-మూఁడవ హెన్రీ; మొదటి ఎడ్వర్డు.

జాను పరంపదించు నప్పటికి ఆతని కొమారుఁడగు హెన్రీ తొమ్మిది సంవత్సరముల చిఱుప్రాయమువాఁడు. అతఁడును ఆతని కొమారుఁడు మొదటి ఎడ్వర్డును తొంబది సంవత్సరములు రాజ్యముచేసిరి. పార్లమెంటుసభ యేర్పడుటయే వీరి రాచఱికమువలన దేశమునకుఁ గలిగిన ముఖ్యలాభము. రాచఱికమువలని ప్రజాపీడను దొరతనమువారికి నివేదించుకొని తన్నివారణము నొందుటకు పార్లమెంటుసభవంటి యొక స్థిరమయిన సాధనము లేనియెడల జానువలన ప్రజలుపొందిన చార్టరునుబట్టి రాజ్యతంత్రమును నడపించునట్లు రాజును నిర్బంధించు వేఱుసాధనములేదు. మూఁడవ హెన్రీ ధనముకావలసి వచ్చినప్పుడు చార్టరు నిబంధనల కనుగుణ్యముగ రాజ్యము చేసెదనని వాగ్దానములనుజేసి ధనము పోగుపడఁగానే యిష్టానుసారముగ వర్తించుచుండెను ఆతనిని మార్గమునకుఁ దెచ్చి ఆ శాసన నిబంధనలను నడపింపఁజేయుటకై జానుపై నెదుర్కొన్నట్లే యీతని మీఁదను నెదుర్కొనుటకు జమీందారులు, నగరవాసులునుఁ బ్రజాబాహుళ్యమును బలుసారులు కలిసి పని చేయుచు వచ్చిరికాని, ఏదే నొక నియమము చొప్పున సమకూడినవారు కాకపోవుటచే, వీరిలో వీరు అంతః కలహములు పెట్టుకొని కార్యమును నెఱవేర్చుకో లేకపోయిరి. ప్రతి గ్రామమునకును, ప్రతి మండలమునకును ప్రతినిధుల నేర్పఱచుకొని వ్యవహరించుకొనుటకుఁ బ్రజ లలవాటు



లలవాటు పడినవారు గనుక, ఈ ప్రతినిధి పద్ధతి నవలంబించి జనమును బోగుచేసి, ప్రజానాయకు లగువారు రాజుపైఁ బ్రతిఘటించుటకు నేర్చుకొనిరి. మూఁడవ హెన్రీకిఁ దరువాత రాజ్యమునకు వచ్చిన మొదటియెడ్వర్డు తండ్రివలె ప్రజానురాగమును విడనాడక, వారిభక్తిని కూడఁగట్టుకొనియే యుండినవాఁడుగనుక, యీ ప్రతినిధి పద్ధతినవలంబించి యాతఁడురాష్ట్రసభను సమకూర్చి వ్యవహారముల నడపుచుండెను. ఈ పద్ధతిచొప్పున నేర్పఱుపఁబడిన రాష్ట్రసభకే పార్లమెంటుసభయను పేరువాడుకలోనికి వచ్చెను.

మూఁడవ హెన్రీ మైనరుగా నున్న కాలములో రాజ్యభారమును బూనిన రాజప్రతినిధులు మిక్కిలి వివేక చాతుర్యముతో దేశక్షేమము కోరి రాజ్యతంత్రమును నడపించిరి. జానువలనఁ బొందఁబడిన చార్టరును నిలఁబెట్టుటచే, ఫ్రాన్సురాజు చెట్టఁబట్టిన యాంగ్లబారను లాతని విడిచి పెట్టిరి. అందుచే నాతఁడు యుద్ధమునఁ బరాజితుఁడై సంధిచేసికొని తనదారిని బోయెను. మూడవ హెన్రీ మేజరై రాజ్యభారమును స్వయముగఁ బూనిన 1232 మొదలు రాజునకును బ్రజలకును వైరములు తలయెత్తి ప్రబలమయ్యెను. ఈతఁడు దుర్బలుఁడును, చలచిత్తుఁడును, అమితవ్యయము చేయువాఁడునై, దేశాభిమానము లేక విదేశజనుల సన్మానించి యాంగ్లఘనుల న్యూనత పఱచుటచే, ప్రజల కీతనిపై ద్వేషము గల్గియుండెను. దుర్వ్యయము చేయువాఁ డగుటచే నిరంతరము ధనసంపాదనమునకుఁ గఠినమైన పన్నులఁ గట్టుచుండెను. ఇందునకుఁ దోడు రాజసన్మానము నొంది గొప్పయుద్యోగముల నున్న విదేశపరివారజనులు నానావిధములఁ బ్రజలను బాధించి ధనము కూడఁబెట్టుకొనుచుండిరి. పోపునకు రాజు భృత్యుఁడైయుండుటచే, దేవాలయముల యాదాయము నుండి పదవ పాలు పోపు స్వీకరించుచుండెను. ఇట్లు జనబాహుళ్యమునకును, గౌరవపదవుల నున్న గొప్పజమీదారులకును మతప్రవర్తకులకును గూడ రాజుపైని కోపముదయించుటచే, దేశమందు సంక్షోభ మెక్కుడయ్యెను. ఒకటిరెండు సారులు రాజుపై నెదుర్కొని స్వాతంత్ర్య రక్షణార్థము కొన్ని నిబంధనలను జేయించి

రిగాని, రాజు వానిని నెఱవేర్చుట కిష్టములేనివాఁడై బారనులతో నంతఃకలహములఁ బెంచఁ బాటుపడుచుండెను. రాజు దౌష్ట్యమునకుఁ బ్రాణములు విసికి, 1261 వ సం॥ లో బారను లందఱు గలిసి ప్రతిమండలమునుండియు నలుగురుప్రతినిధుల చొప్పున జమచేయుటకు నాహ్వానపత్రికలను దేశమంతటను వెదఁజల్లిరి. రాజీవార్త విని ఆ ప్రతినిధులు తన యెదుట సమకూడునట్లుత్తరువుచేసియొక సభ చేసెను. ఇదియే యాంగ్ల దేశమునఁ గూడిన ప్రథమపార్లమెంటు. ప్రజామోదకరముగ నీ సభయం దేమియు నిర్ధారణ కానందున రాజునకును బ్రజలకును మధ్యవర్తియై తగవు దీర్చుటకు ఫ్రాన్సుదేశపు రాజును గోరుకొనిరి. ఫ్రాన్సు దేశములో రాజు నిరంకుశాధికారముతో నేలవలసిన యావసర ముండుటచే, ఆతనికి, రాజు నధికారమునకు గొఱఁతవచ్చు నేర్పాటు లిష్టములేకపోయెను. ఆంగ్లదేశమందు రాజున కట్టి నిరంకుశాధికారము లేదను సంగతి యాతనికిఁ దెలియదు. అందుచే చార్టరుతరువాత వచ్చిన పద్ధతులను నిషేధించి, తత్పూర్వ దేశాచారమును చట్టములను, చార్టరును నాధారపఱచుకొని యాతఁడు తీరుమానము చేసెను. గొప్పజమీదారుల యనుమతి లేకరాజు పన్నును గట్టఁగూడ దని చార్టరులో నిర్ణయింపఁబడి యున్నంత మాత్రమునఁ బ్రజల స్వాతంత్ర్యమునకు భంగము లేదని గాని రాజు నధికారమునకుఁ గొఱఁతవచ్చిన దని గాని, మనము తలంపఁ గూడదు. రాజ్యతంత్రమును నడపించుటలో రాజే స్వతంత్రుఁడు. రెండవ హెన్రీ యేర్పఱచిన పద్ధతిని బట్టి రాజునకుఁ బ్రజలవలన యెట్టినిర్బంధమును లేదు, మంత్రులను నియమించుటకును, తొలఁగించుటకును నాతఁడే యధికారి; ఇష్టానుసారము దొరతనమును సాగింపఁగలఁడు. దేశరక్షకభటులకు నాతఁడే నాయకుఁడు; న్యాయసభల కాతఁడే యజమాని. చట్టములను మార్చుటకును, క్రొత్తవానిని జేయుటకును, ఆతఁడే స్వతంత్రుఁడు. ఇంతియకాకపోపున కీతఁడు భృత్యుఁడగుటచే, అతని సాహాయ్యమున రాజెవ్వరి యడ్డము లేకుండ నడచుకొనఁగలఁడు. ఈ కారణముచే ఫ్రాన్సురాజు తీరుమానమును బారను లంగీకరింపక, ఆయుధపాణులై రాజుపై నెదురొడ్డిపో



రాడి పుత్రపరివార సహితముగ రాజును చెఱఁబెట్టిరి. ఇతర శరణ్యము లేక మూడవ హెన్రీ బారనుల యిష్టానుసారముగ వారితో సంధి చేసికొనెను. మండలమునకు నలుగురు చొప్పున ప్రతినిధులను జేర్చి పార్లమెంటుసభ నొకటి సమావేశము చేసిరి. క్రొత్తనిబంధనలతో నొక పాలనాపద్ధతిని వారునిర్ణయించిరి కాని, రాజు భార్య ఫ్రాన్సురాజు సాహాయ్యముచే దేశముపై దండెత్తుటకు సమకట్టియుండుటచే, బారనులు క్రొత్తత్రోవ త్రొక్కిరి. పైపార్లమెంటులో పట్టణములనుండియు ముఖ్యములైన పేటలనుండియు ప్రతినిధులను రప్పింపలేదు. కాఁబట్టి యీ లోపమును సవరించి మఱియొక పార్లమెంటును కూర్చి, రాజుపై యుద్ధము సాగించుటకు తీరుమానము చేసికొనిరి. ఈ యుద్ధములోఁ బ్రజానాయకుఁడు హతుఁడు కాఁగా తక్కినవారు రాజుతో సఖ్యపడి, చార్టరునకు బద్ధుఁడై రాజ్యము చేయునట్లు రాజుతో నొకనిబంధనను జేసికొని యుద్ధము విరమించిరి. ఈ సఖ్యము నొడఁగూర్చుటకు మొదటి యెడ్వర్డు మిక్కిలి పాటుపడినందున మూఁడవ హెన్రీ మరణానంతర మాతనికి పట్టము గట్టిరి. హెన్రీ, రిచార్డు, విలియము, మొదలగు పేరులవలె గాక, ఎడ్వర్డు అను పేరు ఆంగ్లనామము. ఈతఁడు విదేశీయులకుఁ జోటియ్యక, దృఢమైన శాసనములను జేసియు, రాజ్యాంగములను బలపఱచియు, ప్రజలకు ఘనులవలన గాని రాజువలనఁ గాని యెట్టిబాధలు కలుగకుండఁ గాపాడియు, పన్నులు కట్టుట మొదలగు రాజకీయవ్యవహారములలోఁ బ్రజలకు జోక్యము కలుగఁజేసి వారి యంగీకారముతో రాజ్యతంత్రముల నడపించియు, తాను యశోవిశాలుఁడై దేశమునకు ఘనతను సంపాదించి యేలిన దొడ్డరాజు. ఈతని సత్పరిపాలనమునందే రాజకీయవ్యవహారములందు రాజు నిరంకుశుఁడై పనిచేసి దేశమును బాధపెట్టకుండఁ గాపాడుకొనుటకును, తమస్వాతంత్ర్యములను రక్షించుకొనుటకును బ్రజలు చక్కఁగా నేర్చుకొన్నారు. ఈతని రాజ్యకాలములలో ననేకచట్టములు చేయఁబడెను. ఈ చట్టనిర్మాణములో మొదటి ఎడ్వర్డు స్వతంత్రముగాఁ బనిచేయక, జనానురాగముతోఁ బనిచేసి

తనబలమును బెంపుచేసి కొనఁదలఁచి, ప్రజాప్రతినిధులను బిలిపించి పార్లమెంటు సభలను దఱచుగాఁ జేయుచు వచ్చెను. ప్రతినిధులను బిలుచుటలోఁ బ్రజాసామాన్యమును విడిచి బారనులను మాత్రము గౌరవింపవలె ననిగాని, మతాచార్యులను గలుపుకొని పట్టణములవారిని విడువవలె ననిగాని, నియమములేక, ఆ యా సమయానుగుణముగఁ బనిచేయుచు వచ్చెను. 1295 వ సం॥ లోఁ జేయఁబడిన సభకుఁ బట్టణవాసులైన వర్తకులును, గ్రామనివాసులైన సామాన్య భూస్వాములును, గూడఁ బిలువఁబడిరి. గొప్పపట్టణములనుండి బట్టణమున కిద్దఱును, గొప్ప పేటలనుండి పేట కిద్దఱును మండలమున కిద్దఱును ప్రతిదేవస్థానమున కొక మతాచార్యుఁడును ప్రధానమతగురువులును, బారనులును, ఈసభకు వచ్చియుండిరి. నానాఁటికి చిన్న దేవాలయములనుండి చిన్న యాచార్యులు సభకు రాక మానుకొనిరి గాని, ప్రజాసామాన్యమునుండి ప్రతినిధులు మాత్రము నిరంతరాయముగా పార్లమెంటులోఁ గూడుచుండిరి. ఇట్లేర్పడిన పార్లమెంటు పద్ధతి 1832 వఱకును జరిగి, ఆ వత్సరమున కొన్నిమార్పులను జెందినది.

తండ్రి రాజ్యముచేసిన కాలములో రాజుతో యుద్ధము చేసినబారనుల బల మడఁగించి జనసామాన్యమునకు వారివలనఁ గలుగు నిబ్బందులను నివారించుట కెడ్వర్డు ప్రయత్నించెను. బారనుల వశమందున్న జమీలపై వారికి సర్వాధికారముండెను. వీరి యధికారముల కాధారములను సంచారిజడ్జిలు విచారించునట్లు రాజు శాసనము చేసి వానిని నిర్ధారణముచేసెను. సంవత్సరమునకు 300 నవరసుల రాఁబడిగల స్వతంత్రభూస్వాము లందఱునైటు అనుబిరుదు నొంది యుద్ధమందు బంటులై పోరునట్లును అటులఁజేయని యెడల విశేషముగాఁ బన్నులుచెల్లించునట్లును రాజుత్తరువుచేసెను. ఇంతవఱకుఁదక్కువపదవిలోనున్న స్వతంత్రులిందువలన బారనులతో సమానగౌరవముగలవారగుటచే బారనులగర్వ మడఁచుటకీ శాసనము తోడుపడెను. మఱియు జమీలను రాజువలన మాన్యముగాఁగొన్న బారనులు తమభూములను రయితుల కమ్ముకొని వారికి లార్డులై గౌరవమునొందుచుండిరి. ఈ



యాచారమును మాన్పించి, మొదట మాన్యము లిచ్చిన రాజులకే, యీ జమీదారుల రయితులు ఆశ్రితులు కావలయు ననియు, ఆ రయితులకు రాజే లార్డు అనియు నొకశాసనమును చేసి దేశమందలి రయితులకు తానే లార్డయి, బారనుల బలమునకుఁ గొఱఁతవెట్టెను.

దేవస్థానములకు జమీదారులు విశేషముగా భూవసతు లిచ్చుచుండుటచే నానాఁటికి దేవాలయములకు గొప్పమాన్యము లేర్పడి, దివాణమునకుఁ బన్నునష్టమగుచుండెను. భూమి పన్నియ్యనక్కఱలేకుండ మాన్యముల ననుభవించుటకై, భూస్వాములు దేవునకు మాన్యము లిచ్చి, వాని ధర్మకర్తలవలన శాశ్వతకవులు పుచ్చుకొని పన్నుబందెలు లేక భూము లనుభవించుచుండిరి. లౌకికులభూములతోఁ బాటు వీనికిఁగూడ పన్నుకట్టి వసూలుచేయుటకు రాజొకచట్టమును జేసెను. పోపు ఈ పన్నుచెల్లించనక్కఱలేదని శ్రీముఖము పంపుటచే మతాచార్యులు రాజాజ్ఞను దిరస్కరించిరి. అందుపై, వారి వ్యవహారములను సివిలు క్రిమినలు కోర్టువారు పరిష్కరింపఁగూడదని రాజు నిషేధించెను. రాజరక్షణము లేక రాష్ట్రమందు జీవించుటకు సాధ్యపడనందున, మతాచార్యులు రాజాజ్ఞ మన్నించి పన్నులియ్యవలసినవారలైరి.

ఫ్రాన్సుదేశమందలి నష్టశేషములైన మండలములను గాపాడుకొనుటకు నచ్చటికి 1297 సం॥లో రాజు సేనను బంపవలసివచ్చెను. అందునకు బారనులను బిలిపించి సభచేసి రాజు తన యభిమతమును దెలియఁజేయఁగా బారనులు విదేశమందుఁ గొలువుచేయుటకుఁ దిరస్కరించిరి. బారనులను విడిచి, ప్రజలనుండి ధనమును సేనను స్వయముగా సమకూర్చుటకు రాజుప్రయత్నముచేసి, వర్తకుల వర్తకద్రవ్యములను జప్తుచేసి, సేనకు ఆహారపదార్థములను బంపవలె నని జనుల కాజ్ఞాపించి, విదేశమందు యుద్ధముచేయుటకు సంసిద్ధముగా నుండుఁడని భూస్వాములఁ బిలువనంపెను. అందుపైఁ బ్రముఖులగువా రొక మహజరు వ్రాసి రాజునకుఁ బ్రజల కష్టము

తెలియఁజేయుచుఁగొనిరి. కాని [illegible]పిన జెట్టి రాజు ఫ్రాన్సుదేశమునకుఁ బోయెను. ఇచ్చట దేశాభిమానులు సమపూనిక మానక లండను పట్టణమునకుఁ బోయి యచ్చటి ముఖ్యుల సాహాయ్యమును గూడఁగట్టుకొనిరి. అప్పుడు తండ్రిస్థానమునఁ బ్రతినిధిగా నుండి రాజ్యభారమును బూనియున్న రాజపుత్రుఁ డగు ఎడ్వర్డు ప్రజలకోరికలఁ దీర్చు నిర్ణయములను నిర్ధారణచేసి యొకసనదు వ్రాసి తండ్రిగారి యంగీకారమునకుఁ బంపి, రాజసమ్మతిము సంపాదించి ప్రజలను సమాధానముచేసెను. ఆచారవిరుద్ధముగా రాజుకట్టిన పన్నులు చట్టవిరుద్ధము లనియు, ఇదివఱకు నాచారముగాఁ బుచ్చుకొనిమందెన్నఁ డిట్టి పన్నులు రాజు వసూలు చేయఁగూడ దనియు, పార్లమెంటు యొక్క అనుమతిలేక క్రొత్తపన్నులను రాజు కట్టఁగూడదనియు, నిందువలన నిర్ణయింపఁబడెను.

మూఁడవ హెన్రీయును మొదటి యెడ్వర్డును రాజ్యముచేసిన తొంబదియేండ్లును రాజు నిరంకుశముగాఁ బన్నులుగట్టి ప్రజలను బాధించకుండఁగాపాడుకొనుటకుఁ బ్రజలు రాజుతోఁ బోరి, తమకు సంరక్షకముగను రాజునకు అంకుశమువలెను బనిచేయు పార్లమెంటు మహాసభను సంపాదించుకొను ప్రయత్నములతోఁ గడచినవి. రాజునకు సొమ్ము కావలసినప్పుడెల్లఁ బ్రజలు స్వాతంత్ర్యమును బలపఱచుకొనుటకు సమయము కలుగుచువచ్చెను. ఆ కాలములో రాజ్యతంత్రమును నడపుటకు విశేషధన మక్కఱలేదు. మితముగా వ్యయము చేసికోఁగలిగినయెడల, రాజునకు వంశానుక్రమముగ వచ్చిన మాన్యముల వలనను రాజువలన మాన్యములను గొన్న జమీదారుల వలన వచ్చు కానుకల వలనను పోగుపడిన ధనమే రాజ్యాంగమును నిర్వహించుటకుఁ జాలును. కాఁబట్టి రాజునకు వచ్చు నీధనముతోనే యాతఁడు గడపుకొనవలెననియు, ఏవిధమైన పన్నులు గట్టఁగూడ దనియుఁ బ్రజలపక్షమున నాయకులై రాజుతోఁ బోరుచు వచ్చినవారు వాదించుచువచ్చిరి. ఇందుచేతనే స్వతంత్రముగ రాజునకుఁ బన్నుగట్టుట కధికారము స్థిరపడక పార్లమెంటు సభమూలమునఁ బ్రజానుమతి చొప్పున రాజు పన్నుకట్టవలసిన



వాఁ డయ్యెను. యుద్ధమునకుఁ గాని, మఱి యే యితరప్రయోజనమునకుఁ గాని ధనము కావలసివచ్చినపుడు, ప్రజలు తమ స్వతంత్రతకు భంగకరములగు రాజకృత్యములను వారించినఁగాని ధనమియ్యమని పట్టుపట్టి, రాజును విధమున నిర్బంధించి తమ యిబ్బందులను దొలఁగించుకొనుచు రాజు నిరంకుశుఁడై యేలకుండునట్లు రాజ్యతంత్రమును సవరించుకొనఁ గలిగిరి.

---

# అధ్యాయము 7

—:o:—

## ఆంజవవంశ రాజులును లాంకాస్ట్రియన్, యార్కిస్టురాజులును —1307-1485

—:o:—

| | |
|---|---|
| ఎడ్వర్డు II. 1307-1327 | హెన్రీ VI. 1422-1461 |
| ఎడ్వర్డు III. 1327-1377 | ఎడ్వర్డు IV. 1461-1483 |
| రిచర్డు II 1377-1399 | ఎడ్వర్డు V. 1483 |
| హెన్రీ IV. 1399-1413 | రిచర్డు III. 1483-1485 |
| హెన్రీ V. 1413-1422 | |

పిమ్మట రాజ్యమునకు వచ్చిన రెండవ యెడ్వర్డు ప్రజల కనుకూలమైన చట్టములను మీఱకుండ రాజ్యము చేయునట్లు ప్రమాణముచేసి పట్టాభిషేకము నొందెను. ఈతఁడు విషయలోలుఁడైన దుర్బలుఁ డగుటవలన, ఎవరో యొకమంత్రిని నమ్ముకొని యాతని చేతి కీలుబొమ్మవలె నాతఁ డాడించినట్లాడుచుండెను. ఈ మంత్రులు రాజుక్షేమమును గాని దేశక్షేమమును గాని పాటించక స్వలాభమును జూచుకొను స్వభావము గలవారై యుండిరి. ఇందు మొదటివాఁడు జనకంటకుఁ డగుటవలన, అతనిని విదేశమునకుఁ బంపుమని బారనులు పట్టుపట్టిరి. రాజిందున కంగీకరింపనందున, రాజునకు దేశపరిపాలనమునందు జోక్యమును దప్పించి, 21 మతాచార్యులును జమీదారులును రాజ్యము చేయునట్లు 1311 లో పార్లమెంటులో స్థిరపఱచిరి. రాజమంత్రి దేశమునుండి వెడలఁగొట్టఁబడెను. వెనుకటిరాజులు దేశక్షేమమునుగోరినవారై బారనుల మదమడఁచి ప్రజలకువారివలన బాధలు గలుగకుండఁ గాపాడిరి. ఇప్పుడు బారనులీచట్టము వలన తమచేతిలో రాజ్యతంత్రము నంతయు నుంచుకొని బలాఢ్యులగుటకు యత్నించిరి. రాజిందున కంగీకరింపనందున, బారనులా



యుధపాణులై రాజు నెదుర్కొని మంత్రిని విచారణ లేకుండఁ జంపివేసిరి. ఇంతట స్కాట్లండురాజుతో ఎడ్వర్డు యుద్ధముచేసి యోడిపోయినందున స్కాటులు దేశమును గొల్లగొని పీడించుచువచ్చిరి. హతుఁడైన మంత్రి స్థానమున బారనులనాయకుఁడు మంత్రియై స్కాటుల పక్షపాతి యయ్యెను. అందుచే బారనులాతనిపై ద్వేషించి, రాజుపక్షమును చేపట్టి యాతనినోడించి యురిదీసిరి. పిమ్మట 1322 లో పార్లమెంటు సభకూడి, 1311 లో బారనులు పార్లమెంటులో స్థిరపఱచుకొన్న రాజ్యపద్ధతిని రద్దుపఱచి, ఇఁక ముందు రాజకార్యములన్నియు పార్లమెంటులో నిర్ధారణయైన చొప్పున జరుగవలె ననియు, రాజును మతాచార్యులును, జమీందారులును, ప్రజాప్రతినిధులును పార్లమెంటులో సభికులుగా నుండవలె ననియు నొకచట్టము చేసిరి. పార్లమెంటుసభలోఁ బ్రతినిధులమూలమున రాచకార్యములను బరిష్కరించుకొనుటకుఁ బ్రజాబాహుళ్యమునకు స్వాతంత్ర్య మీచట్టమువలన స్థిరపడెను. ఆ కాలమున రాజునకు మంత్రులుగా నున్నవారు కడు దుర్మార్గులగుటవలన, వారి శత్రు వొకఁడు ఫ్రాన్సుదేశమునుండి సేనను ప్రోగుచేసికొని యింగ్లాండునకు రాఁగా, బారనులనేకులు వారిపక్షము పట్టి 1327 లో మంత్రుల నురిదీసి, రాజును గారాగృహమునకంపి, పార్లమెంటుయెదుట రాజ్యభారమును బూనుట కసమర్థుఁడ నని యాతనినోట ననిపించి రాజ్యమునకు నీరు విడిచిపెట్టించిరి. కొంతకాలమునకు కారాగృహమందే రాజు క్రూరవధకు బలియై యుసురు బాసెను.

ఆతని కొమారుఁ డగు మూఁడవ యెడ్వర్డు దీర్ఘకాలము రాజ్యము చేసెను. జానుకాలములో నష్టమైనవి గాక మిగిలియున్న ఫ్రాన్సుమండలముల నా దేశపురాజు వశపఱచుకొనఁ దలపెట్టి యుండుటచే, వానిని కాపాడుకొనుట కా దేశమునకు 1337 లో యుద్ధయాత్ర చేయవలసివచ్చెను. ఈ యుద్ధమును రాజు 36 సంవత్సరములు గడపి జయశాలియై పెక్కుకయ్యములలో విజయము నొందుచు వచ్చెను గాని తుదకు మూఁడు ప్రదేశములను మాత్రము కాపాడుకొనఁ గలిగెను. 1337 లోఁ బ్రారంభింపఁబడిన యీ శదనము

నూఱేండ్ల యుద్ధమను పేర, ఆఱవ హెన్రీ 1453 లో నొక్క మండలమును నిలబెట్టుకొని తక్కినపరాసు దేశము గోలుపోయిన నాటివఱకు, జరిగెను. ఈయుద్ధము దేశమునకు లాభకారి కాకపోయినను, దానివలన ప్రజలయందు స్వజాత్యభిమానమును దేశాభిమానమును వృద్ధినొందినవి. ఇట్టి చిరకాలయుద్ధమునకు విశేషముగ ధనము కావలసియుండుటచేత, దాని నియ్యవలసివచ్చినప్పుడెల్ల పార్లమెంటువారు ప్రజలకనుకూలమైన చట్టములను జేసి రాజానుమతిఁ బొందుచువచ్చిరి. 1340 లోఁ బుట్టిన చట్టమును బట్టి పార్లమెంటువారి యనుమతిలేక రాజేవిధమైనపన్ను కట్టఁగూడదని స్థిరపడెను. మఱునటి సంవత్సరమున బారనులు మొదలగు గొప్పవారు లార్డ్సుశాఖవారనియు, పిల్లజమీదారులును పట్టణవాసులును మొదలగువారు కామనులనబడు ప్రజాశాఖవారనియు నిర్ణీతముగా వేఱుపడి పార్లమెంటునకు రెండుశాఖలుగా స్థిరపడిరి. ఇదివఱకు రాజమంత్రులు పార్లమెంటువారికి జవాబు చెప్పవలసిన విధి లేకపోవుటచే, ఇష్టానుసారము ప్రవర్తించుచు వచ్చిరి. ఇప్పుడట్లు కాక పార్లమెంటునకు లోఁబడి రాజ్యము నడుపునట్లును వారికుత్తరవాదులగునట్లును, నిబంధన లేర్పడెను. దేవస్థాన మాన్యములు విరివియగుటచే మతాచార్యులు ధనవంతులై ప్రవృత్తిమార్గపరు లగుటఁ జూచి, వారిపై జనులకు ద్వేషము పెరిగెను. మతాచార్యులు రాజకీయోద్యోగము చేయఁగూడదని శాసింపఁబడెను. జీససువలె మతాచార్యులు నివృత్తిపరులై సంపదలు గోరక మతవిషయములందే కాలము గడుపవలెనని బోధించు మతబోధకులు వెడలిరి. సంపదాంధులై యున్న ఈ మతప్రవర్తకులకు రోమకపోపు మూలబలమై యుండుటచే, పోపుబల మడిగించుటకుఁగాను, ఆంగ్లదేవాలయములకు పోపు ఆచార్యనిమంత్రణముఁ జేయఁగూడదనియు, ఆంగ్లదేశమందలి ప్రతికక్షివివాదములు విదేశన్యాయసభలకుఁబోఁగూడదనియు, జానుకాలములో పోపునకుఁ జెల్లించుటకేర్పడిన సాంవత్సరిక సుంకమియ్యఁగూడదనియు పార్లమెంటువారు చట్టములఁ జేసిరి.



మూఁడవ ఎడ్వర్డు 1377 లోఁ బరంపదించినందున, పదునొకండువత్సరముల ప్రాయముగల ఆతని పౌత్రుఁడగు రెండవ రిచార్డు రాజ్యమునకు వచ్చెను. ఈ కాలమున పెంచివారింగ్లాండును గొల్లపెట్టుచుండుటచే, ఈతని పినతండ్రి వారితో యుద్ధము చేసి యోడి జనకంటకుం డయ్యెను. ఈ యుద్ధమునకు వలయు ధనము నిమిత్తము జనసామాన్యమునకుఁ దలపన్ను కట్టఁబడెను. భూములను గవులునకుఁ బుచ్చుకొన్న సేద్యగాండ్రు ఈనాముదార్లకు కొంత నౌఖరీచేయు పద్ధతి యుండెను. దీనిని మాన్పించి, నఘాకింద ద్రవ్యము నిచ్చి నౌఖరీపరతుల మాన్పించుకొనవలెనని రయితులను, నౌఖరీపద్ధతి నిలఁబెట్టుకోవలెనని యీనాందారులును దగవులాడుచుండిరి. ఇందునకుఁ దోడుగా రాజు పినతండ్రియొక్క దుష్టపరిపాలనముచేతను, దుర్భరమైన పన్నులచేతను, జనులు కంపించుచుండిరి. ఈ కారణములచే జను లొక్కుమ్మడిగా సంక్షోభించి, యాయుధహస్తులై రాజు నెదిరించిరి. రాజు మైనరయినను శాంతము దెచ్చుకొని, ప్రజలకోరికల నెఱవేర్చెదనని వారి నూరడించెను. ఈనాందారులీ యల్లరులకు జడిసి రయితుల కోరికలఁ దీర్చిరి. పూర్వాధ్యాయములందుఁ జెప్పఁబడిన కర్షకుల స్థితి నానాఁటికిమారి వారు చిన్న చిన్న యీనాందారులైరి. పాటకజనముయొక్క స్థితి మారి మంచిమార్గమునకు వచ్చెను. రిచార్డు మైనరుగానున్న కాలములో పార్లమెంటులో లార్డుశాఖవారు బలాఢ్యులై తమకు లాభకరముగా రాజ్యతంత్రమును మార్పఁజూచిరి గాని, అతఁడు మేజరయి రాజ్యము పూనినతరువాత, లార్డుల నవమానించి పార్లమెంటుతో సంబంధములేకుండ నిరంకుశముగ రాజ్యమేలెను. అందుచే మతాచార్యులును లార్డులును దిరుగఁబడి రాజును ఖయిదుచేసి, రాజ్యపదమునకసమర్థుఁడని యందుండి తొలఁగించిరి. ఆతని సోదరపుత్రుఁ డొకఁడుండఁగా పార్లమెంటువారాతని నిరాకరించి, ఈ రాజు వంశముతో దూరసంబంధముగల హెన్రీయను వానికి 1399 లోఁ బట్టముగట్టిరి. ఈతఁడు నాల్గవ హెన్రీ.

బారనులలోఁ గొంద ఱిందునకు సమ్మతించక, రెండవ రిచార్డుపక్షము పట్టియుండుటచేత ప్రజలు వారితోఁ బోరి వారిని యమపురి కంపిరి. రిచార్డు కారాగృహములోఁ జంపఁబడినట్లు చెప్పుకొందురు. హెన్రీరాజ్యకాల మంతయు వేల్సులోను స్కాట్లండులోను బుట్టిన కల్తలవలనను, ఫ్రెంచివారితోడి పోరాటములవలనను నల్లకల్లోలముగఁ గడచెను. మఱియు వెనుకటిరాజులకువలె నీతనికి వంశపరంపరాధీనమైన అర్హత(హక్కు)సింహాసనమందు లేక పార్లమెంటువారి యనుగ్రహమే యందునకు ముఖ్యాధారమైనందున, ఆతండు పార్లమెంటువారి యిష్టానుసారము నడచుకోవలసినవాఁడయ్యెను. అందుచే నీతనిరాజ్యములోఁ బ్రజలయధికారము మిన్నుముట్టెను; వారి సెలవులేక పన్నులు కట్టఁబడలేదు. దివాణపుఖర్చులు వారి సెలవుమీఁద జరుగుచుండెను. దివాణపుఖర్చునకు వలయుధనమును వారే యియ్యవలెను. 1413లో నాలుగవహెన్రీ కాలధర్మమునొంది ఆతని కుమారుఁడగు నైదవహెన్రీకిఁ జోటు చేసెను.

ఐదవహెన్రీ ధీరోదాత్తుఁడును, ఉదారచిత్తుఁడునై ప్రజానురాగముతోఁ బాలించెను. ఈతని కాలమంతయు ఫ్రాన్సుదేశముతోడ యుద్ధము చేయుటతో సరిపోయెను. ఈతఁడు యుద్ధమందు విజయుఁడై ఆ దేశములోని యుత్తరభాగము స్వాధీనము చేసికొనుటచేతను, 1415 లో జగద్విఖ్యాతమైన అజనుకోర్టు యుద్ధమున శాశ్వతకీర్తి పొందుటచేతను, ఈతనిపైఁ బ్రజానురాగము మిక్కుటమయ్యెను. ఈతఁడు స్వర్గస్థుఁడగునప్పటికీ తని కొమారుఁడగు నాఱవహెన్రీ 10 మాసముల పసిపిల్లవాఁడు. ఈతనిదీర్ఘమైనారిటీవల్లను, మైనారిటీవదలిన తరువాత దుర్బలుఁడై కుత్సితమంత్రులు నడపినట్లు నడుచువాఁడగుటవల్లను బారనుజమీదారులు పెచ్చుపెరిగి రాజ్యాధికారము తమచేతులలో నుంచుకొనుట కుద్యమించినవారై యుద్ధములు ప్రారంభించిరి. 1450 లో నీరాచటికములోఁ బ్రారంభమైన యీ యుద్ధమునకు బారనుల జండాలమీఁద గులాబిచిహ్నములనుబట్టి ఆంగ్లచరిత్రలో గులాబియుద్ధమని పేరుగల్గినది. ఈ యుద్ధము 1450 మొదలు 1485 వఱకు నిరం



తరాయముగా ఆఱవహేన్రీ, నాలవఎడ్వర్డు, అయిదవఎడ్వర్డు, మూడవరిచార్డు అనురాజచతుష్టయము యొక్క దొరతనములకడవఱకు ముప్పదేనవత్సరములు ప్రజ్వరిల్లి బారనులను నామమాత్రావశేషులఁ జేసినది. ఆఱవహెన్రీ కాలమందే ఫ్రాన్సుదేశమందొక మండలము తప్ప తక్కిన దేశమంతయు నా రాజుపాలయ్యెను. గులాబియుద్ధములో నాఱవహెన్రీ దేశమువిడిచి పాఱిపోయి స్కాట్లండులోఁ దలదాచుకోవలసిన వాఁడయ్యెను, మూఁడవ రిచార్డు తనసోదరుఁడగు నాలుగవ యెడ్వర్డుయొక్క కొమారుఁడగు నైదవయెడ్వర్డు పదుమూఁడువత్సరముల మైనరైనందున రాజప్రతినిధియై రాజ్యమేలుటకు సోదరునిచే నియుక్తుఁడయ్యును అన్నకొడుకును జంపుటచేత ప్రజ లాతనిపై ద్వేషముగలవారై నాల్గవహెన్రీ యొక్క సోదరిసంతతివారి కల్లుఁడైన హెన్రీ ట్యూడరును బిలిపించి, యాతని సాహాయ్యమున మూఁడవ రిచార్డును జంపి 1485 లో నాట్యూడరుకుఁ బట్టముగట్టినందున నాతఁడు సప్తమహెన్రీ అను పేరరాజ్యము చేసెను. 1154 లో రెండవ హెన్రీ రాజ్యాధికారమునుబూనినది మొదలుగా నాంగ్లదేశము నేలిన ఆంజవ వంశము మూఁడవ రిచార్డు మరణముతో 1485 లో ముగిసెను.

ఆంగ్లేయులు దేశమును కాణాచిగా నాక్రమించుకొన్న నాఁడువెలసియున్న స్వతంత్రులు, కర్షకులు, బానిసలు అనుప్రజల శాఖాభేదములను గూర్చి చెప్పియుంటిమి. నార్మనురాజులవలన జమీలను మాన్యముగాఁ గొన్నవారిని బారను లనియు, ఉమ్మరావు లనియు, జమీదారు లనియు, ఘనులనియు ననేకనామములతో వాడియున్నాము. నానాఁటికి గ్రామములు పట్టణములై కాయకష్టములచే జీవించవలసినవారు కూడా నభివృద్ధికివచ్చిరి. సప్తమ హెన్రీ యొక్క రాజ్యము ముగియువఱకు దేశమున స్థిరపడియున్న ప్రజాశాఖలను గూర్చియు, రాజ్యతంత్రనిర్వాహకమునందు వారు సంపాదించుకొన్న స్వాతంత్ర్యములను గూర్చియు, పార్లమెంటు సభయొక్క యోగక్షేమములను గూర్చియు నిచట సంగ్రహముగఁ జెప్పవలసియున్నది.

జాను రాజ్యమునకు వచ్చినదాదిగా, రాజు దుర్బలుఁడై కుమంత్రుల మంత్రమును విని దేశమును బాధ పెట్టినప్పుడు, బారనులే ప్రజానాయకులై రాజును దారికిఁదీసికొని వచ్చుచుండిరి. మూఁడవ ఎడ్వర్డు విజయశోభితుఁడును, ఉదారగుణసంపన్నుఁడు నగుటచే, బారనుల పరవశమును ఫ్రాన్సు దేశముపై నడపించి బారనులను హద్దులో నుంచఁగలిగెనుగాని, ఆతని తరువాత వారు బలయుతులై కలహములకుఁ గాలు ద్రవ్వుచుండిరి. అప్పటికే గొప్పజమీదారుల సంఖ్య సన్నమయ్యెనుగాని, ఉన్నవారి జమీలు విశాలములగుటవలన, తమ జమీలలో నున్న రయితులను బలివారముగాఁ గూర్చుకొని, వారి కశ్వములను ఆయుధముల నిచ్చి వారిని వెంటఁ బెట్టుకొని రాజున కెదురొడ్డుచుండిరి. ఆఱవ హెన్రీ యొక్క దుర్బలప్రభుత్వములో నీ కడిఁది బారనులు తమ కర్షకపరివారముతో నజేయులై విక్రమించియుండిరి. వీరి కుటుంబములలో కొన్ని కాలక్రమమున నశించుటచేతను, గులాబియుద్ధములో మిగిలిన వారు హతులగుటచేతను, దేశమునకు వీరివలన పీడ తొలఁగి పోయెను. అయినను ప్రాచీనబారను కుటుంబములు నిలిచియున్నంత కాలము, వారే ప్రజానాయకులై, రాచఱిక దుర్ణయముల నడఁచుటకుఁ బ్రజలను నడపుచుండిరి. అందువలనఁ బ్రజలు నానాఁటి కనుభవశాలులై బలాధికు లగుచువచ్చిరగాని, బారను సాహాయ్యము లేక స్వతంత్రముగ రాజుయొక్కయు రాజకీయోద్యోగులయొక్కయు పరివారము నెదిరించుపాటి ధైర్యసాహసములు వారికిఁ గలుగలేదు. అందుచేతనే గులాబియుద్ధము సాంతమగునప్పటికి బారనులు నిర్మూలమగుటవలనఁ బ్రజలకు నాయకులులేక, రాజునకు బలము హెచ్చెను.

పార్లమెంటు సభలో లార్డుల శాఖయొకటియు, ప్రజాశాఖయొకటియు వేఱువేఱు అధికారతారతమ్యములతో వెలసియున్నవని వ్రాసియుంటిమి. ఈ లార్డు లనగా నెవ్వరో కామను లనఁబడు ప్రజాశాఖవా రెవ్వరో విచారించవలసియున్నది. జమీదారు లందఱు లార్డుల శాఖలోనివారు. హిందూ లావలెగాక ఇంగ్లీషు లా ప్రకారము తండ్రియాస్తియంతయు జ్యే



ష్ఠపుత్రునికే కాని తక్కిన కొమాళ్లకు రాదు. లార్డుపదవిలో నున్న తండ్రి చనిపోఁగానే, ఆతని జ్యేష్ఠపుత్రుఁడు మాత్రము లార్డుఅయి, తక్కినవారు కామనులలోనే జేరుదురు. ప్రజాశాఖ వారి నికముం దీ గ్రంథములో కామను లని వ్రాయుదుము. కామనులలోని వాఁడు ధనాధికుఁడై యున్నతపదవి సంపాదింపఁ గలిగినయెడల, రా జాతనికి లార్డు బిరుదము నియ్యవచ్చును. జాను కాలపు చార్టరు ప్రకారము రాజువలన మాన్యములను గొన్నవారందఱు పార్లమెంటుసభకుఁ బిలువఁబడవలసియున్నను, రాజు లట్లుచేయక గొప్పజమీదారులను మాత్రము రప్పించుచుండిరి. స్వల్పభూస్వాము లనేకులుండుటచే, రాజు వారిని పిలుచుట మానివేసెను. కొందఱిని పిలిచినను వారు దూరప్రయాణములకు వెఱచి పార్లమెంటునకు వెళ్లుట మానుకొనిరి. ఈకారణములచే రాజుచే ప్రత్యేకముగ సమను జేయఁబడిన జమీదారులే లార్డుశాఖవారైరి.

రాజువలనఁ బ్రత్యేకసమను పొందని పిల్లజమీదారులును, గొప్పకుటుంబమునఁ బుట్టినవారును, పట్టణములనుండు నాగరికులును, మండలసభవారినుండి స్వతంత్రభూస్వాములచేఁ దమ ప్రతినిధులుగఁ గోరఁబడినవారును, కామనుల శాఖవారు మండలసభలలోను, శతకూటములలోను జేరుట కర్హతలేని కర్షకులును గాయకష్టములచే జీవించుచు మడిమాన్యములులేని పాటకజనములు, పట్టణ వాసులయ్యును మునిసిపలు సభలోఁ జేరని నాగరికులును పార్లమెంటు సభకుఁ బ్రతినిధులను బంప నర్హతలేనివారు సంవత్సరమునకు 30 నవరసుల నఫావచ్చు మాన్యము లేనివారు పార్లమెంటు సభికత్వమున కర్హులు కారని 1430 లో ఆఱవ హెన్రీ శాసించెను. ఈ ప్రతినిధులను నియమించుటలోఁ బ్రజలు స్వతంత్రముగాఁ బనిచేయుటకుఁ గొన్నియాటంకములు గలుగుచు వచ్చెను. ఒకప్పు డొకలార్డు అడ్డము వచ్చి, తనకిష్టులైనవారిని నియమింప మండలసభవారిని నిర్బంధపెట్టుచుండెను. రాజు పక్షమునఁ బని చేయు షరీపు అడ్డము వచ్చి రాజుపక్షమువారిని నియమింపఁజేయఁ బాటు పడుచువచ్చెను. ఇట్టి దురాచారముల

ను మాన్పుటకై, మండలసభవారందఱు సమకూడిన సభయెదుటనే ప్రతినిధి నిర్ణయము జరుగవలెనని 1496 లో నాలుగవ హెన్రీ శాసించెను.

ఈకాలమున పార్లమెంటు సభికత్వము గౌరవార్హమని ప్రజలు తలఁచినవారు కారు. ఇందున కనేక కారణములున్నవి. ధనము కావలసి వచ్చినపుడే రాజు పార్లమెంటు నిమిత్తము ప్రతినిధులను బిలువనంపుచు వచ్చెను. రాజునకు ధనమిచ్చుటకు కామనులకు సమ్మతిలేదు. పల్లెలమీఁద కట్టఁబడినదానికంటె పట్టణములమీఁద పన్ను అధికముగాఁ గట్టఁబడుచుండెను. అందుచేఁ బార్లమెంటు సభకు బ్రతినిధులను మాపట్టణములనుండి పిలువకుండ ననుగ్రహింపుమని కూడఁ గొన్నిపట్టణములవారు రాజునకు పిటీషను లిచ్చుకొనిరి. పార్లమెంటు సభకుఁ బోయినవారికి జీతములిచ్చెడు నాచారమీ కాలమునఁ గలదు. ఈ జీతము లిచ్చుకొనలేక కొన్నిమండలములు ప్రతినిధులను పార్లమెంటునకుఁ బంపుట మానుకొనిరి. ఈ జీతముల కాసించియైనను, ప్రతినిధులు పార్లమెంటునకుఁ బోవుట కిష్టపడకుండిరి. అచటికిఁ బోయినయెడల, రాజు కోరికచొప్పున ధనమిచ్చుటకంగీకరింపవలసియుండెను. ధన మిచ్చుట కంగీకరించినయెడల, తమ్ము బ్రతినిధులనుగా నియమించిన మండలములవారికిఁ గష్టముగా నుండుచువచ్చెను. అందుచేతనే యొకప్పుడాక్సుఫర్డు పట్టణమువారు కొందఱు నగరజనులను ప్రతినిధులుగాఁ గోరినప్పుడా ప్రతినిధులు పార్లమెంటునకుఁ బోవుట కిష్టపడక పట్టణము విడిచి పాఱిపోయిరి. దొంగలను, ఖూనీచేసినవారిని భటులు వెంటనంటి తీసికొని వచ్చునట్లు ఈ ప్రతినిధులవెంట బంటులు వెన్నాడి వారిని బలవంతముగ పార్లమెంటులోఁ గూర్చుండఁ బెట్టవలసి వచ్చెను.

పార్లమెంటుయొక్క అంగీకారము లేకుండఁ గ్రొత్త పన్నులు కట్టకూడదనియు, క్రొత్తచట్టములను జేయఁగూడదనియు శాసనములు పుట్టినవనియిదివఱకు వ్రాసియుంటిమి. ఇప్పుడు క్రొత్తచట్టములను జేయవలసివచ్చినప్పుడు, ప్రజాశాఖవారగు కామనులు, ఆ చట్టనిబంధనలను సూత్రప్రాయముగ వ్రాయుదురు. దానికి బిల్లు అనిపేరు. కామనుశాఖలో నీ బిల్లు స్థిర



పడినవెనుక లార్డ్సుశాఖవారు దీనిని గుఱించి తర్కించి దాని నామోదించవచ్చును. నిరాకరించవచ్చును. లార్డ్సుశాఖవారుగూడ ఆబిల్లున కామోదించినయెడల, రాజానుమతికొఱకది పంపఁబడును. అప్పుడా బిల్లును రాజు మార్చుట కధికారము లేదు. తన యిష్టానుసారము దాని నంగీరించవచ్చును. షిమ్మట ఆబిల్లు చట్టము (law) అగును. రాజు నిరాకరించినయెడల బిల్లు రద్దుపడును. నాలుగవహెన్రీకాలములో ధనముకొఱకు రాజు పార్లమెంటును బిలిచినప్పుడు దేశక్షేమముకొఱకు కామనులు లోక శాసనమును జేయింప సమకట్టి ఆ శాసన నిబంధనలను ఇప్పటివలె బిల్లు రూపమున వ్రాయక పిటీషను రూపమున వ్రాసి రాజునకు నివేదించుకొనుచుండిరి. రాజు ఆపిటీషనులోని నిబంధనల నిచ్చవచ్చినట్లు మార్చి శాసనము చేయుచువచ్చెను. 1414 లో కామను లిట్టి మార్పులకు విసికి, తాము పిటీషనులో వ్రాసికొన్న నిబంధనలలోని మాటలనైన మార్చకుండ రాజు శాసనమున కంగీకరించునట్లు లేక నిరాకరించు నట్లు పార్లమెంటువారు నాలుగవ హెన్రీవలన నొక శాసనము నొందిరి. ఇట్టి పిటీషనునకే తరువాత బిల్లు అని పేరువచ్చినది.

రాజు ఇచ్చవచ్చిన మంత్రులను నియమించుకొనవచ్చును, తొలఁగించవచ్చునని మూఁడవ హెన్రీ చారిత్రములో వ్రాసియుంటిమి. ఈ మంత్రులు పార్లమెంటుసభ కుత్తరవాదులై, వారివలన నేర్పఱుపఁబడుచు, వారివలనఁ దొలఁగింపఁబడినఁగాని మంత్రులను తిన్నగా రాజ్యము నడిపించునట్లు చేయఁగల యంకుశ ముండదు. ఈ యధికారము పార్లమెంటునకు మూఁడవ హెన్రీ కాలములో లేదు. తర్వాత ఎడ్వర్డు III, రిచార్డు II, హెన్రీ VI ప్రభుత్వములో మంత్రులు దుష్పరిపాలనము చేయఁగా వారిపై పార్లమెంటు నెదుట కామనులు నేరముమోపి రుజువుచేయుటయు, లార్డులు శిక్షించుటయుఁ దటస్థించుటచే, మంత్రులపై పార్లమెంటుకు నానాఁటి కధికారము కలిగెను.

ఈకాలమందలి మతాచార్యుల స్థితిగతులనుగూర్చి యొకింత చెప్పవలసి యున్నది. సివిలు కోర్టులతో సంబంధములేకుండ మతాచార్య సభలను

పేరవిజయభూషణుఁడు క్రొత్తసభలను స్థాపించెనని చెప్పియున్నాము. ఇంతియు కాక కాంటర్బరిపట్టణమున నొకటియు, యార్కుపట్టణమున నొకటియు రెండు మతసభలను స్థాపించుకొని మత వ్యవహారములను జక్కఁబెట్టుకొనుటకుఁ గావలసిన నిబంధనలను జేసికొనుచు, తమలోఁ దాము పన్ను గట్టుకొని కావలసిన ధనమును బోగుచేసికొనుచు, దొరతనమువారి పార్లమెంటుసభతో సంబంధము లేకుండఁ బనిచేయుచుండిరి. అందుచేతనే చిన్నదేవాలయముల మతాచార్య ప్రతినిధులకు పార్లమెంటుసభలో మొదటి యెడ్వర్డు చోటిచ్చినప్పుడు, వారు సభకు రాక మానుకొనుటయు, రాజుగారిచేఁ బ్రత్యేకముగ సమను చేయఁబడినవారే వచ్చుచుండుటయుఁ దటస్థించినది. నానాఁటి కితర విషయములలోఁ గూడ మతాచార్యులస్థితి క్షీణదశకు వచ్చుచుండెను. జానుకాలమువఱకు మతాచార్యులే ప్రజలపక్షమున నాయకులై నడపించిరి వాస్వాతంత్ర్యమును గాపాడుచుండిరి. జానుకాలము మొదలు మొదటి యెడ్వర్డు కాలము వఱకు మతాచార్యులు పోపునకు లోఁబడినవారై, ప్రజాక్షేమమునం దాదరణము లేనివారగుటవలన బారనులు ప్రజలపక్షమునఁ బోరాడుట కారంభించిరి. మొదటి యెడ్వర్డునాఁటినుండియు కామనులు ప్రబలులై స్వాతంత్ర్యమును బలపఱచుకొన నారంభించిరి. ఇట్లు మతాచార్యులు క్రమక్రమముగ రాజకీయ వ్యవహార దక్షత విషయమున వెనుకఁ బడిరి. పూర్వము దేశసామాన్యము కంటె మతాచార్యులే విద్యావంతులును పండితులును నై యుండిరి. ఇటీవల వీరికీ గౌరవము కూడఁ దప్పిపోయెను. మతబోధకులు క్రొత్తవారు బయలుదేరి మతాచార్యుల మూఢమతమును ఖండించి సహేతుకముగ వాదించుచుండిరి. మతాచార్యులా నూతనబోధకులను బాధపెట్టి వారి బోధనలను మాన్పింపఁ బాటుపడిరి. అందుచే విద్యాధికు లయినవారు, సహేతుక వాదమును విడిచి మూఢ సిద్ధాంతముల గౌరవింపఁ జాలరు గనుక మతాచార్యులపై గౌరవమును విడిచిపెట్టిరి. గరువమును, కలిమియు, దొరతనమును గూడ మతాచార్యులనే ఆశ్రయించి యుండుటచేత, వీరికి మత



బోధయం దుత్సాహము తగ్గిపోయినది. వీరిని తమపనుల యం దవహితులై పనిచేయునట్లు దండించు పోపుకూడ ధనమదాంధులై యుండిరి. నూతన బోధలు బయలు వెడలిన కొలఁది మతాచార్యులకు మూఢ సిద్ధాంతముల యెడల నమ్మకము కూడఁ దగ్గిపోయెను. వీరి ధనసంపద నానాఁటికి పెరుగుటయే కాని తఱుగుట లేదు. కనుక జనులకు వీరిపైని సహిష్ణుత పెంపొందెను. మొదటి యెడ్వర్డు చేసిన శాసనమువలన, దేవస్థానములకు మాన్యదానములు వృద్ధికాకుండ నిలుపఁబడెను. 1414లో పార్లమెంటువారు విదేశ మతాచార్యుల మాన్యము లన్నియు రాజపరము చేసిరి. ఇంతియు కాక, క్రిమినలు కోర్టులలో విచారించుట కర్హము కాని పరువునష్టము మొదలగు సివిల్ నేరములు మతాచార్యుల కోర్టులలోనె విచారింపఁబడుచుండెను. ఈకోర్టులలో జడ్జీలుగా నున్న మతాచార్యులు లంచములు పట్టుట మొదలగు దురాచారములఁ గలిగియుండుటచే వీరియెడ ద్వేషము బలమయ్యెను. మఱియు జాను పోపుయొక్క ఆధిక్యతకుఁ గే లొగ్గిన దాదిగా పోపు ప్రతి విషయములోను నడ్డము వచ్చుచుండెను. అందుచే 1301లో రాజుపై పోపున కధికారము లేదనియు, 1366 లో పోపునకిచ్చుటకు జాను సమ్మతించిన సాంవత్సరిక రుసుము చెల్లింపఁబడఁ గూడదనియు, 1353, 1365, 1393 లో ఇంగ్లాండులోని దావాలు పోపువద్దకు రోమునకు పోఁగూడదనియు, 1351, 1362, 1390,లో నాంగ్లదేవాలయములకు పోపు మతాచార్యనియమము చేయఁగూడ దనియుఁ జట్టములు చేయఁబడెను.

స్వంతభూములు లేక కవులునకు సేద్యము చేయుకర్షకులకు స్వతంత్రులకు వలె గ్రామవ్యవహారములందును మండల రాచకార్యములలోను ప్రవేశము లేదని చెప్పియున్నాము. కాలక్రమమున వీరి కిట్టి దుస్థితి తొలఁగిపోయి స్వాతంత్ర్య భాగ్య మబ్బినది. సేద్యగా డనేకవిధముల

స్వతంత్రుఁ డగుటకు మార్గములు గలవు. యజమానునకుఁ బ్రతిఫలమిచ్చి కాని, మత పరివర్తకులలోఁ జేరి గాని కర్షకుఁడు స్వతంత్రుఁడు కావచ్చును. మునిసిపలు పట్టణములో యజమానునకులోఁబడక యొక సంవత్సరముమీఁద నొక దినము వాసము చేసినయెడల, స్వతంత్రత వచ్చుచుండెను. పరతంత్రులగు కర్షకులకు స్వాతంత్ర్య దాన మిచ్చిన యెడల దేవునకుఁ బ్రీతి యగు నని మతాచార్యులు జమీందారులకు బోధించి వారిచే నట్లు చేయించుటవలన ననేకులకు సేవకాబంధము విడిపోవుచు వచ్చెను.

స్వసేవకు మారుగా ధనరూపమున ఈనాందారులకు నఘాయిచ్చుట కొడఁబఱచి కృషికులు సేవనుండి తప్పించుకొనుచుండిరి. 1349 లో దేశమంతట నల్లుకొన్న ప్లేగువ్యాధివలనఁ బాటక జనము సగమగుటచే మిగిలినవారు విశేషముగఁ గూలి అడుగుచు వచ్చిరి. అందుచే లార్డులు ధనము పుచ్చుకొనుట కంగీకరింపక రయితులవలన నూడిగము చేయించుకొనుటకే పట్టు పట్టుచుండిరి. సేవకు లెక్కువ కూలి కోరఁగూడదని శాసనములు కూడ బయలుదేరినవి. అందుచే 1381లో రెండవ రిచార్డు కాలమునందుఁ గర్షకులు తిరుగఁబడి యుద్ధమునకు డీకొనిరి. ఈయుద్ధము వలన వారి కోరికలు నెరవేఱలేదు గాని నాఁటనుండియు వారి యిష్టము సాగుచు వచ్చెను. ఇట్లు జరుగుచు రాఁగా రాఁగా గులాబి యుద్ధము 1485 లో ముగియునప్పటికి దేశమందు స్వతంత్రహీనులైన కర్షకులజాతి నిర్మూలమైనది. ఇట్లు సేవ్యగాండ్రు స్వతంత్రులగుటవలన సేవ్యము చాలవఱకు తగ్గిపోయి, పాటక జనమునకు దారిద్ర్య మబ్బినది. ఆకాలములో ఉన్ని (wool) వ్యాపారము ప్రబలముగా నున్నది. జర్మనుదేశములో ఉన్నితో వస్త్రములు నేయు నేతగాండ్రు ప్రవీణులైయుండిరి. అందుచే నింగ్లాండునుండి యాదేశమునకు ఉన్ని విశేషముగా నెగుమతి చేయఁబడుచుండెను. ఉన్ని తయారుచేయునిమిత్తము వర్తకులు విశేషముగ భూములను సంపాదించి గొఱ్ఱెలకుఁ బచ్చిక బీళ్లుగా మార్చివేసి సాగుబడి తక్కువ చేసిరి. కూలిలేక కూటికి మొగమువాసిన పాటక జనముయొక్క దారి



ద్ర్యదశను ప్రధానము చేసికొని యీకాలమున దేశము దుర్భిక్ష మనుభవించిన దనియు, వర్తక వృద్ధివలనను, జేతిపనుల (ఇండస్ట్రీ) వృద్ధివలనను ప్రజాబాహుళ్య మభివృద్ధి నొందుటయు స్వాతంత్ర్యలాభము నొందుటయుఁ ప్రధానము చేసికొని యీకాలమున దేశము సుభిక్షమనుభవించిన దనియుఁ జారిత్రకారు లీపదునేనవ శతాబ్దమును వేఱువేఱుగా వర్ణింతురు.

---

# అధ్యాయము 8.

## ట్యూడరు రాజులు-1485-1603

### హెన్రీ VII (1485-1509); హెన్రీ VIII (1509-1547); ఎడ్వర్డు VI (1547-1553)

గులాబి యుద్ధములో లంకాస్టరు వంశపు బారనులు కొంతకాలమును యార్కు వంశము వారు కొంతకాలమును ముందంజవేసి జయైశ్వర్యతోఁ బోరాడుటచే నన్యోన్య ద్వేషము ఇరువురియందు రగులుచుండెను. సప్తమ హెన్రీ లంకాస్టరు బారనులవంశము వాఁడు. ఈతనికి వంశపారంపర్యముగా వచ్చిన యధికారము లేకుండ రాజగుటచే, యార్కు వంశమువారి వలన నెట్టియాపద రాకుండ వారివంశములోని సుందరిని వివాహమాడి పత్నీసయితముగాఁ బట్టాభిషిక్తుఁడై వారిని సమాధాన పఱచుకొనెను. కాని బారనుల బలము పూర్తిగాఁ దగ్గించుటకుఁ దగు శాసనములఁ జేసినఁ గాని తనకు రాజ్యము నిష్కంటకము గాదని నిశ్చయించుకొని యొకక్రొత్తకోర్టు స్థాపించెను. ప్రతిబారను వద్దను ఆయుధపాణులై కోరినప్పుడు యుద్ధము చేయు పరివారజనులుండిరి. కోర్టులలో బారనులపైనే వ్యవహారము వచ్చినను వారిపక్షముననుండి గెల్పించుటకు బద్ధులైన యాశ్రితులు కొందఱుండిరి. ఇట్టి మూఁకలను బారను లుంచుకొనఁగూడదని యిదివఱకే రాజులు శాసనములను జేసి యున్నను అవి అమలు జరుగుటలేదు. ఆ ప్రాంతచట్టములను మీరిన జమీదారులను విచారించి శిక్షించుటయే హెన్రీ యేర్పఱచినయీ క్రొత్తకోర్టు యొక్క ముఖ్యోద్దేశము. ఈజమీదారుల మగఁటిమికి మిక్కిలి జడిసిసామాన్యులు వారికి వ్యతిరేకముగఁ దీర్పుచెప్ప వెరతురను భీతిచే రాజునొద్ద మంత్రులుగానున్న గొప్పయుద్యోగస్థులే యీ



కోర్టులో జడ్జీలుగా నియమింపఁబడిరి. లిఖిత వాగ్రూపముల రాజునకును మంత్రులకును వ్యతిరేకముగ మాట్లాడినవారిని రాజద్రోహులని యీకోర్టులోనే శిక్షించుచు వచ్చిరి. అయిన నీరాజుకాలములో నల్లరులు లేక పోలేదు. క్రొత్తపన్నుకట్టు నిమిత్తము పార్లమెంటువారి యంగీకారమును బొందుటకు రాజు ప్రయత్నము చేసినప్పుడు రెండు సారులు దిరుగబాటు జరిగెను. అందుచే పార్లమెంటుతో సంబంధము లేకుండ స్వతంత్రముగ సొమ్ము వసూలు చేయుటకు రాజులనేకోపాయములను బన్నెను. తనమంత్రుల ద్వారమున దేశమందలి ధనవంతులను బిలిపించి వారిని ధనమిమ్మని కోరి జమచేయుచు వచ్చెను. గులాబియుద్ధపునల్లరులలోఁ బ్రజలు మఱచిపోయిన ప్రాంతచట్టములను వెదకించి, వానిని మీఱినందుకుఁ గఠినముగ జుల్మానాలు వేసి యీరూపమున విశేషముగ సొమ్ము పోగుచేయుచువచ్చెను. ఈవిధముగ ధనవంతుఁడగుటచే నీతని పదమూఁడు సంవత్సరముల రాజ్యకాలములోను పార్లమెంటును బిలువనక్కఱ గలుగలేదు. ఒక్కసారి మాత్రము ఫ్రాన్సుదేశముమీఁద యుద్ధము చేసెదనని నటించి పార్లమెంటుసభగూర్చి ధనము నాకర్షించెను. ఆకాలమున నాంగ్లసింహాసనమునకు ముఖ్య కర్తనని యొకవంచకుఁడు బయలుదేఱఁగా ఫ్రాన్సుస్కాట్లండు రాజు లాతనికి సహాయులైరి. ఇట్లయిదు సంవత్సరములు జనులు కలవరపడిరి. తుదకు రాజందఱితో సఖ్యపడి యావంచకు నరిదీయించెను. కొందఱు బారను లప్పుడప్పుడు తిరుగబాటు చేయుచువచ్చిరి. కాని వారిప్రయత్నములు కొనసాగనందున వారు నిర్మూలము చేయఁబడి వారి మడి మాన్యములు దివాణము పరమయ్యెను. ఇట్లు దేశమందలి యంతఃకలహముల సమయించి, విదేశరాజులతో సఖ్యము బలపఱచుకొన నుద్యమించి, తనకొమార్తెను స్కాట్లండు రాజునకు వివాహము చేసియు, స్పానియాదేశపు రాజుకూతురును మొదట తన పెద్దకొమారునకును ఆతఁడు వెంటనే చనిపోయినందున పోపుయొక్క సెలవు పొంది ఆవితంతువును తన రెండవకొమారుఁడగు హెన్రీకిని వివాహము చేసి, స్కాట్లండు తోడను స్పానియాతోడను స్నేహము బలప

అనుకొనెను. మఱియు నైర్లాండు నందుఁ దగిన చట్టములు లేనందున, ఇంగ్లాండునందములోనున్న చట్టములన్నియు నాదేశమందమలు జరుగవలయు ననియు, రాజు సెలవు లేకుండ ఆదేశమందు పార్లమెంటుసభ చేయఁగూడ దనియు, అట్టి సెలవుపొంది కూడినపార్లమెంటు వారే చట్టము చేసినను రాజుయొక్కయు నాంగ్లపార్లమెంటుయొక్కయు నంగీకారమును బొందినఁగాని అది శాసనము కానేరదనియు, నిర్ణయించి యైర్లాండును స్వాధీనము చేసికొనెను. ఇట్లీరాజు చేసిన యేర్పాటులవలన స్వదేశమందలి బారనులవలనను, విదేశమందలి రాజులవలనను దేశమునకు సంక్షోభము తగ్గించి సుభిక్షముగ రాజ్యము చేసినను, ఈతఁడు లోభియై ప్రజలబాధపెట్టి ధనాకర్షణము చేయుటచే 1509 లో నీతఁడు చనిపోయినప్పుడు ప్రజ లంతగా విచారించలేదు.

ఈతని కొమారుఁడగు నెనిమిదవ హెన్రీ ప్రజానురాగము కోరినవాఁడై ముప్పది యెనిమిది సంవత్సరములు రాచరికము చేసెను. జనప్రీతిని గూడఁగట్టుకొనుట కుపాయముగా ధనార్జనలోఁ దండ్రికి సాయము చేసిన మంత్రుల నురిదీయించెను. ఈకాలమున నిటలీ దేశ మరాజకమై యున్నందున ఫ్రాన్సురాజును స్పానియారాజును ఆదేశముమీఁదికి దండెత్తి, కూడినంత దేశము నాక్రమించుకొనఁ దలపెట్టి యిద్దరును గూడ హెన్రీ సహాయము నపేక్షించిరి. అందుచే నాంగ్లజనులకు గర్వము హెచ్చి, తమంతటి పరాక్రమశాలురు లేరనుకొనుచు నుబ్బి తబ్బిబ్బులగుచుండిరి. హెన్రీ తండ్రివలె మితవ్యయము చేయువాఁడు కానందునఁ దండ్రి కూడఁబెట్టినదెల్ల వెచ్చపుచ్చి, ధనము సంపాదించుటకుఁ గఠినమైన పన్నులు విధించెను. వానిని జమచేయుట కనేకోపాయములను బన్ని మంత్రి పాటుపడెను. కాని 1525 లో ప్రజలు తిరుగఁబడఁగా రాజు కట్టిన పన్నులను రద్దుపఱచుకోవలసి వచ్చెను. ఇంతట ఫ్రాన్సు స్పానియాలకు జరుగుచున్న యుద్ధములలో స్పానియా ప్రభువు చేతిలో ఫ్రాన్సురాజు చిక్కెను. వెనుకటిరాజుల కాలములలో నష్టమైన ఫ్రాన్సునందలి సామంతమండలములను దిరుగ



సంపాదించుకొనుట కిదియే సమయమని హెన్రీ తలంచి, ఫ్రాన్సురాజును సింహాసనమునుండి తొలఁగించి తనకు సామంతరాజులఁగా నేల నొడఁబడు మఱియొకని నాస్థానమున నిలుపుమని స్పానియా ప్రభువుతో హెన్రీ మంతనమారంభించెను. ఆతని కోరికఁ దీర్చిన యెడల నాంగ్లరాజునకు బలము హెచ్చునని యెంచి యాప్రభు విందున కొడఁబడక, ఆదేశమును దనవశమందే యుంచుకొనుటకుఁ బూనియుండెను. అందుచే హెన్రీకి స్పానియాప్రభువుమీఁద వైరము పెరిగెను. అతని మేనత్త హెన్రీయొక్క జ్యేష్ఠసోదరుని మొదట పెండ్లాడె ననియు ఆతఁడు వెంటనే చనిపోయినందునఁ బిమ్మట హెన్రీకి వివాహము చేయఁబడెననియు, స్పానియాతోడ స్నేహము పెంచుకొనుటయే యీవివాహముల ముఖ్యోద్దేశమనియు నీతని తండ్రి సప్తమ హెన్రీ చారిత్రములోఁ జెప్పియుంటిమి. ఈరాణివలన ఎనిమిదవ హెన్రీకిఁ గలిగిన సంతానములో మేరీయను నొకకొమార్తె మాత్రము సజీవియై పుత్రసంతానము బాలారిష్టములకు బలియైనందునను, తనకంటె నామె వయోధికురాలైనందునను, స్పానియారాజుతోడి నెయ్యముపోయి కయ్యము సంప్రాప్తమగుటచేతను, హెన్రీ మఱియొక జవరాలి పయి వలపుగొని యామెను విసర్జింపఁ దలపెట్టి యుండెను. మృతసోదరుని కళత్రమును క్రైస్తవమతాచారము చొప్పున వివాహమాడుట దూష్యమగుటచే, పీఠాధిపతియగు పోపు తగు కారణములను విచారించి యిట్టి దాంపత్యమునకు నంగీకరింపవలసి యుండెను. అట్టి యంగీకారమునుగూడ ఆకాలపు పోపువలనఁ గూడఁగట్టుకొని హెన్రీ యీ రాణిని వివాహమాడె నని చదువరు లెఱిఁగి యున్నారు. ఇప్పుడు మఱియొకఁడు పోపుస్థానమునం దున్నందున, వెనుకటిపోపుయొక్క యంగీకారము ధర్మవిరుద్ధమని శ్రీముఖము నిమ్మని రాజు పోపును గోరెను. ఆకాలమున పోపు చెప్పెడు మతసిద్ధాంతములు బైబిలులోనివి కావని ఖండించుచు లూథ రనుమతసంస్కర్త యొకఁడు బయలుదేఱి పోపునెడ జనులకు భయభక్తులు తొలఁగునట్లు బోధించుచుండెను. ఆ సంస్కర్తయొక్క వాద

ముసు ఖండించి పోపు పక్షమున హెన్రీ యొక ఖండనభాష్యమును వ్రాసి పోపువలన మతపోషకుఁడను బిరుదు నొందెను. అందుచే రాజు కోరినట్లు పోపువలన శ్రీముఖము నవలీలగ సంపాదించుకోవచ్చునని తలఁచియుండెను. కాని యప్పుడు ఇటలీని ముట్టడించియున్న స్పానియారాజుచేతఁ జిక్కి పోపు బహుకష్టముతోఁ బ్రాణములు దక్కించుకొని బయలుపడెను. ఇంతి యకాక స్పానియారాజు జర్మనుదేశమునుగూడ నేలుచుండెను. జర్మనీలు లూథరు సంస్కర్తయొక్క పక్ష మవలంబించి చాలమంది పోపును విడనాడియుండిరి. వారిని దిరుగ పోపుపక్షమునకు స్పానియారాజు కూడఁ గట్టఁగలఁడని పోపు ఆతనిపై గంపెడు ఆశ పెట్టుకొని యుండెను. ఈ కారణములచే హెన్రీకోరికనుదీర్చి స్పానియారాజు నాగ్రహమునకుఁ బాత్రుఁడగుట కిష్టపడక, పోపు తనస్థానమునఁ బ్రతినిధిగ నుండి యీ వ్యవహారమును బరిష్కరించుట కొకని నింగ్లాండునకుఁ బంపెను. ఈ ప్రతినిధి తీరుమానమున కంగీకరింపక, పోపువలననే యీ ధర్మమీమాంస నిర్ణయింపఁబడవలెనని పట్టుపట్టుటచేత నాప్రతినిధి వచ్చినదారిని మరలి పోవలసివచ్చెను. పోపువలన విదేశకోర్టులు హెన్రీవిచారింపఁబడుటకుఁ బ్రజలంగీకరింపరైరి. అందుచే వివాహబంధము తెగక పోపుపై రాజునకు ద్వేషముపట్టియుండెను. ఈ వైరవృత్తాంత మింతటితో విరమించి యా కాలపు మతాచార్యులనుగూర్చి యొకింత చెప్పవలసియున్నది.

ఆకాలమున మతప్రవర్తకులకు మడిమాన్యము లమితముగా వృద్ధియైనందున వారు భోగపరాయణులై మతబోధక వ్యాపారమునందు పాలుమాలియుండిరి. పూర్వకాలమునందు పోపులు వివేకులును సద్గుణసంపన్నులు నగుటచే గౌరవపాత్రులై క్రైస్తవ ప్రపంచమునకుఁ బీఠాధిపతులై, రాజులవలన దేవాలయములకును బ్రజలకును బాధ కలిగినప్పుడు వారి పక్షమునుండి కాపాడుచువచ్చిరి. పదునాలుగవ శతాబ్దమందు పోపు ఫ్రాన్సురాజుచేఁ జిక్కుకొన్నప్పటినుండియు ఆంగ్లదేశమునకును ఫ్రాన్సునకును బ్రతికక్షులు ప్రబలుటచే పోపునెడల నాంగ్లజనులకు విశ్వాసము



తగ్గిపోయెను. ఫ్రాన్సు రాజగృహమునుండి విడివడినపిమ్మట పీఠాధికారముకొఱకు తగవులేర్పడి యొకప్పు డిద్దఱు ముగ్గురు పోపులేర్పడుచు వచ్చిరి. ఈయల్లరులఁ జల్లార్చుటకు మతాచార్యులు సభకూడి 1417 లో నొకపోపును నియమించిరి. నాఁటనుండియు రాజులవలె గజాశ్వాది భోగములతోఁ దులఁదూఁగుచు విద్యల భోజులై కొందఱును క్రూరులై ప్రజలపీడించి కాలము గడపుచు, పీఠాధిపతులు తమ యుచిత కృత్యములందుఁ బ్రమత్తులైయుండిరి. పూర్వమువలె రాజులవలన మత ప్రవర్తకులకును బ్రజలకును నిక్కట్టులు వచ్చినప్పుడు పోపు లడ్డపడక మానుకొనుటయేకాక తామే రాజుకంటె నెక్కుడుగఁ గట్నములను కానుకలను బుచ్చుకొనుచు వారిని బాధించుచుండిరి. ఈ కారణములచే మతాచార్యులను మతాధిపతులను మంచిమార్గమునకుఁ దేవలెననియు, ఆంగ్లదేశమత ప్రచారమునుగూర్చి పోపున కేవిధమైన జోక్యములేకుండఁ జేయవలెననియు, మతమం దవాంతరముగ వచ్చిచేరిన మూఢసిద్ధాంతములను మూలకుఁ ద్రోసి క్రీస్తుశిష్యులు బోధించిన మూలసిద్ధాంతముల నెలకొల్పవలెననియు, ననేకులు సంకల్పించుచుండిరి. మతమును సంస్కరింపవలెనను కోరికకు ముఖ్యసహకారికారణము ముద్రాయంత్రములే. ఇప్పటివలె సీసపుటక్షరములతో యంత్రద్వారమున గ్రంథములను వేనవేలుగా నచ్చువేసి దేశమున వెదఁజల్లుట కాంగిలేయులు 1476లో నూతనముగా నేర్చుకొనిరి. అంతకుఁ బూర్వము వ్రాసికొని గ్రంథములను జదువవలసి వచ్చుటచేత వ్రాతనేర్చిన కొందఱికే కాని యితరులకు విద్యాధన మందనిమ్రానిపండువలె నుండెను. మనదేశములో నున్న భాషలన్నిటి యందునకంటె సంస్కృతమున శాస్త్రసాహిత్య గ్రంథము లనేకములు వ్రాయఁబడి యున్నట్లే ఐరోపా ఖండమునందుఁ బ్రాచీన కాలములో నాగరికత ననుభవించిన గ్రీసుదేశములోను రోములోను లాటిను గ్రీకుభాషలలోను విశేషముగా గొప్ప గ్రంథములు వ్రాయఁబడి యున్నవి. అందుచే మన దేశమందు సంస్కృతగ్రంథములను గౌరవముతోఁ జదివి

నట్లే గ్రీకుగ్రంథములను రోమనులలాటిను భాషాగ్రంథములను ఈట్యూడరు రాజుల కాలములో విద్యావంతులు చదువుచు వచ్చిరి. గ్రీకుభాషలో నున్న బైబిలు ఆంగ్లీకరింపఁబడి యీ ముద్రాయంత్రములు వచ్చినతరువాత అందఱిచే బాహుళ్యముగాఁ జదువఁబడుచు వచ్చినది. అందుచే మత సిద్ధాంత విమర్శ దేశమునందు వృద్ధియై పోపుయొక్క మూఢసిద్ధాంతములు బైబిలులో లేవనియు అవి సహేతుకములు కావనియు స్పష్టపడెను. మత విషయములందు పోపునెడల గౌరవము తగ్గిపోయినందున ప్రజ లాతని యాధిపత్యమును నిరాకరించిరి. మతాధిపతులయు ఆచార్యులయు మూఢ సిద్ధాంతములను ఖండించుచు ననేక సంస్కర్తలు గ్రంథములు వ్రాసిరి. సోమరి తిండిపోతులకు మూలపట్టులైన చిన్న మఠములు మాన్పఁబడి వాని కాధారములైన మాన్యములును ధనమును విద్యాలయములు స్థాపించుట కుపయోగింపఁబడెను.

ఈకారణములచే భార్యను విసర్జించుటకు రాజునకు పోపు సాయము చేయనందున పోపుయొక్క ప్రతినిధిపై రాజు నేరముమోపి యాతని ధనమును దివాణమునకుఁ జేర్చుకొని వాని నుద్యోగమునుండి తొలఁగించెను. ఆతని ప్రతినిధిత్వమునకు లోఁబడినందునకు మతాచార్యు లందఱిపై నేరము మోపఁబడఁగా ఈ నిందఁ బాపుకొనుటకు విశేషముగ ధనము చందాచేసి పార్లమెంటులో బిల్లుచేయించి రాజున కర్పించిరి. ఆ బిల్లులో రాజే దేవాలయము లన్నింటికిని ప్రధానాధికారి యని వ్రాయించినఁగాని ధనము స్వీకరింపనని రాజు పట్టుపట్టి పంతము నెగ్గించుకొని మతాచార్యుల లోఁబఱచుకొనెను. నేరముచేసిన మతాచార్యులు క్రిమినలుకోర్టులో శిక్షింపఁబడకుండఁ దప్పించుకొను నాచారము చాలవఱకు రద్దు పఱుపఁబడెను. మతములకు భక్తులు ధనదాన మియ్యఁగూడదని నిషేధింపఁబడెను. పోపుయొక్క యధికార మిట్లన్ని విధములఁ దగ్గింపఁ బడినను హెన్రీ కోరికను పోపు తీర్చక రాజునకును రాణికిని విడియాకు లియ్యఁగూడదని యాజ్ఞ చేసెను. అందుచే 1533 లో నాంగ్లమత వ్యవహారములను వారి ప్రధా



నాచార్యుఁడే తీర్పవలెననియు ఆతని తీరుమానములపై పోపునకు అప్పీలు చెయ్యఁగూడదనియు పార్లమెంటులో రాజు శాసనము చేయించి కాంటరుబరి ప్రధానాచార్యుఁడు రాజునకును రాణికిని తగవు దీర్చునటుల నేర్పఱచెను. రాణి యాతనికోర్టునకు రాక నిరాకరించినందున ఆమె పరోక్షమందే వివాహబంధ విమోచనము చేయఁబడెను. మఱుసటి వత్సరమున నాంగ్ల దేవస్థానముల కాచార్యులను నియమించుటలో పోపునకు జోక్య ముండఁగూడదనియు పోపున కేవిధమగు పాదపూజలును సమర్పింపఁగూడదనియు పార్లమెంటువారు చట్టము చేసిరి. దీనితో పోపున కాంగ్లమతాచార్యుల తోడి యనుబంధము మొదలంట తొలఁగి పోయెను. ఈ శాసనమునకు వ్యతిరేకముగ మాట్లాడిన ప్రాచీనమత పక్షమువారు శిక్షాపాత్రు లగుచు వచ్చిరి. మతాచార్యులపై రాజున కధికారము లేదనినయెడల రాజద్రోహ నేరమగునని 1534 లో నొక చట్టము పుట్టెను. మతాచార్యు లందఱిచేత నిట్లు ప్రమాణములు చేయించఁబడెను. ఈ ప్రమాణమున కొడఁబడనివారు ఉరి దీయఁబడిరి. మతాధిపతు లీ విషయమున భిన్నాభిప్రాయు లగుటఁ గనిపెట్టి వారి నడతనుగుఱించి దర్యాప్తులు చేయఁబడెను. వారిప్రవర్తన నీతి బాహ్యముగ నున్నట్లు తేలినందున చిన్నమఠము లన్నియు నాశనము చేయఁబడునట్లును వారిద్రవ్యము రాజునకుఁ జెందునట్లును 1535 లో నొక శాసనము చేయఁబడెను. తుదకు 1539 లోఁ జిన్న పెద్ద విపక్షత లేకుండ మఠము లన్నియు నాశనము చేయఁబడి వాటిమాన్యములు విక్రయింపఁబడెను. పోపుయొక్క యధికారమును దొలఁగించుటయు, మఠప్రవర్తకుల మడి మాన్యములను దివాణమునకుఁ గలుపుకొని మఠముల నుద్వాసనచేయుటయు రాజునకును పార్లమెంటునకును జేతిలోనున్న పనులే కనుక సుకరముగ నవి నెఱవేఱెను గాని మతవిషయమున చిరతరాభ్యాసకముగా నడచుచున్న విశ్వాసములను సంస్కర్తలు చెప్పినచొప్పున మార్చుకొనుట ప్రజాబాహుళ్యమువారి వశమందున్న పనియగుటచే దుస్సాధ్యము గదా! అందుచే మత సిద్ధాంత సంస్కారమునుగూర్చి తగవులాడుటతో నీ రాజుయొక్క కడపటి

రాజ్యకాలమును దరువాత సింహాసనమునకు వచ్చిన యిద్దరురాణుల కాలమును నల్లకల్లోలముగ సంక్షోభించెను.

పూర్వము బైబిలు చదువకుండ రోమక పీఠాధిపతియే యీశ్వరావతారమనియు ఆతఁడు చెప్పినదె యీశ్వరవాక్యమనియు నమ్ముచుండిరి. క్రైస్తవమతము క్రొత్తగాఁ బ్రపంచమున వ్యాపించినప్పు డదివఱకున్న బహు దేవతారాధనపరుల కర్మకాండ కొంతవఱకు క్రైస్తవ మతములోఁ జేరినది. వీనిని పోపులు విమర్శలేకుండ అవలంబించి యుండిరి. జీససు బోధించిన మతము మూఢకర్మలులేని పరిశుద్ధాస్తిక మతమగుటచే బైబిలు చక్కఁగాఁ జదివిన వారి కీ కర్మకాండ వ్యర్థకాలయాపన యని తోఁచక మానదు. బైబిలు చదివి కర్మకాండను నిరసించి పరిశుద్ధాస్తిక సిద్ధాంతములను బోధించినవారిలో మొదటివాఁడు లూథరు అనుజర్మను సన్యాసి. ఈ సిద్ధాంతములు నానాఁటి కింగ్లాండునందుఁ బ్రబలి ముద్రాయంత్రములు బయలు వెడలినతోడనే విజృంభించెను. ఈ నూతనసిద్ధాంతముల నవలంబించినవారిని ప్రొటెస్టంటులనియు ప్రాచీన సిద్ధాంతముల నవలంబించినవారిని కాథొలిక్కులనియు నాంగ్లభాషలో వాడుదురు. ఆంధ్రభాష కివి నూతనపదము లగుటచే ఈ మాటలే యీ గ్రంథమున వాడఁబడును. పోపుపై ప్రీతి ఘటించి యుండుటచే హెన్రి నూతనపద్ధతిని కొంతవఱ కవలంబింపవలసిన వాఁడయ్యెనుగాని ఆంతర్యమునఁ బ్రాచీనపద్ధతియందు విశ్వాసము గలవాఁడగుటచే, ప్రొటెస్టెంటులు చెప్పినదెల్ల నంగీకరింపఁజాలక యుభయులకును మధ్యమార్గము నవలంబించెను. హెన్రి కడపటిభార్య ప్రొటెస్టెంటుపద్ధతిలోని దగుటచే నానాఁటికి వీరిపక్షము బలమయ్యెను. మఱియు 1547 లో హెన్రీ పరంపదించినందున ఆతని మైనరుకొమారుఁ డగు నాఱవ యెడ్వర్డు పక్షమున రాజ్యతంత్రమును నడపించిన మంత్రిమండలి కీ నూతనపక్షమువాఁడే నాయకుఁడయ్యెను. ఈతనిపేరు సోమరసెట్టు. దేశమందలి దేవాలయము లన్నిటిలోను విగ్రహములను దీసివేయవలెననియు కర్మకాండ కట్టిపెట్టి మానసిక ప్రార్థనలను మాత్రము జరుపవలెననియు నీతఁడు శాసించి కమీష



నరులను బంపి దేవాలయములందలి విగ్రహములను దీసివేయించుటచే జనబాహుళ్యమున కీ మార్పులు కంటకముగ నుండుటయె కాక కాథొలిక్కుమతావలంబులైన విదేశరాజులు మతావేశముచే నింగ్లాండు మీఁదికి దండెత్తుట కనువుగలిగెను. ఇట్టివిపద్దశ గలుగకుండ వాదింపఁ దలపెట్టి దూరదర్శియగు నెనిమిదవహెన్రీ స్కాట్లండురాజును దనపక్షమునకుఁ ద్రిప్పుకొని ఆతనిచే నా దేశ మతాచారములనుగూడ నింగ్లాండునందువలె మార్పింపఁ బాటుపడెను గాని ఆతఁ డీతనిమాట పెడచెవినిబెట్టి ఫ్రాన్సు యువతిని పెండ్లియాడి ఆ దేశాధీశునితో సఖ్యము చేసికొని యింగ్లాండుపై 10,000 సైన్యమును బంపఁగా వారు పరాజితులై మరలి పోవలసినవారైరి. విదేశప్రచార మిట్లుండఁగా మతవిషయములందు సోమెరసెట్టు చేసినమార్పులకు జను లిష్టపడకుండిరి. ఉన్ని వర్త్తకము వృద్ధియగుటచే సేద్యభూములు గొఱ్ఱెలబీళ్లుగా మాఱి కాయకష్టములవలన జీవించువారికి జీవనములు తప్పిపోయి దేశదిమ్మరులు వృద్ధియైరి. వీరిని దండించుటకుఁ గఠినమైన చట్టములు చేయఁబడెను. ఈ కారణములచే కామను లెదిరించి యల్లరులు మొదలుపెట్టిరి. ఇవి వెనువెంట నడఁచఁబడి వీని కుత్తరవాదియగు సోమరసెట్టు ఉరి దీయఁబడెను గాని ఆతనితరువాత రాజ్యతంత్రము నడపినమంత్రియు స్వలాభాపేక్షుఁడై దుష్పరిపాలనము చేసినందున జనులకు శాంతి గలుగలేదు. ఇంతట నాఱవయెడ్వర్డు 1553 లో చనిపోఁగా ఎనిమిదవ హెన్రీ యొక్క (divorced wife) విసృష్టపత్ని సంతానమగు మేరి రాజ్యమునకు వచ్చెను.

---

# అధ్యాయము 9

## ట్యూడరు వంశరాజులు.

### మేరీ (1553-1558); ఎలిజబెత్తు (1558-1653).

మేరీ ప్రాచీనమతాచార పక్షపాతియగుటచే, ఈ సామ్రాజ్యము పూనుట ప్రజల కెంతయు నామోదకరముగ నుండెను. ఎనిమిదవ హెన్రీ పరమపదించినపిమ్మట బయలువెడలిన మతాచార సంస్కారము లన్నియు మార్పుచేయఁబడి ఆనాఁటి మతాచారపద్ధతి పునరుద్ధారణము చేయఁబడెను. రోమకపీఠాధిపతి కధిరాజును జర్మనుమండలములకుఁ జక్రవర్తియునగు స్పానియారాజు మేరికి మేనమామయగుటచే వానిని కొమారుని మేరీ వివాహ మయ్యెను. ఈ వివాహము ప్రజల కిష్టములేక రాణిపై నెదురొడ్డిరి; కాని వారి ప్రయత్నములు విఫలములయ్యెను. ఈ వివాహమువలన మేరీ ధైర్యము తెచ్చుకొని పోపునకు వ్యతిరేకముగఁ దండ్రికాలమునఁ జేయఁబడిన చట్టములను రద్దుపఱిపించి ఆంగ్లదేశ స్థానములమీఁద పోపుయొక్క యాధిపత్యమును మరల నెలకొల్పెను. కాథొలిక్కు లీసమయము గనిపెట్టి ప్రొటెస్టెంటులను మతాచార్యులయొద్దకుఁ బిలిపించి తమ నూతనాభిప్రాయములను మార్చుకోవలెననియు తప్పినయెడల నిశ్శేషహానమునకుఁ బాలు గావలెననియుఁ దీర్మానించి ప్రజలకు భయము కలుగున ట్లాప్రొటెస్టెంటు లుండునెలవులలోనే వారిని సజీవముతో నగ్నిప్రవేశము చేయించి చంపిరి. కాని రాణి యనుకొన్నట్లు ప్రజలు భయాక్రాంతులై కాథొలిక్కు పక్షమునకుఁ దిరుగుటకు మాఱుగా సత్యమని నమ్మిన నూతనసిద్ధాంతముల కొఱకు ప్రాణములను బలియిచ్చిన యా భక్తాగ్రేసరులయెడ గౌరవమధికమై వారి నూతనాభిప్రాయమునం దెక్కుడు ఆదరము గలవారైరి. అలవరియెద్ద కాలమున



ఎలిజబెత్తురాజ్ఞి.

దివాణముపాలై విక్రయింపఁబడిన మఠముల మాన్యములు క్రయము పొందిన వారినుండి తీసికొనఁబడి, నాశము చేయఁబడిన మఠములు కొన్ని మరల స్థాపింపఁబడెను. ఈకారణములచే మేరియందుఁ బ్రజాద్వేషము ప్రబలితరముగఁ బాటుటకుఁ గారణమయ్యెను గాని యవి వెనువెంట నణఁచఁబడెను.

అంతట స్పానియా రాజ్యమునకుఁ గర్తయయిన మేరీభర్త యింగ్లాండును సాయముదీసికొని ఫ్రాన్సుమీఁదకి యుద్ధయాత్ర నడపఁగా, ఆదేశమందు నష్టములైన యాంగ్లసామంతమండలముల మీఁదఁబడి ఫ్రెంచివారు స్వాధీనము చేసికొనిరి. ఈనష్ట మాంగ్లజనులకు దుర్భర పరాభవముగఁ దోఁచినందున మేరీయెడల విప్రీతి మతిశీకరగులుకొనెను. దివాణమునకు వెనుకటి రాజులు చేర్చిన ధనము వెచ్చింపఁబడుటయే కాక, ఋణభారము మిక్కుటమయ్యెను. రాణి మతిప్రచారమందుఁ దగిలియుండుటచే, దేశరక్షకభటులుగాని, యుద్ధనావల బలముగాని క్రమమైన స్థితియందుండక దీనగతినుండెను. మేరీ ప్రజానురాగము లేక విచారగ్రస్తురాలై 1558సం॥నఁ గాలధర్మము నొందిన; నామెను సపత్నిసోదరియగు ఎలిజబెత్తురాణి సింహాసనము నలంకరించెను.

ప్రాచీనమత మెక్కుఁబెట్టునఁ దెచ్చిపెట్టి మేరీమతవిషయమున పోపునఁ కాధిపత్యమిచ్చుటచేతను, జనాభిమతమునకు వ్యతిరేకముగ స్పానియారాజును బెండ్లియాడుటచేతను, విదేశీయు లాంగ్లేయుల స్వాతంత్ర్యమున కడ్డము వచ్చుట కవకాశము గలిగెను. పోపుయొక్క విదేశాధికార మాంగ్లమత విషయమున మరలఁ బొడుకొనెను. ప్రొటెస్టంటుల నూతన సిద్ధాంతముల యెడల జనులకుఁ బూర్ణ[illegible]న యాదరము లేకపోయినను, స్వాతంత్ర్యప్రవృత్తి కలవాటుపడిన వారగుటచేఁ బోపుయొక్క యధికారమును దొలఁగించుకొనుట కుత్సుకులైయుండిరి. ప్రొటెస్టెంటుల నేదేశమున నున్నను రూపుమాపవలెనని స్పానియారాజు బద్ధకంకణుఁడైయుండెను. ఫ్రాన్సు తోడియుద్ధమింకను దుదముట్టలేదు. ఫ్రాన్సురాజు స్కా[illegible]

రాణిని వివాహమైత్రోమ్ములోఁ గుంపటించవలె నుండెను. ఈస్కాట్లండు రాణి యెనిమిదవ హెన్రీయొక్క సోదరికి మనుమరాలగుటచేఁ బ్రొటెస్టంటు మతాభిమానియయిన ఎలిజిబెత్తుకంటె, కాథోలిక్కు మతాభిమానినియైన స్కాట్లండు రాణియే యాంగ్లరాజ్యభారమును బూనిన బాగుండునని కాథోలిక్కులు సంకల్పించుచుండిరి. ఇట్టిశత్రుల మధ్యమున నూతనమతమును దెచ్చిపెట్టినయెడల ఫ్రాన్సుస్పానియా రాజులతో 'ఎలిజబెత్తు' వైరము వహించుకొనక తప్పదు. ఆ రాజులాకాలమునఁ బరస్పర విరోధులై యున్నందున, స్పానియా రాజునుదన పక్షమునకుఁ జేర్చుకొనుట యామెకు వివేకపక్షముగాఁ దోఁచెను. స్కాట్లండు రాణియాంగ్లసింహాసన మధిష్టించిన యెడల నాంగ్లబలమును ఫ్రాన్సునకామె తోడు చేయునను భీతిచేఁ బ్రాచీన మతాభిమాని యయినను, స్పానియా రాజు ఎలిజబెత్తుపక్షముననే యుండవలసి వచ్చెను. అందుచే మనరాణి ఫ్రాన్సు స్పానియా రాజులిద్దఱితోడను సఖ్యము చేసికొనెను.

ఇట్టికల్లోలములలో నింటిపోరు వినాశహేతువు గనుక ప్రాచీన మతముపట్లగాని నూతన మతముపట్లగాని పాక్షికము చూపక ఎలిజబెత్తు రాణి యుభయ మతములవారికిని సమాధాన మగునట్లుల నారాధనకాండనమర్చి యుభయులను సమాధాన పఱచఁదగు ప్రయత్నములు చేసెను. మేరీ మతాధిపతులకుఁ గ్రొత్తగానిచ్చిన మాన్యములు మరల దివాణమునకుఁ గలుపఁబడెను. మతవిషయములన్నిటిలోను రాణియే సర్వాధికారిణియని శాసింపఁబడెను. రాణియొక్క యీనూతనాధికారమునమలు జరుపుటకు హైకమీషనను కోర్టు క్రొత్తగా స్థాపింపఁబడెను. అర్థము తెలియని సంస్కృతభాషలో నున్నమంత్రముల నంధప్రాయముగ మనవారు జదువుచున్నట్లే, ఆదేశమందారాధనకాలమున లాటినుభాషం గర్మకాండను జదువుచుండు పూర్వాచారము మాన్పఁబడి వాడుకగల భాషలో నారాధన జరుగునట్లేర్పఱుపఁబడెను. పోపునకు దాసులైయున్న విదేశరాజుల దండయాత్రలు



దేశమును బీడించునన్న భయము జనులకుఁ బట్టియుండుటచే నీమార్పులందు అను నిష్టములేకున్నను జనులలో మతద్వేషములఁ జంపి యందఱు నేకముగఁ జేయుటకీమార్పు సహకారిగా నుండుననునమ్మకముతో నిరుకక్షులవా రడఁగియుండిరి.

పైఁజెప్పినవిధమున ఫ్రాన్సు స్పానియా రాజులను సుముఖులఁ జేసికొన్నను, స్కాట్లాండుతోడి వైరము ఎలిజిబెత్తునకుఁ దప్పలేదు. స్కాట్లాండులో నూతనమతము విరివిగా వ్యాపించియుండుటచే నక్కడపార్లమెంటువారు పోపుయొక్కనధికారము విసర్జించి ప్రాచీనారాధనకాండను మార్చికొనియుండిరి. విగతభర్తృకయై ఫ్రాన్సునుండి స్కాట్లండు రాణి దేశమునకు వచ్చినపుడామె ప్రాచీన మతాభిమానమును లక్ష్యపెట్టువారు లేకపోయినందున ఫ్రాన్సుభటుల నామెసహాయమునకుఁ దెచ్చుకొని తన మతమును మగటమిచే దేశమున వ్యాపింపఁజేయఁ దలపెట్టియుండెను. ఫ్రెంచివారి ప్రమేయమునొల్లక ప్రాటెస్టంటు లాంగ్లరాణిని సహాయము వేడికొనిరి. ఎలిజిబెత్తు ఎనిమిదవహెన్రీకి ధర్మపత్ని వలనిసంతానము కాదనియు తానేడవ హెన్రీకి మనుమరాలునగుటచే నాంగ్లసింహాసనమునకు ముఖ్యకర్త్రనియు నీస్కాటుల రాణి ప్రచురము చేయుచుండినందున నామెను బ్రతిఘటించుచున్న ప్రొటెస్టెంటులకు ఎలిజబెత్తు సహాయము చేసెను. అంతట పోపు ఎలిజబెత్తును 1570 సం॥న బహిష్కారము చేసి, స్కాట్లాండు రాణి పక్షమునుండి యామెకు సహాయము చేయుండని కాథోలిక్కులకు శ్రీముఖము నంపెను. ఆకాలమున ప్రొటెస్టెంటుల రూపుమాపుటకు బద్ధకంకణులై పనిఁజేయుచున్న కాథోలిక్కు తెగవార్లోకరు గలరు. వారి కీశ్రీముఖము మరింత యుజ్జీవకమైనందున వీరు రాణిప్రాణముఁ దీయుటకనేక కుతంత్రములఁ బన్నుచుండిరి. అందుచేయెలిజిబెత్తు ఆత్మసంరక్షణార్థ మీతెగవారు దేశమందెక్కడనున్న నురిశిక్షకుఁ బాత్రులఁజేసి వారికి శరణమిచ్చి దాఁచుటకూడ రాజద్రోహమని శాసించెను.

రాజ్యమునకు వచ్చినప్పుడు ఎలిజబెత్తు స్పానియా రాజుతోఁ జేసికొన్న స్నేహము ముప్పదిసంవత్సరముల వఱకు నిలిచియుండెను. ఐన నీకాలమున స్పానియుల కాంగ్లేయు లపకృతులు సేయకపోలేదు. మనరాణి కాలములో నాంగలుల యందు నావిక నైపుణ్యము వృద్ధియైనందున నంతగా నుచ్చనీచములఁ బాటింపని నావికులు స్పానియావర్తకుల యోడలఁ గొల్లఁగొని దోఁచుకొనుచుండిరి. స్పానియా రాజు వశమందున్న ఒలందుప్రాంత భూములయందలి ప్రాటెస్టెంటులు రాజుయొక్క ప్రాచీనమతమును విడనాడి స్వాతంత్ర్యము నార్జించుకొనుట కారాజుతోడి వైరమునఁ దగిలియుండగా ఎలిజబెత్తు వారికిఁ దోడ్పడుటకు సమ్మతింపలేదు గాని సూక్ష్మమతాభిమానముచే నాంగ్లేయు లనుచితముగ నా ప్రాటెస్టెంటుల పక్షమున రాజుతోఁ బోరుచుండిరి. అంతట నాంగ్లదేశమున కాథొలిక్కులు రాణినిజంపి స్కాట్లండురాణి నాంగ్లసింహాసనమున నెలకొల్పుటకై 1583 సం॥ లో నొకప్పుడును 1586 సం॥ లో నొకప్పుడును గుతంత్రములఁ బన్నిరి. ఈకడపటి ప్రయత్నములలో స్కాట్లండురాణికూడఁ జేరియున్నందున నామె నురిదీయవలసివచ్చెను. ఈ వార్త విని యూరోపునందలి కాథొలిక్కులందఱు క్రోధావేశ పరవశులై కంపించిరి. ప్రాచీనమతమును నిల్వఁబెట్టుటకుఁ గత్తిచేఁబట్టుఁడని పోపు కాథొలిక్కుల నుత్సహించెను. స్పానియారాజు లెక్కలేని నావిక సైన్యమును సిద్ధముచేసి యింగ్లాండుమీఁదఁ బంపెను. అతని నాంగ్ల నావికుఁడొకఁడు స్పానియులకుఁ దెలియకుండ హుటాహుటిని వారిపైఁగలిసి నలుబదియోడల ముంచివేయగా వారు వెన్నిచ్చి పాఱిపోయి సంవత్సరమువఱకుఁ దిరిగిచూడరైరి. ఈలోన నాంగ్ల నావికులు యుద్ధసన్నద్ధులైరి. 1588 సం॥ లో నూటముప్పది రెండు స్పానియాయోడలును, రెండువేలయేనూరు పిరంగులును, ఎనిమిదివేల నావికభటులును, ఇరువదివేల కాల్బలమును, గూర్చుకొని స్పానియు లింగ్లాండును ముట్టడించిరి. ఈయాపదను నివారించుకొనుటకు మతభేదములను మఱచిపోయి దేశాభిమానమును జాత్యభిమానమును నతిశయింప నాంగ్ల ప్రాటెస్టెంటులును కాథొలిక్కులును ముప్పిరిగొన్న యావేశముతో సమకూడి నూటయేబది యోడలఁ



గూర్చుకొని తొమ్మిదివేల ప్రసిద్ధ నావికప్రముఖులతో స్పానియనుల నెదుర్కొనిరి. ఆఱు ప్రాతయోడలను మందుతో నింపి వానికి నిప్పంటించి అంగలులు స్పానియుల యోడలమధ్య నడపింపగా వారు యదాయపరులై యింగ్లాండు నొడ్డువిడిచి ప్రవాహమధ్యమునకుఁ బోయిరి. పాఱుచున్న స్పానియులను అంగలులు తఱుముచుండ గాలియెదురై యుత్తరమునకు వారినిఁజేర్చెను. నాలుగువేల స్పానియులు గతించిరి. పెక్కుయోడలు మునిగియు నొడ్డెక్కియు నష్టమయ్యెను. స్పానియా నాయకుండు స్కాట్లండును జుట్టిపోవలెనని యత్నించుచుండఁ గాఁడుపానువచ్చి వారినిఁ జెల్లాచెదరు చేసెను. తుదకేఁబదిమూఁడు యోడలును, రోగపీడితులై మృత్యువున కభిముఖులైయున్న పదివేల సైనికులును స్పానియాకుఁ జేరికొనిరి. ఆంగ్లనావికులు స్పానియుల ద్వీపములను గొల్లపెట్టిరి. ఆగ్రహావేశుఁడై స్పానియా రాజు మఱియొక యుద్ధనౌకావ్యూహమును సిద్ధముచేసి బయులుదేరెను గాని తుపానుచే నది నాశమగుటచే 1597 సం॥ నాటికి స్పానియా వలని భయ మింగ్లండునకుఁ దొలఁగిపోయెను. సముద్రముమీఁద నాంగలుల పరాక్రమము సుస్థిరమయ్యెను.

ఐర్లాండునఁగూడ 'ప్రాటెస్టెంటు' మతమును స్థాపించి, దాని నాంగ్లరాజ్యమునకు లోఁబడఁజేయుటకు రాణి ప్రయత్నము చేసెను. ఐర్లాండులు కాథొలిక్కు మతమందు దృఢమయిన యభిమానము గలవారగుటచే రాణి సంకల్పము నెఱవేర్చుకొనుటకుఁ గ్రూరముగాఁబనిఁ జేయవలసి వచ్చెను. ఆంగ్లేయులమీఁది కచ్చటి బారనొకఁడు సేనను బోగుచేసి యెదురొడ్డెను గాని వెంటనే జయింపఁబడుటచే నాతని స్వాధీనమందున్న గొప్పజమీ, వలస వచ్చిన యాంగ్లేయులకును, స్కాటులకును, మాన్యముగా నీయఁబడెను

నానాటికి మతసంస్కారపక్షమును బ్రజలందఱా మోదించిన కొలఁది, ప్రాటెస్టెంటు లొప్పిన సిద్ధాంతములలోఁ గూడఁ గొన్నిమార్పులు కావల

యుసని వాదించు 'ప్యూరిటనులు' కొందఱు బయలుదేరిరి. పండితులును విశుద్ధవర్తనులును మాత్రమే మతాచార్యులుగా నుండవలెననియు, వీరికిఁదగు జీతబత్తెము లియ్యవలెననియు, బైబిలులోలేని సిద్ధాంతములను నమ్మఁగూడదనియు, నారాధనస్థలములగు దేవాలయములందు నింద్రియాకర్షకములగు సంగీతములను, మతాచార్యులు ధరించువెలపొడుగువస్త్రములను, ఆలయశృంగారములును, నుండఁగూడదనియు నారాధనము మానసికముగ నుండవలెననియు, వీరియాశయము. మతవ్యవహారములఁ దీర్చుటకుఁ బరిషత్తులేర్పడవలయు ననియు, నందునకు మతాచార్యుఁడొక్కఁడు చాలఁడనియు వాదించు తెగవారు మఱియొకరుగలరు. ఈ విశాలసృష్టియంతయుఁ బవిత్రమగు బ్రహ్మమందిరమైయుండ నారాధనమునకు దేవాలయమను నొక ప్రత్యేకస్థల మగత్యములేదని తలచువారి దింకొకతెగ గలదు.

ఎలిజబెత్తు, తండ్రివలెనే ప్రివికౌన్సిలు ( గూఢసభ ) మూలమున రాజ్యము చేసెను. అందొకఁడు ముఖ్యమంత్రియై యామెకు నాలోచనచెప్పుచుండెను. బహుమితవ్యయము చేసికొని రాజ్యమునడపుకొనుటచేఁ దఱచుగాఁ బార్లమెంటుసభకూర్చుట కీమెకగత్యములేకపోయెను. కాని యీమె కడపటి రాజ్యదినమునాటికి ట్యూడరుల నిరంకుశపు రాచరికమునకు జనులు విసుగుఁజెందిరి, ఈమె వివాహములేకయే ముదుసలియై 1603 సం॥లో పరంపదించెను. దయనీయులై వృద్ధులగు పేదలను, రోగపీడితులై కాయకష్టము చేయలేని నిరాధారులనుఁబోషించుటకును, దృఢకాయులైపాటుఁబడనొల్లక తిరిపె మెత్తుసోమరులను నిర్బంధించిపాటుపడునట్లు చేయుకృషిశాలల నిర్మించుటకును, బ్రజలపైఁబన్నుకట్టుటకునొక శాసన మీరాణికాలములోఁ జేయఁబడెను. అది 1834 సం॥ వఱకు నమలులో నుండెను.

ఇంగ్లాండుదేశము నలుప్రక్కలనీటిచేఁజుట్టఁ బడియున్న యొక చిన్న ద్వీపము. నౌకాబలము ప్రబలమైయున్నఁగాని విదేశరాజుల దండయాత్రలనుండి రాజు దానిని గాపాడలేడు. దీనివిస్తీర్ణము కడుచిన్నది



యగుటచేఁబ్రజావృద్ధియైనకొలఁది ధనాకర్షకములగు చేతిపనులు (ఇండస్ట్రీ) వృద్ధికానియెడల దారిద్ర్యదేవతకు నిత్యనివాసమగును. మఱియు నుదరపోషణార్థము దేశదేశములకుఁబోయి యందలి ప్రజలుతగ్గుచువచ్చినఁ గాని చేతిపను లెంతవృద్ధియైనను దారిద్ర్యము మట్టుపడదు. ఇంతియకాక చేతిపనులకొఱకు విదేశమునుండి వస్తుసామగ్రి దిగుమతియగుటకు వాడుకపడవలెను. ఇంగ్లాండుదేశ మిప్పుడు యుద్ధనావల బలముగలదై సముద్రముమీఁద నజేయమైయుండుటవలన ట్యూడరుల కాలములోవలె విదేశరాజుల భయముఁ గలుగుట కవకాశము లేదు. ఆంగ్లేయదేశమున మూడుసంవత్సరముల కొకసారి పదిలక్షల జనసంఖ్య పెరుగుచున్నను, కానడా, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా మొదలగు సామంత దేశములు విశాలములై వారి కాతిథ్య మిచ్చుచున్నందున దారిద్ర్యపీడలేదు. ఇతరదేశములనుండి వస్తుసామగ్రి విశేషముగా నింగ్లాండున దిగుమతి యగుచుండుటచే, మడిమాన్యములులేక కాయకష్టముచే జీవించు జనసామాన్యమున కన్నపానములు సుభిక్షముగ దొరకుటయేకాక విదేశములకు వారుచేసిన వస్తువు లెగుమతియై అమితమైన సంపదలభించుచున్నది. ఇట్లన్ని విధముల నైశ్వర్యముతోఁ దులదూఁగుటకుఁ బ్రారంభబీజము లీ యెలిజబెత్తురాణి కాలములోనే నాటఁబడినవి.

ఒలందు (హాలండు) ప్రాంతభూములలోనున్న ప్రొటెస్టంటులు కాథొలిక్కు మతాభిమానియగు స్పానియారాజు నాధిపత్యమునుండి విడివడి స్వతంత్రులగుటకు యుద్ధము చేసిరని పైనివ్రాసియున్నాము. ఇప్పుడు ఒలందు, రాజ్యమను పేరఁబఱగు నేఁడురాష్ట్రములును బెల్జియము దేశమును గూడి ఒలందు ప్రాంతభూములని యచటఁ వాడఁబడెను. ఈయుద్ధమునాటికీరెండు రాజ్యములును స్పానియారాజు క్రిందనుండెను. ఈయుద్ధములో నారాజునకు బెల్జియము దేశమోడిపోవుటయు, ఒలందురాష్ట్రములుజయించి స్వతంత్రములగుటయుఁ దటస్థించినందున, నారాజునకిష్టమగు పూర్వమతాచార పద్ధతినొల్లని బెల్జియము దేశపుసాలెవాండ్రు దేశమువదలి, కొఱు

నూతన మతప్రచారమున కనువుగా నున్న ఇంగ్లాండునకు వలసవచ్చిరి. ఈ నేతగాండ్రకొఱకే యింతవఱకింగ్లాండునఁ దయారు చేయఁబడినవన్ని బెల్జియమున కెగుమతియగుచువచ్చినది. ఇప్పుడా పనివాండ్రు ఇంగ్లండును గాఁపాచిగాఁ జేసికొన్నందున, నచ్చటపుట్టిన ఉన్నితో నచ్చటనే వస్త్రములు నేయఁబడి యితర దేశములకెగుమతి చేయఁ బడుచువచ్చినవి. అందువలన నానాటికి దేశమునందుఁ జేతిపనులును వర్తకమును గూడ వృద్ధియయినవి.

రోమకరాజ్యము పూర్వకాలమున మిగుల ఘనత వహించినదనియు, నయిదవశతాబ్దము నాటికే సామంతరాజ్యములను నిలుపుకొనలేనంత దుర్బలమయినదనియు, నెనిమిదవ హెన్రీ కాలమునకు సామంతరాజ్యములు విడిపోవుటయేకాక, ఇటలీదేశమే పరరాజుల యాశకుఁ బాత్రమై కొంతవఱకు స్పానియా దేశమునకు వశమయ్యెననియుఁ జదువరులెఱిఁగియున్నారు. మధ్యధరా సముద్రముచుట్టునున్న దేశములలో 'నిటలీ' కడు ప్రాచీనకాలమందే ఘనతకెక్కి, ఐశ్వర్యముతోఁ దులఁదూగుచుండెను ఐరోపాదేశమందలి వర్తకమంతయు నిటలీమీఁదుఁగా నాఫ్రికా మొదలగు నితరదేశములకు వ్యాపించుచువచ్చినది. ఐరోపాకు పశ్చిమదిశను దక్షిణపుకొననున్న పోర్చుగలుదేశమునకుఁ జేరు తెచ్చిన 'వాస్కోడిగామా' అను నావికుఁడాఫ్రికాఖండపుదక్షిణభాగమును జుట్టి 1498సం॥లో నావికయాత్ర చేయఁగలిగెను. ఈమార్గమితఁడు చూపువఱకు నైరోపాఖండమువారాసియాఖండమునకు వచ్చుటకు దెరవుగానకుండిరి. ఈ రహస్యమును దక్కినవారికంటె ముందుగా నెఱిఁగినవారగుటచే పోర్చుగీసులిండియాదేశమును 'ఈస్టిండియాద్వీపము' లనఁబడు సుమాత్రా జావా మొదలగు ద్వీపములను గనుఁగొని యచ్చటికివర్తకమును విరివిగా వ్యాపింపఁజేసి భాగ్యవంతులైరి. ఈ 1498సం॥లోనే కొలంబసను స్పానియా నావికుఁడమెరికాదేశమును 'వెస్టు ఇండియా దీవు' లనఁబడు దక్షిణపమెరికాకు నుత్తరమునన్న ద్వీపములను గనుఁగొని యుండుటచే స్పానియులు నానాటికీదేశమునుగూర్చి పూర్ణముగాఁ దెలిసికొని సామంత రాజ్యముల నేర్పఱచు



కొని వర్తకమువృద్ధిచేసి సంపన్నులైరి. పోర్చుగల్లునకు మూడుతట్టుల స్పానియాదేశము చుట్టియుండుటచేతను, దానికంటె స్పానియా మిగుల విరివిగలదగుటచేతను, 1580 సం॥ లో సామంతద్వీపములతో 'పోర్చుగల్లు' స్పానియాకులోఁబడెను. అంతట స్పానియావశమందున్న 'ఒలందురాష్ట్రము' లేడును మాతృదేశముతోఁ బోరాడి పైనిజెప్పిన విధమున విజయమునొందినవి. ఈ యొలందురాష్ట్రములకుత్తరపశ్చిమదిశలను సముద్రముచుట్టియుండుటచే నచటిప్రజలు నావిక నైపుణ్యమునకుఁ జిరతరముగాఁ బేరుపడియుండిరి. స్పానియాయధికారమునుండి విడివడి స్వాతంత్ర్యము నొందినతరువాత, స్పానియా యెడల స్పర్ధచే నాదేశపుసామంత భూములను జయింపసంకల్పించి అమెరికా మొదలగు స్పానియా సామంత రాజ్యములతోఁ బాటు స్పానియా వశమందున్న పోర్చుగల్లుయొక్క సామంత ద్వీపములనుగూడ 'ఒలందులు' స్వాధీనపఱచుకొనిరి. ఇట్టి యున్నతదశ పొందినకాలములోనే 'ఒలందులు' మనదేశమునకు వచ్చి కొన్నాళ్లు వర్తకముసాగించిరి. అందుచేఁ గొంతకాలము 'ఒలందుల' ప్రాభవము ప్రపంచమందంతట విక్రమించియున్నది. ఈ కాలమున నింగ్లాండుయొక్క విదేశప్రభావములేనేలేదు. ఎలిజబెత్తు కాలమునను యాంగ్ల నావికు లమెరికా మొదలగు దూరదేశములకు యాత్రలు చేయ నేర్చుకొనిరి. ఇంగ్లీషు నావికులు నానాటికిఁ బ్రబలినకొలఁది యొలందులతో నీటియుద్ధములు చేసి వారి ప్రాభవమును రూపుమాపి మనయాంగ్లేయులు నీటిమీఁద నజేయులైరి.

# అధ్యాయము. 10.

—:o:—

## ట్యూడరురాజుల కాలములోఁ బ్రజలయోగక్షేమములు.

———:o:———

ట్యూడరురాజులకుఁ బూర్వము పార్లమెంటుయొక్క యధికారము ప్రబలమై వారియనుమతిలేక రాజుక్రొత్తగ పన్నుకట్టఁ గూడదనియు నూతనశాసనములఁ జేయఁగూడదనియు, రాజునకు సహకారులుగనుండు మంత్రులపై నేరములను బార్లమెంటువారు విచారించి వారిని దండింపవచ్చువనియు స్థిరపడియుండెను. గులాబియుద్ధములో బారనులు(సామంతరాజులు) నశించిపోయిరి. మతాచార్యులు సంపదంధులై యుచితకృత్యములందుఁ బ్రమత్తులై యుండుటవలనఁ బ్రజానురాగమునకు దూరులైరి. అందుచే రాజునకును బ్రజలకును మధ్యవర్తులుగాఁ బూర్వము ప్రవర్తించుచువచ్చిన మతాచార్యులిప్పుడు రాజే దిక్కని నమ్ముకొనవలసిన వారైరి. పార్లమెంటులోని కామనుశాఖవారిని (సామాన్య జనప్రతినిధులు) నియమించుకొను సామాన్యజనమునకు గులాబియుద్ధముతో సంబంధము లేకపోవుటచే వారు వర్తకమును విరివిగా సాగించుకొని మిగుల సంపన్నులయిరికాని రాజుపైఁ బ్రతిఘటించి రాజ్యతంత్రమును నడపింప నలవాటుపడినవారు కాకపోవుటవలనను దేశమందలి యల్లరుల మాటుపఱిచి కృషివాణిజ్యముల కాటంకములేకుండ నేలినఁజాలునని రాజునే నమ్ముకొనియుండిరి. ఈ కారణములచే నిరంకుశముగ రాజ్యమేలుటకు 'ట్యూడరు' రాజుల కవకాశము గలిగెను. ఇట్లని వారు ప్రజాభయములేక బాధపెట్టియేలిరని తలఁపఁగూడదు. ఆంగ్లజనులు వీరపురుషులు. వీరు తిరుగఁబడినయెడలఁ గాపాడుకొనుటకు రక్షకసైన్యమైనను రాజునకాకాలములోలేదు. అందుచే 'ట్యూడరురాజు' లెంతకఠినముగను, జట్టములకు వ్యతిరేకముగను బనిచేసినను ప్రజాద్వేషము కనఁబడినతో



డనే వెనుకకు మరలుచుఁ బ్రజాస్వాతంత్ర్యమును గాపాడు[illegible]డిన నిబంధనములఁ నెన్నఁడు మీఱకుండ జాగరూకులై రాజ్యముచేసిరి. మఱియుఁ బార్లమెంటుయొక్క యధికారమును వీరు కాపాడుచుఁ బని[illegible]. గులాబియుద్ధములో లార్డుశాఖవారు చాలవఱకు నష్టమయినందున, ఆఱవ హెన్రీ కాలములోఁ బార్లమెంటునకు వచ్చిన లార్డులలో సగముమందియైన నేడవ హెన్రీయొక్క మొదటి పార్లమెంటులో లేకపోయిరి. హెన్రీ VII హెన్రీ VIII లకాలములో నురిశిక్షకుఁ బాత్రులై యాసగము మందిలోఁగూడ ననేకులు నశించిరి. మఠము లుద్వాసనముచేయఁబడుటచే, ఎనిమిదవ హెన్రీ కాలమునఁ బార్లమెంటులోని మతాధిపతు లంతరించిరి. అందుచేఁ బార్లమెంటులో మతప్రవర్తకుల సంఖ్య సన్నమై లౌకికులగు లార్డులసంఖ్య యధికమైనది. ఈ లౌకికులగు లార్డులు చాలవఱకు నశింపఁజేయఁబడిన మఠముల భూములను మాన్యములుగా రాజువలనఁ బొందినవారేయగుటచే వీరు రాజునకు భృత్యులైయుండిరి. వర్తకము విరివియయినకొలఁది పల్లెలు పట్టణములయి ప్రాముఖ్యత వహించుచు వచ్చినవి. ఈ నూతన పట్టణముల వారికి పార్లమెంటునకు సభ్యులను నియమించుకొను నధికారము క్రొత్తగరాజే యియ్యవలసివచ్చెను. రాజానుమతమును జెల్లించు పట్టణములకే యిట్టినియమన స్వాతంత్ర్యమునిచ్చుచు 'ట్యూడరు' రాజులాపట్టణములనుండివచ్చు 'కామనులను' గూడ వశమందుంచుకొనుచు వచ్చిరి. మఱియు వేల్సుమండలమును నెనిమిదవ హెన్రీ యాంగ్ల దేశమునకుఁ గలిపి, దానిని జిల్లాలుగ విభజించి, ఆ జిల్లాలవారికి ప్రతినిధి నియమనస్వాతంత్ర్యమునిచ్చి, తన యిష్టమును నెఱవేర్చు కామనులను వృద్ధిచేసికొనెను. మాన్యములిచ్చి లార్డులను, నియమన స్వాతంత్ర్యములిచ్చి కామనులను లోఁబఱచుకొని పార్లమెంటు మూలముననే ట్యూడరులు స్వేష్టానుసారముగ రాజ్యము చేయఁగలిగిరి. క్రొత్తగఁ బన్నుకట్టుటకుఁ బార్లమెంటునకేకాని రాజునకు స్వాతంత్ర్యములేదని స్థిరపడియున్న చట్టమును మీఱకుండ, యుద్ధములను మానుకొనుటవలనను, మితముగ వ్యయముచేసికొనుటవలనను, జట్టములు మీఱినవారికి గొప్పజుల్మానాలను

విధించుటవలనను, మఱియు నిట్టి చట్టమునకు విరుద్ధముకాని యితరసాధనములవలనను, రాజ్యము నడపుటయే కాక, సప్తమహెన్రీ విశేషధనమును గూడఁ బెట్టఁగలిగెను. ఎనిమిదవ హెన్రీ దూబరియై తండ్రి కూడఁబెట్టిన ధనమును వెచ్చించుటవలనఁ బార్లమెంటు వారిని ధనము కోరి యెంతో నిష్ఠురముమీఁదఁ బొందఁగలిగెను. మఱియొకతఱిఁ బ్రతిమనుష్యునకు నున్న స్వస్వ మింతయని నిర్ధారణము చేయించి, అందుఁగొంతపాలు తనకిమ్మని కోరఁగాఁ బ్రజలు తిరుగఁబడిరి. అందుచే నతఁడు తన ప్రయత్నమును మానుకోవలసివచ్చెను. భాగ్యవంతునివలనఁగానుకగా ధనము చేపట్టు నాచారము నాలవఎడ్వర్డు నెలకొల్పఁగా, మూఁడవరిచార్డు కాలములో నదిచట్టమునకు విరుద్ధమని రద్దుపఱుపఁబడెను. మూఁడవరిచార్డు వంశపరంపరాధికారముచే రాజ్యమునకు వచ్చినవాఁడు కాఁడు గనుక నాల్గవయెడ్వర్డుయొక్క శాసనమును రద్దుచేయుటకాతని కధికారము లేదని మిషపెట్టి సప్తమ హెన్రీయును, నాతని కుమారుఁడును ధనవంతులఁ బిలిపించి ధనమిమ్మని కోరి, యీయనివారిని గారాగృహమునకుఁ బంపుచువచ్చిరి. ఇంతియె కాక యెనిమిదవ హెన్రి సంపన్నులవలన ఋణమని పేరుపెట్టి బలవంతముగ సొమ్ము పుచ్చుకొని రాజుగారికిచ్చిన ఋణములు మరలఁ బుచ్చుకొనఁగూడదనియు, నట్లు పుచ్చుకొన్నవారు తిరుగ రాజుగారికిచ్చివేయవలెననియు, రెండుసారులు చట్టములనుగూడఁ జేయించెను. ఎలిజబెత్తు కూడ నప్పుడప్పుడిట్టి ఋణములఁ బుచ్చుకొనుచువచ్చెనుగాని, అసలుసొమ్ము మాత్రము తిరుగ నిచ్చుచు వడ్డికి బదులు బిరుదుల నొసఁగుచు, సన్మానవచనములతో సంతోషపెట్టుచు ఋణదాతలఁ దృప్తి చేయుచువచ్చెను. ఇతరదేశములనుండి దిగుమతియగు వర్తకపుసామగ్రిమీఁదఁ బన్నుకట్టుటకుఁ బార్లమెంటువారి యడ్డములేకపోవుటచే, రాజు వానిపైఁ బన్నుకట్టెను. ఇంతియ కాక గులాబి యుద్ధములు ముగిసినతోడనే ప్రతికక్షులోని బారనులజమీలేడవ హెన్రీకి నిరతము లుద్వాసనము చేయఁబడుటచే మఠమాన్యము లెనిమిదవ హెన్రీకిని, చేరినందున వాని విక్రయమువలన వీరికి ధనము సమకూడినది, అందుచేఁ జట్టములచే విధించిన చొప్పున నియమితసమయములందుఁ బార్లమెంటుసభను సమకూర్చకయే



ట్యూడరురాజులు పాలించఁగలిగిరి. ఏడవహెన్రీయొక్క కడపటి యయిదు సంవత్సరముల రాజ్యములో నొకసారియయిన పార్లమెంటును బిలువలేదు. 1523-1529 సం-వఱకుఁ బార్లమెంటులేకయే యెనిమిదవ హెన్రీ రాజ్యము చేసెను. ఎలిజబెత్తుకూడ నొకతఱి నయిదుసంవత్సరములు పార్లమెంటును గూర్చ నక్కఱలేకుండ గడపుకొనెను.

పార్లమెంటువారి యనుమతిలేకుండ రాజు క్రొత్తచట్టములఁ జేయఁగూడదను చట్టమును ట్యూడరులు మీఱలేదు కాని, రాజాజ్ఞలను పేరుపెట్టి యిచ్చవచ్చినట్లు నిబంధనములను (ordinances) బ్రకటించుచు వచ్చిరి. ఈ యాజ్ఞలే చట్టములవలె నమలుజరుగవలెనని 1539 సం॥ లో నెనిమిదవహెన్రీ యొకశాసనమును జేయించుకొనెను గాని, ఆఱవ ఎడ్వర్డు కాలములో నీశాసనము రద్దుపఱుపఁబడెను. ఐనను నాఱవయెడ్వర్డు కాలములోఁ బనిచేసినమంత్రులిట్టినిబంధనములను బ్రకటనము చేయుటమానలేదు. ఇట్లే మేరీయును, ఎలిజబెత్తునుగూడ నిబంధనములను బ్రకటించిరి. ఇట్టినిబంధనములలో నొకదాని నిచట వివరింప ముచ్చటయగుచున్నది. లండనుపట్టణమునందు మాత్రము ముద్రాయంత్రముండవలెననియు నచ్చుపడు పుస్తకములు కాంటరిబరి ప్రధానాచార్యుడును, లండనుమరీపును, అంగీకరించినఁగాని ప్రకటింపఁబడఁగూడదనియు నాఱునెలలోన నేర్పడిన ముద్రాయంత్రములు తీసివేయఁబడవలెననియు నింతయగు నొక నిబంధనము యెలిజబెత్తుకాలములో వెలువడినది.

రాజమంత్రులు రాజువలననే నియమింపఁబడిన వారగుటను బట్టి యీట్యూడరుల కాలములో రాజువలననే శిక్షింపబడుచు వచ్చిరికాని వారిపైఁ బార్లమెంటువారికట్టి యధికారము లేకపోయెను. రాజాజ్ఞల నమలుజరుపుటకుఁ బ్రీవీకౌన్సిలు ముఖ్యసాధనము. నార్మనురాజుల కాలమునుండియు నొక మంత్రిమండలమువారి సహాయము చేతనే రాజ్యము నడచుచు వచ్చినది. రాజవంశమువారును, బంధువులును, విశేషోద్యోగస్థులును, రాజునకాంత

రంగిక మితులును, యీప్రివీకౌన్సిలులోఁ గూడుచుండిరి. నార్మనుల ప్రభుత్వమునుగూర్చి వ్రాసినపుడు, ఈకౌన్సిలునే 'రాజుగారికోర్టు' (Curia Regis) అనివివరించియున్నాము. క్రొత్తచట్టములను జేయుటకును, పన్నులుకట్టుటకును, న్యాయవిచారణము చేయుటకును వీరే దక్షులై యుండిరి. పదమూఁడు పదునాలుగు శతాబ్దములందు న్యాయవిచారణనిమిత్తము క్రొత్తగఁగోర్టులు స్థాపింపఁబడినవి. ఆకాలమునందే శాసననిర్మాణమునకును, పన్నులుకట్టుటకును సర్వాధికారమును వహించినపార్లమెంటుసభ యేర్పడినది. అందుచేఁబూర్వపు 'రాజుగారికోర్టు' నశించినదని చెప్పవచ్చును గాని, చట్టముల నడపుటకు రాజే ప్రధానాధికారియై యుండుటచేత, నందు నిమిత్తమాతని కాలోచనము చెప్పుచు నడపువారిసభయొకటి కావలసి వచ్చినది. అందుచేతనే 16 వ శతాబ్దమువఱకును విశేషరాజకీయోద్యోగులును కొందఱుబారనులును, మఠాధిపతులునుగూడి 'రాజుగారికోర్టు' అను పేరుతో మంత్రిత్వము నడపుచుండిరి. ఈకోర్టునకే 15 వ శతాబ్దమందు ప్రీవీకౌన్సిలను పేరువచ్చినది. ప్రాయికముగ రాజ్యతంత్రమును నడపుటయందుసర్వాధికారము వీరిచేతియందేయున్నది. ఈకౌన్సిలునకు సభ్యులనేర్పఱచియు న్యాయముగను, చట్టములమీఱకుండగను, ప్రవర్తింపఁ బ్రమాణములఁ జేయించియు వారికి జీతములనిచ్చియు, వారుచేయవలసిన పనికిఁదగు కట్టుబాటుల నేర్పఱచియు వారిని తమవశమందుంచుకొనుట కనేక విధముల పార్లమెంటువారు ప్రయత్నములు చేసిరి. గులాబియుద్ధమునకుఁ బూర్వము బారనుల ప్రాభవము మిక్కుటమై యుండుటచే, ప్రీవికౌన్సిలువారు స్వతంత్రులై రాజులకు లొంగక ప్రతిఘటించుచువచ్చిరి. ఆయుద్ధములో బారనులునశించుటచేతను మఠము లుద్వాసనము చేయఁబడినపిమ్మట మఠాధిపతు లంతరించుటచేతను, రాజానుగ్రహమును సంపాదించుకొని ముందుకు రావలెనని యత్నించు కామనులు ట్యూడరులకాలములో ప్రీవీకౌన్సిలు సభ్యులుగ నుండుటచేతను, ఈకాలపు కౌన్సిలువారు రాజునకులోఁబడి నడచుకొనువారై యుండిరి. అందుచేరాజీసభవారిలో నిరంకుశుఁడై విశేషరాజకార్యములు వచ్చినప్పుడు



తనయిష్టమును సాగించుకొనుచుండెను. పార్లమెంటులో విచారింపఁబడుబిల్లులనుగూర్చియు దొరతనమువా రవలంబించవలసిన రాజ్యపద్ధతినిగూర్చియుఁ గ్రిందియుద్యోగస్థులఁ యుచితపరివర్తనముల గూర్చియు, నీకౌన్సిలువారే పని గలిగియుండిరి. న్యాయనిర్ణయము చేయుటకు రాజేముఖ్యాధికారియనియాంగ్ల రాజనీతిలోఁ జిరతరముగా స్థిరపడిన సిద్ధాంతాంశమైయుండెను. రాజ్యమందలి కోర్టులన్నిఁటికి నధికారమిచ్చినవాఁడు రాజే. చట్టములో నిర్ణయింపఁబడనిక్రొత్త నేరము జరిగినప్పుడు రాజే నిర్ణయము చేయవలెను. బలాధికులై సామాన్యపుకోర్టులకు లొంగని ముష్కరులగు జమీదారులను ప్రీవీకౌన్సిలులో విచారించి, ట్యూడరు రాజులు లోఁబఱచుకొనఁగలిగిరి. సామాన్యపుకోర్టులలో జడ్జీలిష్టమువచ్చినట్లు తీర్పుచెప్పి ప్రజలను బాధించకుండఁ దగిననిబంధనము లేర్పఱచఁబడెను. ప్రీవీకౌన్సిలు వారినట్టినిబంధనము లడ్డుపెట్టవుగనుక సామాన్యపుకోర్టులలో దండితులుకారని తోఁచినవారిని ప్రీవీకౌన్సిలువారు విచారించి, రాజ్యమునందలి యల్లరుల నణఁచఁగలిగిరి. అందుచేతనే వీరికాలములోఁ బ్రబలిన మతవిషయికములగు పోరాటములలో రాజుపైఁదిరుగఁబాటు లేకుండఁ గాలముగడచినది.

గ్రామసభలును, శతకూటములను, ట్యూడరులకాలములలో నంతరించినవి. ట్యూడరులకుఁ బూర్వము మండలసభలో న్యాయవిచారణము చేయుచువచ్చిన షరీఫుపేరికాలములో మండలసేనానాయకుఁడై యాతనికి "షరీఫు" అను పేరుపోయి, 'లార్డులూటినెంటు' అను పేరువచ్చినది. మండలసభవారి స్థానమున సంచారపుజడ్జీలువెలసి పార్లమెంటునకు సభ్యులను నియమించుటకుఁ దగుప్రయత్నములజేయుచుఁ మండలవ్యవహారములను జక్కఁబెట్టుచువచ్చిరి. పార్లమెంటునకు సభ్యులనుగోరుకొను నధికారముపూర్వము పట్టణవాసులలో కొందఱికియ్యబడినది. నానాటికీ పట్టణములు విరివియైవృద్ధిపొందినను ప్రతినిధి నియమనస్వాతంత్ర్యము పూర్వమట్టి యధికారము గలవారియందేనిలిచియున్నది. అందుచే విశేష జనసంకులములైన పట్టణములయందుఁ గొద్దిమందికే 1835 సంవత్సరమువఱకుఁ బార్లమెంటుతోడను మునిసిపలు వ్యవహారములతోడను సంబంధము కలిగియున్నది.

లౌకిక వ్యవహారములలో ట్యూడరురాజులు రాజకీయపూర్వాచారములను, పూర్వరాజులకాలములో స్థిరపడినచట్టములకును గట్టుపడినడచుకొనిరి. కాని, మతవిషయమందు పోపునకుండు సంబంధమును వీరుతొలగించుటవలన నాతని నిరంకుశాధికారమంతయు వీరిపరమయ్యెను. ఆంజవవంశరాజులకాలములో 'పోపు' యొక్క ప్రమేయము బలముగానుండుటచే మతాచార్యులను వశపఱచుకొనుటకు రాజులుపలుసారులు ప్రయత్నములుచేసి విఫలులైరి. ట్యూడరులకిమ్మట రాజ్యమునకువచ్చిన స్టూవర్టురాజులందఱు కాథొలిక్కుమతమందుఁ గొంతయభిమానముగలవారగుటచేమతాచార్యులనుగౌరవించుచువచ్చిరి. ఎనిమిదవహెన్రియును, ఎలిజబెత్తును, ఆంగ్లికాన ప్రధానాచార్యులను దామే నియమించినవారగుటచేవారిని లౌకికరాజకీయోద్యోగస్థులవలెనే దండించుచు, నుద్యోగమునుండితొలగించుచువచ్చిరి. మతవిషయములైన కక్షలలోదేనియందును వారికి దురభిమానము లేనందున కాథొలిక్కులనియు ప్రొటెస్టెంటులనియు వ్యత్యాసముచూడక రాజప్రతిష్ఠితమైన యారాధనపద్ధతికి వ్యతిరేకించిన వారినిరాజాజ్ఞనెఱవేఱునట్లు కాపాడుటకై క్రూరదండనము పాలుచేయుచుండిరి. వీరికాలములోఁ బ్రజాబాహుళ్యమునకుఁ బ్రాచీనమతవిషయమునఁగాని నూతనమతవిషయమునఁగానిస్థిరవిశ్వాసములేదు- పోపుయొక్క విదేశాధికారమునుతొలగించుకొనుటకేవారికిఁబట్టుదలయుండెను. ప్రజలకేదో యొకమతమందు స్థిరబుద్ధియున్నయెడల, నీప్రభువులుకూడ నామతమునే కాపాడియుందురు. అందుచేఁ బ్రాచీన మతమునుగాని నూతనమతమునుగాని పూర్ణముగఁజేపట్టక మధ్యమార్గము నవలంబించి ప్రజానురాగమునుగూడఁ గట్టుకొనికేవలనూతనమార్గమునం దభిమానముగల ప్యూరిటనులనుదండించుటకు వీరి కవకాశముగలిగినది. ఎలిజబెత్తుయొక్క మంత్రులుకొందఱు ప్యూరిటనుల మతమం దభిమానముగలవారగుటచేఁ గొంతకాలమువీరికి బాధకలుగలేదు కాని ప్యూరిటనులకుఁ బ్రతిపక్షుఁడొకఁడు 1583 సం॥లో 'కాంటరుబరి' ప్రధానాచార్యపదవికి వచ్చిననాటనుండియు రాజప్రతిష్ఠిత మతమునకు భిన్నాభిప్రాయులగువారిని దండించుటకేర్పడిన హైకమీషనుకోర్టువ్యవహారములన 'ప్యూరిటనులు' చిరకాలము పడరాని బాధలపాలైరి.



ఎనిమిదవహెన్రీ కాలములో మఠమాన్యములను విక్రయముపొంది లార్డులైనవారు ట్యూడరురాజుల యంతిమదినములనాటికి ఐశ్వర్యమునందును, ఘనతయందును, వ్యవహారనిర్వాహక పాటవమునందునువృద్ధినొందిరి. గులాబి యుద్ధమునకుఁబూర్వముండిన బారనుకుటుంబములతో నీనూతనలార్డుల వివాహ సంబంధములఁ జేసికొని యౌన్నత్యమును, ధనికులగు వర్తకులతో వియ్యమంది సంపదనుఁబొందిరి. గులాబియుద్ధములో నంతరించిన బారనులవలె వీరు మొఱటు బంటులుకాక రాజభక్తిగల నాగరికులు. మఱియుఁ బ్రజాస్వాతంత్ర్యమును పార్లమెంటు మూలమునఁ గాపాడుకొనుటకు సమర్థతలేక రాజునకు లొంగియుండినకామనులవలెఁగాక, ఈనూతనపులార్డులు పార్లమెంటును బలపఱచి రాజుయొక్క నిరంకుశాధికారమును సాగనీయక ప్రజల స్వాతంత్ర్యమును బలపఱుప సమర్థులు. ముద్రాయంత్రములు వెడలి గ్రంథరాజములలో గప్పపడియున్న జ్ఞానధనము దేశమున నాబాలగోపాలము నావరించుటచేతను, రాజువలని యదటును బాపి రక్షింపఁగలపోపునకు దేశమునం దధికారము తొలగుటచేతను, జీవనాధారమగు మఠమాన్యములు దివాణము పాలగుటచేతను, మోక్షసామ్రాజ్యమునకుఁబురోహితులే ప్రధానసోపానములనియెంచెడు మూఢసిద్ధాంతములు కల్లలని జనసామాన్యమునకు బోధపడుటచేతను, పూర్వము లార్డులవలె రాజునకులొంగక వేఱుతెగవారైయున్న మతాచార్యులు ట్యూడరులకాలములో 'దాసోహ' మనవలసినవారై పార్లమెంటులోని పూర్వపు ప్రాముఖ్యతను గోలుపోయిరి. ఏడవహెన్రీ రాజ్యమునకు వచ్చిననాటికంటె కామనులు సంపన్నులును బలాఢ్యులునైరి. వర్తకము, (ఇండస్ట్రి) మొదలగుధనాకర్షణవృత్తులు పెంపొందినవి. ఎలిజబెత్తుకాలములోఁ బ్రజలయైశ్వర్యము మిన్నుముట్టినది. ముద్రాయంత్రములవలనను, విరివిగా వెలసిన పాఠశాలలవలనను, సాహిత్యగ్రంథవిజృంభణముచేతను బ్రజలయందు జ్ఞానాభివృద్ధియైనది. నావికయాత్రలకు జనులలవాటుపడి విదేశవర్తకము వృద్ధిచేయుటవలనను స్వదేశ స్వజాత్యభిమానములు జనులయందుఁ బాదుకొని విదేశ సంసర్గమును దొలగించుకొను సంకల్పము వృద్ధియై తమప్రయత్నములు

కొనసాగుటవలనను, ప్రజలకు ధైర్యస్థైర్యములు పెరిగి స్వశక్తిగౌరవము హెచ్చెను. ప్రాచీనమతము మూఢసిద్ధాంత దూషితమనియు, బైబిలులోని సత్య సిద్ధాంతములే యాచరణీయములనియు నొకదృఢ విశ్వాసము ప్రజా బాహుళ్యమునందు వేళ్లుపారి యుండుటచే, కామనులు పూర్వమువలె లార్డులకును, మతాచార్యులకును భృత్యులై యుండక స్వతంత్రముగ వ్యవహరించుకొను సామర్థ్యము గలవారై పార్లమెంటులో బలవంతులైరి.



# అధ్యాయము 11

—:o:—

## నిరంకుశప్రభుత్వమునకును పార్లమెంటునకును పోరాటము.

1603–1630.

—:o:—

ట్యూడరు రాజుల యనంతరము రాజ్యముచేసిన యాఱుగురురాజులును స్టూవర్టు వంశమువారు. గులాబి యుద్ధముల కాలమున దేశమునఁబుట్టిన కల్లోలములవలన నింటిపోరొకవంకను విదేశరాజుల దాడి మఱియొకవంకను ప్రబలి యున్నందున నప్పుడు రాజ్యము చేసిన ట్యూడరు రాజులు కాలగతిని బట్టి పార్లమెంటుయొక్క యధికారమును గొంతవఱకుఁ గ్రిందుపఱచి యొక కొంత నిరంకుశాధికారమును నెరపిరి. దేశమందలి కలవరము మాటుపడి కాలగతి మారిన కాలమందుఁగూడ స్టూవర్టు ప్రభువులు ట్యూడరులవలె నిరంకుశముగ రాజ్యముచేయ నుద్యమించిన వారయినందున నీయాఱ్వుర రాజరికమును బ్రజలతోడి పోరాటములతోఁ గడచి, తుదకుఁ బ్రజాప్రభుత్వము స్థిరపడుటకుఁ గారణమయ్యెను.

మొదటి జేమ్సు స్టూవర్టు రాజులలోఁ బ్రథముఁడు. ఈతఁడు1703 సం॥ లో రాజ్యభారము పూనినప్పుడు ప్రజలయందు మతాంతర సహనములేక రాజుపట్టినపక్షమే సత్యసమ్మతమనుకొను మూఢప్రతిజ్ఞ వేళ్లుపాఱియుండెను. ఒక్కరాజు నేలుబడిలోనున్న ప్రజలంద ఱా రాజసన్మాన్యమతమునే యవలంబించ వలసి యుండెను. 1559 సం॥లో వెలువడిన చట్టముచొప్పున రాజుచే స్థిరీకరింపఁబడిన యుపాసనగ్రంథపద్ధతినే దేశమంతయు నవలంబింపవలెను గాని తలుపులు మూసికొని యేకాంతస్థలమునందయిన నన్యపద్ధతి నీశ్వరు ను పాసింపరాదు.

రాజదండనమిట్లిచ్ఛాప్రవృత్తికిఁ బ్రతిఘటించుటవలన ప్రొటెస్టెంటు మతాభిమానియగు ఎలిజబెత్తు నెలకొల్పిన నూతన మతము కూడ బైబిలులో నిర్ణీతమైన సిద్ధాంతములకు వ్యతిరేకముగఁ గొంతకర్మ కాండ కవకాశమిచ్చు చున్నదని యెంచి యందునకు సమ్మతింపక విమతులగు ప్యూరిటను తెగవారొ కరు వెలసిరని చదివియున్నాము. ఈప్యూరిటనులు సత్ప్రవర్తకులును, అగాధభక్తి మహితులును, ఈశ్వర సేవకొఱకు జీవితమును ధారవోయు వారు నగుటచే ఎలిజబెత్తు మతమునందుఁ ప్రజలకు వీడని నమ్మకమున్నను, ఏదోయొకవిధమున ప్యూరిటనులను రాజు కూడఁ గట్టవలెనని జనులుకోరియుం డిరి. తానేర్పఱచిన కర్మకాండనొల్లని ప్యూరిటనులు తనచేఁ బాలింపఁ బడుచున్న దేవాలయములలో నాచార్యపదవియందుండఁగూడదని శాసించి, ఎలిజబెత్తుప్యూరిటనులను వెలిపెట్టెను. కాఁబట్టి మొదటిజేమ్సు రాజ్యమునకు వచ్చి, ప్యూరిటనులను యథాస్థానములకుఁ బిలిపించునని ప్రజలు కొండంత యాశఁ బెట్టుకొనియుండిరి. ఆంగ్లరాజ్య పదవికి వచ్చునప్పటికే జేమ్సు స్కాట్లండున రాజ్యము చేయుచుండెను. ఎలిజబెత్తువలన నురిశిక్షకుఁ బాలైన మేరికి నీతడు కొమారుఁడును, ఎనిమిదవ హెన్రికి దోబుట్టువగు మార్గరెట్టునకుఁ బ్రపౌత్రుడునై యుండుటచే, ఆంగ్లస్కాట్లండు దేశములీతని మూలమున నేకఛత్రాధిపత్యమునకు వచ్చినవయ్యెను. కాని చట్టములును, మతప్రచారమును, పార్లమెంటును, వేర్వేఱుగనే యుండుచు వచ్చినవి.

ఈతఁడువిద్యాధికుఁడును సువక్తయునగును గాని, స్వలాభాసక్తుడును పిఱికిపందయుఁగావునీత డేపని చేసినను దేశముయొక్క క్షేమమునాలోచించక స్వప్రయోజనమునే పాటిగాఁబట్టి వ్యవహరించెను. స్కాట్లండులోని దేవస్థానములయందిదివఱకే ప్యూరిటనుల యభిమతానుసారముగ నారాధనపద్ధతి స్థిరపడి ధర్మకర్తృత్వమొక్క ప్రధానాచార్యునిచేతిలో నుండక కొందఱు మతాచార్యులు కూడియున్న పరిషదుల యాజమాన్యముక్రింద నడచుచుం డెను. ఆంగ్ల దేవళములందట్లుకాక రాజనియతులయిన ప్రధానాచార్యులే



ధర్మకర్తలైయుండుటచే, ప్యూరిటనుల యిష్టముసాగనిచ్చినయెడల స్కాట్లం డునందు వలెనే యింగ్లాండునఁగూడ పరిషదులేర్పడి రాజానుమతమును లక్ష్యపెట్టక స్వేష్టాను వర్తనములకు దిగుదురని రాజునకు భయము కలిగెను. అందుచే ప్యూరిటనుల మొఱాలించుట కవకాశమిచ్చి రాజు సభజేసినను, 1604 సం॥లో పార్లమెంటువారిని మతవ్యవహారములందు జోక్యముపుచ్చుకో నియ్యక ప్యూరిటనులను మఱింత బహిష్కారము చేయుటకు మతాచార్యుల కుత్తరువు చేసెను. పార్లమెంటునకును రాజునకును బ్రబలిన వైరమునకు నీ ప్యూరిటను ప్రమేయము ప్రధమమున నంకురార్పణము చేసెను.

ఇఁక 'కాథొలిక్కులను' గూర్చి కొంత ముచ్చటింపవలసి యున్నది. ఎలిజబెత్తు ప్రాణములఁదీయుటకు వీరు యత్నించి యుండుటచేతను దేశ మందలి మతవ్యవహారముల విషయమున పోపే సర్వాధికారియను పట్టుదల వీరికి స్థిరపడి యుండుటచేతను, ప్రజాబాహుళ్యమునకును పార్లమెంటు వారికిని వీరిపైననురాగము సడలియుండెను. అందుచే ఎలిజబెత్తు కాలమున నొకటి వెనుకనొకటి కాథొలిక్కులకు బాధకముగ శాసనములు చేయఁబడెను. కొందఱు రాణికిఁ బ్రతిఘటించియుండినను కాథొలిక్కులెక్కువమందియామె యెడలఁ బ్రభుభక్తితో నుండుటఁ దలపోసి జేమ్సువారియెడఁ గృపఁజూపిన యెడ రాజభక్తి వీడరనినమ్మి చట్టముల నమలు జరుపక దినములు గడుపవలెనని తలపెట్టి యుండెనుగాని పార్లమెంటు భవనము క్రిందిగదులలోఁ దుపాకి మందుజేర్చి, రాజుతోఁగూడ పార్లమెంటు సభవారందఱు పరశురామప్రీతి యగునట్లు చిచ్చుముట్టింపఁ దలపెట్టి పాటుపడుచున్న కాథొలిక్కుల కుతంత్రమొకటి 1605సం॥లో బయలుపడెను. దుస్సంకల్పులగు నీ యాతతాయినుల సంఖ్య పదునేనుగురికంటె నధికముగ లేకున్నను, వీరి టకటొంకు తనమువలన, కాథొలిక్కులు మఱింత క్రూరశాసనముల పాలైదుర్గతినొందిరి.

జేమ్సు రాజ్యతంత్రమును బూనునప్పటికి స్పానియా రాజుతో వైరము ప్రబలియుండెను. ప్రొటెస్టంటులు కాథొలిక్కులను వివక్షత లేకుండ నందఱు

రాజులును బరస్పర వైరములు వీడి స్నేహమున నుండవలెనని కోరినవాఁడగుటచే జేమ్సు రాజ్యమునకు వచ్చినతోడనే స్పానియా ప్రభువుతో సంధిఁగూర్చుకొని తన కొమారుని నారాజపుత్త్రికతో వివాహము చేయుటకు మంతనముల నడపెను. ఇట్టివియ్యమొడఁగూడిన యెడల నైరోపా ఖండమందలి మతవైరములను మాటుపఱచవచ్చునని జేమ్సు తలచియుండెను. కాథొలిక్కు ప్రభువులకెల్ల స్పానియారా జధిరాజయి యుండుటచే నీపరిణయాపేక్షచే నైన నాంగ్లకాథొలిక్కులను జేమ్సు కొంతయాదరింపవచ్చునని తలంచి స్పానియాప్రభువు వివాహప్రరాయబారములను నడువనిచ్చెను గాని, యీ దాంపత్యమునకు మాత్ర మాతఁడంతరంగమున నొడఁబడినవాఁడు కాఁడు. అతని యింగితము నెఱుఁగక జేమ్సు పెడత్రోవనుండి జనకంటకముగ వ్యవహరించుచుఁ బ్రజలతో వైరము పెంచుకొనెను. ఇంతియకాక మొదటనుండియు స్పానియాతోడి సఖ్యము గాని, ఆరాజుతోడి వియ్యముఁ గాని ప్రజలకిష్టము లేకుండెను.

ఈ తరుణమున దక్షిణ యమెరికాలోని ప్రాగ్భాములయందు బంగారు గనులున్నవని రాజునకుఁ దెలిసి, అది స్పానియా రాజునకు సామంతదేశమగుటచే స్పానియులతోఁ బోరాటము లేకుండ బంగారము తెండని నియమించి రాజు కొందఱు నావికుల నచటికిఁ బంపెను. స్పానియులతోఁ బోరాటము లేకుండ నీయుద్యమము కొనసాగదని యెఱిఁగినవారయ్యును, రాజు ఋణగ్రస్తుఁడై యున్నందున బంగారమును జూచినతోడనే క్షమింపకపోఁడను నమ్మకముతో నీనావికులచటికిఁబోయి స్పానియులతో మిక్కుటముగఁబోరి తుదకు విఫలమనోరథులై స్వదేశమునకుఁ జేరికొనిరి. ఈ నావికుల చేష్టలవలన స్పానియా రాజునకు నింగ్లాండుపై ద్వేషము పట్టకుండఁ జేయుటకై వీరి నాయకుఁడైన ప్రఖ్యాత వీరాగ్రేసరుని జేమ్సురిదీయించి జన విద్వేషమునకుఁ బాత్రుఁడయ్యెను.



జేమ్సుకూఁతురొక జర్మను మండలాధిపతిని వివాహమాడెను. ఈతఁడు నూతన మతాభిమాని. ఈమండలమునకు సమీపముననున్న మఱియొక మండలమువారు ప్రొటెస్టంటు మతాభిమానులగుటవలన, తమకిప్పుడధిపతిగనున్న కాథొలిక్కు ప్రభువును వెడలనడచి జేమ్సుయొక్క జామాతనధిపతిగా నేర్పఱచుకొనిరి. ఇట్లు బహిష్కరింపఁబడిన ప్రభువు జర్మనుదేశమునకుఁ జక్రవర్తియు, స్పానియా రాజునకు బంధువును నగుటచే సామంతుఁడై జేమ్సునల్లుని బదభ్రష్టుఁ జేసెను. మనరాజు స్పానియారాజు సహాయమునుఁ గోరి యల్లుని యాపదను దొలగింపఁ బాటుపడెను గాని యాతఁడు శుష్కప్రియవచనములతో సరిపెట్టెను. ఆంగ్లప్రజలు మఱింత రాజవిద్వేషులై స్పానియా రాజుతో వియ్యమునకు నీరువదలి, స్వదేశగౌరవమును గాపాడి, జనకంటకులగు కాథొలిక్కుల పైచట్టముల నమలుజరుపుమని పట్టుపట్టి రాజును నిర్బంధించిరి.

ఇట్లు పార్లమెంటువారును రాజును, ప్యూరిటనులను గుఱించియు కాథొలిక్కులను గురించియు, స్పానియా రాజుతోడి వియ్యమును గుఱించియు భిన్నాభిప్రాయులై ప్రతికక్షులఁ దగిలి యుండిరి. వీరి బలాబలములను బట్టి పంతము నెరవేరవలసియున్నది. అందుచే నుభయుల సామంతమును గూర్చి యిచట విచారించవలసి యున్నది.

వర్తమాన రాజ్యపద్ధతి చొప్పున పార్లమెంటువారి మనసునకు వచ్చినవానినే రాజు మంత్త్రిపదమునకు నియమించుకొనవలసి యున్నది. కామనుల యభిమతము ననుసరించియే యామంత్త్రి రాజ్యతంత్త్రమును నడపవలసియున్నది. జేమ్సుకాలమున నట్లుకాక రాజున కిష్టమైనవాఁడే మంత్త్రిత్వమునకు వచ్చుచుండెను. అతఁడు పార్లమెంటువారియిష్టానిష్టములను లక్ష్యపెట్టక రాజాను మతమును జెల్లింపవలెను. తానుతలపెట్టినపనిని పార్లమెంటువారికి బోధపఱచుట కాని, వత్సరమున కొకసారి పార్లమెంటు సభ చేయుట కాని, ఇప్పటివలె నాతనికి విధిలేదు. అందుచే రాజునకు కామనులు ప్రతిబంధకముగ నడవలేరు. ఐనను, పార్లమెంటు సమ్మతినొందకుండఁ గ్రొత్త చట్టములు చేయుటకుఁ గాని

కొత్తపన్నులఁగట్టుటకుఁ గాని, స్థిరపడినచట్టములకు వ్యతిరేకముగ వ్యవహరించుటకుఁగాని రాజునకు స్వతంత్రము లేకుండుటవలన, రాజుచేష్టలను బ్రతిఘటించుటకు కామనులకుఁగూడ కొంత యవకాశము లేకపోవుటలేదు. రాజునకు ధనము పార్లమెంటువారే యియ్యవలసి యుండుటచే, ఇష్టమున్నను, లేకున్నను పార్లమెంటు సభ చేయక తప్పదు. ఈకాలమున పార్లమెంటులో కామనుశాఖవారి ప్రాభవమే హెచ్చుగానున్నదని యిదివఱకే చెప్పఁబడినది. కాఁబట్టి కామనుల మతానుసారముగ రాజును, రాజు మతానుసారముగ కామనులును నడచుకొనవలసిన కాలమువచ్చినది. కాని, స్టూవర్టురాజులార్వురును పార్లమెంటువారి ప్రమేయము నొల్లనివారగుటచే నెనుబదివత్సరములవఱకు జిగీషతోనిరువురును బోరాటము జరుపుకొనిరి.

రాజ్యపద్ధతిలోఁ గనఁబడినలోపములన్నిఁటిని సవరింపుమని కామనులు రాజును గోరుచువచ్చిరి. అతఁడందున కొడఁబడనినాఁ డాతనికి ధనమియ్యక నిరాకరించుచు వచ్చిరి. అందుచే పార్లమెంటు సభ తఱచుగఁ జేయుట కాతఁడిష్టపడక, వారితో నిమిత్తము లేకుండగనే ధనాకర్షణము చేయుటకు మార్గములను వెదుకుచువచ్చెను. ఎలిజబెత్తు కూడ నిట్లు ధనస్వీకారము చేసియున్నదిగాని, ఆమె దుర్వ్యయము చేయదను దృఢవిశ్వాస మామెయెడఁ బ్రజలకు నిలచియుండుటచే నామెపయి ద్వేషము కలుగలేదు. జేమ్సుయెడ నట్టి నమ్మకము ప్రజలకులేనందున పార్లమెంటుసభ కూడినప్పుడెల్ల రాజుతో ననహనము బలమగుచు వచ్చెను. లంచము, సురాపానము మొదలగు చెడునడతలు బహిరంగముగా రాజసభలో జరుగుచున్నప్పుడా రాజుపైఁ బ్రజానురాగ మెట్లుండును? రాజమంత్రియొకఁడు రాజుగారి హైకోర్టులో చాన్సెలరు జడ్జిగానుండి కక్షిదారులయొద్ద ధనరూపముగఁ గానుకలను స్వీకరించుచు రాఁగా, కామనుశాఖవారభియోగకులుగానుండి లార్డ్సుశాఖవారియెదుట నామంత్రిపై లంచపు నేరము మోపి విచారణము చేయించి దండనపాత్రుని జేసిరి. దోషష్ఠులగు రాజమంత్రులువిశృంఖలముగఁబోకుండ వారని పార్లమెంటు



వారు దండించు సదాచారము స్థిరపడుటకు దారిదీసిన ప్రయత్నములలో నిదియే మొదటిది.

స్పానియతోడి వియ్య పడియాన యింకను దృఢముగ నుండుటచే యువరాజగు చార్లసునకు మంత్రిని సాయమిచ్చి యాతనిని స్పానియాదేశమునకు రాజుపంపెను. ఆంగ్లకాథొలిక్కులపైని జట్టములను రద్దుచేయవలెననియు నందునకు బంధకముగా వివాహానంతరము వధు వొకసంవత్సరకాలము స్పానియాలో వాసముచేయవలెననియు నిందున కొడఁబడనిపక్షమున వివాహము జరుగఁగూడదనియు స్పానియులు నిబంధన లేర్పఱిచినందున విఫలమనోరథుఁడై యువరాజుతిరిగివచ్చెను. ప్రాన్సు, డెన్మార్కు ఒలందుదేశాధీశులతో సఖ్యము గూర్చుకొని స్పానియాకు బుద్ధిచెప్పి జర్మను రాష్ట్రముపై దండెత్తి పద భ్రష్టుఁడైన బావమఱది కాతని స్వమండలాధిపత్యమిప్పింపవలెనని యువరాజు సంకల్పించి వలదన్న తండ్రిని జీవాట్లుపెట్టి స్పానియాతోడ నావిక యుద్ధము చేసెదనని పార్లమెంటు వారికి వాగ్దానముచేసి వారివలన సొమ్ము పుచ్చుకొని యెంతోరభసముతో దాడివెడలెను. ఈసేన సంకల్పసిద్ధి పొందకయే భోజనసదుపాయము లేక వందలకొలది మృత్యువువాతఁబడి హతశేషులతో నిల్లుచేరికొనిరి. పార్లమెంటువారు సొమ్మిచ్చుటలో యువరాజు కాథొలిక్కు యువతిని బరిణయమైనయెడల వైవాహిక నియమములలో నాంగ్లకాథొలిక్కుల ప్రమేయ ముండగూడదనియు జర్మనురాష్ట్రము మీఁదికి యుద్ధమునకుఁ బోగూడదనియుఁ గూడ నాతనివలన వాగ్ధానములనుజేయించుకొనిరి. ఈనియమములను మీఱి, కాథొలిక్కు మతాభిమానినియైన ఫ్రాన్సు రాజపుత్రిని యువరాజు పాణిగ్రహణము చేసికొని యాంగ్లకాథొలిక్కులపయి ప్రతిబంధక శాసనముల నమలు జరుపనని ప్రతిజ్ఞ చేసెను. అందుచే పార్లమెంటువారతని నమ్మజాలకపోయిరి. పైనిజెప్పిన ప్రతిజ్ఞ చేసినప్పుడు తనబావమఱదికి నష్టమండలాధిపత్యము నిప్పించుటలో జర్మనీరాజుతోఁ బోరుటయందు ఫ్రాన్సురాజు తనకుఁ దోడుపడునని యువరాజు తలఁచి

యుండెను. వివాహానంతరమాప్రభువు తనకుఁబ్రతిపక్షుఁడగుట చూచి, ఫ్రాన్సుతో నాతఁడు యుద్ధముతలపెట్టెను. అంతట మొదటి జేమ్సు కాలధర్మము నొందినందున మొదటి ఛార్లెసు 1625 సం॥లో రాజ్యభారమువహించి, తన మాటయందు నమ్మకముతప్పి యుద్ధమునకు ధనమియ్యనొల్లని పార్లమెంటు సభపయిఁగోపించి దానిని రెండుసారులు ముగించి, పార్లమెంటుయొక్క అంగీకారములేకయే ధనమార్జించుటకుఁ బలుత్రోవలఁ ద్రొక్కెను. సంపన్నులఁబిలిపించి బలాత్కారముగా ఋణమిమ్మని కోరుటయు, నందున కొల్లని వారిని గారాగృహమున కంపుటయు నొక ధనాకర్షణ సాధనముగాఁజేపట్టి రాజుకొండఱను వరకమున కంపెను. చట్టములకు వ్యతిరేకముగఁ బ్రజలను జయిలునకుఁ బంపఁగూడదనియు, జయిలునందలి యధికారులకు ఖయిదీ యొక్క నేరమును వివరించియుండు వారంటు నొకటిఁ బంపవలెననియు, ఖయిదీయొక్క బంధుమిత్రులు రాజుగారికోర్టు (The Court of Kings Bench) లో పిటీషను దాఖలు చేసిన మీఁదట వారు జయిలధికారులను బిలిపించి పైవారంటులో నుదాహరింపఁబడిన నేరమును జూచి విచారణమువఱకు రిమాండులో నుండునట్లుగాని, జామీనుగయిచ్చి విచారణదినమున కోర్టుయెదుర హాజరగునట్లుగాని, ఉత్తరువు చేయవలెననియుఁ జట్టమొకటి స్థిరపడి యుండెను. రిమాండులోనుండునట్లుత్తరువయినయెడల, విచారణదినము నిర్ణయించవలెనని కోరుటకు ఖయిదీకి స్వతంత్రముండెను. ఋణమియ్యనందులకు రాజుగారిచే ఖయిదులోనుంచఁబడినవారు కోర్టువారికిఁ బిటిషను యిచ్చుకొనఁగా వారంటులో నేర ముదాహరింపఁబడనందున ఖయిదీలను రిమాండున నుంచుటకుఁగాని, విచారణదినము నిర్ణయము చేయుటకుఁగాని తెన్నుకానక, తమయుద్యోగములు రాజానుగ్రహము నపేక్షించి యున్న వగుటచే జడ్జీలు రాజప్రీతినిఁగోరి, ఖయిదీలను రిమాండులోనుంచిరి.

అంతట రాజు ఫ్రాన్సుమీఁదికి దండెత్తి వెళ్లి భూతాదులకు వలయు సామగ్రిచాలినంత సిద్ధముచేసికొనక పోవుటచే మఱలివచ్చి ఖయిదీలను



విడుదలచేసిన యెడలఁ బ్రజలకు రాజభక్తి కుదిరి మఱియొకసారి యుద్ధమునకుఁ బోవుటకుఁదగు ధనమునిచ్చెదరని యూహించి, మూడవసారి పార్లమెంటుసభఁగూర్చెను. రాజుకోరిన బలత్కారఋణములఁ గూర్చియు, స్వత్వవర్తకులైన ప్రజలనుగారణము చెప్పకుండ ఖయిదు చేయుటను గూర్చియు దోషస్థాపనము లేనప్పుడుజడ్జీలు ఖయిదు విడుదల చేయకుండుటనుగూర్చియు, ప్రజలయావేదనముఁ బార్లమెంటులోఁజర్చింపఁబడి (1) పార్లమెంటుచట్టమువలన నియ్యఁబడకుండ స్వతంత్రముగ రాజు ఋణముగాని, పన్నుగాని మఱియేయితర కానుకగాని ప్రజలవలనఁ బుచ్చుకొనఁ గూడదనియు, (2) కారణముచెప్పకుండ నెవ్వనిని ఖయిదు చేయఁగూడదనియు, పార్లమెంటువారొక చట్టము చేసి రాజునకుఁ గొంత ద్రవ్యమిచ్చిరి. ఈద్రవ్యములోఁ బంపఁబడిన యుద్ధపీరులు కొందఱు భూతాదికి లేక హతులైరి. మొదటి ఛార్లెసు విసికి 1629సం॥ లో ఫ్రాన్సుతోడను 1630సం॥ లో స్పెయినుతోడను సఖ్యము చేసికొనెను.

## అధ్యాయము. 12.

———— :o: ————

## నిరంకుశ ప్రభుత్వమునకును పార్లమెంటునకును బోరాటము.

## 1609 – 1688.

———— :o: ————

ఇట్లు కామనులును రాజులును సఖ్యపడి చట్టము చేసికొన్నను రివీవైరము లింతటితో ముగియలేదు. కర్మకాండ బైబిలులోనిసిద్ధాంతములకు విరుద్ధమని క్రొత్త బోధకులు బోధించినతోడనే, ప్రజాబాహుళ్యము నూతనమతము నవలంబించిరి. ఈక్రొత్త మతమునకుఁ గొంతకాల మలవాటుపడిన మీఁదట దానివలన నారాధనకాండలోఁ దెచ్చిపెట్టఁబడిన మార్పులు సిద్ధాంతములకు సంబంధించని స్వల్పవిషయములనియు, ప్రాచీనారాధన పద్ధతియే శ్రేష్ఠమనియు బోధించువారు బయలుదేరిరి. రాజు వీరిపక్ష మవలంబించి దేవాలయములం దాచార్యపదవియందు వీరిని నియమించి గౌరవించెను. ఈమతము ప్రజాబాహుళ్యమున కిష్టములేనందున కామనులకును, రాజునకును మతవిషయమున భిన్నాభిప్రాయములు ప్రబలియుండెను. రాజీశ్వరాంశసంభూతుఁడుగనుక పార్లమెంటువారి చట్టములకువ్యతిరేకముగ రాజ్యము చేసినను, ప్రజలు రాజునకు విధేయులైయుండవలెనని రాజుపక్షము వారును, పార్లమెంటువారి చట్టములను మీఱి రాజు వ్యవహరింపఁ గూడదని ప్రొటెస్టంటులును ప్రతికక్షులఁ దగిలియుండిరి. జను లవలంబించియున్న ప్రొటెస్టంటు మతమునుగుఱించి బోధించుటగాని గ్రంథములఁ బ్రకటించుట గాని కూడదని శాసించుచు రాజొక ప్రకటనము చేసెను. ఏసిద్ధాంతము బోధింపఁబడుటకుఁ దగినదో యేది తగినది కాదో నిర్ణయించు నధికారము కామనులగు విముఖ మతాచార్యులయందే యుండుటచే, ఈప్రతి



కక్షులు ప్రజ్వరిల్లెను. అందుచే పార్లమెంటువారు సభ చేసినప్పు డుభయపక్షముల వారికిని గలహము పెరిగి సభలో కలవళము పుట్టెను. రాజు సభ జరుపలేక ముగించవలసివచ్చెను.

మొదటిఛార్లెసు స్వాభిప్రాయదురభిమానము కలవాఁడగుటచే జనానురాగమునకై లక్ష్యపెట్టక, తనయాజ్ఞలను నిరంకుశముగఁ జెల్లించుకొనుట యందే పట్టుదలఁ గలిగియుండెను. మతవిషయమునఁ దనయిష్టానుసారము ప్రజలనడపుటకుఁ గామనుల ప్రతికక్షువారిలోఁ బ్రముఖుఁడగు వానినొకనిని మంత్రిపదమునకు నియమించెను. తనమతమునకు విముఖులగు వారియెడ నీతనికి సహనము లేశమును లేనివాఁడగుటచేతను, ఉపాసనకుఁ గర్మకాండ యావశ్యకమని యీతని యభిమత మగుటచేతను, కామనుల కీతని మతాచారములును సిద్ధాంతములును సరిపడవు. ఈశ్వరుఁడు దేశకాల పరిచ్ఛేదము లేనివాఁడగుటచే నాతని నారాధించుట కొక్క దేవాలయమే పవిత్రస్థానము కాదనియు విశ్వమంతయు బ్రహ్మమందిరమే యనియు, నిష్కళంకమైన మానవ హృదయమే యీశ్వరుని దివ్యతీర్థమనియు కామనుల యభిమతము. వీరు సచ్చారిత్రులును, సురాపానాదివ్యసనములు లేనివారును, తెలుపాడుగువస్త్రము లాదిగాఁగల వేషముల నొల్లనివారును, సత్యమని నమ్మిన దానికొఱకుఁ బ్రాణములనైన లక్ష్యము చేయక పాటుపడువారును నగుటచే, దాంభికులును వంచకులును, వ్యసనమగ్నులును, అవినీతులును నగు నితరమతము వారితో వీరికిఁ జొత్తుకూడదు.

పైనిజెప్పిన రాజమంత్రి కాంటరుబరి యాలయ ప్రధానాచార్యపదవి యందుండుటచే, తనమతమునకు విపక్షులగు కామనులదండింప నుపాయముల నవలంబించెను. ఎలిజబెత్తు రాణి కాలములో 1558 సం॥నఁ బుట్టిన చట్టమును బట్టి రాజే పోపుస్థానమున మతవిషయములందు సర్వాధికారము వహించియుండెను. రాజునమ్మతించిన మతమునుండి విడిపోయిన వారిని దండించునిమిత్తము కమీషనరు కోర్టుల నేర్పఱచుట కీచట్టమే రాజునకధికార

మిచ్చి యున్నది. ఇప్పు డీచట్టము ననుసరించి హైకమీషను కోరటొకటి స్థాపింపఁబడెను. కామనుల మతానుసారము బోధించు మతాచార్యుల నీకోర్టువారుపదభ్రష్టులఁ జేయుచుండిరి. దేవాలయములో శిరోవేష్టమును ధరించినవారును మోకాటిఁ మొక్కులు మ్రొక్కి యీశ్వరప్రసాదమును స్వీకరింపనొల్లనివారును, ఈకోర్టువారు విధించు జుల్మానాలకుఁగాని ఖయిదునకుఁగాని పాలగుచువచ్చిరి. మాటలవలనఁగాని, పనులవలనఁగాని, వ్రాతలవలనఁగాని, రాజుయొక్కయు మంత్రులయొక్కయు నాగ్రహమునకుఁ బాత్రులగు వారికింతకంటెనధిక దండనము విధించుటకు మఱియొక కోర్టుకూడ స్థాపింపఁబడెను. దేశపీడనులై, దుర్జయులై, విక్రమించిన కడిఁదిమగలను దండించుటకీకోర్టుఏడవహెన్రీకాలములో నుండుచువచ్చెను. ఇప్పుడీకోర్టును విమతదండనార్థము పునరుద్ధారణముచేసి రాజు తనమంత్రులనే యందుజడ్జీలనుగా నిలిపెను. జుల్మానాలు వేయుటయు, వీధులవెంటఁ ద్రిప్పి కొరడా దెబ్బలు కొట్టుటయు, కెంపలవడఁ గ్రాగినయినుముతో వాతలువేయుటయుఁ జెవులుగోయుటయు మొదలగునవి వీ రవలంబించిన దండనవిధానములు. సత్యమని నమ్మినసిద్ధాంతములను వీడఁజాలక, సత్యశూరులై యీదండనములకుఁ బాత్రులైన వారిపక్షముననే జనాభిప్రాయము పాదుకొనియున్నందున నిట్టియీశ్వరభక్తుల పావనదేహములనుండి కారెడురక్తమందు చేరుమాళ్లను దడిపి జ్ఞాపకార్థముగఁ బ్రజలుఁ దాఁచుకొనుచు వచ్చిరి. పార్లమెంటుసభ చేయుకయే రాజునిరంకుశముగ నిర్లేలుబడి సాగించుటయు, ఆంగ్లదేవళములందు నెలకొల్పఁబడిన సన్మతాచారములు నీఱుచేయఁబడి కాథోలిక్కుల మూఢాచారములు వెలయుచుండుటయుఁ బ్రజలు స్వాతంత్ర్యభాగ్య మీరాజు కాలమున నడుగంటుటయు సహించలేక, సన్మతాభిమానులీయు లీకాలముననే యమెరికాదేశమునకు వలసపోయి సుఖమున జీవించుచు నందుఁ బ్రబలి. యభ్యుదయ పరంపరలఁ బొందిరి.

మొదటిఛార్లెసుయొద్ద మంత్రికము నడపువారిలో 'వెంటువర్తు' అనువాఁ డైర్లాండునకు రాజప్రతినిధియై 1633సం॥లో నాదేశము నేలఁబోయెను.



ఐర్లాండులోని కాథోలిక్కులును, ప్రొటెస్టంటులును, రెండుకక్షులుగా విడిపోయి యైకమత్యములేక భిన్నాభిప్రాయులై యుండిరి. ఈమతభేదము లింగ్లాండునఁగూడనున్నను, కాథోలిక్కులసంఖ్య స్వల్పమగుటచే రాజువారియెడసుముఖుఁడైయున్నను, బహుసంఖ్యాకులైన జనబాహుళ్యము నెడల తమయాటలు సాగక యొదిగియుండవలసివచ్చెను. ఐర్లాండునట్టి యేకీభావములేనందున, వెంటువర్తు నిరంకుశముగఁ దనయిష్టము చెల్లించుకొనుచుండెను. ఈతనిపాలనము బహు కఠినముగ నున్నందునను, ఆడితప్పుటకు వెరుపక యాదేశమందలి పార్లమెంటువారిని మోసపుచ్చుటచేతను, ఈతడు ప్రజల యనురాగమును బోఁగొట్టుకొనెను.

అంతట ఫ్రాన్సు జర్మనుతీరములనుండి నీటిదొంగలు దేశము మీఁదికి వచ్చి వర్తకుల దోఁచుకొని వాణిజ్యము పాడుచేయుచుండిరి. ఆఫ్రికా తీరవాసులగు మఱికొందఱు వచ్చి యాంగ్లతీరమందు నివసించెడు పల్లెవాండ్రను బలాత్కారముగఁ బట్టుకొని బానిసలుగఁ దీసికొని పోవుచుండిరి. వీరి దుండగమును దుడమట్టింప రాజు తలపెట్టి యుండెను. ఇందునకు వలయు ధనమును పార్లమెంటుతో సంబంధములేకుండ సంపాదించుటకు మొదటి ఛార్లెసు దారులు వెదకుచు, ఇందునకు దారి చూపు పూర్వరాజుల యితిహాసములఁ దడవుచుండెను. స్పానియులు ఎలిజబెత్తు రాజ్యదినములలో దేశముపై దాడి వెడలినప్పుడు రేవు పట్టణముల నావికులకు యోడలఁ గొని తెండని రాణి సందేశము పంపియుండెను. ఛార్లెసుకూడ నట్లుచేసి యంతటితో నూరకుండక పూర్వపురాజులు త్రొక్కని క్రొత్తత్రోవఁ ద్రొక్కి, నీటిదొంగలనుండి రేవు పట్టణములను గాపాడు నిమిత్త మాపట్టణవాసులనుండి ఓడపన్ను, అను పేర నోడలు కట్టించుకొనుటకొక క్రొత్త పన్ను జమచేయ మొదలుపెట్టెను. ఈక్రొత్త పన్ను జమచేయుటకు పార్లమెంటువారి యనుమతిఁ బొందుటకైన వ్యవధి లేనంత తొందరకలుగఁ జేయు నాపద కనిపెట్టుకొని యుండనందున నీపన్ను నిచ్చుటకుఁ బ్రజలుసమ్మతింపక విప్రీతితోఁ జెల్లించుచుండిరి. "హాంపుడన్" అను

నొక వృద్ధప్రతిజ్ఞుండగు దేశాభిమాని యీపన్ను చెల్లించనని నిరాకరింపఁగా పార్లమెంటు సభాస్థానమైన వెస్టుమినిస్టరు భవనమందుఁ బన్నిద్దఱు జడ్జీలు రాజునకును హాంప్డెనునకును గలిగిన వివాదాంశమును గూర్చి విచారించి న్యాయైక శూరులగు నేవురు రాతని పక్షమునను, అధికార భీరులగు నేడ్వురు రాజుపక్షమునను నేకాభిప్రాయులైనందున, రాజుపక్షమునఁ దీర్పు చెప్పిరి. (1634.)

ఈశ్వరాంశవలన రాజ్యపదవికి వచ్చినవారిని పార్లమెంటు చేసినచట్టము లడ్డుపెట్టజాలవు గనుక పార్లమెంటువారి యనుమతి లేక రాజు క్రొత్త పన్ను కట్టఁగూడదను శాసనములను మీఱి పన్ను విధించుటలో రాజువలన లోపములేదని రాజుపక్షమున వాదించిన జడ్జీల యభిప్రాయము. తుదకు రాజు పక్షముననే యీవివాదాంశము స్థిరపడినందున రాజుయొక్క నిరంకుశాధికారము నెలకొల్పంబడెను. ఎలిజబెత్తుకాలములో నిట్టి రాజనీతి పక్షముగ వాదము చేయుటకైనఁ దలఁపు గలుగదు. చిరకాలమునుండి యేర్పడిన రాజతంత్రముల కీనీతి కడువిరుద్ధముగనున్నది. దేశక్షేమము నాలోచించి ఆయా కాలములయందలి యల్లరులను బట్టి ట్యూడరు రాజులప్పుడప్పుడు శాసనవిరుద్ధముగ రాజ్యతంత్రమును నడపినను, వారందఱును బ్రజల యనురాగమునుగూడఁ గట్టుకొనుటయందు జాగరూకులైయుండుటయు, శాసనవిరుద్ధముగ వ్యవహరించి నప్పుడు ప్రజలు రాజుతోఁ బోరుచుండుటయు చదువరులెఱిగియే యున్నారు. జేమ్సును ఛార్లెసును వెనుకటి వారివలెఁ గాక ప్రజాక్షేమమును గాని వారి యనురాగమును గాని కాపాడుకొనుటకుఁ దలపెట్టక, ప్రజలను, పార్లమెంటును, దుదకుఁ జిరకాల ప్రతిష్ఠితములైనశాసనములను గూడ లక్ష్యపెట్టక విశృంఖలముగా రాచరికము చేయ సమకట్టిరి. నేటి కీజడ్జీల తీరుమానములతో నిచ్చవచ్చినట్లు శాసనములను రద్దుచేసి యేలుటకుఁగూడ రాజునకు స్వాతంత్ర్య మలవడినది.



ఇక్కడి కింగ్లాండునందును, ఐర్లాండునందును, ప్రజాద్వేషము ప్రబలియుండెను. ఛార్లెసుయొక్క మంత్రియొకండు స్కాట్లండు నందలిమతాచారములను మార్చవలెనని ప్రయత్నించుటచే నాదేశమునందుఁగూడ రాజుపైఁ బ్రజానురాగము తొలఁగిపోయెను. ఆంగ్ల దేవాలయములందలి యారాధన పద్ధతి దెచ్చిపెట్టి, అదివఱకున్న మతాచారమును మార్పఁ బ్రయత్నము జరిగిన తోడనే స్కాట్లండుయొక్క రాజధానియైనయెడింబరోపట్టణమునందుఁ బ్రజలు దొమ్మికి రేగిరి. ఈకలవరము దేశమంతట వ్యాపించి ప్రజ లాయుధహస్తులై బయలుదేరి బలాత్కారముగ నీ మార్పులను మాన్పుకొనుటకు రాజుపైఁ బ్రతిఘటించిరి. పనిపాటలు చేసికొని జీవించు కష్టజీవులును, చిల్లర రయితులును, గూడినట్టియు, నదనుకొలఁద బలవంతపెట్టి సమకూర్చఁబడినట్టియు సేనతప్ప స్థిరమై చిరకాల శిక్షితమైన రక్షకసైన్యము రాజునకులేదు. ఈసిపాయులును స్కాటులవిపత్తులు తమకును గనిపెట్టుకొని యున్నవని గుర్తెఱింగి వారితో స్నేహభావమున నుండిరి. ఇందునకుఁ దోడుగా కాథొలిక్కు నాయకులు వీరిపై నియమింపఁబడిరి. సైనికుల కది పొడకట్టినతోడనే నాయకులను జంపివేసి వందలకొలఁదిఁగా బాఱిపోవుచువచ్చిరి. ఇందునకుఁదోడు ఛార్లెసుపార్లమెంటుసభ చేసి స్కాటులపై యుద్ధమునకు ధనమిండని కోరఁగా వా రంగీకరింపరైరి. అందుచే స్కాటులు పొలిమేరదాటి, యింగ్లాండునకు వచ్చిరి. అచ్చట చార్లెసుపైనివివరించినప్రతికూలసేనలతో విడిసియుండెను. ఇంగ్లాండునందుపార్లమెంటుసభ చేసివివాదాంశమును బరిష్కరింపుఁడనిస్కాటులతోఁ బాంగ్లసైనికులుగలసి యేకగ్రీవముగారాజును గోరుకొనిరి- అందుచే రాజు 1640 సం॥లో పార్లమెంటు సభ చేసెను.

ఈసభ తక్కినవానికంటె మిక్కిలి ప్రసిద్ధివహించినది. ఇంతవఱకును రాజుయొక్క యధికారము ప్రబలుచుండెనుగాని యీ ప్రాబల్యము నీ సభవారు తుదముట్టించి శాసనములను రాజు స్వేష్టానుసారము ముందెన్నఁడు రద్దుపఱచి యేలుట కవకాశములేకుండఁ జేసిరి.

రాజప్రతినిధిగా నైర్లాండు నేలుచున్న వెంటువర్తును మంత్రిగాఁ బిలిపించుకొని రాజు పార్లమెంటువకుఁ బోఁగానే, రాజద్రోహియని వెంటవర్తుపైని కామనులు నేరముమోపి లార్డులను జడ్జీలుగాఁ జేసి వారియెదుట బహుదినములు విచారణము జరిగించిరి. ఈతఁడు ప్రజలస్వాతంత్ర్యమునకును, చట్టములకును, విరోధియై వర్తించెననియు, పార్లమెంటుసభకు విరోధియనియు నైర్లాండునందును నింగ్లాండునందును ననేక విషయములలోఁ జట్టములకు వ్యతిరేకముగ వ్యవహరించెననియు నీతనిపై నేరము మోపఁబడెను. చార్లెసు పార్లమెంటు సభ చేయకుండ నిరంకుశాధికారము నెఱపి కడుక్రూరముగను న్యాయవిరుద్ధముగను, వ్యవహరించిన కార్యములన్నిటిలో నాతనికిఁ గుడిభుజమై నిలచినవాఁడీతఁడే. అందుచే పార్లమెంటువారి కీతనియెడ దయాదాక్షిణ్యములు లేకపోయెను. కాని యీతనిని రాజద్రోహపు నేరమునకు దండించుటకుఁ దగిన నేరము రుజువుకానందున, నీతని నురిశిక్షకుఁ బాలుచేయుట కీతనికొఱకొక క్రొత్త బిల్లుచేసి పార్లమెంటువారీతని నురిదీయించిరి (1641).

సమయముగని పెట్టి చార్లెసు మునుపటివలె నిరంకుశముగ రాజ్యము నడపకుండ, పార్లమెంటుసభను మూఁడుసంవత్సరముల కొకసారి తప్పక రాజు సమావేశము చేయుచుండవలెననియు, రాజట్లు సభ చేయనియెడల ప్రజలు సభ్యులను నియమించుకొని పార్లమెంటుసభ చేసికొనవచ్చుననియు, పార్లమెంటువారి యనుమతిలేకుండ నెగుమతి దిగుమతి సరకులమీఁద రాజు పన్నుపసూలు చేయఁగూడదనియు, హాంపుడను కేసులో జడ్జీలు చెప్పిన తీర్పు శాసనవిరుద్ధమనియు, 'ఒడపన్ను' అను పేర రాజువసూలు చేసిన పన్ను శాసనవిరుద్ధమనియు, రాజసమ్మతమతానుసారముగ వర్తించనివారి దండనము నిమిత్త మేర్పడినకోర్టులు మాపుచేయవలెననియు, పార్లమెంటువారు క్రొత్త చట్టములను జేసి రాజానుమతిని బొందిరి. కాంటరుబరీ ప్రధానాచార్యుని గారాగృహమునకుఁ బంపిరి. కర్మకాండ దేవాలయములందు మాన్పఁబడినది.



ఇట్లు క్రొత్త చట్టములకు చార్లెసు అంగీకరించినను, కామనులయిష్టానుసారము నడవనక్కఱలేకుండ నుపాయముల నాతఁడు వెదుక మొదలుపెట్టెను. పార్లమెంటువారు వెంటువర్తును దండింప సమకట్టినప్పుడు కొంత సేనను సహాయము చేసికొని పార్లమెంటును పెదిరించి మంత్రిని గాపాడవలెనని రాజు తలపెట్టెను. అసంగతి పార్లమెంటువారికిఁ దెలిసి, పార్లమెంటు యిష్టములేకుండ రాజుసభను ముగింపఁగూడదని యొక చట్టము చేయించిరి. అందుచే నిప్పుడు రాజు పార్లమెంటు సభ ముగించుట కవకాశములేకపోయెను. కామనులలోఁ బ్రముఖులగువారినిఁ దనకు మంత్రులుగఁ జేసికొన్నయెడల వారు తనపక్షము నుండి పార్లమెంటుసభను ముగించుటకు సహాయపడుదురేమోయని రాజొకప్పుడూహించెను గాని, అట్లు చేసినను వారు తనపక్షము మాటాడరని తెలిసికొని యీయాలోచనము మానివేసి, వారిపై రాజద్రోహపు నేరము మోపియురిదీయించినయెడల, నాయకులు లేక కామనులులొంగుబాటునకువత్తురనియు, అప్పుడు క్రొత్త చట్టములను దీసివేసి నిరంకుశముగ నేలవచ్చుననియు చార్లెసు తలంచుచుండెను.

రాజు పన్నుచున్న కుతంత్రములు కామనులకునుఁ దెలియవుగాని, ఆతఁడేదో యొకయుపాయము పన్ని యీ క్రొత్త చట్టములను రద్దుచేయుననియు అతఁడట్లు చేయుటకవకాశము కలుగకుండఁ జేయు నుపాయముల నవలంబింపవలెననియు దూరదర్శులగు వారి నాయకు లాలోచించుచుండిరి.

చట్టములలో సందేహాస్పదములై రెండర్థముల కవకాశమిచ్చు పదములున్నప్పుడు, వానియర్థమును వెల్లడించి సంశయమును దీర్చుటకు మఱియొక చట్టము నీకాలమున దొరతనమువారు చేయుచున్నారు. ఛార్లెసు కాలమున నట్లుకాదు. రెండర్థముల కవకాశమున్నప్పుడే రాజు తనయిష్టమువచ్చిన యర్థము నవలంబించి, జడ్జీలుతనచే నియామకులైనవారేకనుక, విచారణపు కోర్టులోఁ బరిష్కరింప బడవలసినప్పుడు, తనపక్షమునఁ దీర్పు చెప్పించుకోవచ్చును. అందుచే రాజిట్లర్థనిర్ధారణశాసనమున కంగీకరించఁడు. రాజునకునచ్చిన యర్థమును స్థిరపఱచ్చిశాసనము చేసినయెడలఁ బ్రజల స్వాతంత్ర్యమునకు భంగము

కలుగును గనుక పార్లమెంటువారట్టి శాసనముఁ జేయనొల్లరు. ఈకారణములచే శాసనములందు నిర్దిష్టముగాను సందేహ రహితముగాను నిబంధనములు లేనప్పుడు, వానియర్థమునుగుఱించి రాజును పార్లమెంటువారును వివాదములుపడి, నిజమైన యర్థముయొక్క పరిష్కారమునకుఁ గోర్టువారి నేశరణు చొచ్చుట యావశ్యకము. కోర్టులలోని న్యాయాధికారులయెడ నిగ్రహానుగ్రహసమర్థత రాజునందే యుండుటచే రాజుపక్షముననే యర్థనిర్ణయము జరుగక తప్పదు. అందుచే నిట్టి యవకాశమును బురస్కరించుకొని రాజీ క్రొత్త చట్టములను మీఱివచ్చునని కామనుల నాయకులు తలఁచి, రాజమంత్రులను, రాజుగారి కోర్టులలోని న్యాయాధికారులను, రాజకీయోన్నతోద్యోగస్థులను, ఇక ముందు పార్లమెంటువారే నియమించునట్లును, రాజున కట్టినియమనాధికారము లేకుండఁ జేయుటకును, జట్టములను బుట్టింప నాలోచించుచుండిరి. మఱియు దేశసమష్టిమీఁద రక్షకసైన్య మీకాలమున లేకపోయినను, ప్రతిమండలమందును మాన్యముల ననుభవించు కట్టుబడి బంట్లుగలరు. వారిపై నాయకులను నియమించు నధికారము రాజునందే యున్నది. ఈయాధికారము కూడ రాజునకు లేకుండఁ జేసి పార్లమెంటు వారి చేతిలో నుంచుకొనవలెనని కామనుల నాయకులు తలఁపోయుచుండిరి.

ఇన్ని యుపాయములతో నగత్యములేదనియు, క్రొత్తచట్టములకు సమ్మతించిన వెనుక రాజు వానిని మీఱఁడనియు, తలఁచువారి తెగయొకటి యీసమయమున నేర్పడుచున్నది. మఱియు కామనులకును, రాజభక్తులని వ్యవహారనామముతో వాడఁదగిన యీ తెగవారికిని భిన్నాభిప్రాయములు మతవిషయమునఁ గూడ బలపడియున్నవి. కామనులలోఁ జాలవఱకు దేవాలయములును మతవిషయములను నడపుటకు పరిషత్సభవా రుండవలెను గాని మతాచార్యుఁ డొక్కఁడు చాలఁడని వాదించువారయి యుండిరి. ఇట్టి పరిషత్ప్రచారమున కంగీకరించని వారందఱు రాజభక్తసంఘములోఁ జేరిరి.



కామనుల నాయకులు తమ యుద్యమముల నెఱవేర్చుకొను నిమిత్తము రాజ్యమునకు వచ్చినది మొదలుగా రాజు చేసిన దుష్పరిపాలనమునుగూర్చియు, పార్లమెంటువారు ప్రజాక్షేమకరముగఁ జేసిన మంచి చట్టములను గూర్చియు, వివరించుచు, నిఁక ముందు పార్లమెంటువారు విశ్వసింపఁదగినవారే మంత్రులుగా నియమింపఁబడవలెననియు, రాజునకిష్టమునకు వచ్చినవారు నియమింపఁబడఁగూడదనియు నొకపత్రికను పార్లమెంటులో నాలోచనకుఁ దెచ్చిరి. ఉభయకక్షులవారు రాత్రులు నిశీథసమయములవఱ కిందునుగుఱించి చర్చించి తుదకు దానిని జట్టముచేసిరి. దీనిని బ్రజలకుఁ దెలియునిమిత్తము ప్రచురముచేయఁగా, కామనులకు రాజునం దెంతమాత్రము నమ్మకములేదను నంశము వెల్లడి యయ్యెను.

ఈవిషయము పార్లమెంటులోఁ జర్చింపఁబడుచుండఁగా, స్కాటుల బలమును దన పక్షమునకుఁ గూడఁగట్టుకొనుటకై రాజు స్కాట్లండునకుఁ బోయి యుండెను. (1641) వారుకోరిన కోర్కెలనెల్లఁ దీర్చినయెడల వారు తనవంక బలమై యింగ్లాండున దనయుద్యమముల నెఱవేర్తురని రాజు తలఁచెను. అంతట ఐర్లాండులోని కాథొలిక్కులు రేగి ప్రొటెస్టెంటుల నాబాలగోపాలము వధించిరని వార్త వచ్చెను. ఇందువలన కాథొలిక్కులను దనవంకకుఁ దెచ్చుకొనుటకు రాజే యీక్రూరవధ చేయించెనని యాంగ్లప్రజాబాహుళ్యమునకుఁ దోఁచి వారికి రాజునెడ విశ్వాసము మఱింత దూరమయ్యెను.

అంతట ఛార్లెసు లండను పట్టణమునకు మరలి వచ్చునప్పటికి, పార్లమెంటు సభాభవనము చుట్టును లండను పట్టణవాసులను పార్లమెంటువారు కావలియుంచుకొని యుండిరి. ఇదిచూచి రాజభక్తులైదువందలవఱకు రాజు చుట్టునుండి రాజున కంగరక్ష చేయుచువచ్చిరి. కామనులు కావలియుంచిన వారిని రాజు పంపివేయఁగా వారు భయపడి తమ రక్షక పురుషులను పార్లమెంటుచుట్టు నుంచుకొనుటకు సెలవిమ్మని రాజునుగోరుకొనిరి. కాని యాతఁడందున కంగీకరింపలేదు. అంతట పార్లమెంటుసభలో నేవురమీఁద రాజద్రోహపునేరము మోపఁబడి వారిని బట్టుకొని యొప్పగింప కామనులను

రాజు కోరెను. వారిని బట్టి యియ్యమని కామనులు నిరాకరించిరి. సేనా సమేతుఁడై పార్లమెంటునకుఁబోయి వారిని మరుసటిదుపట్టుకొనవలెనని రాజు ప్రయత్నించెనుగాని యాతనికోరిక నెఱవేరలేదు. (1642).

ప్రతి మండలమందును మాన్యములు గొనియున్న కట్టుబడి బంట్లకు (Militia) నాయకులను పార్లమెంటువారే నియమించవలెనుగాని రాజు నియమింపఁగూడదని నొకచట్టమును బుట్టింప కామనులు ప్రయత్నించి రాజు నడుగఁగా నాతఁడందున కంగీకరింపలేదు. అందుచే పార్లమెంటునకును రాజునకును 1642సం॥లో యుద్ధము ప్రారంభమయ్యెను. రాజువలనలోపము లేదనియు, పార్లమెంటువారే సర్వాధికారమును జూరఁగొన సమకట్టి యున్నారనియుఁ దలంచికొందఱురాజు పక్షమునుబట్టిరి రాజునందువిశ్వాస ముంచలేనివారందఱు పార్లమెంటు పక్షమైరి. లండనువాసులు పార్లమెంటు పక్షముననుండి యీయుద్ధములోఁ దమవ్యయములను దామేభరించిరి. గొప్ప కుటుంబములవారు దరసామిమీఁద రాజువంకకును, కాయకష్టములచే జీవించువారును,వ్యవసాయదారులును పార్లమెంటువంకకును జేరిరి. ఇంగ్లాండుపశ్చిమ భాగము రాజును దూర్పుదిశ పార్లమెంటును జేపట్టెను. రాజుపక్షమున గుఱ్ఱపుసవారుల కలవాటుపడి కీర్తిపౌరుషములుగల వీరశిఖామణులుండుటచే సామాన్య జీవనులగు కర్షకులతోఁగూడియున్న పార్లమెంటుపక్షమువారు కొంతకాలము వఱకు గెలుపొందలేకపోయిరి.

యుద్ధము ప్రారంభమయినప్పుడు పార్లమెంటులోఁ గొందఱు మత వ్యవహారములు పరిషన్మండలమువలన నెఱవేర్పఁబడవలెననియు,కొందఱుమతాచార్యులవలన జరిగింపఁ బడవలెననియు భిన్నాభిప్రాయములతో నుండిరి పరిషన్మండల నాయకత్వము'నంగీకరించని వారు రాజు పక్షమునకుఁబోవుటవలనఁ బార్లమెంటులో నందఱు నేకాభిప్రాయులైయుండిరి. వీరికి మతాంతర సహన మెంతమాత్రములేదు.ఐనసువీరిలోఁగూడమతాంతరసహనముగలిగినయెవరికిచ్చవచ్చినట్లు వారీశ్వరారాధనము చేసికోవలెననియు మతాచార్యులుగాని,



పరిషన్మండలము వారుగాని రాజుగాని మరియొకరి యారాధనవిషయమున జోక్యము పుచ్చుకొనఁగూడదనియు నెంచువారి తెగ యొకటియుండెను. ఈతెగ యెలిజబెత్తు నాటనుండియు వెలసియున్నదిగానియాకాలమునవీరల్ప సంఖ్యాకులై యనామకులైయుండిరి. నేటికి వీరిసంఖ్య వృద్ధియై నలుగడల వ్యాపించియున్నది. వీరుమతవిషయమున బహుపట్టుదల గలవారు. బైబిలు వేదమును ఛాందసులవలె నోటిపాఠముగ వల్లించి బహునిష్ఠాగరిష్ఠులై విశుద్ధ వర్తనులైన మాననీయులు. ఆలివరు క్రామువెల్లు అనునతడు వీరినాయకుఁడు. ఇప్పుడు పార్లమెంటులోవీరిప్రభ యధికమయి ముందు యుద్ధమంతయు వీరి వలనే జయప్రదముగ సాగింపఁబడెను.రాజుపక్షమువారికంటె వీరుమిన్నలైన యశ్వవారులు. 1644సం॥లో క్రామువెల్లు నాయకత్వముపూని, స్కాటులను సహాయముచేసికొని, యనేకయుద్ధములలో రాజునోడించి యాతనిసేనను బరిమార్చెను. మార్సటనుమూరు యుద్ధములోని జయము(1644)వలన నాంగ్లదేశ మందలి యుత్తర భూములన్నియు పార్లమెంటువశమైనవి. ఈజయోత్సాహముచేఁ బరిషత్ప్రచారకులకుఁ బూర్వప్రొటెస్టంటుల నాయకత్వము విడిపింపఁబడి యుద్ధమంతయు క్రామువెల్లుతెగవారి నాయకత్వమునకిప్పింపఁబడెను. వీరితోమరుసటివత్సరమున రాజు స్వయముగ యుద్ధముచేసి, పోరి, పరాజితుఁడై స్కాటుయోధులచేతులలోఁ బడెను.

ఇంతటితోనైన పార్లమెంటువారి కోరికలఁదీర్చి సుఖముగానుండవలెనని రాజునకు బుద్ధిపుట్టలేదు. పరిషత్ప్రచారకుల యిష్టానుసారముగ దేవాలయములందుమతాచార్యులనుదొలఁగించి పరిషదుల నిలుపుటకుఁగాని, మతాంతర సహన పక్షమువారైన యుద్ధవీరుల యిష్టానుసార మెవరియిచ్చవచ్చినట్లు వారీశ్వరారాధనము జరుపుకొనుటకుగాని,రాజంగీకరించక యుభయులకునువైరము పెంచినయెడల తనమాటలుసాగునని యాశకలవాఁడైశుష్కరాయభారములతోఁ గాలవిలంబనము చేయుచుండెను.స్కాటులు పరిషత్ప్రచారకులగుటచే రాజు తమకోర్కెఁ దీర్పనొల్లఁడని కనిపెట్టియాతనిని పార్లమెంటువశము చేసి తమత్రోవను బోయిరి(1647). రాజునకుసదుద్దేశము లేశమైననున్న

యెడల నేదోయొకవిధమున పార్లమెంటుతో సఖ్యమొడఁగూడియుండును. పార్లమెంటు సభ్యులలో నింటిపోరు తెచ్చి పెట్టుటయే యేకసంకల్పముగాఁ గలవాఁడగుటచే, ఆలయములలోఁ బరిషన్మండలముల నెలకొల్పి మతాచార్యులఁ దొలఁగించెదనని స్కాటులకు వాగ్దానముచేసి వారలను బిలిపించికొని వారిసహాయమునఁ బార్లమెంటును గెలువఁదలఁచెను. పార్లమెంటువారనాయాసముగా స్కాటులనోడించి రాజుయొక్క కుతంత్రములకు నాగ్రహావేశఁ బరవశులై రాజు నురిదీయ సంకల్పించిరి. (1648) రాజులకుఁ బ్రజలవలననే రాచరికము ప్రాప్తించినదనియు, వారియధికారము జనకంటకమైనప్పుడు రాజు దండనపాత్రుఁడనియు వారియభిప్రాయము. కాని, పార్లమెంటులోని పరిషత్ప్రచారకులగు వారు రాజు నురిదీయ సమ్మతింపరైరి. అందుచే క్రాము వెల్లుపక్షము వారు పరిషత్ప్రచారకులను పార్లమెంటునుండి వెలిఁబుచ్చి మిగిలిన యేబది ముగ్గురునుమంతనముచేసి ప్రజాద్రోహపునేరమునకు రాజుపై నేరమును విచారించుటకు 135గురిని న్యాయాధికారులుగ నియమించిరి. ఈవిచారణములో ఛార్లెసు స్వరక్షణార్థము వాదమునకుదిగక, ఆంగ్లజనబాహుళ్యమండలు నేకగ్రీవముగా నియమించిన న్యాయాధికారులకుఁ గాని తనపైనేరమును విచారించుట కధికారములేదనియు, ఈన్యాయాధికారులట్లు నియమింపఁబడినవారు కాకపోవుటచే వీరికిఁ దనపై విచారణాధికారములేదనియు మాత్రము పలికెను. తుదకు ఛార్లెసు 1649సం॥ లో బహిరంగముగా రాజమార్గములో నురిఁదీయఁబడెను.

———:o:———

# అధ్యాయము. 13

———:o:———

## నిరంకుశ ప్రభుత్వమునకును పార్లమెంటునకును బోరాటము

———:o:———

## ప్రజాప్రభుత్వము.

———:o:———

1649-1660.

———:o:———

రాజునురిదీయుటకు జనబాహుళ్య మంగీకరించినది కాదు. పార్లమెంటులో నగ్రశాఖవారగు లార్డులు రాజుపై నేరమును విచారించుటకుఁ గూడ నంగీకరించరైరి. అందుచేఁ దామే చట్టములను జేయుట కధికారులమని కామనులు స్థిరపఱుచుకొని న్యాయవిచారణనిమిత్త మొక హైకోర్టు స్థాపించుకొనిరి. రాజుపై నేరమును విచారించుటకు జడ్జీలనేర్పఱచిన 53గురే యిప్పుడు పార్లమెంటునందు సర్వాధికారులై నిరంకుశముగఁ బ్రజాపాలనము చేసిరి. రాజ్యమేలుటకు రాజు గాని లార్డులు గాని యుండనక్కఱలేదని స్థిరపఱచి రాజ్యమును పేరునకుమాఱుగాఁ బ్రజాప్రభుత్వమని వాడ మొదలుపెట్టిరి. ఇంగ్లాండు, ఐర్లాండు, స్కాట్లండు లందలిజనులు రాజవధకు దుఃఖించి యాతని కొమారుని రెండవ ఛార్లెసును సింహాసనమునకు రప్పించవలెనని కోరుచుండిరి. విజయసింహులగు యోధులతోఁ గూడిన పార్లమెంటు వారికి రాజను పేరే కంటకముగ నున్నందున నాతని బిలిపించుట కింగ్లాండులో సాధ్యము కాకుండెను. ఐర్లాండులోని ప్రొటెస్టంటులును కాథొలిక్కులును గూడ నేకీభవించి రెండవ ఛార్లెసును బిలువనంపిరి. ఆతఁడింకను మార్గమధ్యముననుండఁగానే క్రాము

వెల్లుసేనతో నైర్లాండునకుఁబోయితన్నెదిరించిన యుద్ధవీరులనందఱ నుసురులు వాపిదేశమును జాలవఱకు వశపఱచుకొని యింగ్లాండునకు మరలివచ్చెను. ఈవార్త చెవినిబడఁగానే చార్లెసు మాఱుత్రోవఁద్రొక్కి స్కాట్లండునకుఁబోయెను. ఆదేశస్థులు వెంటనే యాతనిరాజుగాఁజేసిరి గాని క్రామువెల్లుసేనతో వెనుదగిలి యుద్ధముచేసి స్కాటులనోడించెను (1650). ఈతఁడు స్కాట్లండునందే యుద్ధములోఁబనిఁదగిలియున్న సమయములోనే యింగ్లండు ప్రజలు తనపక్షముననిలిచి క్రామువెల్లు నోడింతురను నాసతో ఛార్లెసు ఇంగ్లండునుజేరెను. ఈవార్తవిని క్రామువెల్లు అతనివెన్నుఁదన్ని యాతనిసేనను పటాపంచలుచేసెను. ఛార్లెసు ప్రాణములు దక్కించుకొని బహుకష్టములతో ఫ్రాన్సుదేశమును జేరికొనెను.

ఇట నింగ్లాండున క్రామువెల్లుమొదలగు సేనానాయకులును శాసనులును గూడ న్యాయమై దేశక్షేమకరమైన రాజ్యపద్ధతి నెలకొల్పవలెనని యాలోచించుచుండిరి కాని యొకరిపద్ధతియొకరికిఁబనికిరాలేదు. స్టూవర్టువంశమువాఁడగు రెండవఛార్లెసు తమకు రాజుగావలెననెడి జాడ్యము ప్రజలనువిడిచిపెట్టువఱకుఁ దామే ప్రభుత్వము నేలవలెనని శాసనులును, వెంటనే యీపార్లమెంటు ముగింపఁబడి క్రొత్తపార్లమెంటు యేర్పడవలెనని క్రామువెలు ప్రభృతులును భిన్నాభిప్రాయులై యుండిరి. నిజమునకుఁ గఠినములైన పన్నులు విధించి వసూలుచేసినసొమ్మునగత్యముగా వెచ్చించియు, క్రూరములైన పెక్కుపనులుచేసియు, నిరంకుశముగ శాసనులు చిరకాలము రాజ్యతంత్రము నడపియున్నారు. ఈసభముగించుమార్గము గానక, క్రామువెల్లు సేనాసమేతుఁడై పార్లమెంటునకుఁబోయి సభవెలుపల సేననుబరివేష్టింపించినిలిపి, తానులోనికిఁజని కొంతమారము సభవారిని బొగడి రానురాను క్రోధావేశపరవశుఁడై వారిని న్యాయదూరగులనియు, స్వలాభాపేక్షులనియు ననేకవిధముల నిందించుచుండఁగా, సభవారడ్డుపెట్టిరి. ఆతఁడు వారియడ్డమును లక్ష్యముచేయక సైనికులఁబిలిపించి సభలోనున్న వారినందఱను వెడలనడపించెను(1653).



పిమ్మట క్రామువెల్లు ప్రభృతులు 165 గురిని బిలిపించి పార్లమెంటుసభ చేసిరి. వీరు దేశాచారములను చట్టములనుమార్చవలెననిసంకల్పముకలవారు. ఇందునకుఁ గొందఱు సమ్మతింపనందున నేకాభిప్రాయము కుదరక విసికి తమయధికారమంతయు క్రామువెల్లునకే యర్పణముచేసి ముగించిరి.

ఇంతవఱకు క్రామువెల్లు సేనానాయకుఁడే యైనను, ఇప్పుడు ప్రాయికముగాఁ బ్రభువై ప్రజారక్షకుఁడను పేరువహించి, క్రమముగాఁ పార్లమెంటుసభలను జేయుచు, చట్టముల కనుగుణముగాఁ బరిపాలనము చేయుటకొడఁబడియెను. (1653)తనమతమువారికి స్వేచ్ఛానుసారముగ నీశ్వరారాధనము చేసికొను స్వాతంత్ర్యమియ్యవలెననియు, అందఱకును సమాధానమగునట్లు రాజ్యమును నడుపవలెననియు క్రామువెల్లు కుతూహలముతో నీపనికిఁబూనికొనెను గాని యీతఁడుశత్రుమధ్యమునఁబనిచేయవలసివచ్చుటచే నీతనికిని, యీతఁడు కూర్చిన మొదటిపార్లమెంటునకును సరిపడక యాసభముగించి చట్టములకు వ్యతిరేకముగఁ బ్రవర్తించియు, పార్లమెంటుసాహాయ్యము లేకుండఁ బన్నులఁ గట్టియు, హేతువు చెప్పకుండ జనులను ఖయిదునకుఁ బంపియు ననేకవిధములనిరంకుశముగ రాజ్యము చేయవలసివచ్చెను. పాపమాతఁడిట్లు నిరంకుశముగ రాజ్యమునడపుటకిష్టపడినవాఁడు కాఁడు. ప్రజలాతని సదుద్దేశములనుబట్టి యాతనికి సహాయము చేయరైరి. ఎలిజబెత్తు తరువాత మతాచారములలోఁ జేయఁబడిన మార్పులకు విసికియాపెయేర్పరచిన మతమే పునరుద్ధారణము కావలెననియు, ప్రజాప్రభుత్వము పోయి యధాపూర్వరాజ్యపద్ధతి యుండవలెననియు ప్రజ లంగలార్చుచుండిరి. ఐనను క్రామువెల్లు 1656సం॥లో మఱియొకసారి పార్లమెంటుసభను గూర్చి తనకు విరోధులగు నూర్వుఱ సభ్యుల నందుండి వెడలఁగొట్టి, పెక్కులు చట్టములనుజేసెను. ఈ పార్లమెంటువారాతనిని రాజుగాఁ జేయవలెనని కూడ యత్నించిరి కాని ఛార్లెసు నురిఁదీయుటలోఁ బనిచేసినయోధులును, వారినాయకులును, నొకరాజునుబంపిమఱియొకరాజువ కొదిగియుండుట న్యూనముగ నాలోచించి యందునకంగీకరించనందున, క్రామువెల్లునకుఁగూడ రాజనిపించుకొనవలెనని యున్నను, ఆపని కొనసాగలేదు.

క్రామువెల్లుమీఁదఁ బ్రజల కెంతమాత్ర మనురాగము లేకపోయినను, ఆతనిబుద్ధికుశలతవలనను, యోగ్యతవలనను, మొత్తముమీఁదననుకూలముగానే రాజ్యమునడచెను. దేశమందల్లరులు లేకుండ నిష్కంటకముగ జేసియు, బుద్ధిశాలురను, సమర్థులును, నగువారిని వెదకి సేనానాయకులుగను జడ్జీలుగను మఱియితరోద్యోగస్థులుగను నియమించియు వాణిజ్యము పెంపొందుటకును విద్యాభివృద్ధియగుటకును సుకరములైనమార్గము లేర్పఱచియు ప్రజాసౌఖ్యస్వాతంత్ర్యములకనుకూలముగ శాసనములను సవరించియు ననేకవిధముల సుభిక్షముగ నీతఁడు రాజ్యముచేసెను. ఇదివఱకు నింగ్లాండు స్కాట్లండు ఐర్లాండులలో పార్లమెంటులువేఱ్వేఱుగనుండుచువచ్చినవి. ఈతఁడాంగ్లులపార్లమెంటునకే స్కాట్లండునుండియు, ఐర్లండునుండియు, సభ్యులను బిలిపించి వారికిఁ జోటిచ్చెను. ఈపద్ధతియే యిప్పుడును జరుగుచున్నది. ఈతని రాచరికము బహున్యాయముగను మొత్తముమీఁదఁ బ్రజలయెడ దయాసహితముగను నున్నది. తనకుశత్రుపక్షముననున్నవారిని దనవంకకుఁ దెచ్చుకొనివారినిసమాధానపఱచుకొనుట కీతఁడెంతయుఁ బాటుపడెను. 1640సం॥లో నేర్పడిన పార్లమెంటు నాటనుండియు ప్యూరిటనుల ప్రభావము ప్రజ్వలించెను. ఈపార్లమెంటువారు దేశమందు నాటకవినోదము లుండఁగూడదని నిషేధించి నాటకులను గొరడాదెబ్బలు కొట్టించిరి. చిరకాలమునుండి పండుగదినములలో జనులు మైదానములందు గుంపులుకూడి యచట నాట్యగానములును, దండపట్లుపట్టుటయు, మున్నగు వినోదములఁ దగిలి క్రీడించుట యీదేశాచారము. ఈ వినోదముల నీప్యూరిటను పార్లమెంటువారు మాన్పించిరి. ఆదివారము పవిత్రదినమని వీరి మతసిద్ధాంతమగుటచే నాదినమున నెట్టిక్రీడయుజరుగఁగూడదని నిషేధింపఁబడినది. జూదగాండ్రును, త్రాగుబోతులును, కఠినముగ జుల్మానాలపాలయిరి.

మతవిషయములందుఁగూడప్యూరిటనులు పెక్కుమార్పులను దెచ్చిపెట్టిరి. ఆలయములందు మతాచార్యులను దీసివేసి పరిషన్మండలములనిలఁ బెట్టిరి. ఆరాధనమునకు నిర్ణీతమైన ప్రార్థనగ్రంథమునుమాన్పించి యిష్టానుసారము భక్తులు



హృద్గతార్తికొలఁది నీశ్వరారాధనము చేయవచ్చునని సెలవిచ్చిరి. ఈమార్పుల నొల్లనిమతబోధకులు పదభ్రష్టులైరి. ఆరాధనవిషయమున స్వేచ్ఛానుసారము వివిధమతములవారు నడచుకోవచ్చునని ప్యూరిటనులకు మతాంతరసహనమునంగీకరించినను, కాథోలిక్కుల కట్టి స్వాతంత్ర్యమియ్యలేదు. క్రామువెల్లుతనతెగవారివలె దురభిమానములేనివాఁడుగనుక నాతనియేలుబడిదినములలో కాథోలిక్కులు స్వగృహములం దిచ్చవచ్చిన ట్లీశ్వరార్చనము జరుపుకొను స్వాతంత్ర్య మనుభవించిరి.

మతవిషయిక జ్ఞానము వృద్ధియై జనులకు మూఢసిద్ధాంతములం దాదరము తప్పియున్నకాలమందు ఛార్లెసు కాథోలిక్కుల కర్మకాండములను నెలకొల్పి యెట్లు జననిందపాలయ్యెనో, అట్లే ప్యూరిటనులును జనాభిప్రాయములకు ముందంజవేసియు జనులు రోసిన మార్పులను దెచ్చిపెట్టియు నట్లు ప్రజాద్వేషమును సంపాదించుకొనిరి. అప్పుడు బయలుదేరుచున్న పిన్నకాఱునకు మత విషయమున ప్యూరిటనులు తెచ్చిపెట్టు నిర్బంధము లెంతమాత్రము సరిపడలేదు. ప్రాచీనాచారములకలవాటుపడిన వృద్ధులు పూర్వాచారములనే కోరుచుండిరి. ప్యూరిటనుల లోపము లెన్ని యున్నను మొత్తముమీఁద వారివలన దేశమున కమూల్యమైన యుపకారము జరిగినది. పాపము లన్నను దుర్వ్యసనము లన్నను, బ్రజలకు రోతపుట్టించిరి. నిర్ణీతములైన కృత్యములందుఁ బాలుమాలిక లేక జాగరూకతతో నెఱవేర్చవలెనను నీతి జనులందుఁ బాదుకొలిపిరి. దినచర్యయందు ధర్మము తప్పక ప్రతిస్వల్పవిషయమందును బ్రవర్తించుటకుఁ బాటుపడవలెనను పూనిక నేర్పిరి.

ఆఫ్రికాదేశపు దక్షిణాగ్రము దాటి అమెరికాప్రాంత భూములకు నౌకాయాత్రలు జేయనేర్చుకొని యనేకులు మొదటిజేమ్సు కాలములో నమెరికాఖండమునకువలసఁబోయి నివాసము లేర్పఱచుకొనిరని చెప్పియున్నాము. ప్యూరిటను లీకాలమున 20000 మందివఱ కమెరికాకుఁబోయి వాణిజ్యమును వృద్ధిచేసిరి. వీరి విజృంభణమును జూచి యేవగించి ఛార్లెసు మరణానం

తరము, ఒలందు, లాంగ్లేయులతో 1652-1653 వఱకు రెండువత్సరములు యుద్ధములకు డీకొని యోడిపోయి క్రాము వెల్లుతో సంధిచేసికొనిరి.

రాజు నురిఁదీసి రాజ్యపదవి నాక్రమించుకొన్న క్రాము వెల్లునెడ విదేశరాజులు గౌరవముఁ జూపలేదని వేఱ చెప్పనక్కఱలేదు. ఐననాతనితోఁ గయ్యమునకుఁ గాలుద్రవ్విన యొలందుల దుస్థితిఁ గన్నమీఁదట విదేశరాజులకు భయోత్కంపములు హెచ్చినవి. విదేశరాజులతో వ్యవహరించుటలో నాయా దేశములందు దుస్థితి ననుభవించుచున్న ప్రొటెస్టంటులకు దోరతనము వారివలన నేయాపదలును గలుగకుండఁ గాపాడుట ముఖ్యోద్దేశముగా ముందుంచుకొని క్రాము వెల్లు వ్యవహరించెను. సావాయి మండలాధిపతి తన యేలుబడిలోనున్న ప్రొటెస్టంటులను కాథొలిక్కుమతము చేపట్టుడని నిర్బంధించు చుండెను. సావాయిమండలము ఫ్రాన్సురాజునకు లోఁబడియున్న సామంతదేశ మగుటచే ఫ్రాన్సురా జొకప్పుడు క్రాము వెల్లుయొక్క సహావాసమును గోరఁగా సావాయి ప్రొటెస్టెంటుల దురవస్థను మాన్పించువఱకు నారాజుతో స్నేహమునకాతఁడొడఁబడఁడయ్యెను(1655) దక్షిణపమెరికాకు నుత్తరదిశనున్న వెస్టుయిండియాదీవులతో నాంగ్లనావికులు వర్తకము సాగించుటకు స్పానియావలననవరోధములు గలిగెను. బైబిలను వారి వేదమును స్వయముగ జదువుకొను స్వాతంత్ర్యమును కాథొలిక్కులు జనసామాన్యమునకంగీకరింపరు. వెస్టుయిండియా దీవులలోని స్పానియులు కాథొలిక్కులు. అందుచే నాద్వీపములకుఁ బోయిన యాంగ్లప్రొటెస్టెంటులు బైబిలు చదువుకొనుటకు ఏలను పడక బాధలఁ బడుచుండిరి. వీరి యిబ్బందులను దొలఁగించు సదుద్దేశముతో నాకాలమున ఫ్రాన్సునకును స్పెయినునకును జరుగుచున్న యుద్ధమందు క్రాము వెల్లు ఫ్రాన్సుపక్షమున సహాయుఁడై స్పెయినుతోఁ బోరి జమేకా ద్వీపమును నాంగ్లకాలనీ(సామంతభూమి)గా సంపాదింపఁగలిగెను(1655). జర్మను ప్రాగ్భాములయందు ఫ్రాన్సునకు స్పెయినుతో యుద్ధము సంప్రాప్తమైనప్పుడు ఫ్రాన్సునకు 6000 సిబ్బందిని క్రాము వెల్లు సాయమునంపి యొకపట్టణమును బారితోషికముగా నాంగ్లరాజ్యమునకుఁ గలుపుకొనెను (1658).



ప్రజా బాహుళ్యమున కింకను రెండవచార్లెసుఁ బిలిపింపఁ గోర్కె యున్నను క్రాము వెల్లుయొక్క మహావీరచరిత్రకు సంతుష్టులై, స్వదేశమందు సుభిక్షముగ నేలుటకును, విదేశములలో దేశమునకు కీర్తిసంపాదించుటకును, ప్రజలు మిగుల సంతసిల్లిరి. అంతట కాలవక్రతచే నాతఁడు వ్యాధిగ్రస్తుఁడై 1658సం॥లోఁ బరంపదించెను. తండ్రితరువాత యాజమాన్యమునకు వచ్చిన రిఛర్డ్ క్రాము వెల్లు తండ్రివలెఁ బ్రజలను వశపఱచుకొనసమర్థుఁడుకాఁడు- అతఁడు శూరశిఖామణి కాకపోవుటచే పార్లమెంటులోని వరూధుల కాతఁడునచ్చలేదు. కొన్ని మాసములుచూచి, అతనియధికారమంతయు పార్లమెంటువారు తామే చేపట్టి చార్లెసు నురికిఁబంపిన వెనుకటి పార్లమెంటువారిని సభకుఁబిలిపించిరి. ఈసభ్యులకును వరూధులకును నేకవాక్యత కుదురక తగవులాటతోఁ గాలము గడుపవలసి వచ్చెను.

ఈయరాజకత్వముఁ జూచి ప్రజలు రెండవచార్లెసును బిలిపింపనిశ్చయించి స్కాటుల సేనానాయకు నొకనినిండులకు నియోగించిరి. అతఁడు లండను పట్టణమునకుఁ బోయి వెనుకపార్లమెంటునుండి వెడలఁగొట్టఁబడిన సభ్యులను దిరుగ సభకుఁ బంపఁగా వారు సభకుఁ బోయి సభను ముగించిరి. (1660) పిమ్మట క్రొత్తపార్లమెంటు యేర్పడి రెండవచార్లెసునకు సింహాసనమును గొనుమని స్వాగతమిచ్చి దేశమునకు రప్పించిరి. (1660)

—:o:—

# అధ్యాయము. 14.

## నిరంకుశ ప్రభుత్వమునకును పార్లమెంటునకుఁ బోరాటము.

## 1660–1689.

క్రామువెల్లునాయకత్వముక్రిందఁ బోరినబంటులును, అతనికొమాఱుఁడేర్పఱచిన పార్లమెంటుసభ్యులును మఱికొందఱునుదప్ప, తక్కిన ప్రజలందఱును రెండవచార్లెసునకుఁ బట్టాభిషేకము చేసిరి. ఆబంటుల సంఖ్యయత్యల్పమైనను, ఆయుధహస్తులును యుద్ధవిద్యయందాఱితేరినవారును నగుటచే పార్లమెంటువారు వారి జీతభత్యములకు వలయుధనమిచ్చి వారినిండ్లకు సాగనంపిరి. మొదటిచార్లెసు పైనేరము విచారించుటయందును, అతని నురిఁదీయుటయందును బనిఁబుచ్చుకొన్న వారిని కొందఱి నురిదీఁసి, కొందఱిజన్మఖయిదునకుఁ బంపిరి. ప్యూరిటను ప్రభుత్వకాలమున దివాణమువారు వ్యసనములులేక మర్యాదగావర్తించుచు వచ్చిరి. రెండవచార్లెసు శృంగారపురుషుఁడుగనుక నీతఁడు రాజ్యమునకురాఁగానే విటకాండ్రతోడను, వినోదపరాయణులతోడను, డంబాచారులతోడను, దివాణము నిండిపోయెను.

మొదటిచార్లెసు అంగీకరించిన చట్టములమాత్రమే అమలులో నుంచఁబడి, అతనిపైనేరము మోపిన పార్లమెంటువారును, క్రాముఎల్లును, అతని పార్లమెంటువారును, చేసినచట్టములన్నియు రద్దుచేయఁబడినవి. ఇంగ్లాండు స్కాట్లాండు, ఐర్లండుదేశములలో వేఱువేఱుపార్లమెంటులు నెలకొల్పఁబడినవి. పరిషన్మండలములు తొలఁగింపఁబడి, మతాచార్యులు వెలసిరి. రాజానుమతినొందిన యారాధన గ్రంథమును వాడనివారు దోషస్థులయిరి. రెండవ



ఆలివరు క్రామువెల్లు.

చార్లెసును బిలిపించిన పార్లమెంటులో ననేకులు పరిశుద్ధాచారులై యున్నందున, నాసభ వెంట నేమింపఁబడినట్టియొక పార్లమెంటుసమకూర్పఁబడెను (1661) రాజునకును పార్లమెంటునకును జరిగినవివాదములలో రాజుపక్షమున నున్న వారందఱును నీపార్లమెంటులోఁ జేరిరి. మతాచారములను నీఱుచేసిరని ప్యూరిటనులవాసన వీరికిఁగిట్టదు. ప్యూరిటనులదండించుటనిమిత్తమనేక కఠినశాసనములు చేయఁబడినవి. పట్టణములలో ప్యూరిటనులకట్టి యుద్యోగములును లేకుండఁజేసిరి. రాజసమ్మతిమతాచారములకు వ్యతిరేకముగ నీశ్వరారాధనము చేసిన వారిని, జుల్మానాలు వేసియు, ఖయిదు చేసియు, దేశాంతరప్రవాసశిక్ష విధించియు, నిర్బంధించిరి. ఐనను ప్రజలుమాత్రమువీరు చేసిన నిర్బంధనములను మన్నింపలేదు.

ఇంతవఱకును కాథోలిక్కు మతమునుండి విడిపోయినవారిని ప్రొటెస్టెంటులనియు వారికంటెను మానసికారాధనము నెంచువారిని ప్యూరిటనులనియు, మతాచార్యులు తొలఁగింపఁబడి మతవ్యవహారములను బరిపక్వులైనవారు నడపవలెనను వారిని బరిశుద్ధాచారులనియు, (Presbyterians) మతాంతరసహానధర్మమును బాటించి యెవరియిష్టము వచ్చినట్లు వారు దేవతారాధనము చేసికొనవలెనను వారిని క్రాంవెల్లు పక్షమువారనియు, వేఱువేఱు నామములు వ్యవహారములో నున్నవి. ఇకముందువీరందఱును విమతులని (Dissenters) వాడఁబడుదురు. రాజసమ్మత మతాచారములను విడనాడి స్వేష్టానుసారము ప్రత్యేకాలయములను నిర్మించికొని యారాధనము జరుపుకోవలెనని వీరి ప్రతిజ్ఞ. వీరిని నెఱవేర్చుకొనుటకు వీరుపడిన బాధలు ముందు వివరింపఁబడును.

మొదటిచార్లెసు కాలము మొదలు నేటివఱకు దేశమునఁ బటస్థించిన యాపదలన్నియు నా రాజునురద్దీయించిన పార్లమెంటువారి దురాలోచనములచే సంప్రాప్యములయ్యెననియు, సమానస్వాతంత్ర్యధర్మములుగలిగి రాజును పార్లమెంటును గలసి నడపించిన దొరతనమే యోగ్యమైన దొరతనమనియు రెండవ చార్లెసుయొక్క మొదటిపార్లమెంటువారుకొంతకాలము యోచించుచువచ్చిరి. స్టూవర్టురాజులకందఱకును సామాన్యముగానున్న గర్వమే యీతనిని బాధించు

చుండుటచే, సర్వవిషయములందును దా నేసర్వాధికారినని రాజునకుండుగర్వము నెదురొడ్డవలసిన యగత్యము వెంటనే పార్లమెంటువారికిఁ దటస్థించినది. క్రామువెల్లుపక్షమునఁ బ్రజానురాగమంతగా లేకున్నను, దుర్లంఘ్యముగ నాతఁడు తనమాట చెల్లించుకొనఁ గలుగుటకుఁ గారణమాతఁడు నిలుపుకొన్న స్థిరరక్షకసైన్యమే. కావున నాతనివలెనే తానును విశేషరక్షకసైన్యము నిలుపుకొవలెనని రాజుకోరెను. పార్లమెంటువారిందునకు మాఱుచెప్పిరి. పార్లమెంటు సెలవులేకుండ నిష్టానుసారము వాడుకొనుటకు విశేషధనమిండని రాజుకోరెను. పార్లమెంటువారిందున కంగీకరించరైరి. పంతము నెగ్గించుకొనుట కుచ్చనీచములు లేక యేయుపాయములను బన్నుట రాజునకు స్వభావము. ఆఁడినమాట తప్పుటకును, వంచనము చేసి ధనమార్జించుటకును, ఇంతటివాఁడు లేడు. ఈతని కేమతమందును నభిమానమంతగా లేదు కాని, అంతర్యమున కాథొలిక్కు మతమందుఁ గొంతయిష్టమున్నట్లు కానఁబడును. విమతులకారాధనస్వాతంత్ర్యమిచ్చియైన కాథొలిక్కులకట్టిభాగ్య మొదవఁగూర్చవలెనని యాతనికిఁ గుతూహలమున్నది. కాని, అందువలన నెట్టియిక్కట్టులున్నవో యని వెనుదీయవలసి వచ్చెను.

1664 సం॥లో నొలందులతో యుద్ధము సంప్రాప్తముకాగా, పార్లమెంటువారీతనికి విశేషధనమిచ్చిరి. ఈతని యుద్ధచరిత్రము మొదట కొంచెము జయప్రదముగ నుండెను గాని పిమ్మట పరాజయము సిద్ధమయ్యెను. అందుచేఁ గామనుల కీతనిపైననుమానము గలిగి విచారింపఁగా, నీతఁడు యుద్ధప్రమేయమును గట్టిపెట్టి క్రీడావినోదములందు మునిఁగి తేలుచున్నట్లు తేలినది. అందుచే నీతని కియ్యఁబడినధన మెట్లు వెచ్చింపఁబడెనో వివరింపుమని కామనులాతనిని గోరిరి. అంతట ఒలందులతో వారికిష్టమైనట్లు సంధిచేసికొనవలసి వచ్చినది. (1667)

ఈ యపజయమునకుఁ దోడు లండనునకు రెండాపదలు గొప్పవి తటస్థమైనవి. 1665లో లండనుపట్టణమందు మహామారిజాడ్యము ప్రబలి నూటికిఁ బదినుండిని తనవాతవేసికొన్నది. వెంటనే కార్చిచ్చుపుట్టి యాపట్టణములో రెండుభాగములు పరశురామప్రీతియయ్యెను. ఇట్లు కఠినములైనపన్నులు ఒలందు



యుద్ధము, మహామారి, కార్చిచ్చు, అన్నియు గుమిగూడి దేశమునకు నెన్నరాని పీడకలుగఁజేసినవి. ఇన్నిటికిని మంత్రి నుత్తరవాదిని జేసి రాజద్రోహపునేరమునకు రాజు వాని నురిదీయించెను. (1667)

విదేశవార్తలను గుఱించి యొకింత మన మీసందర్భమునఁ దెలిసికొనవలసి యున్నది. ఇక్కడికి నూఱుసంవత్సరములకిందట స్పానియాయొక్క ప్రాభవము మిన్నుముట్టి తేఱిచూడరానిదై యుండెను. దానికిప్పుడు వాసి దగ్గిపోయి, అభ్యుదయము ఫ్రాన్సుదేశమున కెత్తుకొనియెను. ఫ్రాన్సునకు మూఁడు వైపుల స్పానియా సామంతభూములుండుటచే వానిని జయించి తన రాజ్యమునకుఁ జేర్చుకొనవలెనని ఫ్రాన్సురాజు తలపెట్టియుండెను. ఈతని యౌద్ధత్యము చూచి యాంగ్లులు భయభ్రాంతులై యుండిరి. అందుచే స్వీడను, హాలండు (ఒలందు) లతో ఛార్లెసు సంధికూర్చుకొని, స్పానియాతోడ సఖ్యపడునట్లు ఫ్రాన్సును నిర్బంధించుటకుఁ బ్రయత్నము చేయఁగా పార్లమెంటు మిక్కిలిసంతసించి, ఆతనికి ధనమిచ్చెను. కాని, పార్లమెంటువారియడ్డము లేకుండ నేలుటకుఁ దగిన ధనము నీసుషమీఁద సంపాదించుకొనఁ దలపెట్టినవాఁడే కాని ఛార్లెసు ఫ్రాన్సుమీఁద నెదురొడ్డఁ గుతూహలము కలవాఁడు కాఁడు. ఈసంగతిని గనిపెట్టి ఫ్రాన్సురాజు ఛార్లెసుతో సఖ్యము చేసికొని ఆతనికి (ఛార్లెసునకు) ధనమిచ్చునట్లును, ఆతఁడు ప్రొటెస్టెంటుమతము విడిచి, కాథొలిక్కు మతమవలంబించునట్లును, ఫ్రాన్సురాజుతోఁ గూడి హాలండుతోఁ బోరునట్లును నొడఁబఱచెను. ఈయేర్పాటు దేశమందుఁ బ్రాకకుండ నతిరహస్యముగా రాజుదాచిపెట్టెను (1670).

కాథొలిక్కు మతప్రవేశము చేయుటకు ఛార్లెసు సాహసింపలేక, విమతులగువారు బహిరంగముగను రహస్యముగనుగూడ స్వేచ్ఛానుసార మీశ్వరారాధనము చేసికొనవచ్చుననియు, కాథొలిక్కులు రహస్యముగ నట్లు చేసి కొ[illegible]ననియు నొకప్రకటనము చేసెను. శాసనవిరుద్ధముగ నిట్టి సహనము నంగీకరింప నీప్రకటనము చేయుటకు రాజునకు స్వతంత్రము లేదనియు నట్టిప్రక

టనము ధర్మవిరుద్ధమనియుఁ దీర్మానించి దానిని రాజు రద్దుపఱచుకొనవలయు నాతనికి ధనమియ్యమని పార్లమెంటువారు పట్టుపట్టిరి. (1673.)

ఈప్రకటనముఁ జేసినతోడనే రాజు హాలండుపైకిదాడి వెడలుటచే, ఫ్రాన్సు రాజుతో రాజు చేసిన సమయమును గూర్చి ప్రజలకుఁ దెలియక పోయినను, అట్టి యేర్పాటొకటి జరిగియుండవలెననియు, రాజు సేనాసహాయమును గూర్చుకొని బలిమిమై ప్రొటెస్టంటుమతమునడఁచి కాథొలిక్కుమతమును నెలకొల్పు ప్రయత్నము మీఁద నుండి యుండుననియు, పార్లమెంటువారు సందేహించినవారలై హాలండుమీఁదికి రాజుతీసికొనిపోవుచున్న సేనకు నాయకులందఱు కాథొలిక్కులగుటఁ గనిపెట్టివారిని దొలఁగింప నొకయుపాయము పన్నిరి. దీనిని బోధపఱచుటకు కాథొలిక్కుమతరహస్యము నొకదాని నిచట వివరించెదము. జీవునకును దేవునకును మధ్యవర్తియై జీససు నరులపాపములను బాపుననియు నాతనిని స్మరించి రొట్టె సమర్పించిన యెడల నారొట్టె జీససుయొక్క శరీరముగ మారుననియు, ఆతని కర్పించిన పానకమాతని రక్తముగ మారుననియు, వానిని స్వీకరించినయెడల జీససున కనుగ్రహము కలుగుననియు కాథొలిక్కు సిద్ధాంతము. అందుచే ఛార్లెసు సేనలో కాథొలిక్కుమతము వారిని గుర్తించుట కుపాయముగా, పైనిజెప్పఁబడిన కాథొలిక్కుసిద్ధాంతమునందు విశ్వాసములేదని దివాణమువారియుద్యోగస్థులలోగొప్పవారు ప్రమాణముచేయవలెననియు పార్లమెంటువారు రాజుచే నొక చట్టమును జేయించిరి. (1673) ఈపరిశోధనమువలన ననేకులు కాథొలిక్కులుద్యోగమున నున్నట్లుతేలినందున పార్లమెంటువారు మునుపటికంటె భయభ్రాంతులైరి. అందుచే ప్రొటెస్టంటు ప్రభువైన హాలండు రాజుతోఁ బోరుటకు పార్లమెంటు సమ్మతింపక ధనమియ్యమని యడ్డుపెట్టిరి. వారిని దృప్తి పఱచుటకై హాలండుతో రాజు సఖ్యము చేసికొన వలసి వచ్చెను (1674)

విమతులనివాడఁబడువారుప్రొటెస్టంటులే యనిపైనవ్రాసియుంటిమి. వీరిని, కాథొలిక్కులను, గూడఁగట్టుకొని పార్లమెంటునఁడఁగ ద్రొక్కుటకు



రాజు యత్నించుచున్నట్లు పార్లమెంటువారు కనిపెట్టఁగానే ప్రొటెస్టెంటుమతములోని యంతర్భాగముల కున్న స్వల్ప యాచారభేదములను పాటిచేయక, అందఱు నేకాభిప్రాయులై ప్రొటెస్టంటు మతమును పార్లమెంటును గాపాడుకొన వలెననియు నీనిసంరక్షణార్థము రాజుతోఁ బోరినను దప్పులేదనియు పార్లమెంటులో నొకపంకవారు యోచింప మొదలుపెట్టిరి. ఎన్ని లోపములున్నను రాజునకువ్యతిరేకముగ యుద్ధముజేయుటధర్మము గాదను వారి రెండవ తెగయే వారిలోఁ బ్రబలముగానున్నది.

చార్లెసునకు సంతానములేనందున నతని తరువాత కాథొలిక్కు మతస్థుడగు జేమ్సు రాజ్యార్హుఁడై యుండెను. ఈతనిని రాజ్యమునకు రాకుండఁ జేయుట కొక చట్టమును జేయవలెనని మొదటి తెగవారి కభిప్రాయమున్నను, అధిక సంఖ్యాకులైన రెండవ తెగవారు "నావిష్ణుః పృథివీపతిః" అను నమ్మకము గలవారగుటచే వారి యాటలు సాగలేదు. అందుచే నీపార్లమెంటు సభను ముగించునట్లు రాజును సమ్మతిపఱచిన యెడలఁ దమ యిష్టము నెఱవేర్చెడు మఱియొక పార్లమెంటేర్పడవచ్చునని వారాశించియుండిరి.

ఫ్రాన్సు మీఁదికి యుద్ధమునకు రాకుండునట్లు చార్లెసు నొడఁబఱచి యాతనికిఁ బ్రతిసంవత్సరము ఫ్రాన్సురాజు కొంతమూల్యము నిచ్చుచుండెను. కొంతకాలమునకు చార్లెసు ఫ్రాన్సు రాజునువిడిచిపెట్టిపార్లమెంటుతో మంచిమాటలాడ మొదలు పెట్టిఫ్రాన్సునకు బలవద్విరోధిగా నున్నహాలండుప్రభువునకుఁ దనతమ్ముఁడగు జేమ్సుయొక్కకొమార్తెనువివాహముచేసి, పార్లమెంటు వారంగీరించినయెడల, ఫ్రాన్సుమీఁదికియుద్ధమునకుఁ బోయెదనని వారితోఁ జెప్పి, అందు నిమిత్తము వారివలన నమితముగ ధనముగొనెను. చార్లెసు నిజముగా ఫ్రాన్సుతోఁ బోరు నంతరంగమున నుద్దేశించెనని చెప్పుటకువీలులేదు. కాని వలసినంత ధనము సంపాదింపఁగలిగి తత్సాహాయ్యమున సేనను బోగుచేయుట కవకాశమును గూర్చుకొనెను. ఈసైన్యమునుపార్లమెంటుమీఁదికి నుపయోగించు నేమోయని వారును, దనపైఁ బంపునేమోయని ఫ్రాన్సు

రాజును,భయపఱుచుండిరి. ఈయాపద తప్పించుకొనుటకై రాజునకుఁ బ్రతిపక్షులుగా నున్న పార్లమెంటు తెగవారికి లంచము లిచ్చి, పార్లమెంటు సభను ముగించునట్లు రాజు నొడఁబఱచెదననియు, రాజుతనమీఁదికి రాకుండఁ గాపాడవలెననియు పార్లమెంటు వారితో ఫ్రాన్సురాజు రాయభారములు జరిపెను

ఈసేనలు పార్లమెంటుమీఁదికి రాజుపయోగించునేమో యనుభయముతో జనులిట్లుకంపించుచుండఁగా, కాథొలిక్కులు రాజునుజంపిరాజ్యమును స్వాధీనముచేసికొను ప్రయత్నములలో నున్నారని జనశ్రుతియొకటి బయలుదేరెను. (1678) ఈభయముచేపార్లమెంటులో కాథొలిక్కులుండకుండఁ జేయసమకట్టి ఆంగ్లదేవాలయములమీఁదను మతవ్యవహారముల మీఁదను, రాజే సర్వాధికారి గాని పోపుకెట్టి యధికారమునులేదనియు, ప్రసాద స్వీకారవిషయమున కాథొలిక్కుల సిద్ధాంతమునసత్యమనియు, పార్లమెంటు సభ్యులందఱును ప్రమాణమును చేయునట్లొక చట్టమును బుట్టించిరి.

తనపై యుద్ధమునకుఁ బూనినందులకుఁ బగఁదీర్చుకొనుటకై, ధనము కోరి చార్లెసు మంత్రిచే ఫ్రాన్సురాజునకు వ్రాయించిన యొకయుత్తరము నాతఁడుబయలుపెట్టిపార్లమెంటుసమ్ముఖమునకుఁ దెచ్చెను.మంత్రిప్రాణములను గాపాడుటకయి మఱియొకమార్గము గానక చార్లెసు పార్లమెంటుసభను ముగించవలసి వచ్చెను(1678)

సింహాసనమునకు భావికర్తయగు జేమ్సు కాథొలిక్కుమతమువాఁడైనను దైవాంశవలనఁగాని రాజ్యాధికారయోగ్యతకలుగదనియు, అతఁడే రాజు కావలెననియునెంచువారు టోరీలనియొక పక్షమువారును, ఆతఁడుప్రాటెస్టంటు కాకపోవుటచే నాతనికి రాజ్యార్హత లేదని వాదించు వారు విగ్గులని మఱియొకపక్షమువారునుబయలుదేరిజనసామాన్యము రెండుపక్షములుగా విడిపోయెను. ఈకాలమున కాథొలిక్కులవలని భయమువిరివిగా వ్యాపించియున్నందున1679సం॥ లో చార్లెసుపిలిపించినపార్లమెంటులోవిగ్గులే యధిక సంఖ్యగల



వారై యుండిరి. ఫరాను రాజునకు లేఖ వ్రాసిన మంత్రిని దొలఁగించియు, సైనికులను బంపివేసియు, నీపార్లమెంటు వారిని బుజ్జగించి వారిని సుముఖులను జేసికొనవలెనని చార్లెసు సాకయత్నము చేసెను గాని వారి దారికి రానందున నీ సభముగించి మఱియొకసభ చేయఁగా వారునునట్లేయైరి. ఈరెండుసభలునులండనుపట్టణములోఁ జేయఁబడినవి. ఈపౌరులుచాలవఱకు విగ్గులుగనుక యిట్లయినదని చింతించి, ఆక్సుఫర్డులో సభజరుపనుద్దేశించిరాజుమఱియొక పార్లమెంటు సభ నాపట్టణమునఁ జేయఁగా, లండను విగ్గులచ్చటికి సాయుధహస్తులై మూగిరి. అందుమీఁదనే యుపాయములేక యీసభను గూడరాజుముగించెను. (1681) జేమ్సును రాజ్యమునకు రాకుండఁ జేయుటకుఁ బట్టుపట్టిన విగ్గుల బల మధికముగా నుండుటచే రాజుమాటసాగలేదు. జేమ్సును దప్పించిన యెడల, చార్లెసు అనంతరము రాజ్యార్హత్వముగలవారెవ్వరని స్థిరపఱచుటలో పార్లమెంటువారికి భిన్నాభిప్రాయములు పుట్టెను. చార్లెసునకుభోగభార్యవలనఁ బుట్టినవిలియము పక్షమునఁ గొందఱును, అతఁడు ధర్మపత్నీసంతానము కాఁడు గనుక చార్లెసు సోదరియగు మేరీపక్షమునఁ గొందఱును, నుండిరి. జేమ్సును దప్పించినయెడల, విపఱులప్రాభవమెక్కువై, వెనుక ప్యూరిటనులనాఁటి పాట్లుమరల వెలయఁగలవని భయపడి కొందఱు విగ్గులు టోరీలయిరి. ఇందునకుఁ దోడుగ రాజునుజంపి రాజ్యముస్వాధీనము చేసికొనుటకు కాథొలిక్కులు కుట్రపన్నుచున్నారను కింవదంతిచేఁ గంపితులై విగ్గులనేకులు నిరపరాధులగు కాథొలిక్కుల నురిదీయుచుండుటచే, ప్రజాభిప్రాయము విగ్గులకు విముఖమయ్యెను.

కారణము చెప్పకుండజనులను గారాగృహమునకంపఁ గూడదనియు, విచారణములేకుండ ఖయిదీలను ఖయిదులో నుంచఁగూడదనియు మొదటి చార్లెసుకాలమందొక చట్టముపుట్టినదని చెప్పియుంటిమి, ఐన నేదోయొక విధమున మంత్రులు దీనికి విరుద్ధముగాఁ దమయాగ్రహమునకుఁ బాత్రులైనవారిని నిగళ బద్ధులఁ జేయుచువచ్చిరి. ఇందున కవకాశము తప్పించుటకై ఖయిదీని

గారాగృహమునకుఁగొనిపోవుటకుఁ బూర్వము జడ్జీలాతని కొకచీటీ నియ్యవలెననియు, విచారణమునకు హాజరగుదురని నమ్మతగిన వారిని రిమాండులోనుంచ నక్కఱలేదనియు, ఖయిదీ చీటిని జూపఁగానే జయిలరు ఖయిదీని జడ్జీయెదుట హాజరు పెట్టవలెననియు, విగ్గులొక మహోపకారమైన చట్టమును బుట్టించిరి. ఖయిదీలు చిరకాలము రిమాండులో నుండనక్కఱలేకుండ వెంటనే నేరము విచారణము జరుగునట్లు కూడ నియమము చేయఁబడెను.

ఆక్స్ఫర్డు పార్లమెంటును ముగించిన వెనుక, పూర్వమువలెనే చార్లెసు ప్రాన్సు రాజువలన ధనము పుచ్చుకొనుచు నాలుగు సంవత్సరములు పార్లమెంటు లేకుండనే కాలము గడపెను. మఱియు, పూర్వపు రాజువలన మునిసిపలు స్వాతంత్ర్యమును బొందినపట్టణముల కట్టిస్వాతంత్ర్యములను దీసివేసి, రాజు తన కిష్టమైనవారిని మునిసిపలుద్యోగములందు నియోగించెను. పూర్వము పార్లమెంటునకు సభ్యులను నియమించుకొనుస్వాతంత్ర్యము పట్టణములలోని నేవుల కుండుచువచ్చెను. తన కనుకూలురైన వారిని పార్లమెంటునకుఁబంపుట కొడఁబడిన కొందఱు సంపన్నులకు మాత్రమట్లు స్వాతంత్ర్యమును నిలిపి, రాజు తక్కిన వారికి లేకుండఁ జేసెను. ఇందుచే విగ్గులను పార్లమెంటులో లేకుండఁజేయుటకు చార్లెసు తలపెట్టినయేదో యొక దోషస్థాపనము మీఁద విగ్గులను గారాగృహ బద్ధులఁజేసియు, జుల్మానాలు వేసియు, నురిదీసియు, బాధించుచుండెను.

తమకోరికలలో నొక్కటియుఁ జెల్లలేదని విచారించి, విగ్గులు ముందు చేయవలసిన దేమని యాలోచించుచుండిరి. వెనుక క్రాంమువెల్లునాయకత్వము క్రిందఁబోరిన సైనికులు కొందఱు విగ్గులవిషాద హేతువును గనుఁగొని వారికిఁదెలియకుండనే రాజును జేమ్సును మార్గమున నొంటరిగ నున్నప్పుడు తుపాకితోఁ గొట్టిచంపవలెనని యొక కుతంత్రము పన్నిరి. ఈతంత్రమును విగ్గుల యాలోచనములును, రాజమంత్రుల చెవినిబడఁగా, విగ్గులను రాజద్రోహులని యురిశిక్షల పాలుచేసిరి. (1683) అంతట రాజు 1685సం॥లోఁ గాలధర్మము నొందినందున నాతని సోదరుఁడు జేమ్సు రాజ్యమునకువచ్చెను.



ఈతఁడు రాజ్యముఁబూనిన నాలుగు మాసములలోనే కొందఱు విగ్గుల బలముతో చార్లెసుయొక్క భోగకాంతా పుత్రుఁడగు విలియము ఇంగ్లాండుపై దాడివెడలఁగా రాజసేన వానినోడించి, నురిదీసి దేశమంతట నురికంబముల నిలబెట్టి యాతనికి సాయము చేసిన విగ్గులను వేనవేలుగా నురిదీసిరి.

రెండవ జేమ్సు యోగ్యతకాని ప్రజ్ఞకాని లేనికఠినచిత్తుఁడు. తానొక సేనను నిలుపుకొని కాథొలిక్కులపైఁ జట్టములను రద్దుచేయుటకు సాధనముగా విశేష ద్రవ్యమును బొందవచ్చునను నడియాసతో నాతఁడొక పార్లమెంటు సభను బిలిపించెనుగాని, వారందఱు టోరీలైనను, రాజుకోరిన రెండు విషయములను నంగీకరించనందున వారిని బంపివేసి (1685) మరల పార్లమెంటును బిలువకయే కాలముగడపెను.

నరహత్యపు నేరమునకు దండింపఁబడినవారిని రాజు చిత్తానుసారము క్షమింప వచ్చునుగదా! ఆవిధముగానే రాజున కిష్టమైన యొక్కొక్కమనుష్యుని చట్టము మీఱినను క్షమింపవచ్చునని యొక స్వతంత్రమేర్పఱచుకొని పార్లమెంటు లేకుండ, రాజ్యము చేయవలెనని రాజు సమకట్టి తనకనుగుణముగఁ దీరుమానము చెప్పునలుగురుని జడ్జీలుగా నేర్పఱచుకొనెను. ఇందుమూలముగ కాథొలిక్కుల కుపకారము చేయుటకు రాజొక యుపాయము పన్నెను. రాజకీయోద్యోగస్థులు కాథొలిక్కుమత సిద్ధాంతములకు వ్యతిరేకముగఁ బ్రమాణములు చేయవలెనని రెండవ చార్లెసుకాలములో నేర్పడిన చట్టముల నమలులోనుంచక, కాథొలిక్కులకు విశేషాధికార పదములీయవలెనని రాజుతలపెట్టి ఆమతస్థులనొకని కుద్యోగమిచ్చి, అతఁడు స్వమత విరుద్ధముగఁ బ్రమాణము చేయుటకు నిరాకరించినందున కాతనిపై నేరము మోపించి పైనిజెప్పఁబడిన జడ్జీలయెదుట తీరుమానమునకుఁ దెప్పించెను. ఇచ్ఛవచ్చినపుడొకానొకని విషయమున శాసనధిక్కారమును రాజు మన్నింపవచ్చునని జడ్జీలుతీర్పు చెప్పిరి. ఈతీర్పు నాధారము చేసికొని, కాథొలిక్కులకనేకుల కుద్యోగములిచ్చియు, కళాశాలలలో గౌరవపదవులందు నిలిపియు, తనయాలోచనసభలో

మంత్రులుగ నియమించుకొనియు, రాజనేక విధముల కాథొలిక్కుల నాదరించెను (1686).

మతాచార్యుల కీచర్యలు రుచించవని రెండవజేమ్సెఱుఁగని వాఁడు కాఁడు. అందుచే విమతపక్షమువారిని తనవంకకుఁ గూడఁ గట్టుకొనుతలంపుతో కాథొలిక్కులును విమతులునుగూడ స్వేష్టానుసారముగ బహిరంగముగను, స్వగృహములందును, నీశ్వరారాధనముఁ జేసికొన వచ్చునని యొకసహన శాసనమును జేసెను(1687). దేశచారిత్రమందు స్థిరపడియున్న చట్టములనిట్లకారణముగ నిరసించుటకు రాజున కధికారముగలదా యని జనులు నిశ్చేష్టులైరి. ఒక్కొకతరుణమందుఁ జట్టముల నమలుచేయక నిలుపుటకు స్వాతంత్ర్యమును రాజులు చిరకాలమునుండి యనుభవించుచు వచ్చిరని యితిహాసములఁ దడవుచు రాజుతన విపరీతచర్యలను సమర్థించుకొనుచు వచ్చెను గాని వెనుకటిరాజు లిట్లు ప్రజల సమ్మతిని బురస్కరించుకొని చట్టములయమలును నిలిపియుండుటయు, ఈరాజట్లు కాక ప్రజాభిప్రాయ విరుద్ధముగ నడచుకొనుటయుఁ దటస్థించుటచే, ఈతని చర్యలంతకంతకు జనద్వేషమునుబుట్టించి చట్టములను మీఱుటకు రాజు స్వతంత్రుఁడు కాఁడని యాబాలగోపాలము నేకవాక్యతగఁ దలఁచునట్లు చేసినవి.

పార్లమెంటు పేరుతలపెట్టకూడదని జేమ్సు మొదట నుద్దేశించినను, కాథొలిక్కులపై నిషిద్ధశాసనములను రద్దుపఱచు చట్టమొకటి పార్లమెంటు పురస్సరమునఁ బుట్టింపవలెనని యీతనికిప్పుడు కోరిక పుట్టెను. అతనికేండ్లుపైఁ బడుచున్నందున, తనవెనుక నీచట్టము తిరుగనమలునకు వచ్చి కాథొలిక్కుల బాధించునని యాతనికి భయము పుట్టెను. తన కనుకూలురైన సభ్యులను పార్లమెంటునకుఁ గూడఁగట్టుటకు సాధనముగ, పట్టణములలోను, పల్లెలలోను, నుండు టోరీమేజస్ట్రీలను దొలఁగించి కాథొలిక్కులను విమతమువారిని వారి స్థానమున నెలకొల్పెను. ఇందుచే దేవాంశ సంభూతుఁడగు రాజుమాట కడ్డు చెప్పఁగూడదని వాదించుటోరీల కాతనిపై మొగము మొత్తెను. పాప



మామతమువారైన నీతని కనుకూలురు గాకైరి. ఆరాధన స్వాతంత్ర్యము తమకిచ్చి నందునకు వారెంత హర్షించినను, తమతో సమానముగ కాథొలిక్కుల కట్టిస్వాతంత్ర్యము కలుగుటకు వారికిష్టములేదు. ఇంతియకాక రాజుపై ద్వేషించియున్న టోరీలును విగ్గులును విమతపక్షమువారివలనే ప్రాటెస్టంటులే యగుటచే, రాజుతోఁ గలిసి శాసననిరాకరణమున కంగీకరించవలదనియు, రాజుపక్షమునఁ జేరక తమవలె నెదురొడ్డినయెడల, నారాధన స్వాతంత్ర్యము ముందుశాసనరూపమునఁ దామేయిచ్చెదమనియు టోరీలును విగ్గులును గలసి విమతపక్షమువారితో నమ్మఁబలుకుచుండిరి.

ప్రజలతో విరోధము కూడదని యెన్నిచక్కటలు చెప్పినను రాజు వానినిఁ బెడచెవిని బెట్టెను. మఱియొక మతాంతరసహనశాసనము నొకదానిని బ్రచురించి యారాధనకాలమం దన్ని దేవాలయములందును దానిని జదువునట్లు రాజుత్తరువు చేసెను. ఇట్లు చదువుటకు నిరాకరించి కొందఱు మతాచార్యులు రాజునకొక విజ్ఞాపనము వ్రాసి, యీశాసనము ధర్మవిరుద్ధమనియు, మనస్ఫూర్తిగా దానిని గౌరవించి యారాధనసమయమునఁ జదువఁజాలమనియు విన్నవించుకొనిరి. పూర్వపు మూఢాభిప్రాయములను విడనాడి విగ్గులవలెనే టోరీలును జట్టములను మీఱినప్పుడు రాజునెడభక్తి యుంచఁగూడదని తలంచుచుండిరి. ఈవిజ్ఞాపనము వేలకొలఁది గాముద్రింపఁబడి దేశమంతటను వెదఁజల్లఁబడినది. రాజద్రోహకరముగ నీవిజ్ఞాపనము వ్రాయఁబడినదని దానినివ్రాసిన మతాచార్యులపై నొకనేరము రాజుగారికోర్టులో విచారింపఁబడెను. న్యాయసభాస్థలి యంతయు జనులతో నూపిరిసలుపక నిండియుండెను. కాటికిఁ గాళ్లుచాపుకొనియున్న రాజుయొక్క యాగ్రహముకంటె ముందురాఁబోవు పార్లమెంటుయొక్క యాగ్రహమునే పాటిచేసి జడ్జీలు రాజుచేసినమతాంతరసహనశాసనము ధర్మవిరుద్ధమని నిర్ణయించి, విజ్ఞాపనము వ్రాసిన మతాచార్యులు నిర్దోషులని తీరుమానించిరి. ఈ తీరుమానమున కన్నిమతశాఖలవారును నత్యంతసంతుష్టులై జడ్జీలను మిన్నుముట్టఁగొనియాడి యుత్సవములు చేసికొనిరి. (1688) అంతట జేమ్సునకు పుత్రసంతానముకలి

గెను. జేమ్సు రాచరికమునకు జనులువిసికి స్టూవర్టువంశము వారికి రాజ్యార్హత లేకుండఁ జేయఁదలఁచి, మొదటి చార్లెసుయొక్క దౌహిత్రుఁడగు మూఁడవవిలియమున కాహ్వానశుభలేఖనంపిరి. ఈలేఖలో విగ్గులును టోరీలును గలిసిరి. ఆకాలమున విదేశరాజులకుఁ గంటకుఁడుగానున్న ఫ్రాన్సు రాజువలన జేమ్సు సుంకము గొనుచుండుటచే, మూఁడవ విలియముయొక్క రాకకు వారుకూడ సహాయపడిరి. విలియము సేనాసమేతుఁడై దేశమునదిగి విగ్గులచేతను టోరీలచేతను స్వాగతము నొందెను. రెండవ జేమ్సు "బ్రతికి యుండిన సుఖములఁబడయవచ్చు" నని తలదాఁచుకొనుటకు ఫ్రాన్సునకుఁ బోయెను.

అప్పుడొక పార్లమెంటు సభ జరిగినది. సింహాసన మనధిష్ఠితముగా స్థిరపఱచి మొదటి చార్లెసుయొక్క కొమార్తెయైన మేరీతోడఁగూడిన మూఁడవ విలియమునకుఁ బట్టాభిషేకము చేసిరి. ఆతరుణమందు పార్లమెంటువారు ప్రజాస్వాతంత్ర్య పత్రికనొకటి లిఖించి, పార్లమెంటుతో నాలోచించకుండ నిరంకుశముగ స్టూవర్టురాజులు రాజ్యము జరుపఁ జేపట్టిన రాజ్యపద్ధతి శాసనవిరుద్ధమనియు, పార్లమెంటుసభ తఱచుగాఁ జరుగుచుండవలెననియు, పార్లమెంటువారియనుమతిలేకుండ రాజుస్థిరముగ సేననిలుపఁగూడదనియు, పన్నులఁ బుచ్చుకొనఁ గూడదనియు, చట్టముల నిరాకరించఁ గూడదనియు, ఉన్న చట్టముల నమలుజరుపక నిలుపుచేయఁ గూడదనియు, మొదలగు రాజధర్మములను నిరూపించి, ఆరాజుచే చట్టము చేయించిరి(1689).

-:o:-

# అధ్యాయము. 15.

-:o:-

## రాజ్యపద్ధతి నిర్ధారణముగుట.

### 1699-1702

స్టూవర్టు రాజులకాలములోఁ బ్రబలియున్న పగవు నేటి కీస్వాతంత్ర్యపత్రికతో పార్లమెంటున కనుకూలముగను రాజునకు వ్యతిరేకముగను బరిష్కృతమయినది. జానుకాలమునఁ బ్రజాస్వాతంత్ర్య రక్షకముగఁ బుట్టిన చార్టరువలెను, మొదటిచార్లెసు నాటి స్వాతంత్ర్య పత్రికవలెను, ఇది ప్రజలకు మిక్కిలి సంరక్షకమయినది. దీనివలన రాజకుటుంబమువారికి పరంపరముగావచ్చు వారసత్వ క్రమముకూడ మాఱిపోయినది. పార్లమెంటువారిచ్చిన యధికారమే యాధారముగా నేలవలసిన మూఁడవ విలియము మొదలుగాఁగలముందు రానున్న ప్రభువులు దైవాంశవలన రాజపదవికి వచ్చినామనియు, అందుచే పార్లమెంటువారును వారిచట్టములును మమ్ము నిరోధింపఁ జాలవనియుఁ జెప్పుకొనుచుఁ దమమాట కడ్డములేకుండ వ్యవహరించుట కవకాశము తప్పిపోయినది. రాజపదవిని పావనముగాఁ జూచు టోరీల కీకారణముచేతనే ముందువచ్చు రాజులయెడ భక్త్యతిశయము లేకపోయెను. పార్లమెంటువారివలన నియమింపఁబడిన రాజులయెడ నాదరాతిశయముగల విగ్గులింతటినుండి ప్రముఖులై రాజునం దధికారము నామమాత్రమునిలఁబెట్టి పార్లమెంటుమూలమునఁ దామే రాచరికము నడపించిరి. రాజే సర్వాధికారిగను పార్లమెంటువారు రాజుయొక్క నిరంకుశ చరిత్రనడ్డుపెట్టు నుపదేశకులుగను నింతవఱకు నిగడిన పూర్వపు రాజ్యపద్ధతి మారిపోయెను. పార్లమెంటు ముఖమున ప్రజా ప్రతినిధులే సర్వాధికారులయి యేలఁగలిగిన దినములు ప్రారంభమైనవి.

ఇట్టి మార్పునకుఁ దోడుపడి విలియమునకు రాజ్యమొసఁగిన వారిలో గొందఱు (Dissenters) విమత పక్షమువారుండిరి. అందుచే వెనుక రెండవచార్లెసు కాలములో వీరికి బాధకముగ వెలసిన ప్రతిబంధక శాసనములను రద్దుపఱచి వారికారాధన స్వాతంత్ర్య మిచ్చు తరుణము వచ్చినది. అందుచే విమతులకందఱకు నారాధన స్వాతంత్ర్యము నొసఁగి వారు ప్రత్యేకముగ నాలయముల నిర్మించుకొనుటకంగీకరించు మతాంతర సహన శాసనమను పేర 1689సం॥లో నొకచట్టము చేయఁబడెను. ఇంతమాత్రముచేత విమతులు రాజసమ్మతమైన మతము నవలంబించిన వారితో సమానస్థితికి వచ్చినట్లు తలఁపఁగూడదు. వారిపలె విమతులు రాజకీయోద్యోగార్హులు కారు. దేవాలయమం దాచార్య పదవికిఁ బనికిరారు. ఈలోపము సవరణమగుటకు నేఁడాదిగా నూటయేఁబది సంవత్సరములు పట్టినది.

ఫ్రాన్సు దేశమునకుఁ బ్రవాసము వెళ్లిన జేమ్సునెడఁ గొందఱు మతాచార్యులు భక్తియుక్తులుగ యుండిరి, అందుచే విలియము పట్లను, ఆతనిరాణియగు మేరీవిషయమునను, రాజభక్తితో వర్తించెదమని యందఱు మతాచార్యులును బ్రమాణములు చేయవలెననియు, అందున కొడఁబడనివారాచార్యపదవిని వదలుకొనవలెననియు నొకచట్టము చేయఁబడెను(1689). ఇట్టి ప్రమాణమున కంగీకరింపక 400 మంది యాచార్యత్వమునకుఁ దిలోదకములు విడిచి పెట్టిరి. ఫరాసు రాజును సేనతో దేశమునకుఁ బిలిపించి విలియమునోడించి జేమ్సునకు నష్టరాజ్యము నిప్పింపవలెనని తంత్రములు పన్నువారి తెగ యొకటి తలయెత్తినది. యీ యుద్వరసంఖ్య ప్రబలలేదు గాని, పెక్కు కుట్రలు పన్ని దొరతనమువారికిఁ గొన్ని వత్సరములవఱకు వీరుకొంత యాందోళనము కలుగఁ జేసిరి.

పార్లమెంటువారి ప్రాముఖ్యతను బలపఱచు రెండు క్రొత్తపద్ధతులు బయలుదేరినవి. దొరతనమునకంతకును శిరోభూషణము వంటివారు గనుక వెనుకటి రాజులు దివాణపుమాన్యములవలనవచ్చు నాదాయమును, పార్లమెంటువారిచ్చుధనమును తమకుతోచినరీతిని వెచ్చించుచుండిరి. రాజుకోరినధనమును పార్లమెంటువారిచ్చిన నియ్యవచ్చును; లేకున్న మానవచ్చును గాని, ఇచ్చిన సొమ్మునువ్యయపఱచువిషయమున వారికి జోక్యమెన్నఁడును లేదు. రాజ్యాంగములలో దీనికింత ద్రవ్యము వ్యయపెట్టవలెనని నియమించుచు రాజునకుద్రవ్యమిచ్చెడు నాచారమునునూతనముగా1688సం॥లోపార్లమెంటువారుప్రారంభించిరి. రాజునకు1200000నవరనులిచ్చి, అందుసగము సివిలధికారుల నిమిత్తమును, తక్కిన సగము మిలిటరీ యుద్యోగస్థుల నిమిత్తమును, వెచ్చించవలెనని నియమించిరి. నానాటికీయాచారమును బలము చేయుచురాగా రాగా, ఇప్పుడు కామనుశాఖవారు దొరతనమువారే బాపతున కెంత వెచ్చించవలెనో నిర్ధారణము చేయుచున్నారు. పూర్వము, ఎగుమతి దిగుమతి సరకులమీఁదఁ గట్టఁబడు పన్ను రాజునకు యావజ్జీవము నొసఁగుచు వచ్చిరి. ఈపార్లమెంటువారట్లుకాక నాలుగు సంవత్సరములకు మాత్రమీపన్ను విలియమునకిచ్చిరి. ఈ యాచారమువలన దివాణమంతయు ధనవిషయమున కామనుశాఖవారి చేతిలోనికి వచ్చినది. దివాణపుసొమ్ము విషయమున కామనులే సర్వాధికారులైరి.



వీరు మొదలుపెట్టిన రెండవయాచారము మిలటరీ నేరములను గుఱించి నైనవివరించిన స్వాతంత్ర్య పత్రికనుబట్టి, పార్లమెంటుయొక్క యంగీకారము పొందకుండ రాజుస్థిరముగా సేననుంచుకొనఁగూడదని యేర్పడియున్నది. దేశరక్షక సేనను లేకుండఁజేయుటయే దీనిముఖ్యోద్దేశము. ఈసేనయే మొదటి చార్లెసునకుఁ బ్రాణగొడ్డమై ప్రజాప్రభుత్వము తెచ్చిపెట్టినదని టోరీలకును, దీనియాధారమున రెండవజేమ్సునిరంకుశముగ నేలఁదలపెట్టఁగలిగివాఁడని విగ్గులకును, ఈరక్షక సేనను రాజు నిలుపుకొనుట కిష్టము లేకపోయెను. దేశముమీఁదికి యుద్ధము వచ్చిన యెడలఁ గాపాడుకొనుటకుఁ బ్రతిమండలమందునను కట్టుబడి బంటులేచాలునని వీరియభిప్రాయము. ఆకాలపురాజులలో ఫ్రాన్సురాజునకు లోకవిఖ్యాతమైయుద్ధనైపుణ్యముగల సేనగలిగియుండెను. అట్టి బలియునితో నాంగ్లదేశమునకు యుద్ధము సంప్రాప్తమైనందున సేనను దిఱుగ సమకూర్చవలసిన యదను వచ్చినది. ఈసేనను యుక్తముగా సమర్థించు

టకుఁదగిన శిక్షాస్మృతియు, దానినములు జరుపుటకుఁ దగిన న్యాయసభలును, నావశ్యకములైనవి. అట్టిశాసనములు గాని కోర్టులు గాని యిదివఱకు దేశమున లేవు. బంట్లుకొందఱు శత్రుపక్షమునకుఁ దిరిగినప్పుడు రెండవజేమ్సు వారి నురిదీయించెను. నిజమునుబట్టి చూచినయెడల నీదండనము శాసనవిరుద్ధమని చెప్పక తప్పదు. అందుచేతనే 1689 సం॥లోఁ దిరుగఁబాటుజరిగినప్పుడువారి దండనార్థమొక చట్టము చేయఁబడి యొకసంవత్సరము మాత్రమమలులో నుంచఁబడెను. అంతటితో నవసరముతీరనందున మఱియొక వత్సరము వఱకు గడువు పెంచవలసి వచ్చినది. మొదటరక్షకసైన్య మగత్యము లేదనియు, అగత్యమున్నట్లు తోఁచినవెనుక దానిని తమయాధిపత్యము క్రిందనే యుంచుకోవలెననియు, పార్లమెంటువారనుకొనుటచేతనే సేనాప్రవర్తకశాసనము స్థిరముగాఁ బుట్టలేదు. ఇట్టిశాసనమొకటి యిటీవల 1881 సం॥లోఁ బుట్టినదిగాని దానికిని ప్రతివత్సరమును నాయువు పోయవలసి వచ్చును. అట్లు పునరుజ్జీవితముచేయనియెడల శత్రుపక్షము పట్టినబంటును కంట్రాక్టువిరోధమునకు సామాన్యులను దండించినట్లు దండింపవలెనుగాని వేఱుసాధనములేదు. సేనానాయకుని బంటు కొట్టినయెడల దెబ్బలాటనేరమునకు విధింపవలసిన దండనమే బంటునకును విధింపవలెను. ఇట్లు సాంవత్సరికశిక్షాస్మృతులవలన దివాణపు సిబ్బంది మీఁదఁ గూడ పార్లమెంటువారే యధికారము చేత నుంచుకొనఁగలిగిరి.

విలియము రాజ్యమునకు వచ్చుటకు స్కాటులును, ఐర్లండువారును నిరాక్షేపముగ నంగీకరించినవారు కారు. 1688-9లలో స్కాట్లండును ఇంగ్లాండును వేఱ్వేఱు రాజ్యములే. రెండిటికిని రాజుమాత్ర మొక్కఁడు. కాఁబట్టి రెండవజేమ్సును ఆంగ్లసింహాసనమునుండి తొలఁగించిన మాత్రమున స్కాట్లండు రాజ్యమునకుఁగూడ నాతఁడు నీడువవలనక్కఱలేదు. ఇంగ్లాండు దేశమువారవలంబించిన మార్గమును స్కాటులామోదించిన నామోదించవచ్చును, నిరాకరించిన నిరాకరించవచ్చును కాని, స్టూవర్టు రాజులయెడ స్కాటు లనుకూలురు కారు. వారిమతమునకు వారినివిడిచిపెట్టక వారిమతవ్యవహారముల మార్పులను దెచ్చి పెట్టుటకుఁ బ్రయత్నముచేసియు, కఠినములైనచట్టములను జేసియు,



ననేకవిధముల స్టూవర్టులు ప్రజాద్వేషమును సంపాదించుకొనిరి. అందుచే స్టూవర్టులవలని శనివదలినదని స్కాటులత్యంతానందముతో రాజ్యభారము బూనుమని విలియమునకు స్వాగతమిచ్చిరి, ఆంగ్లేయులవలెనే వీరును స్వాతంత్ర్యదర్పణము నొకదానిని వ్రాసి, స్కాట్లండునందుండు పరివస్మండలాధిష్ఠితమతప్రచారమును రాజునెలకొల్పునట్లును, పార్లమెంటువారిచ్చిన యధికారమే రాజపదవి కాధారముగాఁగొని విలియము రాజ్యముచేయునట్లును, అతనివలన నంగీకారమును గొని యాతనికిఁ బట్టము గట్టిరి

ఇట్లని రెండవజేమ్సుపక్షమున నభిమానముగలిగి పోరాడిన స్కాటులు లేరనుకొనఁగూడదు. అట్టివారందఱుకూడి రెండువత్సరములు యుద్ధముచేసి 1690సం॥లో నోడిపోయిరి. వారిణదటున నుంచుటకు, దుర్గములుకట్టఁబడెను.

ఐర్లండునందట్లు కాక, ఆదేశమువారు రెండవజేమ్సువలెనే కాథోలిక్కుమతస్థులగుటవలన నాతనిరాచరికమే ప్రొటెస్టంటుమతము వాఁడగు విలియమురాచరికముకంటె ననుకూలముగ నుండుననియెంచి, ఈక్రొత్తరాజునకు దేశము స్వాధీనము కాకుండఁజేయుటకు మూఁడు సంవత్సరము లెడతెగని యుద్ధము చేసి, తమయిష్టానుసార మీశ్వరారాధనము చేసికొనుటకు విలియమంగీకరించునట్లును, జేమ్సుయొక్క బంటులాతని రాచరికమున సంపాదించుకొన్న మాన్యములను వారనుభవించునట్లును 1691 సం॥న సంధిచేసికొనిరి. స్కాట్లండునకువలెనే యైర్లాండునకును బ్రత్యేకపు పార్లమెంటుగలదు. కాని ఆదేశపు పార్లమెంటునకువలె నైరిషుపార్లమెంటునకు స్వతంత్రముగ వ్యవహరించు నధికారములేదు. ఈపార్లమెంటులో ప్రొటెస్టంటు లధికమై కాథోలిక్కుల విద్యార్థులు స్వదేశమందుఁగాని విదేశమందుఁగాని విద్యనేర్చుకోఁగూడదనయుఁ వారుభూవసతుల సంపాదింపఁగూడదనియు, పార్లమెంటునకుసభ్యులను నియమించుకొనఁగూడదనియు నాయుధముల నుంచుకోఁగూడదనియు, ప్రొటెస్టంటుకన్యలను వివాహమాడియైన మాన్యభూము లుంచుకొనఁగూడదనియు, మొదలగు క్రూరశాసనములను జేసిరి. ఇందుచే

విలియమురాక పాప మీదేశములో జనబాహుళ్యమున కనిష్టదాయకమయినది

ఇంగ్లాండునకు రాకపూర్వము విలియము హాలండు దేశమునకు రాజు. ఆదేశమునకును ఫ్రాన్సునకును బద్ధవైరమున్నదని వాచకులకు వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఫ్రాన్సురాజు యుద్ధవిద్యయం దారితేరిన పదాతిబలగమును వ్యూహనైపుణ్యముగల వరూధినీనాయకులను సంపాదించుకొని, జర్మనీ, స్పానియా, హాలండు దేశములమీఁదికి దాడివెడలుచుండుటయు, రెండవ జేమ్సు దుర్బలుఁడై యాతనితో స్నేహముననుండుటయు, విలియమునకుఁ గంటకముగనుండె. ఆరాజు బలముడిగింప బద్ధకంకణుఁడై రెండవజేమ్సు రాజుగానున్నంతకాలము తనపూనిక నెఱవేఱదని యూహించి, ఆంగ్లరాజపదవికి సమ్మతించెను. ఫ్రాన్సురాజు గర్వపరిహారమునకై జర్మనులును స్పానియులును ఒలందులును జేసికొన్న సఖ్యసంఘములో నాంగ్లేయులనుగూడ జేర్చుకొనుట కాతఁడుత్సాహపడెను. ఈతని యుద్యమము నెఱింగినవాఁడు గనుకనే, ఫరాసు రాజు రెండవజేమ్సు పక్షముననుండి యాతనికి నష్టరాజ్యము నిప్పింప ననేక ప్రయత్నములు చేసెను. ఇందుచే విలియము రాజ్యభారమును బూనినవెంటనే ఫరాసులతోడ నాంగ్లదేశమునకు ఘోరయుద్ధము సంప్రాప్తమయ్యెను. ఈయుద్ధములో నాంగ్లేయులు మున్నెన్నఁడును వెచ్చించని లెక్కలేనిధనము వ్యయపెట్టి సామంతదేశమును, జగదేకవీరులను ప్రఖ్యాతిని, సంపాదించుకొనిరి. ఈయుద్ధము వారు గర్వముచేఁ గాలుద్రవ్వి కొనితెచ్చుకొన్నదికాదు. యుద్ధము చేసి స్టూవర్టులవలని గోడుడిపి స్వాతంత్ర్యమును గాపాడుకొనుటకో, రెండవ జేమ్సును రాజుగా నంగీకరించి నిరంకుశాధికారమునకుఁ దలయొగ్గుటకో, నిర్ణయించుకొని కర్తవ్యమును బూనుకొనవలసిన యవసరము గలుగుటం బట్టి యనివార్యముగ వారీయుద్ధమున కభిముఖులు కావలసివచ్చినది. ఈయుద్ధము 1683 సం॥ మొదలు 1697 సం॥ వఱకును జరిగినది. 1697లో ఫ్రాన్సురాజు విలియముతో సఖ్యము చేసికొని రెండవజేమ్సు పక్షమున నికఁ బోరాడననియు, విలియమును



ఆంగ్లరాజుగా నంగీకరించెదననియు నొడఁబడెను. ఈసంధివలన రెండవజేమ్సు వలని పీడ దేశమునకు వదలినది.

విలియము తనమాటపూర్తిగాఁ దీసివేయలేఁడను ధైర్యముతో పార్లమెంటువారనేక శాసనముల నీతనికాలమునఁ జేయించిరి. పైనివివరించినట్లనేకవిధముల రాజ్యప్రవర్తకత్వవిషయమున తామునే ముఖ్యాధికారులై యేర్పడినందున, పార్లమెంటులేకుండ రాజు దేశము నేలునేమో యని భయపడుట కవకాశము తప్పిపోయినది. ఐనను దనకిష్టమైన పార్లమెంటువారిని బెట్టుకొని, ఆపార్లమెంటువారివలనఁ బ్రజలకనురాగము తప్పిపోయినను రాజ్యమునడపుకొనునేమో యని భయము కలిగినది. అట్లు చేయుట కవకాశములేకుండఁ జేయవలెనని యుద్దేశించి, నూతనముగ పార్లమెంటేర్పడినప్పుడు మొదటిసభ జరిగినది మొదలు మూడు సంవత్సరములపై నిరంతరముగ మఱిపార్లమెంటు లేకుండ నుండఁగూడదనియు నొకశాసనము చేయఁబడెను (1664).

దొరతనమువారు చేయుచట్టములనుగుఱించియు, న్యాయస్థానములందు జరుగు తీర్మానములను గుఱించియు, గ్రంథకర్తలు లిఖించిన గ్రంథములను గుఱించియు, లోకవార్తలనుగుఱించియు, విమర్శించి మంచిచెడ్డలఁ జర్చించు వార్తాపత్రికలుండవలెను. కాని, యిట్టి స్వేచ్ఛాప్రవృత్తి వార్తాపత్రికలకిచ్చుటకు రాజులింతవఱకంగీకరించినవారు కారు. ట్యూడరువంశరాజులును, మొదటిచార్లెసు మొదలుగాగల స్టూవర్టువంశరాజులును, పత్రికాధిపతులను గ్రంథకర్తలను, ఇచ్చవచ్చినట్లు వ్రాయకుండ నష్టపెట్టుశాసనములను జేసిరి. రెండవ చార్లెసు కాలములోఁగూడ నిట్టిశాసన మొక్కటి వెలువడి యప్పుడప్పుడు పునర్జన్మమెత్తుచువచ్చినదికాని, అది 1679 సంలో రాజునకును పార్లమెంటునకును బ్రతికక్షలేర్పడియుండుటచే నంతరించి, రెండవజేమ్సు రాజ్యమునకు వచ్చువఱకు గాఢనిద్రలోనుండి 1685 సం॥లోఁ దిరుగఁ దలయెత్తి సప్తవత్సరజీవియై 1692 సం॥లో నొకవత్సరమువఱకు నాయువుపొంది 1693సం॥లోఁ బ్రాణముపోయియు వాకు లేక యంతరించినది. నాటినుండియుఁ జరుగు నష్టమునకుఁ బరిహారము

నిప్పించు సివిల్ చట్టముతప్ప పత్రికాధిపతి కలముయొక్క విశృంఖలమార్గమును నిరోధించు సాధనములేదు. దొరతనమువారి చర్యలను విమర్శించిఖండించు వ్రాతలు దొరతనముయొక్క పరువునకు భంగముతేఁగలవుగనుక సివిల్ చట్టము క్రింద దోషదూషితమని చెప్పవలెనుగాని రాజద్రోహపు నేరమగునని నిర్ణయించు చట్టములేదు. అందుచే 1693సం॥ నాటనుండి వార్తాపత్రికలయందున్న ఖండన శక్తికి జడిసి దొరతనమువారు తమచర్యలను నడపుకొనవలసివచ్చినది. విలియము తరువాత రాజ్యమునకువచ్చిన ఆనిరాణికాలములో ననేకులు రాజకీయవిషయములనుగూర్చి గ్రంథములలోను వార్తాపత్రికలలోను వ్రాయుచువచ్చిరి. ఇందుమూలమున మునుపటికంటె నెక్కుడుగ రాజ్యతంత్రమందు జనబాహుళ్యము శ్రద్ధపుచ్చుకొన నేర్చుకొనెను.

పూర్వము నేరము మోపఁబడిన వారిని విచారించుటలో జరుగవలసిన చర్యమిక్కిలి న్యాయవిరుద్ధముగనుండెను. ముద్దాయిపై వచ్చినఫిర్యాదర్జీకి విచారణమునకుపూర్వమునకలిచ్చెడువారుకారు. ముద్దాయితరపుసాక్షులను ప్రమాణముచేయించిఫిర్యాదిసాక్షులను విచారించినట్లు విచారణముచేసెడువారుకారు. ముద్దాయితరపున వాదించుటకు వకీలునుగుదుర్చుకొన నిచ్చెడివారుకారు. రాజద్రోహపు నేరముమోపఁబడినప్పుడీ నియమములు ముద్దాయీలకు మిక్కిలియన్యాయకరములుగనుండుచువచ్చినవి. రాజుగారియిష్టమునుగనిపెట్టి జడ్జీలుతీర్పుచెప్పుచువచ్చిరి. ప్రజ్ఞావంతులగులాయర్లనుగొప్పతనమువారేతమపక్షమునవాదించుట కేర్పఱచుకొనుచువచ్చిరి. ఆఱవఎడ్వర్డుకాలములో నీనేరమును రుజువుచేయుటకిద్దఱుసాక్షులకుఁ దక్కువ యుండఁగూడదనిశాసన మేర్పడినది. పదునేడవశతాబ్దమందీ నేరమునుగుఱించిజరిగినవిచారణము మిక్కిలి యన్యాయముగను దయావిహీనముగను జరిగినది. అందుచే1695సం॥లో విచారణసంబంధములైనకొన్నిమార్పులు చెయ్యఁబడినవి. విచారణప్రారంభమునకుఁ బూర్వమే ఫిర్యాదునకును జూరరులపట్టీకిని నకళ్లుముద్దాయీకియ్యవలెననియు వకీలును గుదుర్చుకొని ముద్దాయీవాదించుకొనవచ్చుననియు, ముద్దాయీ



సాక్షులను ప్రమాణముమీఁద విచారించవచ్చుననియు, నేరముజరిగినదన్న దినమునుండి మూఁడుసంవత్సరములలోపల ఫిర్యాదుదాఖలుకావలెననియు మొదలగు నిబంధనములతో నొకచట్టము చెయ్యఁబడినది.

విలియమును జంపవలెనని యొకకుట్రజరుగుట ప్రజలకుఁదెలిసి, యాతనిని గాపాడునిమిత్తము లార్డులును కామనులును వేలకొలఁదిజనులును నొకసంఘముగ నేర్పడి, రెండవజేమ్సు పక్షమువారి దుష్ప్రయత్నములనుగొనసాగనియ్యకుండుటకును, విలియమున కేదేనియాపదసంభవించినయెడల నా దుష్టులు దండింపఁబడు కృషి చేయుటకును, ప్రమాణములు చేసికొనియొక పత్రికపై సంతకములుచేసిరి.

విలియము సంతానహీనుఁడు. ఈతనికి రాజ్యమిచ్చినపుడే, ఈతని వెనుక రెండవ జేమ్సుయొక్క కొమారునకు రాజ్యార్హతలేదనియు, విలియము సంతానహీనుఁడైనయెడల నాతనిమఱఁదలు, ఆనిరాణియు నామెవంశమువారును రాజ్యార్హులనియు స్వాతంత్ర్యపత్రికయందు నిర్ధారణము చేయఁబడినది. ఈరాణికిఁ గూడ సంతానము నిలువనందున, నామె తరువాత రాజ్యమునకు రాఁదగిన వారిని నిర్ణయించుటకును మఱికొన్ని యితర విషయములను బరిష్కరించుటకును 'సెటిలు మెంటు ఆక్టు' 1701 సం॥ లోఁ జేయఁబడెను. దీనిని బట్టి మొదటి చార్లెసుయొక్క సోదరియగు ఎలిజ బెత్తుకూఁతురు రాణి యగునట్లు స్థిరపఱచఁబడెను. ఇప్పుడు రాజ్యముచేయుచున్న సప్తమఎడ్వర్డు ఈమెకేడవ తరమువాఁడు. ఈచట్టములో ననేకములును నితరవిషయములున్నవి. విదేశస్థుఁ డిఁకముందు పార్లమెంటు సభ్యుఁడుగా నుండుటకుఁగాని, దివాణముక్రింద నుద్యోగముచేయుటకుఁగాని యర్హుఁడుఁ కాఁడు. పార్లమెంటువారు నియమించినఁదప్ప, ఇంగ్లాండుతో సంబంధములేని యితర దేశముల పక్షమున రాజు యుద్ధమునకుదిగఁగూడదు. కామనులు నేరముమోపివిచారణమునకుదెచ్చినవాని నేరమును రాజు క్షమించఁగూడదు. ఆంగ్లదేవాలయములకు రాజే యజమాని. అందుచే రెండవజేమ్సువలె రాజు కాథొలిక్కుమతస్థుఁడైన యెడల, ప్రొటె

స్టేంటు మతాభిమానులైన దేశస్థుల కనర్థదాయకమగును. ఇట్టివైపరీత్యమున కవకాశములేకుండఁ జేయుటకు రాజు దేశసమ్మతమైన మతమునంగీకరించినవాఁడు గావలెనని నియమ మొకటి యేర్పరుపఁబడినందున, నికముందు రెండవ జేమ్సు వంటి మతాంతరులు వంశపరంపరాధీనముగ రాజ్యార్హులైనను, సింహాసనమునకు వచ్చుట కవకాశము లేదు. రాజు దైవాంశసంభూతుఁడను మూఢాభిప్రాయమునకు నేటికి టోరీలలోఁగూడ బలముడిగి శుష్కించినదని దీనిని బట్టి యూహింపఁదగియున్నది.

జీర్ణమైన ప్రివీకౌన్సిలును బున రుద్ధారణము చేయుట కీచట్టములో నొక నిబంధనమున్నది. ప్రివీకౌన్సిలు పూర్వము చక్కఁబెట్టిన రాజకార్యములను యథాప్రకారము నడపించుచుండవలెననియు, ఆసభవారు చేయుతీర్మానముల క్రింద నందలిసభవారు సంతకములు చేయవలెననియు ననునిబంధనము నిర్ణయించుచున్నది. ట్యూడరు వంశరాజుల కాలములో నీ కౌన్సిలువారే రాజకార్యము లన్నియుఁ జక్కఁబెట్టుచుండిరి. స్టూవర్టు వంశరాజులనాఁడు రాజులు కొంద ఱాంతరంగిక మిత్రులతో మాత్రమాలోచన చేయుచు, కౌన్సిలులోనున్న తక్కిన వారికి నామమాత్రముగాఁ గొద్ది జోక్యము విడిచిపెట్టిరి. ఈ యాంతరంగిక మంత్రులు రాజున కేమియుపదేశించినను, అతిరహస్యముగా నుంచుచుండుటవలన వారి యాలోచనములు కామనులకుఁ దెలియుట కవకాశము లేకపోయినది. రాజమంత్రులు కామనులకే జవాబుదారులై యుండుటచేత, కామనుల కిష్టములేని పనినిగూర్చి రాజున కే మంత్రియైన నుపదేశించిన నాతనిని కామనులు దండింతురని భయపడి రహస్యముగ మంత్రులు రాజుతో మంతనముల నడుప నారంభించిరి. ఇట్టి గోప్యమును జెడఁగొట్టుటకై పైనిజెప్పబడిన నిబంధన మేర్పడినది. కాని కామనుల కోర్కె నెఱవేరుట మాత్రము కాలస్థితినిబట్టి దుస్తరము. ఇటీవలి కాలమున దొరతనమందు నిజముగాఁ బని కలుగఁ జేసికొన నిష్టమున్నను లేకున్నను, ప్రఖ్యాత పురుషులకు గౌరవ సూచకముగ ప్రివీకౌన్సిలరు బిరుదము రాజుచే నొసగఁబడుచుండెను. అందుచేనే వ్యవహారమైన తీర్మానించవలసి వచ్చినపుడు ప్రివీకౌన్సిలరులు బహు సంఖ్యగల వారగుట వలన



వెనువెంటపని జరుగ నాటంకము గలుగుచు వచ్చెను. అందుచేఁ గొంతమందే మంత్రులుగానుండు నగత్యము కలిగెను. వీరు నిరంకుశముగ బ్రవర్తించకుండ మూఁడు శతాబ్దములోఁ దగుకట్టుబాట్లు చేయఁబడెను.

పార్లమెంటులో నర్ధభాగమువారైన కామనులే రాజ్యాంగములన్నిటిలో సర్వాధికారులై యుండిరిగదా. అందుచే వీరు లంచ పంచముల కపేక్షించి దుర్నడతలకుదిగకుండఁగాపాడవలసియున్నది. వీరిచర్యలనువిమర్శించిమందలించుటకు వార్తాపత్రికలైన నంతగా లేవు. కొన్ని కొన్ని ప్రదేశములలోని జనులు రాజునకుగాని మంత్రికిగాని లోఁబడిన వారగుటచే నాప్రాంతముల నుండి వచ్చిన కామనులు వారి యిష్టానుసారముగా నే పార్లమెంటులోఁ బని చేయుచు వచ్చిరి. కామనులలో ననేకులకు నాయకుఁడై నడపించువానికి పార్లమెంటు సంబంధములైనయుద్యోగములిచ్చెడునిప్పటియాచారమాకాలమున నేర్పడలేదు. అందుచేమంత్రులపనిసాగనియ్యక కామనులు పార్లమెంటులో దొమ్మిగా రేగుచువచ్చిరి. వీరినిస్వాధీనపఱచుకొనుటకు మంత్రులు లంచము లిచ్చియునుద్యోగములనిచ్చియునీమూకలనుస్వాధీనపఱచుకొనుచువచ్చిరి. ఈదురాచారమును గొంతవఱకుమాన్పుట కీసెటిలిమెంటు ఆక్టులో, రాజు క్రింద నుద్యోగముగలవారును, రాజువలన పెన్షను బుచ్చుకొనువారును కామనులశాఖవారితో సభ్యత్వమున కర్హులుకారనిశాసించు నిబంధన మొకటి చేయఁబడినది. ఇది కొంతవఱకు క్షేమకరమైనదైనను దివాణములో విశేషోద్యోగముగలవారికిఁగూడ కామనులలోనికి వచ్చుట కవకాశము తప్పిపోయెను. అందువలన దొరతనమువారి చర్యలను గుఱించి ప్రత్యక్షజ్ఞానము కామనులకుదొరకక చిక్కుపడవలసివచ్చెను. అందుచేనీనిబంధనము కొన్నివత్సరములలో మాఫుచేయఁబడి 1706సంవత్సరమునకుఁ బిమ్మట నేర్పాటుచేయఁబడిన యుద్యోగములలో నుండువారుతప్ప తక్కినవారు కామనులలోసభ్యులై యుండవచ్చుననియు, దొరతనమువారి క్రిందియుద్యోగమును సభ్యుఁడు క్రొత్తగాఁబొందినయెడలఁ బ్రజలకు వానియెడననురాగమున్న పక్షమున వానిని

తిరుగ సభ్యత్వమునకు నియమించుకొనవలెననియు మఱియొక నిబంధనము చేయఁబడెను. ఈ నిబంధనమే నేటివఱకమలులోనున్నది.

ఈయాక్టువలనఁ దెచ్చిపెట్టఁబడిన మఱియొక నిబంధనమువలన జడ్జీలు యావజ్జీవమును లేక సరిగా ప్రవర్తించినంతకాలము, నుద్యోగము చేయవచ్చుననియు, వారిజీతము లింతయని నిర్ధారణము కావలెననియు, లార్డులును కామనులును గూడ కలిసికాని వారిని యుద్యోగమునుండి తప్పించఁ గూడదనియు విధింపఁబడెను. అందుచేఁ దమయిష్టానుసారము తీర్పు చెప్పఁడని స్టూవర్టు వంశరాజులు జడ్జీలను నిర్బంధించిన ట్లీకాలమున రాజు నిర్బంధించుట కవకాశము లేదు. ఈనిబంధనమువలన జడ్జీలు నిర్భయముగ న్యాయనిర్ణయము చేయుచు ప్రపంచమందంతట గౌరవార్హులైరి.

పార్లమెంటుమూలమునఁ బ్రజలు తెలియఁజేసిన ప్రకారము రాజు కట్టుపడి నడచుకొనవలెనని నేటికి రాజనీతి స్థిరపడెను. ఆంగ్లరాజ్యపద్ధతి రాజపూర్వక ప్రజాపరిపాలన పద్ధతి యని చెప్పవచ్చును. రాజునకు ఠీవియు, బిరుదులును, దక్కువలేదు. పూర్వపురాజులలో నగ్రగణ్యులగువారు చట్టములకు మించి సాగించిన యధికారవిశేషములు నామమాత్రములై నిల్చియున్నవి. ఆతఁడింకను మతవ్యవహారములందును, రాచకార్యపరిష్కారమందును, న్యాయాధికారమునందును, నీటిమీఁదను మెట్టమీఁదను రక్షక సేనానాయకత్వమునందును, అద్వితీయశిఖామణియే. కాని యీ వ్యవహారములన్నిటియందును కామనులచేతను, వారు నమ్మి నియమించిన మంత్రులచేతను నిర్ణయింపఁబడిన మార్గము మీఱకుండ రాజు నడచుకొనవలసినవాఁ డయ్యెను.

అంతట రెండవజేమ్సు కాలధర్మము నొందినందున 1701సం॥ ఫ్రాన్సుదేశరాజీతని కొమారుని జేమ్సు యొడ్వర్డును ఆంగ్లదేశాధీశుఁడని ప్రకటనము సేయ నారంభించెను. ఫ్రాన్సురాజు జేసిన ప్రకటనమునకు నాంగ్లజనులొక కట్టైన మితిమీఱిన క్రోధావేశముతో ఫ్రాన్సుమీఁదికి యుద్ధమున కాయత్తపడుచుండఁగా 1702 సం॥ లో విలియము కీర్తిశేషుఁ డయ్యెను.

# అధ్యాయము. 16.

## రాజ్యపద్ధతి నిర్ణయమగుట. ఆనీరాణి, మొదటిజార్జి.

## 1702–1727

ఆంగ్లజనులు ఫ్రాన్సుతోడి యుద్ధమున కాయత్తపడుచుండిరని పూర్వాధ్యాయమున వ్రాసియుంటిమి. ఆకాలమున స్పానియా దేశాధీశుఁడు సంతానహీనుఁడై చనిపోయినందున ఫ్రాన్సుదేశపు యువరాజొకవంకను ఆస్ట్రియా దేశప్రభువొకవంకను స్పానియా రాజ్యమునకు వారసులమని వాదులాడుచుండిరి. ఇటలీలోఁ గొంతభాగమును, జర్మనీలోఁ గొంతభాగమును, అమెరికా దేశమునకుఁ దూర్పుదిశను గొన్ని దీవులును, స్పానియా దేశమునకు సామంతదేశములుగా నుండెను. ఇంతవిశేషరాజ్య మిదివఱకే విస్తరించియున్న ఫ్రాన్సురాజ్యమునకుఁ గలిసినచో, ఫ్రాన్సురాజు మర్న్యుఁడై యితరరాజులను మననీయఁడని భయపడి, ఆస్ట్రియాప్రభువునకు సాహాయ్యపడి యుద్ధములో ఫ్రాన్సురాజుతోఁ బోరుటకై రోపాదేశములోని యితర రాజులందఱు నాలోచించుచుండిరి. మూఁడవవిలియముకూడ ఫ్రాన్సురాజు గర్వ మడఁచుటకే యీయుద్ధమునఁ బనిఁ బుచ్చుకొనుట కుద్యమించియుండ, నంతట రెండవజేమ్సు కాలధర్మము నొందుటయు, జనాభిప్రాయమునకు వ్యతిరేకముగ నాతని కొమారున కాంగ్లసింహాసనమునఁ బట్టముగట్టి యాటంకపు స్టూవర్టుల ప్రభుత్వము తెచ్చిపెట్టవలెనని ఫ్రాన్సురాజు తలపెట్టియు, స్టూవర్టుపెనుభూతమును మారణహోమము చేయుటకయి ప్రజలేకవాక్యముగా యుద్ధమునకు సన్నద్ధులగుటయుఁ దటస్థించెను. దైవవశమున వీరాధిపుఁడగు విలియమీ మహత్తరతరుణమున స్వర్గస్థుడైనను, ఆంగ్లవీరశిఖామణు లీయుద్ధమునఁ దమకును దేశమునకును జగత్ప్రసిద్ధముగ యశోవర్ధనులై యైరోపాఖండములో నద్వితీయప్రఖ్యాతిని సంపాదించిరి. ఆంగ్లవీరులలో ధీరోదాత్తుఁడు మార్ల్‌బరోడ్యూకు జర్మనీ, స్పానియా, మధ్యధరాసముద్రము, అమెరికా— ఇట్లనేకప్రదేశములలో నేకకాలమున యుద్ధము

చేయవలసివచ్చెను. జర్మనుదేశములో ముమ్మరముగా యుద్ధము జరిగెను. అచ్చట ఫ్రాన్సునెదిరించిపోరిన ఆంగ్ల, ఒలందు, జర్మనులాదిగాఁగల వరూథినీబృందము లకుమార్లబరో ముఖ్యనాయకుఁడు. యుద్ధము ప్రారంభమైన రెండుసంవత్సరముల వఱకుఁ బేరెత్తి చెప్పఁదగిన వీరచరిత్రములు జరుగలేదు గాని జర్మనీలోఁ 'బ్లెనుహేము' అనుప్రదేశమందు జరిగినమహాయుద్ధములో (1794) ఫ్రాన్సురాజు శిఖపువ్వుద్రుంచి యాతనిసైన్యములో రెండువంతులను యమునివాతవేసిమార్లబరో శాశ్వతకీర్తిని సంపాదించెను. ఈతరుణమందే మఱియొక మహావీరుఁడు స్పానియాతీరమున షికారులు చేయుచు నాప్రాంతముల రేవుపట్టణములకు నాయకమణియని చెప్పఁదగినజిబ్రాల్టరుపట్టణమును స్వాధీనపఱచుకొనెను. జర్మనుప్రాంతములందేమార్లబరో మఱిమూఁడుయుద్ధములలోవిజయుఁడై తుదకు జర్మనీనుండి ఫ్రెంచివారినిదఱిమివేసి, ఫ్రాన్సుయొక్క యుద్ధపుపరవసమునుడిగించి యాదేశమునమహావీరులని పేరుపడిననాయకుల యుసురులువాపెను. అటు స్పెయినులో మార్లబరోవంటివీరాగ్రేసరుఁడులేకపోవుటచే ఫ్రెంచివారంతగా నొగులలేము కాని 1713 సం॥లో శత్రువులతో సంధిచేసికోవలసినవారైరి.

విలియమును రాజ్యమునకుఁ దెచ్చినకాలమందుఁ బుట్టినస్వాతంత్ర్యపత్రికానిబంధనములవలనఁ బూర్వపురాజులకును పార్లమెంటునకును ప్రబలిన వివాదాంశములు పార్లమెంటునకుఁ దృప్తికరముగఁ బరిష్కరింపఁబడినందున నూటయేఁబదివత్సరములవఱకు నాంగ్లరాజ్యతంత్రమందు మార్పులులేక విశ్రాంతి కలిగెను. అయినను ఆనిరాణికాలములో విగ్గుటోరీకక్షులు బలపడి అధికారమంతయుఁ దమస్వాధీనమందుంచుకొనవలెనని యొండొరులు జయేచ్ఛతోఁ దగవులాడుచువచ్చిరి. ఈకాలపుటోరీలు మునుపటివారివలె పార్లమెంటుకంటెరాణి బలాధికురాలుగ నుండవలెనని కోరినవారు కారు. మతవ్యవహారములందు భిన్నాభిప్రాయులై దేశసామాన్యమతము నంగీకరించిన వారినే యుద్యోగములయందుంచి విమతులనువానినుండి బహిష్కారముచేయవలెనని టోరీలును, ప్రొటెస్టంటు లగువారందఱును, సమాన స్వాతంత్ర్యముల ననుభవించునట్లు చట్టముల నడపవలెనని విగ్గులును, బట్టుదలగలవారై యుండిరి.



మొదటి రెండు సంవత్సరములు టోరీలప్రాభవ మెక్కువగనుండుటచేఁ దమ కోర్కెదీర నొకచట్టముచేయఁ బాటుపడిరిగాని పార్లమెంటులోని లార్డులు విగ్గులగుటవలన నీచట్టమునకుబురిటిలోనే సందుగొట్టెను. పిమ్మట ఫ్రాన్సుతోడి యుద్ధము బలమగుటచేతను, ఆయుద్ధములో విగ్గులపక్షమువాఁడగు మార్లబరో ప్రముఖుఁడగుటచేతను విగ్గులే పార్లమెంటులో బలపడిరి. ఈకాలమున ఘనులును సంపన్నులును నగు భూస్వాములును, ఐశ్వర్యవంతులగు వర్తకులును, విమతులును, విగ్గులపక్షముననుండిరి. యువకులగు భూస్వాములును, సామాన్యమతాచార్యులును, పేదలగు పెక్కండ్రు జనులు టోరీలపక్షముననుండిరి. లెక్కకు విగ్గులు తక్కువవారేకాని, ఆంగ్లదేశమందలి ధనికబాహుళ్యమును ప్రజ్ఞావంతులును విగ్గులవంకనే యుండుటచేత ముందు రాజ్యమునకు వచ్చిన యిద్దఱు జార్జిలకాలములోను విగ్గులే రాజ్యము నేలిరి.

ఇంగ్లాండు స్కాట్లండును నేకముచేసి రెండింటికినొకటియేపార్లమెంటును విధించిన 'యూనియను అక్టు' యీరాణిరాచరికమునకు వన్నెపెట్టిన మహాత్కార్యము. ఇట్టి మార్పును నెలకొల్పవలెనని వెనుక మొదటిజేమ్సు మిగులపాటుపడి పార్లమెంటువారి కిష్టములేనందున సంకల్పసిద్ధుఁడు కాఁజాలకపోయెను. స్కాట్లండును జయించిన వెనుక క్రాముమెల్లు రెండు దేశములకును పార్లమెంటు నొక్కదానినే నిలుపఁగలిగెను గాని, ఇందునకు స్కాటులు బుద్ధిపూర్వకముగ నంగీకరింప నందున నాదేశములో నొక సేనను నిలిపి తన మాట చెల్లించుకోవలసిన వాఁడయ్యెను. రెండవ చార్లెసు తిరుగరాజ్యమునకు రాగానేపార్లమెంటులు విడఁదీయఁబడెను. ఆంగ్లపార్లమెంటులో వర్తకులధికముగ నుండుటచే వారు దురాశగలవారై స్కాట్లండునుండి యింగ్లాండునకు నెగుమతియగు సరకులమీఁద దుర్భరములైన పన్నులు కట్టించియు, నితరదేశములందు ఇంగ్లాండునకు సామంతభూములుగానున్న ప్రదేశములలో స్కాటులు వర్తకము చేసికొనఁగూడదనియు, స్కాట్లండులోఁ బండినట్టియు, చేయఁబడినట్టియు వస్తువులే కాని యితరదేశములనుండి స్కాటులు ఖరీదుచేసిన వస్తువుల నింగ్లాండునకుఁ దేఁగూడదనియు మొదలగుచట్టములను వాణిజ్యమును

జంపివేయుశాశింపించి స్వలాభమును గాపాడుకొన మొదలుపెట్టిరి. ఈ కారణముచే నాంగ్లేయులుచేయు నన్యాయమునుగుఱించి స్కాటులు మొఱపెట్టుకొనఁగా, స్కాటులఁబాధలనుఁదొలఁగించి ఆంగ్లేయులతోసమానస్వాతంత్ర్యములియ్యక తప్పదనివివేకులకుఁదోచి, విలియమును ప్రోత్సాహపఱచఁగా, రెండుజాతులవారి నేకముజేయు నుపాయముల నాలోచింపుఁడని పార్లమెంటువారికి సందేశముఁబంపెను. అతఁడంతటితోఁజనిపోయినందునఁదమగతిఁజూచువారు లేక స్కాటులు పార్లమెంటువారు మతవిషయమునను, వాణిజ్య విషయమునను, ఆంగ్లేయులతో సమముగ స్కాటులకు స్వాతంత్ర్య మియ్యనియెడల, అనిరాణితరువాత నాంగ్లేయరాజ్యమునకు వచ్చినరాజు స్కాట్లండునకు రాజుగానుండఁగూడదని 1703-1704 సం॥లో నొకచట్టము చేసికొనిరి. ఇట్లుస్కాట్లండు విడిపోయినయెడల ఫ్రాన్సు రాజుచేతిలోఁబడి యాదేశమింగ్లాండునకు వెనుపోటుకాఁగలదని యింగ్లీషువారు భయపడి యుభయులను గలుపు కమీషనుల నేర్పఱచుటకు రాణికి పార్లమెంటువారధికారమిచ్చిరి. ఆంగ్లేయులుముప్పదియొకరును, స్కాటులు ముప్పదియొకరును, గలిసిన యొకయూనియను యేర్పఱచఁబడెను. ఇంగ్లాండును స్కాట్లండునుగలసి యొకరాజ్యముగ నేర్పడవలెననియు, దానికి 'గ్రేట్బ్రిటను' అను వ్యవహారనామ ముండవలెననియు, వెనుకవేఱుగానున్న రెండుజండాలను దీసివేసి రెండుదేశములకు నొకజెండానునిలుపవలెననియు, రెంటికి నొకటే పార్లమెంటుండవలెననియు, ఈపార్లమెంటులో స్కాటులు లార్డ్సులలోఁ బదునాఱుగురును కామనులలో నలువదియైదుగురు నుండవలెననియు, దొరతనమువారిచ్చవచ్చినట్లు బిరుదులిచ్చి లార్డ్సులను వృద్ధిచేయఁగూడదనియు, దేశమందున్న ఘనులనుండి లార్డ్సులను స్కాటులే నియమించుకొనవలెననియు, ఈయూనియను సమాఖ్యలోని ముఖ్యనిబంధనములు. స్కాటులకున్న దివాణపుఋణము నాంగ్లేయులు దీర్చివేసిరి. ఇంగ్లాండువలన 200000 సవరనుల నేలపన్ను వచ్చినయెడల స్కాట్లండు 48000 సవరనులు నేలపన్ను చెల్లించవలెను. ఇదివఱకములలోనున్న చట్టములే స్కాట్లండులో నమలుజరుగవలెను. ఇదివఱకున్న కోర్టులే యికముందును



నుండవలెను. స్కాట్లండులో నిదివఱకున్న పరిష్మండములు మార్చఁబడకుండ స్కాటుల పార్లమెంటువారును, ఆంగ్లేయమతవ్యవహారములు యథాస్థితినుండునట్లాంగ్లేయపార్లమెంటు వారును వేర్వేఱుచట్టములను జేసికొనిరి. ఈవేర్వేఱుచట్టములను పైని వివరించిన యూనియను సమాఖ్యతోఁబాటు సంయుక్త ప్రజాస్వామికసభవారు స్థిరపఱచిరి. (1707)

ఈచట్టమునకు స్కాటులుగాని, ఆంగిలిలుగాని, మొదటనంతగాసమ్మతించలేదు గాని తుదకు రెండుదేశములకును దీనివలనఁగడు క్షేమమే కలిగెను. స్కాటు లింగ్లాండునుండి విడిపోయి యాంగ్ల దేశమునకేమి యుపద్రవము తెచ్చి పెట్టుదురో యనుభయ మాంగ్లేయులకుఁదప్పెను. ఆంగ్లేయులతో సమానముగ విదేశములతోడను నాంగ్లదేశముతోడను వర్తకము చేసికొనుటకు స్కాటుల కవకాశము పొసఁగెను. ఈచట్టము పుట్టిననాఁ డైరోపారాజ్యములలో మిక్కిలి హీనగతినున్న స్కాట్లండునకు, దీనిపిమ్మట తక్కినరాజ్యములకుఁదీసిపోని యైశ్వర్య మెత్తుకొనెను.

1714లో అనిరాణి చనిపోవునప్పటికిఁ బ్రజలు మిక్కిలి యాందోళనము పడుచుండిరి. రెండవ జేమ్సుయొక్క కొమారుఁడగు జేమ్సెడ్వర్డును దిరుగ రాజ్యమునకుఁబిలిపించవలెనని కొంతకుట్రజరుగుచుండెను. జేమ్సు సంతతివారియెడ బద్ధవిరోధులైన విగ్గులలోఁ బ్రముఖుఁడగు నొకడ్యూకును కోశాధిపతిగ(Lord high Treasurer.)నియమించి, రాణి చనిపోయినందున స్టూవర్టుల బాధ తొలఁగవచ్చునని జనులు కొంతధైర్యము చిక్కఁబట్టిరి. సెటిలుమెంటు ఆక్టు ప్రకారము రాజ్యమునకు రావలసిన మొదటి ఛార్లెసుయొక్క మేనగోడలు అనిరాణికిఁ బూర్వమే పరలోకగతురాలగుటచే, ఆమె పుత్రుడునుజర్మనులోని హానోవరుమండలమునకధీశుఁడునగు మొదటి జార్జిరాజయ్యెను. స్టూవర్టుల పక్షపాతులీతని రాక కడ్డుపెట్టుదురేమోయను భీతి కలిగినదికాని వారు దుర్బలులగుటవలన నట్టి యవరోధము కలుగలేదు. ఫ్రాన్సురాజు చేసిన కొన్ని సంధినిబంధనముల నాతఁడుమన్నించి స్టూవర్టుల పక్షపాతమును వదలు

కొనెను. ఐనను మఱుసటి సంవత్సరము స్కాట్లండునందును, ఇంగ్లాండునందును, స్టూవర్టుల పక్షమువారు కొందఱు కత్తి చేపట్టి కయ్యమునకు డీకొనిరి. ఈసమయమున జేమ్సుస్టూవర్టుకూడ స్కాట్లండునకు వచ్చి తనపక్షము వారితోఁ గలిసెను. ఆంగ్ల నాయకులు వీరి ననాయాసముగా నోడించి వారిలోఁ బ్రముఖులగు వారిని నలువది మందిని యురిదీసి, మఱి కొందఱను విదేశములకు వెడల నడచిరి.

ఈ కారణములచేఁ బ్రజలు స్థిరచిత్తులుగాక కంపించుచుండిరి. పార్లమెంటిప్పటికి మూఁడు సంవత్సరములనుండి పనిచేయుచున్నందున విలియము కాలమును బట్టి క్రొత్త పార్లమెంటేర్పడవలసి యున్నది. కాలస్థితినిఁ బట్టి యున్న పార్లమెంటును ముగించుట వివేకపక్షముఁ గాదని యోచించి, యొకసారి యేర్పడిన పార్లమెంటేడు సంవత్సరములవఱకుఁ బని చేయవచ్చుననియు, ఇప్పుడున్న పార్లమెంటు మఱి నాలుగుసంవత్సరము లుండవచ్చుననియు నొకచట్టము చేయఁబడెను (1716) ఇంతటినుండి యొకమారు వరణము నొందిన పార్లమెంటే యేడు సంవత్సరముల వఱకుఁ బనిచేయుచు వచ్చెను.

మొదటనుండియు స్టూవర్టులను సింహాసనమునకు వెలిపెట్టి హానోవరు వంశమువారినిఁ దెచ్చిపెట్టవలెనని పాటుపడినవారు విగ్గులే కనుక మొదటిజార్జికిఁ బట్టము గట్టఁగానే, విగ్గులే మంత్రులైరి. మాటలాడుటకు వలసినంత యాంగ్ల భాషాపరిచయము జార్జికి లేనందున మంత్రులతో నన్యభాషతో రాజు మాటాడవలసివచ్చెను. ఇంతేకాక యాంగ్ల రాజపద్ధతి యాతనికి బొత్తుగాఁ దెలియదు. జర్మనీయొక్కయు ముఖ్యముగా నందలి హానోవరుమండలముయొక్కయు రాజకార్యములే కాని యితరదేశ వ్యవహారము లీతనికి రుచింపవు. ఈకారణములచేఁ దన్ను నమ్మినట్టియుఁ దాను నమ్మినట్టియు విగ్గులచేతికే యాంగ్ల రాజ్యభారము నప్పగించి జార్జి యుదాసీనుఁడై కాలము గడపెను. ఇందుచేనిదివఱకే క్రిందపడి న్యూనతకు వచ్చిన రాజుయొక్క యధికారము మఱింత హీనదశకు వచ్చి కామనుల యధికారము హెచ్చెను.



ఆంతట ఫ్రాన్సురాజు చనిపోవుటయు, ఆతని మునిమనుమఁడు మైనరైనందున, ఆర్లియన్సుడ్యూకు గార్డియనుగా నుండి రాజ్యము నడుపుటయుఁ దటస్థించెను. ఈమైనరు కల్పాయువైనయెడల రాజ్యార్హుఁడైన గార్డియను తనకు స్పెయినుదేశపు రాజువలన నాటంకము రావచ్చునని వెఱపుగొనియుండుటచే నాంగ్ల రాజుతోడి సఖ్యము నపేక్షించియుండెను. ఇట నాంగ్లరాజపదవి కంగలార్చుచున్న స్టూవర్టువంశము వారికి ఫ్రాన్సురాజు తప్ప యితరబలము లేదని యాంగ్లేయులు గుర్తెఱిఁగి, స్టూవర్టుల వలని భయమును బాపుకొనుటకు ఫ్రాన్సురాజుతోడ నెయ్యమును గోరుచుండిరి. ఈ కారణములచే విగ్గుమంత్రులు ఫ్రాన్సురాజుతో సఖ్యము చేసికొని యేయిబ్బందులువచ్చినను నొకరికొకరు సహాయపడుట కొడఁబడిరి (1717). ఈ నెయ్యంపుకూటమునకు నితరదేశాధీశులను గూడఁ జేర్చుకొనవలెనని ప్రయత్నించి హాలండు రాజును, జర్మను చక్రవర్తిని, సమలోఁ జేర్చుకొనిరి. జర్మను చక్రవర్తి వశమందున్న సిసిలీదీవిని స్పెయినురాజు పుచ్చుకొనవలెనని యత్నించఁగా నూతన సఖ్యమునుబట్టి యాంగ్లసేనలు సాహాయ్యముగాఁబోయి స్పెయినుతో యుద్ధము చేసి యా యాపదను దప్పించెను. ఈ నేస్తమువలన నాంగ్లపరాక్రమ మైరోపాఖండమున మిగులప్రఖ్యాతిఁ గాంచెను.

కామనుల ప్రాభవము కడు పెంపొందియున్నదని యిదివరలోఁ జెప్పియుంటిమి. అందుచే రాజుగాని మంత్రిగాని యేపనినైనఁ దలపెట్టినప్పుడు కామనులను గూడఁ గట్టుకొని వారియంగీకారమును బొందుట ముఖ్యావశ్యమై యుండెను. ఈకాలమున పార్లమెంటులో సభ్యత్వము సంపాదించుకొనుటకనేకవక్రగతులుండెను. పూర్వము పట్టణములై పార్లమెంటునకు సభ్యులఁ బంపుకొను స్వాతంత్ర్యమును సంపాదించుకొన్న విష్వాశుపల్లెలయినవి. చేతిపనులు వృద్ధియగుచున్న చోటులు వెనుకపల్లెలుగానున్న ప్రదేశములై యుండుచు వచ్చుటచే, పార్లమెంటు సభ్యుల నియమించు స్వాతంత్ర్యము వానికి లేకపోయెను. ఇటీవల చేతిపనులు వృద్ధియై ఫాక్టొరీలేర్పడినకొలఁది, పూర్వపు పట్టణములలోనివారును జుట్టుపట్టుల నివసించు పని

వాండు్రిను, ఆఫాక్టొరీల చుట్టును మూఁగుచు వచ్చుటచే, నాపల్లెలు పట్టణములై జనసంకులము లయినవి. ఇట్లు పట్టణములుగఁ బరిణమించిన ప్రదేశములు పూర్వపుసేవ్య భూములగుటవలన, నాభూస్వాములు చెప్పినట్లెల్ల నందలి వోటరులు (పార్లమెంటునకు సభ్యుల నియమించు వరణాధికారము గలవారు) నడచుకొనుచు వారుచేపట్టిన మంత్రిపక్షముగ పార్లమెంటులోఁ బనిచేయుట కొడఁబడినవారినే పార్లమెంటు సభ్యులనుగ నియమించుకొనవలసి వచ్చినది. ఇట్లే పూర్వము ప్రఖ్యాతిగని యిప్పుడు హైన్యమునకు వచ్చిన పట్టణములవారును, అందలి సంపన్నులు చేపట్టిన మంత్రి పక్షమునఁ బనిచేయుట కొడఁబడినవారినే పార్లమెంటులో కామనులనుగా నియమించుకొనుచుండిరి. సముద్రతీరప్రదేశములవారు రాజునకుఁ గాని మంత్రికిఁ గాని యిష్టమైనవారినే పార్లమెంటుసభకుఁ బ్రతినిధులుగాఁ బంపుచువచ్చిరి. విశేషభూవసతి గల భూస్వాములు తమవశమందున్న రయితులమూలమునఁ దమ కనుకూలురయినవారిని పార్లమెంటునకుఁ బంపునట్లేర్పాటు చేయఁగలిగిరి. కాఁబట్టి యీకాలపు పార్లమెంటుసభ్యుల నిజముగాఁ బ్రజల ప్రతినిధులని చెప్పుటకంటె, రాజుయొక్కయు విశేషసంపన్నుల యొక్కయు భూస్వాములగు గొప్పవారియొక్కయుఁ బ్రతినిధులని చెప్పఁదగియున్నది. అందుచే విలియము రాజ్యమునకువచ్చిన తరువాత కామనుల యధికారమభివృద్ధి నొందినదని చెప్పుటకంటె, దేశమందలిగొప్ప వారికుటుంబముల యుమ్మరావుల ప్రాభవము ప్రబలమయినదని చెప్పవలసియున్నది. ఈ ఘనకుటుంబముల వారి యనుమతిని సంపాదించుకొనకుండ రాజ్యవ్యవహారములను జక్కఁబెట్టుటకు మంత్రికిఁ గాని రాజునకుఁ గాని కొంతకాలమువఱకు సాధ్యము కాలేదు. వీరిసాయమును సంపాదించుకొనుట కీకుటుంబములలోని ముఖ్యులకు దివాణములో ముఖ్యోద్యోగము లియ్యవలసి వచ్చినది. రాజ్యనిర్వాహ కత్వము ప్రాయికముగ వీరిచేతులలోనె యుండుచు వచ్చినది. రాజునకున్న పరమాధికారము కొంతలేకపోలేదు గాని మొదటి జార్జియు రెండవ జార్జియు



నాంగ్లదేశాచారముల నెఱుఁగని విదేశీయులగుటచేఁ దమ స్వాతంత్ర్యమెంతవఱకున్నదో కూడ విస్మరించి దినములు గడపుటచే నుమ్మరావులు మఱింత ముప్పిరిగొనిరి.

ఈకాలమున నాంగ్లప్రజలు రాజ్యవ్యవహారముల యెడల మత్తులయి యుండుచు వచ్చిరి. ఇందునకుఁదోడుగా మంత్రులు తమయిష్టానుసారముగ రాజ్యతంత్రమును నడపుటకు కామనులఁగూడఁ గట్టుకొనుటకై వీరికి లంచములు గూడనిచ్చుచువచ్చిరి. ఈదురాచారము రెండవచార్లెసు కాలములో స్వల్పముగఁ దలయెత్తి విలియము రాచరికములో బాహుళ్యముగ విస్తరించి మొదటిజార్జి నాటికి విజృంభించినది. అందుచే పార్లమెంటువారు మునుపటివలె ప్రజలయొక్క క్షేమములే ప్రధాన ప్రయోజనములుగఁ జూచుకొని వర్తించక, రాజుచెప్పినట్లును మంత్రి చెప్పినట్లును దలయూచుచు వచ్చిరి. ఇట్లయినను, ప్రజాటంకమైన పని జరిగినప్పుడు, పార్లమెంటువారు మంత్రితోడను రాజుతోడను నేకమయినను, ప్రజలు తమ కష్టములను ముమ్మరముగాఁ బ్రకటనముచేసి వానినివారణముచేసికొనుచువచ్చిరి. ఇంగ్లాండులోనున్న నాణెములకంటెఁ దక్కువవెలగల నాణెములను మంత్రి 1724సం॥లో నైర్లాండులోఁ దెచ్చి పెట్టినప్పుడు ప్రజలు రేగి వార్తాపత్రికల మూలమునఁ బెద్ద సందడిచేయఁగా మంత్రి యానాణెములను రద్దుపఱచవలసి వచ్చెను.

# అధ్యాయము. 17.

## రాజ్యపద్ధతి నిర్ధారణమగుట.

## రెండవజార్జి. 1727–1760.

మొదటిజార్జి 1727సం॥లోఁ బరంపదించినందున నాతనికొమారుఁడగు రెండవజార్జి రాజ్యమునకు వచ్చెను. రాజుమారినను మంత్రి మారలేదు. దిగుమతి వస్తువులమీఁదఁ జిరకాలమునుండి పన్నుపుచ్చుకొను నాచారము స్థిరపడి యున్నది కాని సరకులు దేశములో నొకచోటనుండి మఱియొక చోటికిఁ గొనిపోఁబడినందునకుఁ బన్నుగట్టుట జనులిదివఱకు నెఱుఁగరు. మంత్రి 1733సం॥లో పార్లమెంటువారిని సమాధానపఱచుకొని యిప్పుడు మన దేశములో నున్న అబుకారీ పన్నువంటి పన్ను పొగాకు మొదలగు వస్తువుల మీఁదఁ గట్టుటకుఁ బ్రయత్నించెను. ఈ పన్నునకిష్టపడక ప్రజలు నలు దిక్కులనుండి ఘోషపెట్టఁగా మంత్రి తన ప్రయత్నమును మానుకొనవలసి వచ్చెను.

అమెరికాకుఁ దూర్పుదిక్కుననున్న దీవులను స్పెయినుదేశమువా రాక్రమించుకొని విరివిగా వర్తకము సాగించుకొనుచు ధనవంతులగుట చూచి యాంగ్లవర్తకులు కూడ నట్లు చేయఁ బ్రారంభించఁగా స్పానియులకు వారి పొడగిట్టక యాంగ్లవర్తకులను గడుబాములపాలుచేసి, తమ కొకయోడపట్టఁ గలిగిన సరకులు మాత్రము సంవత్సరమున కొకసారి యాంగ్లేయు లెగుమతిచేయుటకు సమ్మతించిరి. ఈనియమమునకుఁ గట్టువడక యితరులయోడలయందు రహస్యముగాఁ దమసరకుల నిమిడించి యాంగ్లేయులు వర్తకము సాగింప మొదలుపెట్టినందున, స్పానియావారోడలను వెదకించుచు నీచాంగకరణమును గనిపెట్టుచు నాంగ్లవర్తకులను దండించుచు వచ్చిరి. వీరికష్టములను నివారించుట కాంగ్లమహాజను లొక్కపెట్టున స్పానియాతోడ యుద్ధమునకుఁ బూనుకొనిరి గాని వీరి ప్రయత్నము మొత్తముమీఁద జయప్రదము కాలేదు. ఈ యుద్ధసందర్భమునఁ బంపఁబడిన యొకనావికుఁడు భూప్రదక్షిణము చేసి నాలుగువత్సరములకు దేశము చేరుకొనఁ గలిగెను.

అంతట నాస్ట్రియా చక్రవర్తి పరలోకగతుఁడైనందున నాతనికొమార్తె రాజ్యమునకు రాకుండఁ జేయుట కొకజర్మను మండలాధిపతి యుద్ధమారంభించెను. ప్రాన్సువా రతనికి సాహాయ్యుఁడై సేనలనంపెను. ప్రష్యారాజు కొంతదేశము నాక్రమించుకొనఁ దలఁచి యొకవంకను ముట్టడించెను. ఈ కల్లోలములో నింగ్లాండు హోలండువా రాస్ట్రియావంక నిలిచిపోరిరి. ఆంగ్లసేనకు రాజే నాయకత్వము వహించెను. ఫ్రెంచివా రదనుకని పెట్టి స్టూవర్టుపక్షము వారిని బురికొల్పి వారికి సేనలను సాహాయ్యము చేసిరి. కాని, రెండవజేమ్సుమనుమఁడు పరాజితుఁడై ప్రాన్సునకుఁ బాఱిపోయి ప్రాణములు రక్షించుకొనెను. అంట నాస్ట్రియా యుద్ధముకూడ నాంగ్లేయులకుఁ గీర్తిప్రదముగ లేనందున 1748సం॥లో జరిగిన సంధివలన యుద్ధముముగిసెను. ఆయెంసంవత్సరములు దేశమునకు విశ్రాంతికలిగెను గాని ప్రాన్సుతోడి జగడ మటుపిమ్మట ముమ్మరమై సప్తవర్షములు ఘోరముగా యుద్ధము జరిగెను. ఉత్తరపమెరికాదేశ మీకాలమున ఫ్రెంచివారి స్వాధీనమందుండెను. ఆదేశమందలి తూర్పుభాగమున 1300000 మంది యింగ్లీషువారు కాపురముండిరి. వారికిస్థలము చాలక పశ్చిమముగాఁ బోయి కాపురములు కుదుర్చుకొనవలెనని వారు యోచించుచుండిరి. పశ్చిమమున నున్న ఫ్రెంచివారి సంఖ్య 60000కంటె యెక్కువ లేకున్నను, ఆంగ్లేయులు రాకనరికట్టుటకు సరిహద్దు లేర్పఱచి దుర్గములు కట్టుటకు ఫ్రెంచివా రారంభించిరి. ఈకాలమందే 500000 యకరములకు జార్జివలనఁ బట్టాపుచ్చుకొని అమెరికాకు వలసపోవుట కాంగ్లేయులకంపెని యొకటి యేర్పడి యుండెను. ఫ్రెంచివా రేర్పఱచిన హద్దుదాటి ఆంగ్లేయులు రాఁగా ఫ్రెంచివారు వారినోడించిరి. ఆంగ్ల దొరతనమువారి యుత్తరువుపొంది యొక యాంగ్లనాయకుఁడు 2000మంది సేనతో ఫ్రెంచివారి మీఁదికి దాడివెడలెను గాని యాతఁడు పరాజితుఁడై వెనుకకు మరలవలసివచ్చెను. ఈకారణ

ములచే నుభయులకును యుద్ధము ప్రారంభమయ్యెను. ప్రష్యాదేశపు రాజు జార్జికి మేనల్లుఁడు. ఈతనిని వంచించుటకు, ఆస్ట్రియా, ప్రాన్సు, స్వీడను, సాక్సని దేశముల రాజులందఱు కలిసిరి. ఈసంగతి తెలిసికొని ప్రష్యారాజు మేనమామ యొద్దను జేరి, యాతనికాంగ్లేయులు 67000 వరహాలు ప్రతిసంవత్సర మిచ్చునట్లును, ఆతఁడాంగ్లేయులతోఁ గలిసి ప్రాన్సుతోఁ బోరునట్లును సఖ్యము చేసికొనెను.

ఈయుద్ధము జర్మనీదేశమందును, ఇండియాదేశమందును, అమెరికాయందును, పోర్చుగలుతీరమందును నొక్కసారిగా నడచుకొనెను. ఆకాలమున మంత్రిగానున్న విలియముపిట్టు బహుబుద్ధిశాలియు, కడు నేర్పరియు, దూరదృష్టిగలవాఁడును నగుటచేత, అతఁడు సమర్థులగు సేనానులైన యుద్ధవీరులను నియమించి బహునైపుణ్యముతో యుద్ధము సాగించినందున జయప్రదముగను, జగద్విఖ్యాతిగను, యుద్ధముకొనసాగెను. ఈయుద్ధము 1763 సం॥లో పారిసుపట్టణమున జరిగినసంధివలన ముగిసెను. దీనివలన నమెరికాలోని ఫ్రెంచివారిబలమడఁగంటియా దేశములోని కనడాయుఁ బడమనుత్తరభాగమును, వెస్టిండియా దీవులనుఁ బడుపశ్చిమ ద్వీపములును నాంగ్లేయుల పరమయ్యెను. ఈయుద్ధమువలననే యిండియాలో ఫ్రెంచివారి ప్రాభవ మణఁగంటి యాంగ్లేయుల దొరతనము పాదుకొనెను.

1600 సంవత్సరమున సుమత్రా జావా మొదలగు నీస్టిండియాదీవులతో వర్తకము చేయుస్వాతంత్ర్యమును ఎలిజబెత్తురాణివలన సంపాదించుకొని యాంగ్లవర్తకులు కొంపణివర్తకము ప్రారంభించుటయు, పిమ్మట 1609 సం॥లో వారు మొదటి జేమ్సువలన నట్టిస్వాతంత్ర్యమును స్థిరపఱచుకొని 1612 సం॥లో నిండియాకువచ్చి సూరతుపట్టణమున ఫ్యాక్టరీకట్టుకొని వర్ధిల్లి, తమవర్తకమునకడ్డము వచ్చినయొల్లందులను బురదకీసులనుఁ బడుపోర్చుగీసులను నోడించుటయు, 1640 సం॥లో చెన్నపట్టణములో సెంటుజార్జికోటను, 1698 సం॥లో కలకత్తాలో విలియముకోటను, గట్టుకొనియు పోర్చుగీసు రాజపుత్రిని వివాహమై రెండవచార్లెసు



కట్నముగఁ గొన్న బొంబాయిరేవుపట్టణము చితముగ గ్రహించియు వృద్ధినొంది ధనాకర్షణమందే కృతోద్యములైయుండుటయు సందఱునెఱిఁగిన సంగతియే కనుక విస్తరించ నక్కఱలేదు. ఈకాలమున ఫ్రెంచివారిండియా దేశము నాక్రమించుకొనఁదల పెట్టుటయు రాబర్టుక్లయివను నాంగ్లశూరుఁడు వారిని మార్కొని యోడించి వారిమగటిమి దూలించుటయు, నానాఁటి కాంగ్లేయులు దేశమును వశపఱచుకొనుటయు, 1761 సం॥ నాఁటికి వారియాధిపత్యము పాదుకొనుటయు, నీరెండవజార్జికాలములో నేతటస్థించెను. ఇంతటు రెండవజార్జి 1760 లోఁ బరంపదించినందున నతని జ్యేష్ఠపౌత్రుఁడగు మూఁడవజార్జి రాజ్యమునకు వచ్చెను.

ఆనిరాణి కాలములోను, జార్జిలకాలములోను, చెన్నఁదగు రాజ్యతంత్ర విశేషములు జరుగలేదు కాని, వీరికాలములో ప్రివికౌన్సిలు మూలముగ రాజకార్య నిర్వాహమంతయు జరుగవలెనను పట్టపు సిద్ధాంత మంతరించి మంత్రిమండలి(Cabinet) యొకటియేర్పడి దానిమూలమున రాజ్య వ్యవహారము లన్నియు జరుపఁబడు శాసనవిరుద్ధమైన యాచార మొకటి వేళ్లుపాఱెను. రాజ్యవ్యవహారములందు దారిచూపి రాజును నడపుటకే ప్రివికౌన్సిలేర్పడినదనియు, ఇటీవల సంపన్నులను ప్రఖ్యాతపురుషులను గౌరవించు నిమిత్తము ప్రివీకౌన్సిలరను బిరుదిచ్చి రాజులు సన్మానించుటచే వారిసంఖ్య పెరిగిపోయి వారిలోఁ గొందఱనుకూల సభ్యులయాలోచనములనుఁ బుచ్చుకొని రాజు వ్యవహరింపవలసిన యావశ్యకము తటస్థించినదనియు, స్టూవర్టులు పార్లమెంటు నిరోధమును సహించనివారై ప్రివీకౌన్సిలులోని కొందఱాంతరంగిక సభ్యుల మంతనము చొప్పునిరంకుశముగఁ బనిచేయఁగా, నీయాంతరంగిక మంత్రిమండలిలో నెవ్వని దురాలోచనము విని రాజు దుష్ప్రభుత్వము చేయుచున్నాఁడో తెలిసికొనుటకు వీలుకుదరక యట్టిదురాలోచనములను జెప్పువారిని కామనుసులు దండింపలేక పోయిరనియు, ఇట్టిదుస్థితిఁ బాపుటకు మూఁడవ విలియము కాలములో 'సెటిలు మెంటుఆక్టు' మూలమున నొకనిబంధనము చేయుటకు కామనుసులు ప్రయ

త్నము చేసిరనియు నిదివఱకే చెప్పియున్నాము. స్టూవర్టువంశ రాజుల కాలములో నీమంత్రిమండలి రాజు ననుగ్రహము నాశ్రయించుకొన్నవారిచే నేర్పడినది. రాజు ప్రాభవము క్రిందుపడి పార్లమెంటువారియధికారము హెచ్చిన తరువాతి కాలములో పార్లమెంటువారి విశ్వాసమును సంపాదించుకొన్నవారే మంత్రిమండలిగ నేర్పడిరి.

మొదటి ఛార్లెసు నురిదీయించిన పార్లమెంటు నాటనుండియు సభవారిలో రెండుపార్టీ లేర్పడినవి. ఈపార్లమెంటువారు రాజశాసనవిరుద్ధముగఁ జేసిన పనులన్నిటిని రద్దుపఱచిరని చదువరు లెఱిఁగియున్నారు. అంతటనుండి ఛార్లెసు శాసనసమ్మతముగ నడచుకొనుననియు, శాసనవిరోధములను దెచ్చిపెట్టకుండ నాతనినిఁక నిరోధించు నిబంధనములను పార్లమెంటు చేయ నక్కఱలేదనియు నొకపక్షము (Party) వారును, ఆతఁడు నమ్మఁదగఁడనియు పార్లమెంటు మఱికొన్ని చట్టములు చేసి, చట్టముల నమలుజరుపుటకు రాజునకున్న యధికారమునుగూడ రాజునకు లేకుండఁ జేయవలెననియు, మంత్రిమండలిని పార్లమెంటువారే యేర్పాటు చేయవలెననియు రెండవపక్షము (Party) వారును, భిన్నాభిప్రాయులై విడిపోయిరి. ఈ విధముగనున్న చట్టములలో మార్పులు చేయు నగత్యము లేదని యెంచు పూర్వాచారాభిమాన లోకపక్షము (పార్టి) గాను, జనులలోఁ గాలక్రమమున మార్పులు గలిగిన కొలఁది తదనుసారముగాఁ జట్టములలో మార్పులు చేయఁబడవలెనను సంస్కారాభిమాన లోకపక్షముగాను, నీమొదటిఛార్లెసు నాటి పార్లమెంటువారి కాలమునుండి నేటివఱకును రెండుపక్షములు (పార్టీలు) దేశములో వెలసియున్నవి. ఉభయపక్షముల (పార్టీల) వారును గ్రొత్తగా పార్లమెంటుసభకు సభ్యుల నియమించుకొను నదను గలిగినప్పుడు తమతమ పక్షమున పార్లమెంటులోఁ బని చేయుట కిష్టపడువారినే నియామకము చేసికొందురు. అందుచే నొకప్పు డొకపక్షము వారును మఱియొకప్పుడు రెండవపక్షము వారును పార్లమెంటులోఁ దమపక్షమున నున్న యధికారసంఖ్యాకులగు స్వపాక్షిక సభ్యులను బట్టి ప్రముఖులై తమయిష్టము వచ్చినట్లు రాజతంత్రమును నడుపఁబాటుపడుదురు. ఒకపక్షము



వారు ప్రముఖులై పనిచేయుచుండ రెండవపక్షమువారు ప్రతికూల ప్రయత్నములను జాగరూకతతోఁ జేయుచుందురు. ఈపక్షములు కామనులలోనే కాని, లార్డులలో లేవు. ఇట్లు ప్రముఖులైన పక్షమువారే మంత్రిమండలి నేర్పఱచుకొందురు. ఈమండలిలోఁ బ్రముఖుఁడగు వాఁడు నాయకుఁడై ప్రధాని యనఁబరఁగుచు రాజునకాలోచనము చెప్పుచుండును. ప్రతిపక్షమువారు తెచ్చిపెట్టు యడ్డంకులను వదలించుకొని కామనులలో బలాఢ్యులైనవారు తాము కోరిన క్రొత్త చట్టమును గూర్చి బిల్లుసిద్ధము చేయుదురు. దీనిని లార్డులు తమకనుకూలముయినయెడల స్థిరపఱచెదరు; లేనియెడల నిరాకరించెదరు. లార్డులు స్థిరపఱచినబిల్లునకుఁ బ్రాయికముగ రాజు సమ్మతించును. నిరాకరించుటకుఁగూడ వాతనికి స్వాతంత్ర్యము లేకపోలేదు. ఇది వర్తమానమున వెలసియున్న రాజనీతి.

ఇట్లు పార్టీల వివక్షత మొదటిచార్లెసు కాలములోనే యేర్పడినను మూఁడవవిలియము రాచరికములోఁ గాని పైనివివరించినచొప్పున కామనులలోఁ నధికులకిష్టమైన మంత్రిమండలి నేర్పఱచవలసిన యావశ్యకము రాజునకుఁ బొడకట్టలేదు. ఆతనికాలములోఁ బ్రాముఖ్యత వహించినవిగ్గుల నిరోధమును తొలఁగించుకొని తనకు సమర్థులని తోఁచిన మంత్రిమండలిఁ గుదుర్చుకొని పనిజరుపుకొనుట కాతఁడు యత్నించెను గాని కొంతయనుభవము కలిగిన కొలఁది విగ్గులనుండియే మంత్రిమండలిని నియమించుకొన వలసి వచ్చెను. విలియము తరువాత ఆనిరాణి కాలములో టోరీలు ప్రబలులగుటవలన టోరీమంత్రిమండలియే రాజ్యము నడపెను. ఆమెపిమ్మట మొదటిజార్జి కాలమున విగ్గుల మంత్రికూటము ప్రబలి టోరీలనడఁగ ద్రొక్కెను. ఇట్లు కామనులలోఁ బ్రముఖులైనపార్టి వారికి విశ్వాసపాత్రులైనవారే కాలక్రమమున వ్యవహారసౌకర్యార్థము మంత్రికూటముగ నేర్పడెడు నాచారము కుదురుపడెను. పేరునకు వీరు రాజునకు విధేయులైనను, నిజమునకు వీరు కామనులలోఁ బ్రబలులైన పార్టివారికి విధేయులై రాజ్యతంత్రముల నడపవలసినవారైరి.

ఒకపక్షమున రాజు పాక్షికము వహించవలసిన వాఁడు కావందునను, రాజేదొయొక వంక కనుకూలముగ నడచుకొనక పోయినయెడల

రాజకార్యములు నెఱవేరనందునను, రాజ్యతంత్రమును నడపుటలో రాజున కున్న యధికారమంతరించి పోవలసివచ్చెను. మొదటిజార్జి దేశభాషాపరిచయము లేనివాఁడగుటచే, మంత్రికూటమువారు మంతనములఁ జేయు సభలకు రాజు పోవుట మానుకొనెను. దీనినిబట్టి రాజుతో నిమిత్తము లేకుండ మంత్రికూటమువారు రాజకార్యములను గుఱించి మంతనము నడపుకొను నాచారమొకటి తలయెత్తి స్థిరపడి యిప్పుడు దుర్భేద్యమై నిలిచెను. ప్రతిసభకును నధ్యక్షుఁ డొకఁడుండవలెను గనుక, రాజున కీమంత్రికూటములో నధ్యక్షత తొలఁగినప్పటి నుండియు, ప్రముఖులైన కామనుల పార్టివారందఱకును గౌరవభాజనుఁడైన మంత్రియే యధ్యక్షుఁడగుచు వచ్చెను. కొంతకాలమున కీతఁడే ప్రధానమంత్రి (Prime Minister) యయ్యెను. తుదకు కామనులలో బలమైన పార్టికి నాయకుఁడే ప్రధానమంత్రియై రాజ్యమును నడపువాఁడయ్యెను. ప్రజలు కామనులనియమించుటచేతను కామనుల నాయకుఁడు ప్రధానియై రాజుకంటెను నెక్కుడధికారము వహించియుండుటచేతను, దివాణపు నుద్యోగస్థులందఱిలోను ప్రధానియే సర్వవిషయములందు నధికారగరిష్ఠుఁడు. ఈతని యధికారమునకు మితిబెట్టి నియమించు చట్టమేదియు లేదుగాని యాచారముగా నాతఁడు మూఁడువిషయములను గుఱించి ముఖ్యముగఁ బనికలిగియుండును. ప్రాయికముగ నీతఁడు రాజ్యాంగములన్నిటిమీఁదను నియామకత్వము వహించియుండును. ఇందునకుఁ దోడ తనయిష్టమునుబట్టి యేదోయొక రాజ్యాంగము నదనపుఁ బెట్టుకొనినను బెట్టుకొనవచ్చును. ఒకొక్క రాజ్యాంగమున కధ్యక్షుఁడై నియమింపఁబడినవాఁడే, తత్కార్యనిర్వాహకమునకు వలయుపద్ధతుల నేర్పఱచుకొనుటకు జవాబుదారుఁడై యుండును. అయినను రాజ్యసమష్టిని బట్టి యాయా రాజ్యాంగధర్మమును నిర్ణయింపవలసివచ్చినప్పు డా రాజ్యాంగాధ్యక్షుఁడైనవాఁడు ప్రధానమంత్రితో నాలోచించి యాతఁడు నియమించినట్లు నడువవలెనుగాని తన యిచ్చవచ్చినట్లు పనిచేయరాదు. ఆయా రాజ్యాంగ విషయముల దివాణపుసొమ్ము వెచ్చించవలసినప్పుడు ప్రధానియే సర్వాధికారి గాని రాజ్యాంగాధ్యక్షునకా విషయమున స్వాతంత్ర్యము లేదు. రాజ్యాంగములన్నిఁటికిని



సమముగా నొక్కొక్కదాని తారతమ్యమును బట్టి ద్రవ్యము వెచ్చింపఁజేయు బాధ్యత ప్రధానియందున్నప్పు డన్యుల కీవిషయమున స్వాతంత్ర్యమెట్లు గలుగును? ఇంతియు కాక విదేశవ్యవహారములను జక్కఁబెట్టుటకేర్పడిన కార్యదర్శి ప్రధానికిఁ జూపకుండ నేకాగితమును దాచఁగూడదు. ప్రధానిపై మోపియున్న పనులలో నిది మొదటిది.

మంత్రిమండలికిని రాజునకును మధ్యవర్తిగానుండి యొకరియుద్దేశముల నొకరికిఁ దెలుపుచు రాయబారమును నడుపుట ప్రధాని చేయవలసిన పనులలో రెండవది. మంత్రిమండలిలోని యితరుల కీవిషయమునఁ బనిచేయు స్వాతంత్ర్యము లేదు. రాజ్యాంగ విషయమున సముజాయిషి కావలసివచ్చినపుడు రాజు రాజ్యాంగాధ్యక్షుని బిలిపించి తెలిసికొనవచ్చును గాని, రాష్ట్రసమష్టికి సంబంధించిన ధర్మములనుగూర్చి వారితో రాజు మంతనము నడపుట రాజనీతికి విరుద్ధము. ఇందునకు వ్యతిరేకము జరిగినయెడల నట్టి యవినీతికిఁ జోటిచ్చిన రాజ్యాంగాధ్యక్షుని ప్రధాని యుద్యోగమునుండి తప్పించును. ఇందునకు రాజొడఁబడఁడేని తానే యుద్యోగమును జాలించుకొనును.

మంత్రిమండలికిని పార్లమెంటునకును మధ్యవర్తియై రాయబారముల నడపుట ప్రధానియొక్క మూఁడవపని. మంత్రిమండలియొక్క యభిప్రాయములు పార్లమెంటువారికిఁ బ్రధానిమూలముగఁ గాని, ప్రధానియుత్తరువును బొందినవానివలనఁ గాని తెలుపఁబడవలెను. లార్డులలోని వాఁడుగాని కామనులలోని వాఁడుగాని యే రాజ్యాంగమునకయిన నధ్యక్షత వహించిన యెడల నా యంగమును గూర్చి యేదైన సముజాయిషి తనశాఖవారికిఁ దెలుపవచ్చును. ప్రధాని లార్డులలోనివాఁడయినను కామనులలోనివాఁడయినను గావచ్చును. ఏశాఖలోనివాఁడయినయెడల నాశాఖవారికిఁ బ్రధానియే నాయకుఁడు. ఆశాఖవారికిఁ గొన్ని విషయములో రాజ్యతంత్రములనుగూర్చి ప్రధాని మర్మములను జెప్పవచ్చును.

ప్రధానికిని మంత్రిమండలికినిగల సంబంధమునుగూర్చి కొంతచెప్పవలసియున్నది. మంత్రిమండలమునకు సభ్యుల నేర్పఱచుకొను స్వాతంత్ర్యము ప్రధానికిఁ గలదు. తనపార్టీవారిలో సమర్థులును బలుకుబడిగల వారిని జూచి తన యిష్టమునకువచ్చిన వారినిమంత్రికూటమునందుఁ బ్రధాని చేర్చుకొనును. ఒకసారి మంత్రికూట మేర్పడిన తరువాత రాష్ట్రసమష్టి కార్యార్థ మవలంబించవలసిన రాజనీతినిగూర్చి మంత్రికూటము వారితోఁ బ్రధాని విధిగా మంతనము చేయవలెను. మంత్రికూటము వారిలో నెవ్వఁడయినఁ బ్రధానికంటెను మంత్రి మండలికంటెను భిన్నాభిప్రాయుఁడైన యెడల తన యుద్యోగమును జాలించుకొనవలెను. లేకున్న వారియభిప్రాయములకుఁ గట్టుపడవలెను. మండలిస్థులగు నేకులిట్లు ప్రధాని కంటెను నితర సభ్యుల కంటెను భేదాభిప్రాయులగువారు తమ పనులను జాలించుకొనవలెను. కామనులలో బహుసంఖ్యాకులు ప్రధాని మాటాడుచు నాతనికిఁ జేయూఁత యయి నిలిచినంతకాలము ప్రధానిరాజ్యము నడపుట రాజనీతి ధర్మముగ స్థిరపడి యున్నందున మంత్రికూటమువా రెందఱాతనికి భిన్నాభిప్రాయులైనను, దమ యుద్యోగములఁ జాలించుకొని తొలఁగిపోవలసినదే కాని యాతని పదవికి భంగముకలుగదు. ప్రధానికి విమతులగు మంత్రిమండలివా రుద్యోగములు విడిచిపెట్టి కామనులలో నాతనికిఁ బ్రతికూలముగఁ బనిచేసి ప్రధాని తలపెట్టినపనికి వ్యతిరేకముగ కామనులలో నధిక సంఖ్యాకులు వోట్లిచ్చునట్లు చేయఁగలిగిన యెడల, ప్రధాని తన యుద్యోగమును విడిచిపెట్టవలసి వచ్చును. అంతేకాని మంత్రికూటములో సభ్యులాయుద్యోగములనున్నంతకాలము ప్రధానికి భక్తితో సాహాయ్యము చేయుచు నాతనికి లోఁబడి యుండవలెను. రాజునకుఁగాని పార్లమెంటునకుఁగాని ప్రధానిపైఁ బ్రీతి తొలఁగునట్లు పని చేయఁగూడదు.

ఇఁక మంత్రిమండలివారి మంతనములనుగూర్చి చెప్పవలసియున్నది. ఈమండలి సభ్యులందఱు ప్రివీకౌన్సిలుసభవారే. ప్రివీకౌన్సిలనగా రహస్యముగఁ బనిచేయు నాలోచనసభయని యర్థము గనుక రాజనీతివిషయమున



మంతనము జరుగుకాలములోఁ జర్చింపఁబడిన యంశములనుగూర్చి మంత్రిమండలమువారు బయటఁబెట్టమని ప్రమాణములు చేయుదురు. ఈ సభలో జరిగిన విషయములనుగూర్చి పత్రికలలో వ్రాయఁబడవు. అందుఁజేరిన ప్రతి మంత్రియు మాండలికులలో నధిక సంఖ్యాకుల యభిప్రాయము లెట్లున్నవో కనిపెట్టుచు వాని ననుసరించి నడచుకొనుచుండును. తుదకు నిర్ధారణము చేయఁబడిన యంశము ప్రతిమంత్రియు నంగీకరించిన నిర్ధారణాంశముగా నే యెన్నఁబడును. ప్రధాని సమర్థుఁడును గార్యదక్షుఁడు నైనయెడల ప్రాయికముగా నాతనిమాటయే యీ సభలోఁ జెల్లుచుండును.

నిరంకుశాధికారముతో రాజ్యము చేయు రాజువలె నీ మంత్రిమండలి యిట్లేకవాక్యముగను, రహస్యముగను సద్యస్సిద్ధముగను బనిచేయుచున్నను కామనులు తమయెడల సుప్రసన్నులై యున్నంతకాలమే మంత్రిమండలివారు రాజ్యము చేయదక్షులయియుందురు. అందువలన నిరంకుశాధికారియగు రాజువలెఁ బ్రజలయోగక్షేమములను మఱచి వర్తించలేరు. కామనులలో రెండు (పార్టీ) పక్షములుండుటవలన, ప్రబలులైన పార్టీవారి యభిప్రాయములనుబట్టి మంత్రిమండలివా రేర్పఱచుకొను రాజనీతికూడ మాఱుచుండును. ఇట్లని యాంగ్లరాజనీతి స్థిరములైన ధర్మములకులోఁబడని చంచలస్వభావము కలదని తలంపఁగూడదు. కామనులలోని (పార్టీల) పక్షములవారు స్థిరరాజ్యధర్మములకు సంబంధములేని విషయములం దెంత భిన్నాభిప్రాయులయినను బ్రధానధర్మములను గూర్చి యేకవాక్యతగనే పనిచేయుదురు. కాథోలిక్కులును ప్రొటెస్టంటులును మతసిద్ధాంతవిషయమున భిన్నాభిప్రాయులైనట్లు పార్లమెంటు పార్టీలకు రాజ్యాంగమూలసిద్ధాంతముల విషయమునభిప్రాయభేదములేదు.

కామనులకును బ్రధానికిని యభిప్రాయభేదము కలిగినప్పుడు ప్రధాని పని చాలించుకొనునని పయిని జెప్పియున్నాము. అందుచే నిప్పుడు పదభ్రష్టుఁడైన ప్రధానికిఁ బ్రాణవిత్తమానభంగములేదు. రాజే మంత్రుల

నేర్పఱచుకొను వెనుకటి కాలమున నట్లు కాక, పార్లమెంటువారికి సరిపడని రాజధర్మమును మంత్రి యవలంబించినప్పు డాతనిని దొలఁగించు నుపాయము రాజునందే కాని తమయందు లేకపోవుటవలన మంత్రిని రాజద్రోహపు నేరమునకు విచారణము చేయించి, నేరము స్థిరపడదని తోఁచినప్పుడు న్యాయవిరుద్ధముగ చట్టమునకు విపరీతార్థము చెప్పుచు ననేకపాట్లుపడుచు వచ్చిరి. ఇట్టి దురవస్థ తప్పిపోయి యిప్పటి మంత్రిమాండలిక రాజ్యపద్ధతి జార్జిలకాలములోఁ బ్రారంభమయి పంతొమ్మిదవ శతాబ్దమునఁ గాని స్థిరపడలేదు.



# అధ్యాయము. 18

## సంధ్యా కాలము.

### మూఁడవజార్జి — 1760-1820.

ఇంతవఱకును రాజుయొక్క నిరంకుశాధికారము తొలఁగి పార్లిమెంటుయొక్క యధికార ప్రాభవము పెంపొందుటనుగూర్చి చర్చించియుంటిమి. పార్లమెంటుశాఖలలో కామనులే సర్వాధికారమును జేపట్టఁగలిగిరని చదివియుంటిరి. పార్లమెంటునకు సభ్యులను నియామకము చేయుటలో నిజముగాఁ బ్రజలకష్టసుఖములను గాపాడువారినే పార్లమెంటు సభ్యులనుగ నిర్ణయించుకొనుటకుఁ బ్రజల కవకాశమిచ్చెడు పద్ధతు లాకాలమున లేవు. ఐశ్వర్యము చేతను నధికారముచేతను సామంతులగు విగ్గులే తమకులోఁబడిన ప్రజలచేఁ దమ కనుకూలురగు వారిని పార్లమెంటు సభ్యత్వమునకు నియమింపఁ బాటుపడుచుండిరి. అందుచే కామనులు పొందినట్లు వెనుకటి యధ్యాయములలోఁ జెప్పఁబడిన యధికారాధిక్యమంతయు సామంత విగ్గుల కుటుంబములవారి చేతులలోనే చేరియున్నది. ఈస్వల్పసంఖ్యాకులగు విగ్గుకుటుంబములవారధికారపరిమత్తులై రాజుయొక్క కుతంత్రములకులోఁబడి యొకరితోనొకరు తగవులాడ మొదలుపెట్టిరి. ఇప్పుడు రాజ్యమునకువచ్చిన మూఁడవజార్జి విశేషబుద్ధిశాలియు విద్యాసంపన్నుఁడును గాకపోయినను "పట్టినకార్య మీశ్వరుఁడు పట్టిన" ను విడువని దృఢప్రతిజ్ఞుఁడై రాజను పదవికిఁగల గౌరవమును బూర్ణముగాఁ గాపాడి రాజ్యమునఁదానే ముఖ్యుఁడైయేలవలెనను బూనికతోఁ బనిచేసినవాఁడగుటచేతను, మొదటిజార్జి, రెండవజార్జివలెఁగాక యాంగ్లభాషాపరిచయము పూర్ణముగాఁగలిగి యింగ్లాండునఁ బుట్టి పెరిగినవాఁ డగుటచేతను, సామంతులగువిగ్గులచేతికీలుబొమ్మవలె వారాడించినట్లాడనొల్లక వారిగర్వమడంచెను. ఈతని 60 వత్సరముల దీర్ఘ పురాచరికమందే, అమెరికాదేశమువారు స్వాతంత్ర్య ధర్మముకొఱకుఁ బోరాడి సిద్ధసంకల్పులైరి. ఫ్రెంచివారితోడ

వైరము బలపడి యుండెయాయందు వారియధికారము నామమాత్రావశేషమై యాంగ్లేయుల యాధిరాజ్యము మొలకెత్తినది. మానవులకు సౌఖ్యాధారములైన వస్త్రపరికరాదులు యంత్రమూలమున నల్పకాలములో గణనాతీతములుగాఁ జేయఁబడి పేదసాదలకు సుఖోపకరణము లనాయాసముగా లభించుటయే కాక విదేశవాణిజ్యమువృద్ధిమై, సంపన్నులునుగాక కూటిపేదలునుగాక మధ్యతరగతియందుండు గృహస్థు లైశ్వర్యవంతు లైరి. ఇట్టిమాధ్యస్థ గృహస్థులే వర్తమానమందు రాజ్యతంత్రమును దేశక్షేమకరముగ నడపుచున్నారు. రెండవ జార్జినాటికి మహోన్నతులైయున్న విగ్గుసామంతకుటుంబముల పరువమును దొరతనమును నడచి, యీమధ్యస్థ గృహస్థుల నాయకత్వమునకు దారితీయుట కీమూఁడవజార్జి కాలమున ననేకకారణములు పనిచేసినవి. ప్రాచీన పద్ధతిపోయి నూతన పద్ధతికిఁ జోటిచ్చుట కమవుపడిన కాలము గనుక యీరాజుకాలము సంధ్యాకాలమని వాడఁబడెను.

మూఁడవజార్జి సింహాసనమునకువచ్చిన 1760సం॥ నాటికి స్పెయినుఫ్రాన్సుతోఁగూడి యింగ్లాండు మీఁదికి దాడివెడలఁ బ్రయత్నము సేయుచుండెను. అప్పుడు ఫ్రాన్సుతోడి యుద్ధమును జయప్రదముగ నడపించిన విలియముపిట్టు స్పెయినుదేశము ముట్టడింప సమకట్టియుండెను. స్వతంత్రుఁడును దృఢచిత్తుఁడునగు నిట్టిబుద్ధిశాలిని మన్నించిన యెడలఁ దనయాటలు సాగవని యీతనికి విసుగుపుట్టించి యుద్యోగము మానుకొనునట్లు చేయుటకై రా జీతనిమాటవినక మఱియొకమంత్రితో నాలోచించి ఫ్రాన్సుతో సఖ్యము నొడఁగూర్చుకొనుటకుఁ బ్రయత్నము చేసెను. అందుపై పిట్టు యుద్యోగము చాలించుకొనఁగా రాజు బ్యూటు అను వానిని బ్రధానిగాఁ జేసికొనెను. ఐనను మంత్రిమండలివారు కామనులకు సమ్మతమైన రీతిని రాజ్యమునడపఁ బ్రయత్నించుచువచ్చిరి. కామనుల ప్రాభవమును సహించనివాఁడు గనుక రాజసేవకులను ప్రధాని పదమునకు నియమించి వారివలనఁ దనయిష్టము నెఱవేరనందున, కామనుల కుత్తర



వాదులు కానివారల సాహాయ్యమును గూర్చుకొనుచు వచ్చెను. మంత్రిమండలివారొకవిధమున రాజ్యతంత్రము నేర్పఱచుకొనఁగా, దానిని భంగపఱచుటకు రాజే రహస్యంపుమంతనగాండ్రనుబంపి, సామోపాయముల చేతను లంచములచేతను కామనులను దనవంకకుఁ ద్రిప్పి తనయిష్టమును సాగించుకొనుచు వచ్చెను. యుద్ధము ప్రారంభించుటకును, సంధిచేసికొనుటకును, పార్లమెంటుసభను పిలిపించుటకును ముగించుటకును, దేవాలయవిషయమునను, రాజకీయోద్యోగముల విషయమునను, నిచ్చవచ్చినవారికుద్యోగములనిచ్చియు, బిరుదులనిచ్చియు సత్కరించుటకును, దనయెడలఁ బ్రజలకు గౌరవముపుట్టించు మఱికొన్ని యితరపనులు చేయుటకును నిలియము రాజ్యమునకు నిచ్చునాటికి రాజున్న కధికారము గలదు. జార్జిల కాలములో నీయధికారము రాజు స్వతంత్రముగాఁ సాగించక పార్లమెంటుముఖముగఁ జేయవలసి వచ్చినది. పార్లమెంటుతో నిమిత్తములేకుండ స్వతంత్రముగ నీపనులను నెఱవేర్పవలెనని రాజిప్పుడు బద్ధకంకణుడయ్యెను. తలపెట్టిన పనులను నెఱవేర్చుకొనుటకుఁ బూర్వపురాజులు పార్లమెంటు ప్రముఖులను విడిచిపెట్టి పనిచేసిరి. మూఁడవజార్జి వారివలెఁగాక పార్లమెంటుమూలముననే తనయిష్టమును జెల్లించుకొనెను. తనయిష్టమునకనుకూలముగా వోటుచేయునట్లు పార్లమెంటుసభవారిని గూడఁ గట్టుకొనుటకు సమస్తోపాయములను రాజుపయోగించి తుదకు సిద్ధసంకల్పుఁడయ్యెను. కామనుల బలము నాధారముచేసికొని రాజ్యతంత్రమును నడపెడు మంత్రిమండలియుండగా, రాజెట్లుదీనికి భిన్నముగ నడువఁగలిగెనని వాచకుల కొకసందేహము బాధించ వచ్చును. కాని యీక్రింద నుదాహరింపఁబడిన కారణాంతరములను బట్టి రాజుకోరికకు కామనులు ప్రతిముఖులై ప్రతిఘటించుటకు మాఱుగా సుముఖులై దానిని జెల్లించుచు వచ్చిరి.

(1) మంత్రిమాండలిక పద్ధతి నూతన రాజకీయాచారముగాని ప్రజలు చిరకాలమునుండి యలవాటుపడిన ప్రాచీనాచారము గాదు. ఈయాచారమును సమర్థించు శాసనములులేవు. రాజ్యతంత్రమును నడపుటకు రాజే

ప్రధానాధికారి యని జనబాహుళ్యము తలఁచుచుండిరి. న్యాయసభలలో లాయరులు నిర్భే వాదప్రతివాదములు చేయుచుండిరి. రాజ్యతంత్రము రాజుచే నియమింపఁబడకుండ మంత్రిమండలిచే నియమింపఁబడుటవలన దేశమునకుఁ గలుగు లాభములింకను విగ్గులకే బాగుగాఁ దెలియవు. అందుచే మంత్రి మండలి వంక నిలిచి రాజుయొక్క సంకల్పములను భంగపఱచువలె నని కామను లెఱుఁగరు. (2) లండను మొదలగు రెండు మూఁడు గొప్ప పట్టణములందు నాగరికులకుఁ గొందఱకుఁ దప్ప తక్కిన జనబాహుళ్యమునకు మంత్రిమండలివారికిని, రాజునకును, జరుగుచున్న వివాదాంశమును గూర్చి యంతగా దెలియదు. ఇంతియు కాక రాజకీయ వ్యవహారములను గూర్చి మన దేశమందుఁ బ్రజలు పాలుమాలి యున్నట్లే ఆకాలమందాంగ్లప్రజలును నీవ్యవహారములందు శ్రద్ధపుచ్చుకొని పనిచేయుటకుఁ జక్కఁగా నేర్చుకొలేదు. (3) కొందఱు కామనులు రాజునకుఁ బ్రతికూలురైయున్నను లంచప్రపంచమునకు లోఁబడుచువచ్చుటచే రాజునభీష్టము నెఱవేరుటకవకాశము గలిగెను. పార్లమెంటులో కామనులు జరిగించువాద ప్రతివాదములను వార్తాపత్రికల మూలమున దేశమందు వెదజల్లునాచారమింకను బయలుదేరనందున కామనులకు జననిందవలన భయములేదు. జననిందవలన శిక్షితులుగాక కామను లపనీతులై రాజుయొక్క దుస్తంత్రములకుఁ గేలొగ్గువారైరి. లంచము మూలముగనే కాక దండోపాయముల మూలమునఁ గూడ రాజు కామనులను లోఁబఱచుకొనెను. (4) మఱియు పార్లమెంటునకు సభ్యులనియమించుకొను పద్ధతిలోఁ గూడ ననేకములు లోపములుండెను. పార్లమెంటుయొక్క యధికారము ట్యూడరు రాజులకాలము నాటికే స్థిరపడినందున, ట్యూడరులును స్టూవర్టులును గూడ పార్లమెంటు లేకుండఁ బని చేయఁజాలక, తమ కనుకూలముగ వోట్లనిచ్చువారి సంఖ్య వృద్ధిచేయుటకై చిన్నపల్లెలలోని సామాన్యులకుఁ గూడ పార్లమెంటునకు సభ్యుల నియమించుకొను స్వాతంత్ర్యము నిచ్చుచువచ్చిరి. ఇట్లు స్థానికజనుల ఘనతను గాని స్థలము యొక్క యౌన్నత్యమును గాని జనసంఖ్యను గాని పాటించక



స్వల్పజనసంఖ్యగల పల్లెలకుఁ బట్టణములకు లేని సభ్యనియామక స్వాతంత్ర్యమియ్యఁబడినది. మఱియు నొకకాలమున ఘనతవహించి బాహుళ్యముగా సభ్య నియమనాధికారము నొందిన పట్టణములు కాలవక్రతచేఁ బల్లెలైనవి. నానాటికిఁ బ్రాముఖ్యత వహించి జనసమృద్ధములైన పట్టణములలో నత్యల్పసంఖ్యాకులకే యట్టి నియమనాధికార ముండుచువచ్చినది. ఈ కారణములచే రాజానుగ్రహము కలుగునని చాలవలననిట్టి నియమనాధికారము గలవారికి వర్తమానముల నంపియు లంచముల వెదజల్లియు రాజు తనకిష్టమైనట్లు పార్లమెంటులో వోట్లనియ్యగలవారినే పార్లమెంటు సభ్యులుగా నియమింపఁబడునట్లు చేయఁగలిగెను. కొన్ని ఘనకుటుంబముల కొక్కొక్క దానికి 6, 8, 10 మంది సభ్యులను గూడ పార్లమెంటునకుఁ బంపు నధికారము గలదు. పిరికలోఁబడినవారు వీరికిష్టులైనవారిని సభ్యత్వమునకు నియమించునట్లు చేయుటకుఁ గూడ నాకాలమున వలను గలిగియుండెను. రాజకీయ వ్యవహారముల గోడు నెఱుఁగని వారికి లంచమిచ్చి సభ్యుల నేర్పఱుచునట్లు చేయుటకు సంపన్నులెంతో ద్రవ్యమును వెచ్చించుచు వచ్చిరి. జాను విల్కిసు అను పార్లమెంటుసభ్యుఁడు రాజునకు వ్యతిరేకముగ నడచుకొనఁగా కామనులు రాజుమాట కడుగుదాటక యాతని లంచముల కాశించి యాతనికిఁ జేయూఁతయైనిలిచి యాసదస్యు నెన్నో బాధలు పెట్టిరి. విదేశరాజులతోడి సంబంధమునుగూర్చియు మఱియితర రాజకీయ వ్యవహారములను గూర్చియు రాజు ప్రతిసంవత్సర ప్రారంభము నందున నొకలేఖను పార్లమెంటు వారి యెదుటఁ జదువు నాచారమొకటిగలదు. ఈలేఖలో ఫ్రాన్సుతోడి సఖ్యము కొఱకు జరుగుచున్న ప్రయత్నములను గూర్చి రాజు వ్రాసిన సంగతులను జానువిల్కిసు ఖండించి యొక్క వార్తాపత్రికను బ్రకటించఁగా నాతనిని బగవుఁబాపిన నేరమునకై పట్టుకొనిరి. పార్లమెంటు సభ్యుఁడగు వానినిట్టి నేరమునకుఁ బట్టుకొనుటకు జారీకాఁబడిన వారంటులో నీతని పేరు నిర్దేశింపఁ బడలేదు. పైవార్తాపత్రికలోని ఖండన వాక్యములను వ్రాసినవారిని, దాని నచ్చువేసిన

వారిని ప్రకటించిన వారిని బట్టుకొనుట కీవారంటులో నధికార మియ్యఁబడెను. వారంటు లిట్టి నిర్దిష్టముగానున్నయెడలఁ బైవార్తాపత్రికతో సంబంధమున్న మనుష్యుల నందఱిని బట్టుకొనుట కవకాశమిచ్చును గనుక నిట్టివారంటులు శాసనవిరుద్ధములని 1765 సం॥లో రాజుగారికోర్టువారు తీర్మానించిరి. 1766 సం॥లో విఖ్యాతమంత్రియుండు ప్రబలమైన యుపన్యాసమున నిట్టి యనిర్దిష్టములగు వారంటులు ధర్మవిరుద్ధములని పార్లమెంటువారు నిర్ధారణము చేసిరి.

కోర్టువారు తీర్మానము చేయుపట్టునను గాలవిలంబనము సహింపలేక, రాజునకనువర్తులైన మంత్రులు 1763 సం॥లో పైఖండనవాక్యములు రాజద్రోహకరములైన నిందావాక్యములని తీర్మానించి, యా వార్తాపత్రిక బహిరంగముగా నగ్నిహోత్రుని కాహుతి చేయించి విల్కిసును పార్లమెంటునుండి తఱిమివేసిరి. లండను నాగరికులు పార్లమెంటుసభవారి చర్యలనొల్లక విల్కిసుపక్షమును జేపట్టిరి. దొరతనమువారును పార్లమెంటును తనకు వ్యతిరేకులైయున్నట్లు కనిపెట్టి కోర్టువారితీర్మానము బయలువెడలకమునుపే విల్కిసు ఫ్రాన్సునకుఁ బాఱిపోయెను. మఱికొన్ని సంవత్సరముల కాతఁ డింగ్లాండునకు మరలి రాఁగా మిడిలుసెక్సుమండలమువా రాతనిని దమకుఁ బ్రతినిధిగ పార్లమెంటుసభకుఁ బంపిరి. అప్పుడు పార్లమెంటు సెక్రేటరీనిగుఱించి యాతఁడు ఖండనవాక్యములను వ్రాసినందులకు పార్లమెంటువా రతనిని సభనుండి మరల వెడలఁగొట్టిరి. మఱియొకసారిమండలమువా రతనిని బ్రతినిధిగ పార్లమెంటునకుఁ బంపఁగా నీతనికి సభ్యత్వార్హత తప్పిపోయినదని విడనాడి యాతనికంటెఁ దక్కువవోటులు సంపాదించుకొన్న మఱియొకనిని పార్లమెంటునఁ జేర్చుకొనిరి. పార్లమెంటునకు సభ్యులనియమించుకొను స్వాతంత్ర్యము ప్రజలకే కాని పార్లమెంటుసభవారికి లేకపోయినను, పార్లమెంటుసభవారు రాజుతోఁగూడ నేకమై ప్రజల ధర్మములనే మఱచియుండుటచే నిట్టి వైపరీత్యము తటస్థమయ్యెను. ఇందునకుఁ బ్రజల కాగ్రహము మిన్నుముట్టెను. లండను నాగరికులు పార్లమెంటును న్యూనతపఱచుటకు విల్కిసునకు లండను మేజస్ట్రే



టను కారాగృహమునుండి విడిపించి 'ఆల్డరుమెను' ఉద్యోగమిచ్చిరి. మేయరు మొదలగు మునిసిపలు యుద్యోగస్థులందఱు గలసి, పార్లమెంటుసభ ప్రజలస్వాతంత్ర్యములను గాపాడనందున సభ చాలించి సభ్యులను పదభ్రష్టులఁ జేయుమని రాజునకు విజ్ఞాపనమంపిరి. పైవివరింపఁబడిన ప్రకారము పార్లమెంటునకు సభ్యుల నియమించుకొను విషయములోఁగల లోపములను బట్టి పార్లమెంటుసభవారిట్లు ప్రజాభిప్రాయములకు వ్యతిరేకముగ నడచుకొనఁగలిగిరని వివేకదృష్టికి స్పష్టమయ్యెను. సభ్యనియమనస్వాతంత్ర్యవిషయమునకైనఁ గొన్ని మార్పు లవశ్యము జరుగవలసియున్నవి. ఆకాలమున మంత్రిగానున్న పిట్టు విల్కిసును పార్లమెంటుసభ్యునిగఁ జేర్చుకొనకపోవుట శాసనుల తప్పేయని ఖండించి వారు చేసినపని శాసనవిరుద్ధమని నిర్ధారణము చేయుచు వ్రాయించెను. ఇంతటితో నిట్టిశాసనవిరుద్ధాచరణము తొలఁగదని యెంచి, నియమనస్వాతంత్ర్యవిషయమునఁ గొన్నిమార్పులు చేయుటకు పిట్టు ప్రయత్నము చేసెను. వర్తకమువలనను జేతిపనులవలనను, బ్రఖ్యాతనొందిన పట్టణములవారికి పార్లమెంటు సభ్యనియమన స్వాతంత్ర్యము వృద్ధిచేయవలెనని యుద్యమము. రాజునకును రాజుపక్షమువారికిని యీమార్పు సరిపడనందున పిట్టుయొక్క ప్రయత్నము కొనసాగలేదు. కాని, పిట్టుపక్షముగ వాదించుచు ప్రజ లనేకసభలు చేసి బహిరంగముగా మంత్రిపక్షమున నిలిచిరి. ఈమార్పు నెట్లైన నెలకొల్పవలెఁగాని దేశమునకు సుఖముకలుగదను పూనికగలవారై దేశమంతటను సభలుగాఁగూడి, అందఱు నేకఫలాపేక్షులై రాజకీయవ్యవహారములను గూర్చి బాహుళ్యముగాఁ జర్చించుటకుఁ బ్రజలారంభించిరి. ఇట్లుకొంతకాలము పనిచేయఁగాఁ బ్రజలకు రాజ్యతంత్రమునందు ఉపేక్షాభావముపోయి శ్రద్ధయెక్కువై రాజుతో పార్లమెంటుకలిసి ప్రజల యిష్టానిష్టములను గాని కష్టసుఖములను గాని చూడక రాజ్యతంత్రమును నడపుట కవకాశము తప్పిపోయెను.

ఈకాలములో పార్లమెంటులో జరుగు వాదప్రతివాదములను వార్తాపత్రికలలోఁ బ్రచురము చేయు నాచారము క్రొత్తగా వెలసి వర్ధిల్లినది. పార్లమెంటుచర్చలను గోప్యముగానుంచుకొనుటకుఁ బూర్వకాలమున కామను

లనేకప్రయత్నములను జేసిరి. రాజునిరంకుశుఁడై ప్రతికూలురగుపార్లమెంటు సభ్యులను దండనము చేయుచువచ్చుటచే, పార్లమెంటుచర్చలు గోప్యములుగా నుండుటయే పూర్వకాలమున క్షేమకరముగానుండెను. పార్లమెంటుసభవారెన్నిపాట్లుపడినను దుర్వినీతుఁడగు సెన్స్వఁడో యొకఁడు పార్లమెంటులో జరిగినసంభాషణములను రాజునకుఁ జెప్పుచుండుటయు, రాజాగ్రహగ్రస్తుఁడై యట్టిసంభాషణములను జేసినవారినిదండించుటయుఁ దఱచుగాఁ దటస్థించుచు వచ్చెను. ఇటీవల ముద్రాయంత్రములు వెలసినతరువాత, పార్లమెంటులో జరిగిన చర్యలనువినుటకు రాజునకును, ఆతనిమంత్రులకు నేకాక, ప్రజలకుఁగూడ ముచ్చటయ్యెను. మొదటిచార్లెసుకాలము నాటనుండియు వాదప్రకటనమునకు పార్లమెంటుసభవారు సుముఖులై యుండిరికాని, ఒక్కొకప్పుడు ప్రకటనము చేసినవారిని పార్లమెంటుసభవారుదండించుచు నే యుండిరి. పార్లమెంటుసభలో వాదములు జరుగునప్పుడు వాదప్రతివాదములను వ్రాసికొనుటకు లేఖకులను లోనికి రానిచ్చెడువారుకారు. అందుచేఁ బత్రికలలోఁ బ్రకటింపఁబడువాదప్రశంసలసంపూర్ణములుగను, సత్యవిరుద్ధములుగను నుండుచువచ్చినవి. పార్లమెంటు సభవారియభిప్రాయములు జనాభిప్రాయమునకు వ్యతిరేకముగనున్న చార్లెసు మొదలుగాగల రాజులకాలమందుఁ బ్రకటింపఁబడిన వాదప్రశంసలలోని లోపములనుబట్టి పత్రికాలేఖకులను పార్లమెంటుసభవారు దండనపాత్రులనుజేయుచు వచ్చిరి. 1771సం॥లో జానువిల్కిసు ప్రోత్సాహపఱుపఁగాఁ గొందఱు పత్రికాధిపతులు పార్లమెంటుచర్చలను బ్రకటించిరి. వీరిని బట్టుకొనుటకు పార్లమెంటుసభవారాజ్ఞాపించిరిగాని పత్రికాధిపతులీయాజ్ఞను దృణీకరించి పట్టువీడరైరి. అందుఁమీఁద వీరినిబట్టుకొనుటకయి రాజుత్తరవు చేసెను. దీనినిబట్టి యిద్దఱను బట్టుకొనిరిగాని లండనుపట్టణ ప్రధానాధికారి (Lord Mojor) శాసనవిరుద్ధమైన నేరమునుజేసిన ట్లీయుత్తరువులలో వివరింపఁబడనందున నీపత్రికాధిపతులఁ బట్టుకొనగూడదని నిర్ణయించి వారిని విడుదల చేయించెను. ఈపత్రికాధిపతులు పార్లమెంటులో సభ్యులే కనుక వారిని బిలువనంపి, పార్లమెంటుసభవారు వారిని గారాగృహమున కంపిరి. పార్ల



మెంటులో నిందునకుఁ బ్రతికక్షగా నున్నవారును లండనుపట్టణవాసులును దీనికంగీకరించక వారియాగ్రహమును జూపినందున నీవ్యవహారము నింతటితోఁ జాలించుకొనిరి. నాటనుండియుఁ బ్రజాద్వేషమునకు వెఱచి, పార్లమెంటుచర్చలను సరిగాఁ బ్రకటించిన వారిని నిరాక్షేపముగా వదలిపెట్టిరి. ఇట్టిప్రకటనములవలన రాజకీయవ్యవహారములనుగూర్చి ప్రజలకు శ్రద్ధపట్టెను. ఇంతకుఁ బూర్వము కామనుల ప్రాభవమే యధికముగా నుండుచువచ్చెనుగాని, ఈ ప్రకటన స్వాతంత్ర్యము స్థిరపడినకాలది వార్తాపత్రికలే పార్లమెంటుచర్చలను బూర్ణముగఁ బ్రకటించుచు విమర్శించుచు ఖండించుచు రాజ్యతంత్రమును సన్మార్గమున నడపుటకు ముఖ్యసాధనములయ్యెను. రాజ్యవ్యవహారములను గుఱించి బుద్ధిమంతులు గ్రంథములను వ్రాయుచు సాధకబాధకములను విమర్శించుచువచ్చిరి. ఇట్టివిమర్శనములు పార్లమెంటుసభవారి యెడలను దొరతనమువారియెడలను నిందాస్వభావముగలవని విమర్శకులను పార్లమెంటుసభవారుదండనపాత్రులనుజేయుచువచ్చిరి. చేయఁబడినవిమర్శనము నిందాస్వభావముగలదని తీర్మానించువారుజడ్జీలయియుండిరి. వీరికి జూరీలుసహాకారులుగా నుండిరిగాని, విమర్శకుఁడీతఁడగునా కాదా యనునంశమును దీర్మానించుటయే వీరిపని యగుటచే, ఇదినిందా స్వభావముగలది, ఇది కాదని, తీర్మానించుపని జడ్జీలయందే యుండెను. జడ్జీలు పార్లమెంటుయొక్క యనుగ్రహమును, రాజానుగ్రహమును గోరి వారియిష్టానుసారము నడచుకోవలసినవారైనందున నిట్టి వ్యవహారములలో న్యాయముజరుగకుండుటకు విశేషావకాశము కలిగి యుండెను. ఈబాధనుదొలగించుటకు 1792సం॥లో మానభంగవిషయములకై యొకఆక్టు చేయఁబడెను. దీనినిబట్టి చేసినపని నేరమగునా కాదాయనునంశమును, విమర్శకుఁడు దోషస్థుఁడగునా కాడా యనునంశమును, నిర్ధారణముచేయుపని జూరీలయందేయుంచఁబడుటచే, రాజకార్యములసాధకబాధకములనుగుఱించి వ్రాయువారు జంకును గొంకును లేక గ్రంథములను బ్రకటించుచు వచ్చిరి. దొరతనమువారిపైకిఁ దిరుగఁబాటునకుఁ బురికొల్పు వ్రాఁతలే యింతటనుండి దండనపాత్రములైనవికాని, అందునకుఁ గొఱవడిన ఖండనగ్రంథముల కపాయముతప్పెను.

# అధ్యాయము. 19.

## అమెరికాయుద్ధము (1775-1782)

### మూఁడవజార్జి.

ఇంగ్లాండునకును ఫ్రాన్సునకును 1756-1763 సం-వఱకు జరిగినసప్తవర్ష యుద్ధములో, అమెరికాదేశీయులింగ్లాండుసాహాయ్యము నపేక్షించి వారిమూలమున విజయులైరి. 1763 సం॥లో పారీసుపట్టణమున జరిగినసంధి నాఁటనుండియు నమెరికనులకు శత్రుభయము తొలఁగిపోయెను. ఈ యమెరికనులు వెనుక యింగ్లాండునుండి వలసవచ్చినవారే యగుటచే వారి కింగ్లాండు మాతృదేశము. అమెరికా పెంపుడుభూమి. దీనికిఁ దగు వాడుకపద మాంధ్రమున లేనందున కాలొనీ యను నాంగ్లపదమునే యిట వాడవలసి వచ్చినది. ఈ రెండిఁటికి నిట్టి తల్లిపిల్లలసంబంధ మూండుటచేతనే ఫ్రెంచివారివలన నమెరికనులకాపద వాటిల్లినప్పుడు మాతృదేశము ప్రోత్సాహము పుచ్చుకొనవలసి వచ్చినది. ఐనను మాతృదేశమునకును కాలొనీకినిఁగలపరస్పరసంబంధము నిర్ధారణముకాకపోవుటచే నప్పుడప్పుడు కలఁతలు పొడచూపుచువచ్చినవి. తమ్మునుచిన్నఁగాఁ జూచుట లేదనియు, తమదేశమునకు వచ్చుగవర్నరులు సధర్ములు కారనియు, చట్టములు న్యాయవిరుద్ధములనియు, కాలొనీవారు గొణఁగుకొనుచువచ్చిరి. ఫ్రెంచివారితోడియుద్ధము వాటికున్న హద్దుదాటి పశ్చిమముగఁ బోయి యమెరికనులు నివాసములేర్పఱచుకొనఁగూడదనియు, మాతృదేశీయులవర్తక సౌకర్యమునకు వారవరోధములు పెట్టఁగూడదనియు, మాతృభాగముతోఁదమ్మును రక్షించుచున్నందులకు కలోనియనులు మాతృదేశమునకుఁ బన్ను చెల్లించవలెననియు, ఆంగ్లేయులు సణుఁగుచుండిరి.

కలోనియనులకుఁ బన్నుకట్టువిషయముననే తుదకీరెండు దేశములకును నెయ్యముపోయి కయ్యముప్రసక్తిల్లెను. 3-వ జార్జికిఁబూర్వమెన్నఁడు కలోనియనులకుఁ బన్నుకట్టుటకు మాతృదేశము ప్రయత్నము చేయలేదు. అట్టిపన్ను



నచ్చుట కమెరికను లొడఁబడలేదు. ఫ్రెంచివారితోడి యుద్ధము సంప్రాప్తమైననాఁటనుండియు నమెరికాదేశము సంపన్నమై ప్రాముఖ్యత వహించి తోఁటిదేశములలో నెన్నికకు వచ్చెను. అందలివివిధమండలములవారొక్కొక్క రాజకార్యసమితి నేర్పఱచుకొని ఆంగ్లగవర్నరు నాధిపత్యముక్రిందఁ దమస్వాతంత్ర్యమును గాపాడుకొనుచు రాజకార్యములను నెఱవేర్చుకొనుచుండిరి. వీరిస్వాతంత్ర్యప్రతిష్ఠ వణఁచవలెనని జార్జిబద్ధకంకణుఁడైయుండెను. వీరిసంరక్షణార్థము ఫ్రాన్సుదేశముతోడ నడపించినయుద్ధమునకొఱకుఁ జేయబడిన ఋణవిమోచనము నిమిత్తమాంగ్లేయులకుఁ బన్నులధికముగఁ గట్టఁబడెను. ఈఋణకముయొక్క దుర్భరభారముతగ్గించుట కమెరికాదేశీయులవలనఁ గొంతపన్ను వసూలుచేయవలెననుద్దేశముతో 1765 సం॥లో నొక స్టాంపుఆక్టుఁ జేసి లావుసంబంధములైన దస్తావేజులన్నిటికి స్టాంపులుండవలెనని తీర్మానించఁబడెను. పార్లమెంటు సెలవులేకుండ రాజుస్వతంత్రుఁడై పన్నుకట్టఁగూడదనియు, ప్రజలకష్టసుఖములను గాపాడుకొను నిమిత్తము ప్రతినిధులను నియమించుకొని పార్లమెంటునకు సభ్యులుగఁ బంపుకొనవలెననియు, పార్లమెంటు మూలమునఁ బ్రజలంగీకరించి విధించుకొన్న పన్నులనే కాని తదితరములను బ్రజలు చెల్లించఁగూడదనియు నాంగ్లరాజనీతిధర్మములై స్థిరపడియున్నవి కదా. అమెరికనులుమాతృదేశమునుండి వలసవెళ్లినవారైనను మాతృదేశీయుల ధర్మములకలవాటుపడినవారే కనుక, నిట్టినీతివిరుద్ధమైన పన్నునచ్చుకొనమనియు, స్టాంపులేకపోయినను లావుసంబంధములైనదస్తావేజులు చెల్లవలెననియు నొక్కుమ్మడిగా నమెరికనులందఱు నిశ్చయించుకొనిరి. ఇఁటనింగ్లాండునఁ గూడనిట్టిపన్ను రాజనీతివిరుద్ధమని విమర్శకులు వాదించిరి. అందుచే నాంగ్లదొరతనమువారి చట్టములు 1766 సం॥లో మాఫుచేసికొనిరి. కాని మరుసటిసంవత్సరముననే యమెరికాయందు నిలుపఁబడిన దొరతనమును బోషించునిమిత్తమును, ధర్మపరిపాలనార్థము నిలుపఁబడిన న్యాయసభలఁబోషించు నిమిత్తమును, తేయాకు మొదలగు నాలుగువస్తువులపైఁ బన్నుగట్టుట కొకరివిన్యూ ఆక్టుతిరుగ నెలకొల్పఁబడెను. ఈపన్నుకూడ రాజనీతికిఁదప్పినదేయని యమె

రికనులు నిరాకరించిరి. 1770 సం॥లో నొక్క తేయాకుమీఁదనే పన్ను నిలిపెదమని దానినుండనిచ్చి తక్కినయెమువస్తువులమీఁద బన్ను తొలఁగించి, అమెరికనులను సమాధానపఱచవలెనని యాంగ్లదొరతనమువారు పాటుపడిరి గాని అమెరికను ప్రజలవలన నియమితులగు ప్రతినిధులాంగ్లపార్లమెంటులో సభ్యులుగానుండి యీపన్నులు విధించలేదుగనుక మొదలేపన్నులియ్యమని కలోనియనులు నిరాకరించిరి.

ఇదియిట్లుండగా మఱియొక కలహకారణము తటస్థించెను. అమెరికాదేశపుసరకు లమెరికనుల యోడలమీఁద నింగ్లాండునకు రాఁగూడదనియు, ఆంగ్లదేశపుసరకు లమెరికాకాంగ్లయోడలమీఁద రాఁగూడదనియు, నిషేధించు చట్టములాకాలములో నమలులోనున్నందున, రహస్యముగఁ గను మొఱఁగించి అమెరికనుపడవలు అమెరికాసరకుల నింగ్లాండునకుఁ గొనిపోకుండ జాగ్రత పెట్టు నిమిత్తము పోలీసుభటులు సముద్రతీరమునఁ గాచుకొని యుందురు. ఒకసారిపోలీసువారిట్టి రహస్యమునుగని పెట్టి దిగుమతి సరకులను దెచ్చిన యమెరికను పడవవాండ్రను బట్టుకొనఁగా నమెరికనులు పోలీసువారినుండి పడవవాండ్రను విడిపించిరి. ఇందువలన నావాటికాంగ్లదొరతనమువారు నిల్పిన పోలీసువారికిని, అమెరికనులకును, వైరముహెచ్చి 1770సం॥లోఁ గొందఱను పోలీసువారుచంపుటఁ దటస్థించెను. నాఁటనుండియు నమెరికనుల మనస్సులో నాంగ్లదొరతనము మీఁదవైరబుద్ధి నాటుకొనియుండెను.

తేయాకుమీఁది పన్ను నిలుపఁబడినందున నమెరికనులు దాని నుపయోగించుట మానుకొనిరి. అంతకును నాంగ్లదొరతనమువారు పన్ను మాపుచేయకుండుటఁ జూచి, అమెరికాదేశమునకు దిగుమతికివచ్చిన కొన్ని తేయాకుపడవలలోని తేయాకుసముద్రమున కర్పించిరి. ఇందునకుఁ బ్రతిహతముగా నాంగ్లదొరతనము వార మెరికనులందఱను దండింపఁదలపెట్టి (1773) బోస్టనురేవునుండియోడల రాకపోకలనరికట్టి, మెస్సాచుసెట్టుకాలొనీ (మండలము) యొక్క స్వాతంత్ర్యమును రద్దుపఱచిరి. ధర్మసంస్థాపనమునకుఁ బూనుకొన్న కలోనియనుల ధర్మదీక్షయింతటితో మొక్కవోవునా? ధర్మప్రతిజ్ఞను



విడువవలదని రాజకార్యసమితివారు దేశస్థులకుఁ బ్రబోధించి, ఆంగ్లగవర్నరు నాధిపత్యము నొకమూలకుఁ ద్రోసిపుచ్చి, తామే స్వతంత్రముగ నొక ప్రతినిధి సంఘము నేర్పఱచికొని మండలరాజకార్యములను దీర్చుకొన నారంభించిరి. ఇట్లొకమండలము స్వాతంత్ర్యమును దీసివేసినందులకన్ని మండలములవారు నేకమై తమకుఁ గూడ నట్టి యిక్కట్టు పుట్టకుండఁగాపాడుకొనుటకై యాకాలమున నమెరికాయందు వెలసియున్న పదుమూఁడు మండలములనుండియు నేఁబదియేవురు ప్రతినిధులు 1774సం॥లో కాంగ్రెసుగా సమకూడి స్వాతంత్ర్యనిర్ధారణ పత్రికనొకటి లిఖించి, ఆంగ్లేయులతో సమముగా సర్వస్వాతంత్ర్యములను గోరుచు నింగ్లాండుతోడి వర్తకమే కూడదని బహిష్కారనిర్ణయము చేసికొని, ఆంగ్లరాష్ట్రమహాజనులకును, కనడాయనునుత్తరదేశవాసులకును, రాజునకును, బత్రికలనంపిరి. ఇందుపైఁ బ్రధాని యమెరికనులపైఁ బన్ను మాపుచేయుట కిష్టపడెనుగాని రాజతనిమాటలు సాగనియ్యఁడయ్యెను. అమెరికావారి కష్టసుఖముల నంతగా నెఱుఁగనివారై పార్లమెంటుసభవారుకూడ రాజుతో నేకాభిప్రాయులై కలోనియనులకు గర్వపరిహారము చేయవలెనని పట్టుపట్టిరి. ఇంగ్లాండు జనసమృద్ధమును ధనసమృద్ధమును బలవంతమునునగుటవలన, యుద్ధవిద్య నెఱుఁగక స్వల్పసంఖ్యాకులైన పేద యమెరికనుల నవలీలగ జయించవచ్చునని యాంగ్లజనులు తలంచియుండిరి. కాని, అమెరికనులు కష్టజీవములైన దృఢకాయులగుట వలనను, కడుదూరముననున్న యింగ్లాండునుండి యుద్ధవీరులను యుద్ధపరికరములను దెచ్చుకొనవలసిన కష్టమాంగ్లేయుల కుండుటచేతను, స్వాతంత్ర్యసంపాదనార్థ మమెరికనులకు బలవత్తరమగు తీవ్ర ప్రతిజ్ఞ యుండుటచేతను, విజయలక్ష్మి యమెరికనులనే యాశ్రయించెను. అంతఁ జేఁబిరికిపందలై పాఱిపోక యమెరికనులు తమముంగలనిల్వలేరను నాంగ్లవీరుల దంభోక్తులు యుద్ధముయొక్క ప్రారంభ చరిత్రములోనే యమెరికనుల విజయములవలన కల్లలైనవి. అందుచే ముప్పిరిగొన్న విజయోత్సాహముతో కలోనియనులు 1775 సం॥లో మరల కాంగ్రెసుసభచేసి యుద్ధమునకు వలయు ధనమును గూడఁబెట్టి 'జార్జివాషింగుటను' అను ప్రసిద్ధ వీరుని

సేనానాయకత్వమునకు నియమించిరి. అదివఱకే కలోనియనులలో నొకరిపై నొకరికుండు పరస్పర వైరముల నీ దేశసామాన్యోపద్రవము నందఱ విస్మరించి యందఱు నేకభావముతో నీమహాపురుని నాయకత్వమున నొడఁబడిరి. ఈ తఁడు కలోనియనులను యుద్ధవిద్యయందు నేర్పరులం జేసెను. కాలొనీ లన్నిటినిసమష్టిమీఁదనడుపునిమిత్తము సాంఘికస్వతంత్రరాజ్యపద్ధతి యొకటి యుండవలెనని కాంగ్రెసుబారు నిశ్చయించిస్వాతంత్ర్యపత్రికనొకదానిని స్థిరపఱుచుకొని, ఆంగ్లవైరులైన ఫ్రెంచివారి నీయుద్ధములోఁ దమకు సాహాయ్యము కోరి దూతలనంపిరి. ఫ్రెంచివారు సాయముచేయుట కంగీకరించుటకుఁ బూర్వమే సరటోగా యనుచోట నాంగ్లేయులను నమెరికనులు ముట్టడిచేసి 5750 మందిని ఖయిదీలనుగాఁ బట్టుకొని తక్కిన వారిని నిరాయుధులనుజేసిరి. (1777)

ఈ పరాజయమునకు సిగ్గుపడి యింగ్లాండున మంత్రు లమెరికనులతో సంధిచేసికొనఁదలఁచి వారిపైఁబన్ను గట్టుటకునాంగ్లపార్లమెంటునకు మొదలే యధికారములేదని యంగీకరించుమని రాజునుబలవంత పెట్టిరిగాని. జార్జిమఱింత పట్టుదలతో యుద్ధమునడపి యమెరికనుల లోఁబఱచుకొనవలెనని సంకల్పించియుండుటచే వారి ప్రయత్నములు కొనసాగలేదు. ఇంగ్లాండువంటి బలాఢ్యమైన దేశము నెదిరించుట కమెరికనులు తగుదురా యను సందేహముచే ఫ్రాన్సురాజు వీరికి సహాయముచేయుట కొకవత్సరము వఱకు తడవుచేసెను. సరటోగాయొద్ద నమెరికనులవలన నాంగ్లేయులు పొందినపరాజయ వృత్తాంతమును ఫ్రెంచివారు విన్నమీఁదట మాత్ర మట్టిసంశయమును విడనాడి, 1778 సం॥ లో గష్టసుఖము లేవివచ్చినను నొకరికొకరు సాహాయ్యులై నిలుచునట్లు ఫ్రెంచివా రమెరికనులతో సంధిచేసికొనిరి. ఈవార్త యింగ్లాండునఁ దెలియఁగానే, పరాజయమువలని దైన్యము దిగజాఱి, కడముట్టయుద్ధము సాగించవలెనను పూనిక యాంగ్లేయుల నావహించెను. ప్రపంచమునఁగల రాజ్యము లన్నిటిలో నింగ్లాండు బలపరాక్రమములందుఁ గడుమిన్నయని



యాంగ్లేయులకొక పౌరుషప్రతిజ్ఞ యయ్యుండుటచే ఫ్రెంచివారితోడ నమెరికనులు చేసికొన్న కూటమికి వారుజంకలేదు. ఈవత్సరాంతరమందే స్పెయినుకూడ నమెరికాతోఁ గలసెను. ఈ సంవత్సరమునఁ బ్రారంభమైన ఘోరకలహము నానాఁటికి నలుగడల నల్లుకొని, యూరోపాయం దాంగ్లేయులకు సాహాయ్యము చేయుట కొక్కరాజైనలేకుండ నందఱును విరోధులై కాలక్రమమునఁ బ్రతిఘటించిరి. ఇందఱకును నజేయులై తుద కింగ్లాండు దిగ్విజయము చేసి జగదేకవిఖ్యాతితో రాజిల్లెను. స్పానియులును ఫ్రెంచివారుగలసి యింగ్లాండుపై దాడివెడల సమకట్టి, ఫ్రాన్సుదేశమునకును, ఇంగ్లాండుదేశమునకును, మధ్యనున్న యింగ్లీషు కాలువలో నోడలనడపించి పరవళ్లు ద్రొక్కసారంభించిరి. ఇంగ్లాండుయొక్క వర్తకము నరికట్టుట కుద్దేశించి మధ్యధరాసముద్రమునకుఁ దలుపువంటిదగు జిబ్రాల్టరు రేవు నాంగ్లేయుల స్వాధీనమునుండి తప్పించవలెనని 1779-1782 సం॥వఱకు ముట్టడించి విఫలులైరి. ఇంతట నొలండువారుకూడ శత్రుకూటమునఁగలసిరి. ఐరోపాయందు కీరి యూటలు సాగకమున నిండియాలో స్వదేశరాజులను బురికొల్పి యాంగ్లేయులనందుండి తఱుమవలెనని ఫ్రెంచివారు మహారాష్ట్రులతోఁ గుతంత్రములు సాగించిరి. ఇండియాకు మొదటి గవర్నరుజనరలుగానున్న వారను హేస్టింగ్సు మహారాష్ట్రుల నోడించి యాంగ్లేయరాజ్యమును గాపాడెను. అంట నమెరికాలోనైన నీ శత్రుకూటముయొక్క దుష్ప్రయత్నములంతఁగాఁ గొనసాగలేదు.

ఇట్లింతటను నాంగ్లేయు లజేయులై యుండఁగా, అమెరికాలో నాంగ్లనాయకుఁ డొకఁడు యార్కుటవునులో విడిసియున్నతఱిని, అమెరికనుల నాయకుఁడగు వాషింగుటనునుం గలసి, ఫ్రెంచివారు సముద్రపు తట్టునను, ముట్టడించిరి. తినుబండారములకు లోటుబడి యాంగ్లభటులు లాకట నకనకలాడుచుండిరి. వెనుకటి సరటోగా నాటిపరాజయమును బోలినపరాజయపుతలంపునకు లోనై యాంగ్లనాయకుఁడు శత్రువులచేతఁ జిక్కెను. ఈయోటమికిఁ దలయెత్తలేక ప్రధాని పనిచాలించుకొనెను. ఆంగ్లేయుల పరాభవముచే నుత్సహింపఁబడి యైర్లాండు దేశస్థు లాంగ్లేయుల క్రూరమైన దొరతనమునుండి విడిపడఁ

దలపెట్టిరి. పేరునకై ర్లాండున నొకసేనయు, ఒకపార్లమెంటును, కొందఱు మేజస్ట్రీటులును నుండిరిగాని, ఐరిషుజన బాహుళ్యమునకు వీనిలోఁ బ్రవేశమే లేదు. ఆదేశములో ప్రాటెస్టంటులకంటె కాథొలిక్కులైదురెట్లుండిరి. ఇంత మంది కాథొలిక్కులకును దమస్వదేశమం దేవిధమైన స్వతంత్రముగాని యధికారముగాని లేదు. ఆదేశపుకోర్టులలో కాథొలిక్కులు ప్లీడర్లుగానైనఁబనిచేసికొనఁగూడదు. పార్లమెంటునకుఁ దమపక్షమున్నఁ బ్రతినిధులనుబంపుకొనుటకు స్వాతంత్ర్యములేదు. కాథొలిక్కుల భూవసతులన్నియు రాజద్రోహము మోపి క్రమక్రమముగా దివాణమునకు దొరతనమువారు కలుపుకొనిరి. మత విషయములో మాత్రము వారి యిష్టానుసారము దేవతార్చనము జరిగించుకొను స్వాతంత్ర్యమియ్యఁబడినది. తక్కిన యన్నివిషయములలోను జనబాహుళ్యమంతయు ప్రాటెస్టంటుల కూలిగములు చేయుచు, వారికి నీళ్లుమోయుచు వారికిఁగట్టెలనుగొట్టుచు నికృష్టజీవనము చేయవలసినవారయిరి. మిగిలిన ప్రాటెస్టంటులకు దేశాభిమానములేక, ఐర్లాండును బ్రవాసప్రదేశమునుగాఁ జూచుకొనుచు, ఐరిషుదేశవాసులమని చెప్పుకొనుటయే ప్రతిష్ఠాభంగముగాఁ దలంచుచు, మాపూర్వు లాంగ్లేయులనియు స్కాటులనియుఁ బ్రతిష్ఠలు పలుకుచు నివసించుచున్నారు. ప్రొటెస్టంటులలోఁగొందఱు పరిషత్ప్రచారకు లున్నారని యిదివఱకే చెప్పియున్నాము. ఐర్లాండునందలి ప్రాటెస్టంట్లలో పరిషత్ప్రచారకులు సగమువఱకున్నందున వీరుకూడ కాథొలిక్కులతోఁబాటుగ బాధలపాలై యుండిరి. రాజానుమతమగు మతము నవలంబించిన ప్రాటెస్టంటులు ప్రజలలో ద్వాదశాంశముందురు. దొరతనసంబంధమయిన యధికారమంతయు గొప్ప ప్రాటెస్టంటు భూస్వాముల చేతులలోను, తక్కిన క్రిందియుద్యోగములన్నియు నీద్వాదశాంశమగు ప్రాటెస్టంట్ల చేతులలోను నున్నవి వెనుకటిరాజులనాఁడుఐరిషుపార్లమెంటును రాజువశమందుంచుకొనుటకుఁగా ముచితానుచితము లాలోచించక పార్లమెంటునకు సభ్యుల నియమించుకొను స్వాతంత్ర్య మియ్యఁబడిన నల్పజనపదములు (Rotten boroughs) బలవంతులగు ప్రాటెస్టంటు భూస్వాములకు నానాటికి వశమైనవి. వీరి



మూలమున నీభూస్వాములు తమకు వశవర్తులై మసలుకొను కామందులను గూర్చుకొని, తాము లార్డులై, విశృంఖలముగ దేశము నేలుచుండిరి. ఆంగ్ల దొరతనమువారుపంపిన రాజప్రతినిధికి వీరే మంతనకాండ్రై ప్రాయికముగ రాజకార్యములను దామేనడపించుచుఁ, బ్రతిఫలముగ పెన్షనులను, ఉద్యోగములిచ్చినందులకు లంచములను స్వీకరించుచు దోపిడిగాండ్రై ధనము గూడఁ బెట్టుచుండిరి. ఈకారణములచే నొకశతాబ్దమునుండి యైర్లాండు కడుహీనముగఁ బరిపాలింపఁబడుచుండెను. ఇంగ్లాండులో నీదొరతనమువారికి సంబంధముండుటచేతను, ఐరిషు పార్లమెంటువారింగ్లీషు పార్లమెంటునకు లోఁబడినవారగుటచేతను, గొంతవఱకైన హద్దులోనుండవలసి వచ్చినది కాని లేకున్నచో నింక నెట్టిదురితములపాలగునో చెప్పనలవికాదు. ఇంగ్లాండునందలి ప్రివీకౌన్సిలు వారాలోచించి స్థిరపఱచిన చట్టములకును నీయైరిషు పార్లమెంటు వారు తలయూచవలెను; లేకున్న నిరాకరించవలెను. అంతేకాక దేశముయొక్క స్థితిగతులనుబట్టి క్రొత్తమార్పులను జేయుటకు వీరికి స్వాతంత్ర్యములేదు. ఐరిషు పార్లమెంటులో లార్డులు చేయు పనుల నాంగ్లపార్లమెంటులోని లార్డు లప్పీలుకోర్టువారుగానుండివిమర్శించుచుండిరి. ఇంతటితో సరిపెట్టక, మూఁడవవిలియము కాలమునుండియు నైర్లాండుల వర్తకమును జంపివేయుటకును, వ్యవసాయము వర్ధిల్లకుండఁ జేయుటకును ఇంగ్లాండనేకప్రయత్నములఁ జేసెను. ఐర్లాండుల పశువులనుగాని గొఱ్ఱెలనుగాని యింగ్లాండురేవుపట్టణములకైర్లాండు లెగుమతి చేయకుండ నాంగ్ల పార్లమెంటువారు నిషిద్ధశాసనముల నెలకొల్పి, ఆంగ్ల భూస్వాములకు లాభమును సంపాదించిపెట్టిరి. ఇంగ్లాండులోని యున్నివర్తకులకు లాభముతక్కువగునని యెంచి యైర్లాండువా రున్ని నెగుమతి చేయఁగూడదని నిషేధించిరి. ఇట్లనేకపాట్లుపడి దుష్పరిపాలనమునకు దారిద్ర్యదేవతను దోడుచేసిరి. అది యేమిపాపమోకాని దరిద్రులయందే సంతానవృద్ధి యధికమయి దారిద్ర్యపీడ నినుమడించుట ప్రకృతిమర్యాద గనుక, నికృష్టజీవనులగు కాథొలిక్కుల జనసంఖ్య మితిమీఱి పెరుగుచుండెను. ఇన్నిటికిఁ దోడు క్షామముకూడ నీదేశమునకే కాపురము వచ్చి దేశమును భూలోకనరకమును జేసినది.

కాథొలిక్కు లప్పుడప్పుడు మొఱ్ఱరేగి తమకష్టములనువిచారణము చేసికొనుటకుఁ బ్రయత్నించుచుండఁగా నాదేశపు ప్రొటెస్టెంటులేవారి నణఁచుచువచ్చిరి, రాజకీయ వ్యవహారములను జక్కఁబఱచుకొనుటను గుఱించి వారంతఁగా నెఱుఁగరు. నానాటికి వ్యవహారలోపములు దుర్భరములై బాధింపఁగాఁ ధనవు ప్రొటెస్టెంటులే తిరుగఁబాటునకుఁ బూనుకొనిరి. మూఁడవ జార్జి రాజ్యమునకు వచ్చినప్పుడు ప్రొటెస్టెంటులవలని క్రౌర్యమును గొంతవఱకుఁ దొలఁగించి కాథొలిక్కులను రక్షింపవలెనని కొంతప్రయత్నము చేయఁబడెను. ఇందువ కష్టములేనివారై, ఐరిషుపార్లమెంటువా రాంగ్లదొరతనమువారికి ద్రవ్యమునిచ్చుటను బిల్లుచేయక నిరాకరించి, ఆంగ్లపార్లమెంటు వారి యాధిపత్యమును దొలఁగించి తమను స్వతంత్రముగఁ జట్టములు చేసికొనుట కధికారమిమ్మని కోరిరి. ఈ వ్యవహారమప్పుడింతటితో మట్టుపడెను. అమెరికాయుద్ధము ప్రారంభమైనతరువాత నైర్లాండుల ప్రార్థనముల నిరాకరించినయెడల ఫ్రెంచివారితో వారేకమగుదురనియు, అందువలన నింగ్లాండుతోడి సంబంధము నైర్లాండు విడిపించుకొని స్వాతంత్ర్యము వడయుననియు భయపడవలసివచ్చెను. ఫ్రెంచివారు దండెత్తుదురను భయము కలుగఁగానే, ఐర్లాండును గాపాడుటకుఁ దగిన రక్షకసైన్యము లేదనియు, మీ దేశమును శత్రువునుండి కాపాడుకొను సాధనములను మీరే కూడఁబెట్టుకొన వలసినదని యాంగ్లదొరతనమువా రైరిషుప్రజలకు సందేశమంపిరి. ఇందుకభిముఖులై 1779సం॥లో నలుబదివేలమంది వాలంటీరు లాయుధహస్తులై నిలఁబడిరి. వీరందఱును ప్రొటెస్టెంటులును, ప్రొటెస్టెంటు నాయకులచే నడుపఁబడువారునై యుండిరి. ప్రొటెస్టెంటులలో మహానీయ ప్రవక్తలిద్దఱు బయలుదేరి, ఐర్లాండు పార్లమెంటువారు దేశకాలస్థితులనుబట్టి స్వతంత్రముగఁ జట్టములు చేసికొనుట కధికారము కలిగియుండవలెననియు, ఐరిషుపార్లమెంటులోని లార్డ్సు చేయుపనులమీఁద నాంగ్లలార్డ్సుల కపీలధికార ముండఁగూడదనియు బోధించుచుండిరి. పైనఁజెప్పఁబడిన వాలంటీరులతో కాథొలిక్కు లేకభావములేక యుదాసీనులై యుండుట చూచి, వారి కష్టములనుగూడఁ దొలఁగింపఁ



బాటుపడెదమని యొప్పించి వారి సాయమును సంపాదించిరి. ఇందఱును గూడి తిరుగఁబడుదురని భయముగలిగి యాంగ్లేయులు తమపక్షమున కిరి నెదురొడ్డ నొక్కఁడైన భటుఁడు లేకుండుటఁ దలపోసి, అక్కడ, అమెరికామాట యెట్లున్నను యిందైర్లాండులను సమాధానపఱచుటయే ముఖ్యకర్తవ్యమని మంత్రిమండలివా రాలోచించవలసినవారైరి.

ఇట్లు అమెరికాను, ఐర్లాండును నిరంతరముగా నేలవలెనను రాజుయొక్క ప్రయత్నము వ్యర్థమయ్యెను. దేశమందేర్పడిన యుభయపక్షములలోఁ బ్రబలులగువారి మంత్రనమునకుఁ గట్టుపడి యాంగ్లరాజకార్యములను నెఱవేర్చవలసియుండఁగా, స్థిరపడిన దేశాచారములను గుర్తెఱుఁగక తానే సర్వాధికారియై యేలవలెనను దుస్సాధ్యపు పూనికను జేపట్టి కుతంత్రములను, బాసలను, కల్లతనములను నాధారముచేసి, తనచేతి కీలుబొమ్మవలె నడచుకొన్న లార్డునార్తు అను ప్రధానిని నామమాత్రమునకు నిలిపి తన యిచ్చవచ్చినట్లు రాజ్యము చేసి, జార్జి విఫలమనోరథుఁడై, ఇంతటినుండి దేశాచారమునే శరణముగొని మంత్రిమండలివారు నడపినట్లు నడచుకొనవలసినవాఁడయ్యెను. గతపదివత్సరములలో జార్జి చేసినట్లేఁక రాజ్యము నడపుటఁ కెన్నఁడుసాధ్యము కాదు. అందుచే 1782సం॥లో మంత్రిమండలివిగ్గులతో 'రాకింగాము' అను ప్రధాని యాధిపత్యముక్రింద నైర్లాండునకు రాజకీయ విషయములందును కోర్టువ్యవహారములందును స్వాతంత్ర్య మలవడుటయు, అమెరికాతో సఖ్యము సమకూరుటయుఁ దటస్థించెను. ఐర్లాండు పార్లమెంటునకు సర్వస్వాతంత్ర్యము నిచ్చుచు నాంగ్లపార్లమెంటువారొక శాసనమును జేసిరి. రెండుదేశములకును రాజొక్కఁడేయన్న విషయమునఁదప్ప, ఇతరవిషయములం దొకరితో నొకరికి సంబంధము లేదు. అమెరికను యుద్ధమును జాలించి వారికిఁగూడ స్వాతంత్ర్యము నిచ్చుటకు రాయబారము లారంభింపఁబడినవి. వెనుక ఫ్రెంచివారును అమెరికనులును సమాఖ్య చేసికొన్నప్పుడు వారందఱును సమాధానమయిన రీతినిదప్ప, యింగ్లాండుతో సఖ్యము చేసికొనఁగూడదని యేర్పాటు జరిగెను. ఇటీవల స్పానియా వీరితోఁ గూడినప్పుడీ పద్ధతిమీఁదనే వారికి నెయ్యము కుదిరెను.

ఇప్పుడాంగ్లేయులు రాయబారము లారంభింపఁగానే జిబ్రాల్టరు రేవును దమ కిచ్చినఁగాని సంధి వలను పడదని స్పానియులును, ఇండియాలో బంగాళ దేశము తప్ప తక్కినదంతయుఁ దమపరము కావలెనని ఫ్రెంచివారును పట్టు పట్టిరి. భూమిమీఁద నాంగ్లేయుల కొమ్మిప్పుడు కొంచె మొత్తఁగియున్నను, నీటిమీఁద వారి ప్రాభవము కొంచెతపడలేదు. 1780సం॥లో రాడ్నే యనునొక ప్రసిద్ధ నావిక నాయకుఁడు స్పానియుల యోడల గుంపు నోడించగా నది చెల్లాచెదరై నశించి నాలుగుమాత్రము దేశమును జేరఁగలిగినవి. అమెరికా దేశమునకుఁ బశ్చిమముననున్న దీవులలో ఫ్రెంచివారియోడ లీ యాంగ్ల నావికనాయకునితోఁ బోరలేక చెల్లాచెదరై 1782సం॥లో నష్టపడిపోయెను. తుదకు నీటిమీఁద నాంగ్లేయులతోఁ బోరలేక జిబ్రాల్టరునొద్ద వీరినోడింప వలెనని స్పానియులును ఫ్రెంచివారును వీరిపైకివచ్చి యచ్చటఁగూడ నోడి పోయిరి. అంతట వీరికాలవిలంబనమునకుఁదాళక యమెరికను సంఘరాజ్యములను పేరుతోఁబరగుచున్న కాలొనీలు సర్వస్వతంత్రములయి రాజ్యము నడపుకొనునట్లును, అమెరికాలో నుత్తరభూములగు కనడా మండలమును, న్యూఫౌండులాండుద్వీపమును, నాంగ్లేయులు నిలుపుకొనునట్లును 1782సం॥లో నమెరికనులును నాంగ్లేయులును సఖ్యపడిరి. ఇంతటితో నమెరికాతోడి యుద్ధము ముగిసెను. ఈ సఖ్యమే ఫ్రెంచివారితోడను స్పానియులతోడను సఖ్యములకు దారితీసెను. ఈయుద్ధమువలన ఫ్రెంచివారికేమియు లాభము కలుగలేదు. స్పానియులు మాత్రము రెండుద్వీపములను సంపాదించుకొనిరి. ఇంగ్లాండుయొక్క జగద్విస్తృతప్రతాపము నడఁచుటకు వీరిద్దఱు తలపెట్టిరి. అమెరికను కాలొనీలు విడిపోవుటతప్ప, ఇంగ్లాండున కెట్టికొఱంతయుఁగలుగలేదు. విడిపోయిన యమెరికావలని నష్టము నిండియా కూడఁదీసినది. అమెరికాలోనైన నుత్తరభూములు దీని స్వాధీనములోనే యుండెను. పశ్చిమ దీవుల కపాయము కలుగనే లేదు. ఈ యుద్ధముతో నాంగ్లేయుల నావికప్రతిష్ఠ మఱింత వృద్ధియయ్యెను. ఈ యుద్ధ సమాప్తికాలమున మాత్రము దేశము నకుఁ గలిగిన లాభనష్టముల యథాస్థితి జనులకు గోచరించక, విశేషనష్టము



కలిగినట్లే భావింపఁబడుచు వచ్చినది. ఇంతటితో నింగ్లాండుయొక్క వాసి మొక్కపోయెనని ఫ్రెంచివారు తలఁచిరి. ఆంగ్లేయుల భావిచరిత్రమే వీరి యభిప్రాయము యథార్థమునకు దూరమని తెలియఁజేయఁగలదు. ఈ యుద్ధమువలన వచ్చిన నష్టములను బాపుకొనవలెనని ముప్పిరిగొన్న పూనికతో నాంగ్లేయులు పాటుపడి యిండస్ట్రీలను వృద్ధిచేసికొనిరి. దీనివలన నిదివఱ కెన్నండెఱుఁగని ధనాభివృద్ధి కలిగినది. ఆస్ట్రేలియాయం దాంగ్లేయులు నివాసమేర్పఱచుకొని వర్తకమును విరివిచేసికొనిరి. ...నాటికమెరికాతోఁ దుల్యమైన రాజ్యమొకటి యీ యాస్ట్రేలియాయందు కుదురుపడెను. అంట అమెరికనులును నీ యుద్ధము చాలించుకొని సర్వవిషయములందు నభివృద్ధి నొంది సరిలేని సంపదను, ఐశ్వర్యమును, ప్రఖ్యాతిని సంపాదించుకొనిరి. ఇంతటనుండి యాంగ్లేయు లింగ్లాండుననే పెంపొందుటకు మాఱుగ నచటను నంతకంటె విరివిగ రెండవ గోళార్ధమం దమెరికనులను పేరుతో వృద్ధినొంది ప్రపంచమున నెల్లెడలవ్యాపింపఁగలిగిరి. 1783 సం॥లో నమెరికాలో ముప్పది లక్షలుమాత్రముండిరి. ఇప్పుడు దేశమంతయు నాక్రమించుకొని నాలుగు కోట్లవఱకు విజృంభించిరి. సంఖ్యయందును, సంపదయందును, బలమందును, అమెరికనులిప్పుడుమాతృదేశ వాస్తవ్యులమించియుండిరి. ఇంగ్లాండును, అమెరికాయును, నిఁక ముందెన్నఁడు నేకదొరతనముక్రిందఁ గలిసికొనలేకపోయినను, అన్నిలక్షణములలో నిరువురు నేకస్వభావము గలవారు. ఓడలవలనను, తంత్రివార్తలవలనను, రెండుదేశములకును గలదూరము నానాఁటికి సన్నగిలుచున్నది. ఒకరితో నొకరికిఁ గాలక్రమమున నెయ్యము పెంపొందుచున్నది. దేశాచార భేదములును, రాజనీతివ్యత్యయములును దినదినము సమసిపోవుచున్నవి. ఆస్ట్రేలియాయం దేర్పడుచున్న యాంగ్లశాఖ అమెరికనులవలెనే మాతృ దేశమునుండి విడిపోవచ్చును. అయినను నీమూఁడు దేశములందును బ్రజల యాచార వ్యవహారములు సమములే. ఈ దేశములలోని ప్రజలు వృద్ధియై యమెరికాయందుఁ గొన్నియర్బుదములుగను, ఆస్ట్రేలియాయందుఁ గొన్నికోట్లుగను పెరిగినయెడలఁ బ్రపంచమందలి యితరదేశములోఁగూడఁ దమ యాచారములను, రాజకీయ స్వాతంత్ర్య ధర్మములను, ఆంగ్లభాషను, ఆంగ్ల విజ్ఞాన పుంజమును, బ్రసాదించి నాగరికబీజముల నంతట వెదఁజల్లఁగలరు.

# అధ్యాయము, 20

—.o.—

## ఇంగ్లాండుయొక్క యిండస్ట్రీల ప్రాభవము. 1782-1792.

### మూఁడవజార్జి

ఇంగ్లాండునుండి అమెరికా విడిపోయినతరువాత ప్రపంచచరిత్రమారి పోయినది. ఇంగ్లీషువారు మొదట నాదేశమునకు వలసపోయనప్పుడది యనామకమై నాగరికతావాసనలేక యాటవికజనులతో నిండియుండెను. ఆంగ్లేయులచట నివాసములను గూర్చుకొన్నతరువాతనైనను, మాతృదేశవిసర్జనముకలుగువఱకునునీదేశమునకు నామరూపములులేవు. స్వదేశస్వాతంత్ర్యము సంపాదించుకొనవలెననియు, విదేశపారతంత్ర్య మనర్థదాయకమునియు, పరస్పరవైరము దుర్బలహేతువనియు, సాముదాయకప్రయోజన మపేక్షణీయమనియు, మొదలగు రాజనీతుల నమెరికనులు మాతృదేశముతోడి యుద్ధములో నేర్చుకొని దేశాభిమానమును జాత్యభిమానమును బెంపుచేసికొని దేశసామాన్యముతో సంబంధించిన రాజకార్యములలో నప్రమత్తులై సకలకళలందును వృద్ధినొంది సరిలేని యైశ్వర్యమును సంపాదించుకొనిరి. ఇంతటి విస్తీర్ణదేశమును నష్టపోయి జీర్ణమైన యాంగ్లదేశ మెట్లు దైన్యోపహతమై యడుగంటక కష్టసముద్రమును దాటఁగలుగునని తటస్థదర్శులు శంకాశీలురై తల లూచుచుండిరి. కాని భావిచరిత్రనుబట్టి చూచినయెడల మునపటికంటెను, ఇంగ్లాండుదేశము ప్రతాపమహితమై ధైర్యస్థైర్యములతో ముందంజ వేసి జగదేకప్రతిష్ఠావంతమై వర్ధిల్లినది. అమెరికాయుద్ధమును వెన్నుదన్ని దశవత్సరముల స్వల్పకాలములో ఘోరయుద్ధమున ముంచివేసిన ఫ్రెంచివారి యుక్కడఁగించుటలోను, ఫ్రెంచివారికి నాయకుఁడగు నెపోలియను నూఁతగాఁగొని నలుగడలఁగవిసిన యైరోపారాజమండలిని వాటర్లూయుద్ధమునఁ దృణీకరించుటలోను, ఆంగ్లదేశము చూపిన బలపరాక్రమములపూర్వదృష్టములై ప్రపంచమును నివ్వెఱపఱచెను. డస్సి తలవంపులపాలై యమెరికాఁయుద్ధమును జాలించుకొనవలసిన దైనను, అభ్యుదయపరంపరలతో నిండినయింగ్లాండుయొక్కతరువాతివత్సరము లమెరికనుల యభ్యుదయ దినములకంటె ఘనగౌరవములందుఁ దీసిపోవునవికావు.. ఇప్పుడన్నిశాఖలయందుఁ గన్నులపండువ చేయుచున్నయింగ్లాండు మహోన్నతి యాదురదృష్టపు యుద్ధమునాఁటనుండియే ప్రారంభమైనది. గణించుచున్న పదునెనిమిదవ శతాబ్దము నాటి ప్రజల నిస్సారుప ప్రమత్తతను గడఁద్రోచి దానిస్థానమున లౌకికవ్యవహార నీతిరతియు, పరోపకార క్రియాదీక్షయు, అవ్యాజదైవభక్తియు, నెలకొల్పిన దీకాలమహిమయేకాని వేఱుకాదు. ఈకాలమందే సాహిత్యగ్రంథములు వేనవేలుగావృద్ధియై జ్ఞానధనమును నలుగడల వెదఁజల్లినవి. ఈకాలమునందే ఆంగ్లజనులు వ్యవసాయమే యేకవృత్తిగాఁగలిగి యనుభవించుదారిద్ర్యమును బాపుకొని, యిండస్ట్రీలను వస్తునిర్మాణ (వ్యాపారములను) వృద్ధిచేసికొని ధనవంతులై సుఖసాధనములగు గృహోపకరణములన్నిఁటిని విరివిగాఁ దయారుచేసికొని, ప్రపంచమంతయుఁ దమయొద్దనేవానిని విలుచునట్లును దేశమును గామధేనువనఁదగినట్లును మార్చివేసిరి. జార్జియొక్క రాచరికమునకుఁ బ్రథమదినములలో దేశమంతటను గాలువలు త్రవ్వఁబడి వర్తకద్రవ్యములను నొకచోట నుండి మఱియొకచోటికి సుకరముగాఁ గొనిపోఁబడుటకు మార్గములేర్పఱచఁబడెను. జేమ్సువాట్టుఅనువాఁడు నీటియావిరిమూలమున బండ్లను నడపు సాధనమును క్రొత్తఁగాఁగనిపెట్టెను. ఈయమెరికాయుద్ధకాలములోనే దేశమునకుధనాభివృద్ధి కలుగుటకుమార్గములన్నిఁటిని సూచించునొక గ్రంథరాజము బయలువెడలెను. మతవిషయమున సంస్కర్తలుబయలువెడలి నస్మత ధర్మములనుబోధింప నారంభింపఁగామతాచార్యులు పూర్వమువలె జంతువుల వేటలయందుఁ గాలమువ్యర్థపుచ్చక జ్ఞానబోధయం దప్రమత్తులై పనిచేయ నేర్చుకొనిరి. సంపన్నులువిషయలోలురై పూర్వమువలెనీతితప్పి వర్తించు

టకు మారుగా సత్యనిరతులై వర్తించుటకు నేర్చుకొనిరి. దుష్టవర్తనులును, అవినీతులును, అజ్ఞానులును, దేహసౌఖ్యముతప్పి, బాధపడువారును, దరిద్రులును, విటకాండ్రును బూర్వమువలె ననాదృతులై సన్మార్గముఁజూపి యాదరించువారు లేక భ్రష్టులుగావలసిన కాలము మారిపోయినది. వీరిదుర్గతిని బాపి పరలోకచింతయు, పాపభీతియు నేర్పుట కెందరో పరోపకారులు బయలు దేరిరి. పని పాటలనుండి విశ్రాంతి కొఱకేర్పడిన యాదివారములందుఁ గాయకష్టములవలన జీవించుపనివాండ్రకు జ్ఞానోపదేశము చేయుటకుఁ బాఠశాలలు ప్రారంభింపఁబడినవి. అసాధులచేనపాయము నొందినవారికిని, దుఃఖాక్రాంతులై యుండువారికిని జిత్తశాంతియొనర్చి యుచితముగ నన్నపానములిచ్చి మందులిచ్చుటకు ధర్మవైద్యశాలలును, ధర్మసత్రములును, దేవాలయములును వెలసినవి. ఆఫ్రికా మొదలగు దేశములలో మనుష్యులనుజంతువులవలెఁ గ్రయవిక్రయములను, జేసికొనుచు, వారికష్టసుఖముల నాలోచింపక జంతువులచేఁ బనిచేయించినట్లు పనిచేయించుకొనుచుండు బానిసలవ్యాపారమప్పుడు విరివిగా వ్యాపించియుండఁగా దానిని నిర్మూలము చేయుటకు దయార్ద్రహృదయులగు నుపకారపురుషులు కంకణముగట్టిపోరాడి మాన్పించి ధన్యులైరి. ఆకాలమందు ఖయిదీలబాధలువర్ణింపనలవికాక యుండెను. దయనీయులైన యీనికృష్టపురుషుల బాధలకుజాలినొంది 'జానుహోవర్డు' అనుధర్మచిత్తుఁడు మిక్కిలిశ్రద్ధతోడను బట్టుదలతోడను గారాగృహములకుఁ బోయివారికష్టములను జూచివానిని నివారించు మార్గములనునాలోచించి పార్లమెంటువారికి విన్నవించెను. జయిలరులు తమయుద్యోగములను ధనమువెచ్చించి సంపాదించుకొనుచుండిరి. వీలయినంతవట్టునకు ఖయిదీలను బాధించివారి వలనధనము పోగుచేసికొనుచుండిరి. విచారణమమీఁద కోర్టువారు రిమాండుఖయిదీలను నిర్దోషులని తీరుమానించి విడుదలచేసినను జయిలరులు తమకురావలసిన ధనమునిచ్చువఱకుఁ బోనియ్యమనితిరుగ ఖయిదులో నుంచుచువచ్చిరి. నేరమునకుదండనముపాలైనఖయిదీలును, ఋణదాతలకుసొమ్ము తీర్పలేక ఖయిదుపాలయిన వారును లుంగలులుంగలుగా నొక్కచోటనే



యుంచఁబడుచు వచ్చిరి. ఖయిదీలలో స్త్రీపురుషులనైన వేఱుచేయక యొక చోటనే యుంచుచువచ్చిరి. ఏజయిలును భూలోకనరకమువలెఁ గ్రూరకృత్యములకును జారత్వమునకును నిలయమైయుండెను. వీనినుండి తప్పించుటకు మృత్యువయిన నడ్డుపడవలెను. క్షామదేవత బలిపుచ్చుకొనవలెను. ఈ దురితనిలయములలో నిత్యనివాసము చేయుచున్న జ్వరదేవతకడుపునఁ బెట్టుకొనవలెనుగాని మఱియొకగతిలేదు. ఈసంగతులనన్నిటిని హోవర్డుస్వయముగాఁ గన్నులతోఁజూచి వానివలన ఖయిదీలకుఁగలుగు బాధలననుభవముచేఁ జూడవలెనని కారాగృహమందలి యొకయిఱుకుచీఁకటి గదిలో నున్న ఖయిదీ యూరిదీసిరక్షింపుఁడని కోరునంత బాధపడుచుండఁగాఁ దానా గదిలో నుండఁగలిగి నంతసేపుతలుపు మూసికొనియుండి చూచెను. ఇట్టి యనుభవపూర్వకమైన యథార్థవాక్యములతో హోవర్డు ఖయిదీలబాధలను వివరించుచునొక గ్రంథమును బ్రకటించగా నాంగ్లదొరతనము వారీతఁడు తెలిపినమార్గముల ననుసరించి కారాగృహములందలి యేర్పాటులను మార్చుకొనిరి. ఈతఁడింగ్లాండులోని చెఱసాలలను బాగుచేయుటతోఁ దృప్తినొందక హాలండు జర్మనీ మొదలగు దేశములలోని జయిలులనుగూడఁ బరీక్షించెను. ఈతని దయాంతరంగమింతటితోఁ దృప్తినొందక ప్లేగువ్యాధిపీడితులగువారి బాధనపనయించుటకుఁ దత్కారణములను గనుకొనుటకై యీవ్యాధిగ్రస్తస్థలములకుఁబోఁగా నాతనికిజ్వరముసోకి యుసురుబాపెను.

లోకోపకారముగ జీవనము ధారపోయుటయే యీశ్వరప్రీతి కరమగు కర్మకాండమను సద్ధర్మమే దేశమున నాటుకొన్నకొలఁది స్వదేశపరదేశవివక్షతయు, స్వజాతివిజాత్యభిమానమును సమసిపోయి, విశాలవిశ్వమంతయు బ్రహ్మమందిరమనియు, మానవకోటియంతయు భ్రాతృసమానమనియుఁ బ్రజలెంచుచు వచ్చిరి. దేశకాలజాతిభేద వివక్షతనెఱుఁగని యిట్టిసర్వజనసౌభ్రాతృతా బుద్ధివలననే యాకాలమందు హిందువులుకూడ నాంగ్లేయులవలెనే దుష్పరిపాలనమునుండి రక్షింపఁబడవలెనని జనసామాన్యము తలంచుచువచ్చిరి.

బానిసపు వర్తకమీకాలమున విరివిగా వ్యాపించియున్నదని చెప్పియుంటిమి. విదేశములకు ఎలిజబెత్తుకాలమున నావికయాత్రలు నడపిన నావికులు నీగ్రోజాతివారిని కుత్సితోపాయములవలన వశపఱచుకొని వారిని బానిసలనుగా విక్రయించిధనము సంపాదించుకొనుటకు సిగ్గుపడరైరి. స్పానియాతోడి యుద్ధములో నాంగ్లనాయకుఁడగు మార్లబరోయొక్క ప్రతాపమువలన నింగ్లాండునకులభించిన లాభములలో నాఫ్రికానుండి స్పానియారాష్ట్రమునకు బానిసలను గొనిపోయి విక్రయించుకొనుట కాంగ్లేయులు పొందిన ప్రత్యేకస్వాతంత్ర్యమే ప్రధానమైనది. ఆంగ్లేయులు క్రొత్తగా నమెరికాయందు నివాసము లేర్పఱచుకొన్న తరువాత నాదేశమందును, దానికిఁ బశ్చిమముననున్న ద్వీపములందును, బానిసలవ్యాపారమును దెచ్చిపెట్టినవా రాంగ్లేయులే. లివర్పూలు పట్టణమందలి వర్తకుల భాగ్యములో సగము వంతు బానిసల వ్యాపారమువలననే లభించినది. ఈ బానిసల వర్తకమున కంటె ఘోరతరమును పాపకరమునునైన దింకొకటి లేదు. ఈదుర్వ్యాపారమువలననే యాఫ్రికాఖండము నాశమై నికృష్టగతికి వచ్చినది. బానిసలు పడు బాధలు వర్ణింపఁదరముగాదు. ఇట్లన్నివిధముల నీవ రక్తము ఘోరమైనను, అమెరికా యుద్ధమునకుఁ బూర్వ మింగ్లీషువారి యుల్లములందు దయాంకురములు మొలకలెత్తలేదు. ఈయుద్ధ సమాప్తియైన తరువాతనే యీవ్యాపారము కడుహేయమై దుర్భరముగాఁదోఁచి శాసనమూలమున దీనినిమాన్పవలెనని గోచరించినది. 1788సం॥లోనిందునిమిత్తము పార్లమెంటులోనొక బిల్లు ప్రస్తావించఁబడినదిగాని, ఈవ్యాపారమువలనధనముసంపాదించుచున్న లివర్పూలు వర్తకుల యాటంకము వలనను, శాసనులకు దీనిని మాన్పవలెనని తీవ్ర సంకల్పము లేనందువలనను, ఈప్రయత్నము కొనసాగలేదు. ఐనను నానాటికి దీనిని నిర్మూలింపవలెనను పూనిక విజృంభించుటచే పార్లమెంటువారు దీనిని నిషేధించుచు శాసనమును జేసిరి. ఈవ్యాపారము మాన్పఁబడిన తోడనే బానిసతనమే రూపుమాసెను.



మూడవ జార్జి రాజ్యమునకు వచ్చునాటికే యింగ్లాండు చేతిపనులకుఁ బ్రసిద్ధివడసియున్నను, జనబాహుళ్యమునకు వ్యవసాయమే ముఖ్యవృత్తిగా నుండెను. చేతిపనులు క్రమక్రమముగా మెల్లఁగా వృద్ధియగుచు వచ్చినవి. వీనియందుఁ బనిగలిగియున్న జనసంఖ్య స్వల్పముగానే యుండెను. వీనివలన దేశము సంపన్నమైనదని చెప్పుటకుఁదగినంత వ్యాప్తిలేదు. చిరకాలము నుండి యున్ని వర్తకము సాగుచున్నందున, తక్కినపనులకంటె నిదియే యెక్కువగా నుండెను. బట్టలనేత మాంచెస్టరువంటి యొకటి రెండు పట్టణములందుమాత్రము జరుగుచుండినందున పదునెనిమిదవ శతాబ్దమందు బట్టల యెగుమతి 50000 సవరనుల విలువకంటె మించలేదు. దూది పట్టు సరకులును నిట్టే స్వల్ప మాత్రములై యుండెను. మొత్తము మీఁద నేతపనులవలన దేశమునకు ధనము వృద్ధియగుచున్నదని చెప్పుటకు వీలులేదు. ఆకాలమున నింకను గనులఁ ద్రవ్వి, ఇనుము మొదలగు లోహములను నేలబొగ్గుమూలమునఁ గరగించుకొనుపని విరివిగా సాగుచుండ లేదు. ఇందునకు నేలబొగ్గు పనికివచ్చునని యప్పటివారికిఁ దెలియకవంటచెఱకునే యుపయోగించెడివారు. అప్పుడు స్వీడను నుండి బాహుళ్యముగా నినుప సామానులఁ దెచ్చుకొనుచు వచ్చిరి. ఇనుపవస్తువులను జేయుటలోఁ బనివాండ్రకు నైపుణ్యమే లేకపోవుటవలన విరివిగా వస్తువులు తయారుచేయఁబడుట కవకాశము లేకపోయెను. ఉన్ని నేత, నూలు నేతయు, మనదేశములో వలెనే గుడిసెలయందుఁ జేతులతో జరుగుచుండెను. ఆవిరి యంత్రములు వెలసిన తరువాతనే వీని నేతకొఱకు ఫ్యాక్టొరీలు బయలుదేరి కోటానకోటులుగా వస్త్రములు తయారు చేయఁబడుచు వచ్చినవి.

ఒక వేళ విరివిగా వస్త్రములు తయారుచేయఁబడినను, ఆకాలమందు సరకుల నొకచోటనుండి మఱియొకచోటికిఁ గొనిపోఁబడుటకుఁ గాల్వలు మొదలగు బాటలేర్పడ నందున, నవినిరర్థకములు. వర్తకమువృద్ధియై బండ్లు పెరగిన కొలది పూర్వపు మెట్టబాటలు చెడిపోయినవి. మఱియు వర్తకము బండ్లు

పోవుటకువలనుపడని గుఱ్ఱపుబండ్లదారులగుండ, పల్లెలమీఁదుగా, సాగవలసివచ్చెను. అందుచే నిన్నివర్తకము చాలవఱకు గుఱ్ఱముల మీఁద పోవలసివచ్చుటచే బట్టలవిలువకంటె కూలి యెక్కువయ్యెను. నేలబొగ్గుమొదలగు గురుపదార్థములను గొనిపోవుటకు సదుపాయములు బొత్తుగా లేనందున సముద్రతీరపట్టణములకును గొప్ప నదులగుండ మాత్రమే పోవలసివచ్చెను. మాంచెస్టరు నగరమునకుఁ గొంతదూరములో నేలబొగ్గుగనికలఁవాడొకడు తనగని నిరుపయోగముగా నుండుట కనిపెట్టి, మాంచెస్టరుసమీపమున నున్న నదివఱకు కాలువ త్రవ్వినయెడలఁ బడవలగుండ బొగ్గునచ్చటికిఁ గొనిపోవచ్చునని యూహించి, యొక కాలువ త్రవ్వెను. పిమ్మటనచ్చటినుండి నదిగుండనొక 'యక్విడక్టు' అను నంతర్వాహినిమూలమున మాంచెస్టరువఱకును గాలువను సాగించవలెనని యూహపుట్టి, కాలువ పెంపు చేయఁబడెను. 1767సం॥లో నీకాలువపూర్తి కాఁగానే సరకులను స్వల్పవెలలకునొకచోటనుండిమఱియొక్కచోటికి సులభముగఁగొనిపోవుటకిదియే యుపాయమని కనఁబడినందున దేశమంతటను నచిరకాలములోనఁ గాలువలల్లుకొనెను. ఇందుమూలమున నాంగ్లవర్తకము విరివిగా నాదేశములోనే నలుగడలకు వ్యాపించెను. పనివాండ్రు విశేషలాభము నొందవచ్చునని మూఁకలుమూఁకలుగాఁ జేతిపను లారంభించిరి. ఇంతవఱకును నేలబొగ్గువలని యుపయోగమును బాగుగా జనులెఱుగకపోవుటవలన భూమిలోనది రాణివాసము చేయవలసివచ్చెను. ఇటీవలకనిపెట్టి యింగ్లాండుయొక్క యుత్తరభూములందిదివఱకు వంటచెఱకుతోఁ గరఁగింపఁబడు నినుము నిప్పుడు నేలబొగ్గుతోఁగరగింపనేర్చుకొనిరి. దీనివలన నేఁబది సంవత్సరములలో 20000 సవరనులవిలువగల పనిమాత్రము జరుగుచుండు నినుమువర్తకము 1700000 సవరనులవఱకుఁ బెరిగినది. మఱియేఁబదివత్సరములలో నఱువదిలక్షలవఱకు వృద్ధియైనది. ఈయినుమువ్యాపారము నందలి యభివృద్ధినిబట్టియే యైరోపాఖండమున కంతకును ఇండస్ట్రీలలో నింగ్లాండు మిన్నయైనది. కాలక్రమమున నినుముతో పాటుసీసము, రాగి, తగరముకూడ నుపయోగమునకు వచ్చినవి. ఆవిరియంత్రములు బయలుదేరి గనులను ద్రవ్వుట



కును, త్రవ్విన లోహములను పనిముట్లుగాఁ జేయుటకును, ఇండస్ట్రీసంబంధములైన పనులనన్నిఁటిఁ దయారుచేయుటకును నుపయోగింపఁ బడువఱకు నింగ్లాండుయొక్క యిండస్ట్రీల ప్రాభవము విజృంభించలేదు. 1776 సం॥లో నమెరికా యుద్ధము ముగియునాటి కావిరియంత్రము లన్ని పనులనిమిత్తము బాహుళ్యముగా నుపయోగింపఁ బడినది.

బట్టలనేత విషయములో వలసినంత నూలుదొరకక నేతగాండ్రు కొంతకాలము చిక్కుపడిరి. తరువాత నొకమంగలివాడు కనిపెట్టిన యంత్రసాహాయ్యమున నూలు సమృద్ధిగా దొరకి నేతగాండ్రు చేతితో నేయఁజాలనంత యధికముగాఁదయారుచేయఁబడుచు వచ్చినది. అమెరికాయుద్ధము సమాప్తమయినతరువాత నేతయంత్రములుకూడ వెలసినవి. ఇట్టి యంత్రసాహాయ్యముచేతనే నేతబట్టల వర్తకమునం దింగ్లాండు తక్కిన దేశములన్నిఁటికంటె మించి, ధనవంతమై, ఫ్రెంచివారితోడఁ దటస్థమయిన ఘోరయుద్ధములో నిలువఁగలిగెను.

ఇట్లు విజృంభించిన యిండస్ట్రీ వ్యాపారము లింగ్లాండున నుత్తరభూములలో విరివిగా వ్యాపించుటచే దక్షిణప్రాంతమునందలి జనులు చాలవఱకుత్తరమునకు మారిరి. ఫాక్టొరీలు కర్మశాలలు పట్టణములలో నేర్పడుటచేఁబూర్వము ఫలవంతములగు భూములవలనఁ బ్రాముఖ్యత వహించిన యూళ్లలోని జనులు పట్టణములకుఁ జేరుకొనిరి. ఈవ్యాపార వృద్ధిచే వర్తకులును, ఫాక్టొరీ యధికారులును, బూర్వము వలె మూలమూలల నొదిగియుండక నలుగురిలోఁ దలయెత్తుకొని తిరుగుచు నీతి వర్తనులును, పరోపకారశీలురును, విశుద్ధచరితులును, భగవద్భక్తులునయి ఘనతకెక్కిరి. వీరికిట్టిగౌరవాతిశయము రాకపూర్వము దేశములో విశేషభూస్వాములే గౌరవభాజనులయి యుండుటవలన వారే పార్లమెంటులో సభ్యులై మంత్రిమండలివారై రాజ్యభారమును వహించి రాజకార్యదక్షులయి యుండిరి.

మూఁడవజార్జికాలములో రాజే దుర్నీతు లవలంబించుటవలన వీరుస్వప్రయో
జనపరులై ద్రవ్యలోభముచే నక్రమలాభముల కాసించుచు సత్పక్షమం
దాదరములేక స్వపక్షదురభిమాన ధూర్వహులయి, రాజ్యతంత్రమును నడ
పుట కసమర్థులై, అధికారము ధనసంపాదనమునకు సాధనముగాఁ జూచు
కొనుచుండిరి. రాజ్యాంగములన్నిఁటిలో ననగత్యములగు వ్యయములగుచుం
డెను. వ్యాపారదక్షులగు వర్తకసంఘమువారి కీయమితవ్యయము, పార్ల
మెంటువారి దుష్ప్రవర్తనయు హేయముగానుండెను. ఇంతేకాక వర్తక
సంఘము వారు ధనవంతులును, ఐశ్వర్యవంతులును, నైయుండుటచే,
తమకు రాజకార్యనిర్వాహకమందు జోక్యములేక, సాపాటురాములగు భూ
స్వాముల కట్టియధికారము లుండుటకు సహించనివారయి, విగ్గులదొరతన
మును రూపుమాపఁ బూనుకొనియుండిరి. అందుచే నిప్పుడధికారమును
వహించియున్న విగ్గులతో వీరికిఁ బ్రతికక్షు ప్రబలియుండెను.

స్పెయినుతోడ జరిగిన సప్తవర్ష సంగ్రామమందు దేశమునకు యశో
వర్ధకుండయి రాజ్యతంత్రమును నడపి కీర్తిశేషుఁడైన పిట్టు విగ్గులకు విరోధి
యుఁ బ్రజలపక్షమువాఁడునై ప్రజలగౌరవాతిశయముచే వీరినణఁగఁ
ద్రొక్కెను. ఈతఁడు స్వర్గస్థుఁడయినను, ఈతని నాయకత్వము క్రింద
శిక్షితులయిన మంత్రికూటమువారు కొందఱింకను రాజ్యభారముఁబూనియుం
డిరి. ఈతని ద్వితీయపుత్రుఁడగు విలియముపిట్టు యిరువ-రెండు వత్సరముల
చిఱుతప్రాయమువాఁడయినను విద్యాధికుఁడును, పితృశిక్షవలన రాజకార్య
ములం దారితేరినవాఁడును, ప్రజ్ఞావంతుఁడును, బ్రజలగౌరవమును జూరఁ
గొన్నవాఁడును, అయి పూజ్యుండయిన జనకునిచే నలంకరింపఁబడిన పక్షము
వారిలోఁజేరి పార్లమెంటులోఁబలికిన మొదటి యుపన్యాసముతోడనే
పార్లమెంటువారికి గౌరవపాత్రుఁడయ్యెను. ఈతఁడు వివేకముతోఁ బదు
నెనిమిది వత్సరములు ప్రధానమంత్రియయి రాజ్యభారమును బూని తన
చిత్తస్థైర్యమాహాత్మ్యముచే రాజుచేతను, బ్రతిపక్షులచేతను దాసోహ



ముల ననిపించుకొనెను. ప్రజలచే నియమింపఁబడిన పార్లమెంటుమూల
మున రాజు నిరంకుశాధికారమునడపి దేశమును యుద్ధములోదింపి తలవంపుల
పాలు చేసినందున, పార్లమెంటుయొక్క సభ్యనియమనములోనున్న లోపములే
రాజునకిట్లు నడచుకొనుటకవకాశమిచ్చినవనియు, వీనినిసవరణముచేసినఁగాని
దేశమునకు క్షేమముగలుగదనియు, విలియముపిట్టు కనిపెట్టి ఇందునిమిత్తము
తండ్రియేర్పఱచిన పద్ధతిననుసరించి యొకబిల్లును పార్లమెంటు యెదుటఁ
బెట్టెను. ఇట్టి సవరణమునకు సమ్మతించిన యెడల పార్లమెంటు సభ్యులలో ననే
కులకు వచ్చులంచములు పోవుననియు, కొందఱకుఁ బలుకుబడి తగ్గుననియు,
భయముపుట్టుటచే వారాబిల్లును నిరాకరించిరి. దీనికి బదులుగా బర్కు అను
వాఁడు పార్లమెంటు సభ్యులు నియమింపఁబడుటలో రాజుపయోగించిన
నింద్యోపాయములకవకాశముతొలఁగించుటకుద్దేశించిమఱియొక బిల్లు తెచ్చెను.
రివిన్యూ ఆఫీసర్లును గవర్నమెంటు కంట్రాక్టరులును పార్లమెంటులో సభ్య
లుగా నుండఁగూడదనియు, దొరతనమువారి రాజ్యాంగములందలి యనగత్య
ములైన యుద్యోగములను దగ్గించవలెననియు, ఈబిల్లుయొక్క యభిప్రా
యము. ఈబిల్లు శాసనముగఁ జేయఁబడెను గాని, సభ్యనియమనములోనున్న
లోపములన్నియు దీనివలనఁ దొలఁగలేదు.



# విలియము పిట్టు

## మూఁడవజార్జి

విలియముపిట్టు యితరమంత్రుల వంటివాఁడు కాఁడు. ఫ్రెంచివారాంగ్లేయులకుఁ గృతాపరాధులనియు, వారితో నెన్నఁడును సఖ్యము కూడదనియు నాకాలమున పార్లమెంటు సభవారును మంత్రిమండలివారును దలచుచుండిరి. సంఘసామాన్య మంతయు సౌఖ్యపడినఁగాని అందలి జనులెవరికి వారు సౌఖ్యము గాంచలేరనియు, ప్రపంచమందలి రాజులందఱును సుఖముగ నున్నఁగాని యొక్కొక రాజ్యమునకు సౌఖ్యముగలుగదనియు, 'సర్వేజనాస్సుఖినోభవంతు,' 'లోకాస్సమస్తాస్సుఖినోభవంతు,' అను దృఢవిశ్వాసముతోఁ బాటుపడి రాజ్యతంత్రమునునడపఁ బ్రయత్నించినవాఁడు విలియముపిట్టు. పైని వివరించిన ప్రకారము ప్రజ లన్నివిషయములందు నద్భుతముగా వృద్ధిలోనికివచ్చిరి. ఈపదునెనిమిదవ శతాబ్దమందు జనసంఖ్య మునుపటికంటె నినుమడించినది. జనసంఖ్యకంటెను ధన మధికముగాఁ బెరిగినది. అందుచే వెనుకటికంటె నొకయద్భుదమువఱకు నమెరికా యుద్ధమువలన దివాణమునకు ఋణ మెక్కువగాఁ బెరిగినను, అదియొకభారముగాఁ దోఁచలేదు. అమెరికా విడిపోవుటవలనదానితో నింగ్లాండునకువర్తకము పెరిగినది. వర్తకముతో ఇండస్ట్రీ పెరిగినది. ఇట్టియభివృద్ధిని మఱింత పెంపుచేసి రాజ్యము నభ్యుదయపరంపరలకు నిలయమగునట్లు నడపుట కసమాన ప్రజ్ఞావిశేషము ప్రధానికుండవలెను. కాయకష్టమే ధనలక్ష్మికి పెంపుడుతల్లి; పనివాండ్రెవని కిష్టమైనట్లు వారు తమ యోగక్షేమములను గాపాడుకొని యయిశ్వర్యవంతు లగునట్లు స్వాతంత్ర్యము గలిగియుండవలెను. అట్లు కాక పనివాండ్ర యిష్టప్రవృత్తికి నడ్డములు కల్పించి యిచ్చవచ్చిన వృత్తుల నవలంబించుట కవకాశమియ్యకుండుటయు, నీదేశములో నీవృత్తులుమాత్రమే యుండవలెనని నియమించుటయు, నిచ్చవచ్చిన ట్లన్నిదేశములకును వర్తకము సాగించుకొనకుండ నిరోధ శాసనములు చేయుటయు, నొకదేశమునకు మఱియొకదేశమునకును బరస్పర సంబంధము స్వేచ్ఛగా నడవకుండ నడ్డుపెట్టుటయు— ఇట్టినిరోధములవలన పనివాండ్రును వర్తకులును నష్టపడిపోవుటయేకాక, రాజ్యము ధనహీనమగును. ఇట్టియవరోధములను దొలఁగించుటకుఁ బాటుపడి విలియము పిట్టు పనిచేసినందున నీతని రాజ్యపద్ధతి క్రొత్తత్రోవలు త్రొక్కెను. విదేశవర్తక విషయమున నెట్టియడ్డములు లేకుండఁ జేయవలెననియు, రాజ్యాంగసంబంధములగు ననగత్యవ్యయములను దగ్గించి భారముగా నున్నపన్నులను దీసివేయవలెననియు, నీతఁడు కొంత కృషిచేసెను గాని యీసద్ధర్మములు దేశమున స్థిరపడుటకుఁ జిరకాలము పట్టెను. రాజధర్మములలో నిట్టిసంస్కారములను జేయుటకితఁడు పాటుపడు కాలముననే ఫ్రాన్సు దేశమువా రిట్టి సద్ధర్మముల నవలంబించి, ఇందునకుఁ బ్రతికూలుఁడైన తమరాజును దేశమునుండి తఱిమివేసి ప్రజాపరిపాలన పద్ధతులను నెలకొల్పుకొనుటవలన నైరోపా యంతయు నల్లకల్లోలమయ్యెను. మఱియు నాకాలమునఁ బనివాండ్రు చేసినవస్తువును దగినధరకు విక్రయించుకొని లాభమునుబొందుట కవకాశములేకుండఁ గొందఱుగొప్పవర్తకులు గుత్తఁగొని పనివాండ్రనొద్ద తక్కువవెలలకు వస్తువులనుగొని హెచ్చుధరలకు విక్రయించి లాభము నొందుచుండిరి. పిట్టుయొక్కబలమంతయు వర్తకసంఘమువారిమీఁదనే యున్నందుననీతనియేర్పాటులకు వర్తకు లొకపట్టున నంగీకరించరైరి. పిట్టు శాంతము వహించి బహు నైపుణ్యముతో వారిని తనవంకకుఁ 'దెచ్చుకోఁగలిగెను. ఈతఁడు పైఁజెప్పినసద్ధర్మముల ననుసరించి రాజ్యతంత్రమును మార్పఁ దలపెట్టిచేసిన ప్రథమ ప్రయత్నమే సాగలేదు. పార్లమెంటుసభ్యుల నియమించుటలోఁ గలలోపము లమెరికాయుద్ధము జరుగుచున్న కాలములోనే మంత్రులు కనిపెట్టి యనేకు లనేక ప్రయత్నములు చేసిరి. కామనులలో రాజునకు లొంగక స్వతంత్రులై యున్న మండలమునకు మునుపటికంటె నెక్కువమందిసభ్యులఁ బంపుకొన నధికారమిచ్చుట కీతనితండ్రిపాటు

పడెను. రిచిమాండను మఱియొక డ్యూకు, సంవత్సరమునకొకసారి పార్లమెంటుసభ్యులు క్రొత్తగ నియమింపఁబడవలెననియు, దేశమును సమాన వైశాల్యముగల మండలములుగా విభజించి ప్రతిమండలము నుండియు సమానముగా సభ్యులు పార్లమెంటునకు వచ్చునట్లేర్పఱచవలెననియు జనులకందఱకును సభ్యుల నియమించుకొను నధికారముండవలెననియు, వాదించుచు వచ్చెను. పూర్వ ప్రాముఖ్యతను బోఁగొట్టుకొని హీనగతికి వచ్చిన ప్రదేశములకు సభ్యుల నియమించుకొను స్వాతంత్ర్యము తీసివేసి జనసంకులములైన మండలముల కియ్యవలెనని జాను విల్కీసు చెప్పుచు వచ్చెను. ఇప్పుడు విలియము పిట్టు యిందువిషయమయి యొకబిల్లు1785సం॥లో పార్లమెంటు వారి యెదుటఁ దీసికొనివచ్చి నిర్జన ప్రదేశములకుఁ గాలక్రమమున సభ్యులను దీసివేయుటకును, అట్టి 36 ప్రదేశముల కిప్పుడే తొలగించుటకును, ముఖ్యమండలముల కట్లుతగ్గిపోయిన సభ్యుల నిచ్చుటకును, ఏర్పాటు చేసెను. ఇందునకడ్డము చెప్పకుండ రాజును గూడ సమాధాన పడెను. జీర్ణప్రదేశమునందలి సభ్యులకు నష్ట పరిహారార్థము ద్రవ్యమిచ్చి సమాధాన పఱచుటకుఁగూడ యత్నించెను. కాని ప్రజాసామాన్యము కాని పార్లమెంటుసభవారు కాని దీని యుపయోగమును గ్రహించుపాటి ప్రజ్ఞావంతులు గాకపోవుటచే నీబిల్లును నిరాకరించిరి. ఈబిల్లు విచారణమునకువచ్చు నాటికిపార్లమెంటులో లంచములు పుచ్చుకొను దురాచార మడుగంటినది. బర్కు అను వాఁడు చేయించిన శాసనమునుబట్టి దివాణముతో సంబంధము గలవారందఱు పార్లమెంటునకు దూరము చేయఁబడినందున రాజు పూర్వమువలె సభ్యులఁ గూడఁగట్టుకొని పనిచేయుట కవకాశము తప్పినది. అందుచే పిట్టుయొక్క బిల్లుమిక్కిలి యావశ్యకము కాదని తోఁచి దానిని నిరాకరించిరి.

పార్లమెంటు విషయమున పిట్టుయొక్క ప్రయత్నములు నిష్ఫలములైనను, దివాణమునకు వ్యయము తగ్గించుటయందును, పన్నులను తగ్గించుటయందును నీతని కోరిక కొనసాగినది. ఈతఁడు మంత్రిపదమును బూను నాటికి దివాణమున కప్పిచ్చుటకుఁ బ్రజలు వెఱచుచుండిరి. ఎగుమతి దిగుమతి సరకులమీఁద దుర్భరములైన పన్నులుండుటచే వానినుండి తప్పించుకొనుట కనేక మాయోపాయములు పన్ని వర్తకులు దొరతనమువారిని వంచించుచుండిరి. అందుచే సర్కారునకు పన్నుతక్కువ జమ యగుచువచ్చినది. ఈలోటు పూడ్చుటకు నూతనముగా పన్నులు గట్టుచు వచ్చిరి. ఈలోపములను సవరించి దివాణముయొక్క ఋణమును దీర్చుట కెంతేని పిట్టు ప్రయత్నము చేసెను. వర్తకులు దొరతనమువారిని వంచించకుండ నెగుమతి దిగుమతులమీఁద పన్నుతగ్గించెను. సారాయిమున్నగు మద్యద్రవ్యములమీఁద పన్నుకట్టెను. రాజ్యాంగములలో జీతములను, ఉద్యోగములను, ఇతరవ్యయములను, తగ్గించుట కుపాయములను నిర్ణయించునిమిత్తము కమిషనరుల నేర్పఱచెను. ఇండస్ట్రి వృద్ధినొందినందున పన్ను లధికముగా వచ్చుచుండెను. పన్నులు తగ్గించిన కొలది దివాణమునకు ధనము హెచ్చుచుండెను. ఇందుచే పిట్టు రెండు సంవత్సరములలోఁ బదిలక్షలు ఋణము తీర్చెను.



ఆంగ్ల పార్లమెంటునకు లోఁబడ నక్కఱలేకుండ నైర్లాండులోని పార్లమెంటునకు స్వాతంత్ర్య మియ్యఁబడెనని చెప్పియుంటిమి. ప్రజల దౌర్భాగ్యస్థితి యింతటితోఁ దొలఁగలేదనియు, దీనికి మూలకారణము దారిద్ర్యమే కాని మఱియొకటి కాదనియు పిట్టుకనిపెట్టి, ఆదేశపు పశువుల నింగ్లాండున కెగుమతి చేయఁగూడదని యిదివఱలో నమలులోనున్న చట్టమును దీసివేసి దుర్భరములైన పన్నులులేకుండ నాదేశస్థు లింగ్లాండుతో వర్తకము సాగించుకొనునట్లేర్పఱచవలెననియు, నిందువలన నైర్లండు ప్రజలకాంగ్ల దొరతనమువారి యెడ భక్తివిశ్వాసములు పెరుగుననియు, వారు ధనవంతులును, ఐశ్వర్యవంతులును నగుదురనియు, పిట్టు తలంచి, ఇందువిషయమై పార్లమెంటులో

నొకబిల్లును 1785సం॥లోఁ దీసికొనివచ్చి, యాంగ్లవర్తకులును విఘ్నులను దెచ్చిపెట్టిన యడ్డములన్నిటిని నివారణముచేసి, యాంగ్లపార్లమెంటు వారిచే నొప్పించగా, ఐర్లాండు పార్లమెంటు సభ్యులు దూరపుచూపు లేనివారై యాబిల్లును నిరాకరించి, మంత్రియొక్క సదుద్దేశము కొనసాగకుండఁ జేసిరి.

ఆకాలమున ఫ్రెంచివారాంగ్లేయులకుఁ గృతాపరాధులని యాంగ్లేయులు తలంచుచుండిరని చెప్పియుంటిమి. ఇట్టియభిప్రాయ మవివేకలక్షణమనియు, నొకదేశమువారొకదేశమువారికి జిరతరముగా విరోధులగుట మానవస్వభావ విరుద్ధమనియు, నుభయులకును బరస్పరానురాగము పెరిగినఁగాని యెవ్వరికిని సౌఖ్యముగలుగదనియుఁ దలపోసి పిట్టు 1787సం॥లో నుభయదేశములవారొకరితో నొకరు నిర్బంధరహితముగా వర్తకము సాగించుకొనునట్లు ఫ్రాన్సుతో నొకవాణిజ్య సమాఖ్య చేసెను. ఇందువలన నుభయదేశములకును వర్తకము విరివిగా వృద్ధియైనది. కాని యీక్రింద వివరించిన ఫ్రాన్సుదేశపు రాజకార్య సంక్షోభమువలన నిట్టిసౌజన్యము చిరకాలము నిలుచుట కవకాశము లేకపోయెను.

ఇంతవఱకును జరిగిన యింగ్లాండు చరిత్రములను బట్టి యైరోపాయందలి యితరరాజ్యములుకూడ నిట్లేయున్న వనితలంపఁగూడదు. రాజు ప్రజల కష్టసుఖములనట్లుండనిచ్చి, ఇచ్చవచ్చినట్లు నిరంకుశముగ నేలుటకెంతయేని యవకాశమున్నది. సిరిసంపదలచేతను రాజసన్మానముచేతను ఘనతకెక్కినవారు తక్కినప్రజాసామాన్యమునకులేని స్వాతంత్ర్యములను జేఁబట్టి యధికులమని గర్వపడవచ్చును. మతవ్యవహారములందు జోక్యముగలుగఁజేసికొని జగదేకపూజ్యులమని కొందఱు చెప్పుకోవచ్చును. జ్ఞానోపదేశము బ్రాహ్మణులకును, రాజధర్మము క్షత్రియులకును, వాణిజ్యము వైశ్యులకును, కృషిగోరక్షణాదులు శూద్రధర్మములనియు, వృత్తులుకొన్నికొన్ని శాఖలజనులకు ముఖ్యధర్మములుగా నేర్పడి యొకశాఖవారు రెండవశాఖవారివృత్తులుచేయుట గౌరవహానియనియు — ఇట్టివర్ణవ్యత్యయములును జాతిభేదములును దేశమున నంకు



రించు యభివృద్ధికడ్డముగనుండి దేశమును హీనగతికిఁ దేవచ్చును. ఇట్టికృత్రిమభేదము లంకురింపక, సర్వజన సౌభ్రాతృత వర్ధిల్లి, యౌన్నత్యమును, ఐశ్వర్యమును గనుట ఆంగ్లేయమహాజనుల భాగ్యమేకాని తక్కినదేశములవారి కట్టియదృష్టము పట్టలేదు. మతాచార్యులు మనబ్రాహ్మణులవలెనే యగ్రస్థానము నాక్రమించుకొనవలెననిపదునాఱవ శతాబ్దమునాఁటికిఁ గుతూహలులవుటయు, ప్యూరిటనులు మతసిద్ధాంతముల యథార్థములు బోధించి వారి ప్రాభవమును మొగ్గలోఁ ద్రుంచివేయుటయు ట్యూడరు రాజులచారిత్రములోఁ జెప్పియుంటిమి. 1688సం॥కుఁ దరువాత మతవిషయములందు భక్తుల యిష్టానుసార మీశ్వరారాధనము జేసికొను స్వాతంత్ర్యము స్థిరపడినది. ప్రజలకోరికలననుసరించి పనిచేయుఁ బ్రతినిధులను నియమించుకొని పార్లమెంటు మూలముగా రాచరికమును నడపుకొను స్వాతంత్ర్యము కూడఁ బ్రాయికముగా స్థిరపడి, రాజు నిరంకుశముగఁ బ్రభుత్వము చేయుట కవకాశము పదునేడవ శతాబ్దాంతమునాటికే తొలఁగిపోయినది. నైష్ఠికసాంఘిక రాజకీయవిషయములం దధికారాభిజాత్యైశ్వర్యాదిలౌకిక తారతమ్యములతో సంబంధము లేకుండ జనులందఱు సమానులన్న సద్ధర్మ మచటనే పాదుకొన్నది. ఘనుఁడైనను, నికృష్టుఁడైనను జట్టములకుఁ గట్టువడుటకందఱును సమానబాధ్యులే. తండ్రి లార్డుగానున్నంతమాత్రమున కొమారునకు లార్డులశాఖలోఁ జోటులేదు. అతఁడు చిల్లరదుకాణము పెట్టుకొని పండుఫలము లమ్ముకొని జీవించు నిరుపేదతో సమముగా పార్లమెంటులో కామనులతోఁ గూరుచుండవలసినదే. వర్తకులకులేని యాధిక్యతయు స్వాతంత్ర్యమును లార్డులగువారికిలేదు. సామాన్యజీవనులగువారికంటె నధికులమని చెప్పుకొనుటకు వర్తకులకట్టి యధికారాధిక్యమును లేదు. విద్యాధికులును వివేకమహితులునగు నాంగ్లజనుల యభిప్రాయము నడచినదారినే రాచరికము నడువవలెను. అహా! ఆంగ్లమహాజనుల భాగ్యమే భాగ్యము.

ఐరోపాయందలి యితరరాజ్యములందిట్లు కాదు. ఈశ్వరార్చన విషయమందు నామమాత్రమునకే కాని నిజమైన స్వాతంత్ర్యము ప్రజలకు

లేదు. రాజ్యతంత్రము నిరంకుశాధికార భూయిష్ఠము. నైష్ఠికసాంఘిక రాజకీయ వ్యవహారములన్నిటిలోను నీచాధిక తారతమ్యములు వ్రేళ్లుపాతి యున్నవి. మనదేశములోవలె జాతిభేద వ్యత్యయము దురత్యయమై పాదుకొనియున్నది. ప్రజలిష్టము వచ్చిన యిండస్ట్రీ చేసికొనుటకు స్వేచ్ఛాప్రవృత్తి లేదు. చట్టములకు జనులందఱు సమబాధ్యులు కారు.

ఈకాలమున నలుగడల వ్యాపించుచున్న జ్ఞానవిశేషమునకును, ఇట్టి తారతమ్య భూయిష్ఠమైన సాంఘిక ప్రచయమునకును, గల వైపరీత్యమును జదువరులే యెఱిఁగియున్నారు. ప్రతిదేశమందును వివేకులును, జ్ఞానులును నగు ప్రభువులు చట్టములను సద్ధర్మానుగుణముగ సవరింపఁ బాటుపడి యీ నికృష్ట తారతమ్యములను జంపివేయుచున్నారు. ప్రష్యాప్రభువగు ఫ్రిడరిక్కు మహనీయుఁడును, ఆస్ట్రియా చక్రవర్తియగు రెండవజోసెఫును, ఫ్రాన్సురాజ్యతంత్రి వివేకియగు టర్గాట్టును, ఇట్టిసంస్కరణ క్రియాపరతంత్రులై పనిచేయుచుండిరి. ఆకాలమున ఫ్రాన్సుదేశమున నున్న సాంఘిక పద్ధతులీసర్వజనభ్రాతృభావమునకుఁ గడువ్యత్యయములుగ నుండెను. రాజు సర్వాధికారి. సిరిసంపదల యందగ్రగణ్యులైన వారికి రాజకీయ వ్యవహారములలో జోక్యమే లేదు. వీరికి జనసామాన్యముకంటె నెక్కుడు స్వాతంత్ర్యములు గలవు. సామాన్యజనులవలె వీరు దివాణమునకుఁ బన్నులుగట్ట నక్కఱలేదు. వర్తకులకును, బనివాండ్రకును వాణిజ్యస్వాతంత్ర్యము లేదు. కొందఱు సంఘములుగా నేర్పడి యిండస్ట్రీలవిషయమునను, వాణిజ్యవిషయమునను, దొరతనము వారివలన లైసెన్సులను బొందియుండిరి. అందుచే వర్తకులకును, పనివాండ్రకును భేదములేర్పడి యున్నవి. సత్కులమందుఁ బుట్టినవారిమందఱు వర్తకులును, బనివాండ్రును, నికృష్టులుగనుక నుత్తమకులము వారికిని వర్తకులకును దూరమయ్యెను. ఇట్లయ్యును రాజ్యములన్నిటిలో ఫ్రాన్సురాజ్యము గౌరవపదవి యందే యుండెను. రాచరికము మొత్తముమీఁదఁ బ్రజలకు సుభిక్షముగా నుండెను. ధనము కొందఱనందు మాత్రము పోగుపడక జనబాహుళ్యములోఁ గొంచెమించుమించుగా సమముగా వ్యాపించి యుండి మొత్తముమీఁద నితర దేశ



ములకంటె నధికముగ ధనవంతమని చెప్పఁదగియుండెను. కడుధనవంతులును గడుపేదలును గాక నడిమితరగతిలోనుండు మధ్యమగృహస్థులు సూక్ష్మబుద్ధియందును, వివేకసంపదయందును, నితరదేశములవారిని మించియుండిరి. అప్పుడు రాజైన పదునేనవ లూయికాలములోఁ బండితు లిష్టానుసారము గ్రంథములను బ్రకటించుకొనుట కెట్టి నిరోధమును లేదు. ఆంగ్ల గ్రంథరాజములనుండి ఫ్రాన్సు దేశపండితులు నేర్చుకొన్న సర్వజనభ్రాతృభావధర్మములును, రాజనీతిధర్మములును, చక్కఁగా జనసామాన్యమునకు విశదముగా బోధపఱచుచుఁ బండితులనేకులు గ్రంథములను వ్రాసి దేశమంతటను వెదఁజల్లిరి. ఆంగ్లేయులదేశమందు వ్యాపించియున్న నీతివాక్యములును, దీనదయాళుత్వమును, సర్వజనసమత్వధర్మమును, సాధుపరితాపము నెడల జాలియుఁ, బాపకర్ములును, పేదలును నగువారి యెడల నుపకారశీలమును, ధన్యపురుషులవలంబింప వలసిన ధర్మములను, నుద్ఘోషించుచు వేలకొలఁది గ్రంథకర్తలు గ్రంథములను గుప్పలుకుప్పలుగా రచించిరి. ఇట్లు వెదఁజల్లఁబడిన జ్ఞానరాశివలన సంఘమందు నాటుకొనియున్న నీచాధిక తారతమ్యములు స్వభావవిరుద్ధములని జనులు తలంచుచుండిరి. తత్త్వవిచారణముతో సంబంధించిన గ్రంథములు మతాచార్యుల ప్రగల్భములను దూషించి యాస్తికసత్యములను బోధించినవి. లార్డులును పటేవలె కోర్టుల మూలమున రయితులను బెట్టుబాధలకు సైరించి యూరకుండక రయితులు మొఱలిడ నారంభించిరి. వర్తకనిరోధమునకును దుర్భరంపుపన్నులకును సహించక వర్తకసంఘమువారు దొరతనమువారిపై విద్వేషులై యుండిరి. ఉమ్మరావులు రాజ్యతంత్రములో జోక్యము లేనందునకుఁ గుందుచుండిరి. స్వదేశమందీయిబ్బందులను నివారించుకొనుమార్గము గానక యమెరికా యుద్ధములో నమెరికనులపక్షమునఁ బ్రజలుత్సాహమును గనఁబఱచగా వాలంటరులను బోగుచేసి రాజువారికిఁ దోడుఁబంపెను. స్వాతంత్ర్య సంపాదనమునకుఁ బోరుచున్న యమెరికనులను జూచి ఫ్రెంచి వారుకూడ స్వాతంత్ర్యభాగ్యముకొఱకు కంగలార్చ మొదలుపెట్టిరి. అమెరికనులకుఁ దగినసాయము చేయుటకు

రాజునొద్దధనము లేకపోయెను. మఱియొకమార్గము గానక ఫ్రెంచివారిపార్లమెంటును 1789సం॥ లోఁ బిలిపించిలార్డులనుగూడఁబన్నుచెల్లించుఁడనిరాజు వేడుకొనెను. అందుపైనిదివఱకు స్వాతంత్ర్యవిషయమున ఫ్రెంచివారి హృదయములందు మెల్లఁగారాజుచున్న సంకల్పాగ్నికణములొక్కపెట్టునఁ బ్రజ్వలించెను. ఫ్రాన్సురాజధానియగు పారిసుపట్టణములో జనులుద్రొమ్మి రేగి దివాణముకోటను ముట్టడించి దాని నగ్నిహోత్రున కాహుతి చేసిరి. ఫ్రాన్సులోనల్లకల్లోల మిట్లుండఁగా, నఁట రష్యాచక్రవర్తిని తురుష్కుల నైరోపాదేశమునుండి తఱిమివేసి తనరాష్ట్రమునకు టర్కీదేశమును పోలాండును గలుపుకొనవలెనని తలపెట్టియుండెను. సమీపమున నున్న ఆస్ట్రియాచక్రవర్తియు, ప్రష్యాచక్రవర్తియుఁగలిసి, రష్యాచక్రవర్తిని కడ్డముగావెళ్లగా ముగ్గురునేకమై పోలాండును విభజించుకొని తమరాజ్యములకుఁ గలుపుకొనిరి. ప్రష్యాచక్రవర్తిచనిపోవు వఱకుఁదఱివేచియుండిరి. ఆస్ట్రియాచక్రవర్తి రష్యాచక్రవర్తితో నేకమై టర్కీరాష్ట్రమును దమలోఁదాముపంచుకొనఁ దలపెట్టిరి. ప్రష్యాదీనినిజూచి యూరకుండ లేక యింగ్లాండుతోడను హాలండుతోడను సఖ్యముగూర్చుకొని రష్యాచక్రవర్తినితో యుద్ధముచేసి టర్కీరాష్ట్రము చెడకుండఁ గాపాడుటకేర్పఱచుకొనెను. ఈసంగతి తెలిసి రష్యాచక్రవర్తి యామెప్రయత్నములను సడలించెను.

అంటఁ ఫ్రాన్సులోఁగోటనుదగులఁబెట్టుటతో నూరకుండక 1789సం॥ లో పారిసులోఁ జేరినద్రొమ్మిగాండ్రు రాజును పార్లమెంటును ముట్టడివేసి, యింతవఱకును రాజునడపుచున్న నిరంకుశాధికారమును విడిచిపెట్టునట్లును, ఫ్రాన్సులోనిమండలముల ప్రత్యేకపు పార్లమెంటులను రద్దుపఱచునట్లును, మతాచార్యులకును సమ్మరావులకును నున్న స్వాతంత్ర్యాధిక్యములను దీసి వేయునట్లును, ప్రజాప్రతినిధుల మూలమునరాజ్యము చేయునట్లును నొడఁబఱచిరి. ఆంగ్లేయులు చట్టములకును, [illegible]కారమునకును గట్టుపడుస్వభావము



గలవారగుటచే ఫ్రెంచివారిచేఁతల నొల్లరైరి. ఈయల్లకల్లోల మడఁగిన తరువాత వారు మరల దారికివచ్చెదరను దృఢవిశ్వాసముగలవాఁడై, పిట్టు మాత్ర ముదాసీనుఁడై వీరిచరితమును జూచుచుండెను. అమెరికాలో నాంగ్లేయుల వశమందున్నదేశమందు స్పానియులువారితోఁ బోరాడి వారిమీఁదికిఁ గవియుటకై ఫ్రెంచివారి సాహాయ్యమునుగోరగా, సంస్కారపరాయణులగు ఫ్రెంచివారందుల కొడఁబడక, ఆంగ్లేయులతో స్నేహభావమును జూపిరి. పూర్వపురాజ్యపద్ధతిని బునరుద్ధారణము చేయఁగోరు కొందఱు మాత్రము సంస్కరణపక్షము వారికిస్పానియాతోడ సఖ్యముగూర్చియాంగ్లేయులతో యుద్ధమునకు డీకొల్పినయెడల, స్వదేశపు రాజకార్యములను సంస్కర్తలు విస్మరింపఁగలరని యూహచేసిరికాని, సంస్కర్తలుదీనిని గనిపెట్టి ప్రజాప్రతినిధుల యంగీకారములేకుండఁ బరదేశములతో యుద్ధమునకుఁబూనుకొనుటకు రాజునకధికారము లేకుండునట్లురాజును సమ్మతింపఁజేసిరి. అంతట రష్యాచక్రవర్తిని టర్కీ రాష్ట్రమునకునొత్తుడు కలుగఁజేయు చుండెను. ప్రష్యాచక్రవర్తియు ఆస్ట్రియాచక్రవర్తియు మరలనేకమై రష్యాచక్రవర్తినియొక్క దుస్సంకల్పమును జెడఁగొట్టఁ బ్రతినఁబూనిరి. అందుచే నింగ్లాండు రష్యాచక్రవర్తిని మీఁదికిఁబో నగత్యము లేకుండుటఁ గనిపెట్టి పిట్టు ఫ్రాన్సుతోడి సెయ్యమును బలపఱచెను. చిరకాలాచారసంస్థాపితములైన నైష్ఠికసాంఘిక రాజకీయమర్యాదలను నీఱుచేసిన ఫ్రెంచివారిని నడచి, కష్టసముద్రమునను్న రాజకుటుంబమున కైరోపారాజులందఱు గూడి సాహాయ్యముచేయవలెనని కొందఱాంగ్ల పూర్వాచార పరాయణులు గ్రంథములఁ బ్రకటించిరి. ఇతరరాజులమాట యెట్లున్నను, తానుమాత్ర మింగ్లాండు నిట్టిపనికొడిగట్ట నియ్యనని ఫ్రెంచిసంస్కర్తలకు పిట్టు, అభయహస్తమిచ్చెను. ఆంగ్లదేశమునఁ బూర్వాచారాభిమానులు చేయురోదనమును బెడచెవినిబెట్టి, నష్టశేషమైన యమెరికాలోని కనడా మండలము వారిని దృప్తిపఱచుటకై పిట్టు, ఆమండలమును రెండుభాగములుచేసి,యొక్కొక భాగమునకు రాజకార్యనిర్వాహకము నిమిత్త మొక్కొక ప్రతినిధి సంఘ

మేర్పఱచుకొనుటకు స్వాతంత్ర్యమిచ్చెను. అఁటఫ్రాన్సున నానాటికి సంస్కర్తలు క్రూరకృత్యములకు దిగవలసివచ్చెను. రాజు 1791 సం॥లో విదేశములకుఁ బలాయితుఁడై ప్రాణములఁ దక్కించుకొని యితరరాజులశరణుఁ జొచ్చెను. దేశ మరాజకమయ్యెను. ఆస్ట్రియాచక్రవర్తియు ప్రష్యా చక్రవర్తియుఁ దమ్మునుశరణుసొచ్చిన ఫ్రాన్సురాజుతోఁగలిసి ఫ్రాన్సు మీఁదికి యుద్ధమునకు బయలుదేరుట కంతఁగాఁ బూనుకొనక, ఫ్రాన్సులో యుక్తమైన రాజ్యపద్ధతి నెలకొల్పునిమిత్త మయిరోపా రాజులందఱు తోడుపడవలెనని యొకప్రకటనముమాత్రము చేసిరి. ఫ్రెంచివారి వ్యవహారములో జోక్యముపుచ్చుకోనని పిట్టు స్థిరచిత్తుఁడై యుండెను. ఆస్ట్రియా ప్రష్యారాజులుచేసిన ప్రకటనము నాధారముచేసికొని ఫ్రాన్సులో రాజభక్తులగు వారువిదేశరాజులు దేశముపైకి యుద్ధమునకు వత్తురని సంస్కర్తలను భయపెట్టిరి. ప్రజాపరిపాలనముపోయి రాజపరిపాలనముమరల ప్రాప్తించునేమోయని భయపడిరా వారు ఆస్ట్రియామీఁదికి యుద్ధమునకుఁబోఁదలపెట్టిరి. రాజభక్తులునుసంస్కర్తలును గలసి,యాస్ట్రియా చక్రవర్తిపోగుచేసిన సేనను బంపివేయుమని కోరిరి. ఆచక్రవర్తియిందున కామోదించెనుగాని ఆతఁడు వెంటనే చనిపోయినందున 1792 సం॥ లో రెండుదేశములకును యుద్ధము ప్రారంభమయ్యెను.

# అధ్యాయము. 22.

—.o.—

## ఆంగ్లదేశము, ఫ్రాన్సురాజ్యనిపాతము 1782–1801

—.o.—

### మూఁడవజార్జి.

—.o.—

ఇంతవఱకు ఫ్రెంచి వారవలంబించిన రాజ్యధర్మము లాంగ్లేయు లవలంబించినవే కాఁబట్టియాధర్మముల సంస్థాపనముకొఱకుఁ బాటుపడుచున్నతమకు ప్రష్యా (జర్మనీ) యుద్ధములో నాంగ్లేయులు సాహాయ్యపడుదురని ఫ్రెంచి వారు పేరాసపెట్టుకొని యుండిరి. ఈయుద్ధములో నేపక్షమును జేపట్టక తటస్థుఁడనై యుండెదనని పిట్టువారికిఁ దెలియఁజేయఁగనే, ఆతని యింగితమును దెలిసికొనలేక, తా మవలంబించిన స్వాతంత్ర్యధర్మయుద్ధ మింగ్లాండున కంగీకారములేదని తలఁచిరి. జర్మనీదేశమును ఫ్రెంచివారీయుద్ధమున నాక్రమించుకొన్నను దాను గలుగఁజేసికొననని; శపథముచేసియు, ఆంధ్ర రక్షకసేనను దగ్గించియు, పన్నులనుగుదించి దివాణమునకు రివిన్యూతగ్గించియు, ననేకవిధముల ఫ్రెంచివారిని దన తటస్థతను గూర్చి నమ్మించుటకు పిట్టు యెన్ని ప్రయత్నములను జేసినను, ఫ్రెంచివారి కాతనిపై నమ్మకము గలుగలేదు. ఇందునకుఁదోడుగా బర్కుఅను నాంగ్లగ్రంథకారుఁడు ఫ్రెంచివారిసేఁతలను ఖండించుచు గ్రంథములనువ్రాసెను. ఫ్రెంచివారిచేఁ దఱుమఁబడిన యుమ్మరావులను మతాచార్యులను నాంగ్లేయులాదరించి వారి దుర్దశకు జాలిపడుచుండిరి. అందుచే నాంగ్లేయులు దమ ప్రయత్నములకుఁ బ్రతికూలులయి యున్నట్లు ఫ్రెంచివారనుకొనిరి. ఐనను పర్యాలోచనముమీఁద నాంగ్లజనసామాన్యమునకు ఫ్రెంచివారిమీఁదనిట్టి భిన్నాభిప్రా

యముండఁగూడదనియుఁ, బ్రతికూలులయిన వారొక్క లార్డులలోనే కాని
తక్కినవారియం దుండరనియు, ప్రజలు పార్లమెంటును సంస్కరించుకొనఁ
గోరియుండఁగా లార్డులే వారికాటంకములు కలుగఁజేయుచున్నారనియు,
ఈలార్డు లింగ్లాండులో మాత్రమే యిట్లు ప్రజాస్వాతంత్ర్యమునకుఁ బ్రతి
ఘటించుటతో నూరకొనక ఐర్లాండునందును నిండియాయందునుగూడ బ్రజా
స్వాతంత్ర్యము నణగఁద్రొక్కి స్వతంత్రజనులను దమస్వాధీనమునం దుంచు
కొనుచున్నారనియు, నందుచే నింగ్లాండులోని లార్డులయొక్కయు, ప్రభు
త్వమువారియొక్కయుఁ గ్రూరబంధనమునుండి ప్రజలను విడిపించినయెడల
వారు తమకుసాహాయ్యులై యైరోపాయం దెచ్చటను బ్రజాస్వాతంత్ర్యము
నకు రాజులవలన నాపదలేకుండఁజేయుటకుఁ దమకు బాసటగా నుందురనియు,
ఫ్రెంచివారూహించిరి. అందుచే నైర్లాండుజనులను, ఇండియాజనులను
గూడ నింగ్లాండుమీఁదికి యుద్ధమునకుఁ బురికొల్పుట ప్రథమకర్తవ్యముగ ఫ్రెంచి
వారికిఁ దోఁచెను. ఇంగ్లాండునకును ఫ్రాన్సునకును విరోధము స్థిరపడిన
తోడనే, ఫ్రెంచివారు కొందఱు రెండుచోటులకునుబోయి యింగ్లాండుపై
యుద్ధమునకుఁ బ్రజలను డీకొల్పఁ బూనుకొనిరి- మైసూరు మహా
రాజువంటి స్వదేశరాజులనొద్దకుఁబోయి క్రోధాగ్నిని బెంచుచుండిరి. ఇట
నింగ్లాండులోఁ దమ కనుకూలురుగానున్న సమాజములమూలమున లార్డులమీఁ
దను దొరతనమువారిమీఁదను బ్రజాద్వేషము రగులుకొల్పుచుండిరి. ఈ
దుష్ప్రయత్నములవలన దొరతనమువారికిఁగాని లార్డులకుగాని యెట్టి యాప
దయుఁ గలుగకుండ జనులందఱు నేకముఖమై స్వదేశరాజకార్య సంస్కార
ప్రయత్నములను గట్టిపెట్టి, యీవిదేశపీడనువదల్చుకొనుట కప్రమత్తులై
యుండిరి. అంతట జర్మను లెనుబదివేలమంది సేననుగూర్చుకొని ఫ్రాన్సుమీఁదికి
బయలుదేరిరి. నలుగడల యుద్ధము పెంచుకొనుటయే కాని, శత్రుసేనల
నెదిరించి నిలుచుటకుఁ దగిన సేనాసమృద్ధి ఫ్రెంచివారికిలేదు. జర్మనుల
రాక చెవినిబడఁగానే పారిసుజనులు కలగుండుపడి రాజున్నచోటికిఁబోయి
యాతని పదభ్రష్టునిజేసి కారాగృహమందుంచిరి. ప్రతినిధి సభ సమ



కూడి ఫ్రాన్సుదేశమున కెన్నఁడు రాజులేకుండ స్థిరపఱచుటకుఁ బ్రయ
త్నము చేయుచుండగా రాజకుటుంబమువారు రాజున్నకారాగృహము చుట్టును
జేరి ప్రజలకు జాలిపుట్టునట్లు రోదనము సేయ నారంభించిరి. అందుపై
జీతబత్తెముల కాసించిన నరహంతకులు కొందఱు రాజకుటుంబము వారిని,
రాజభక్తులను సంహరించిరి. అంతట ఫ్రాన్సుపయిఁ గలిసిన జర్మనులసేన
వ్యాధిగ్రస్తమయి చాలవఱకు నశించినందున పారిసుపట్టణమువఱకు రాఁజాలక
వెనుకకు మరలినది. జర్మను పల్లపుభూములలో ఫ్రెంచివారి సేనాధినా
యకుఁడొకఁడు శత్రువుల నోడింపఁగలిగెను. ఇందువలన స్వశక్తియందమిత
విశ్వాసముగలిగి ప్రతినిధిసంఘమువారు మరల సభకూడి ప్రపంచమందలి
రాజులందఱు తమకు విరోధులనియు ప్రజలందఱు మిత్రులనియు
రాజులచే వేతలంబడుచున్న ప్రజలకు దాము సాహాయ్యులయి రాజపీడను
వదలించుటకు సిద్ధముగా నున్నారమనియుఁ దీరుమానము చేసికొని దిగంత
విశ్రుతముగాఁ బ్రకటనము సేసిరి. ఇదివఱలో నింగ్లాండు హాలండులు ఫ్రా
న్సుతోఁ జేసికొన్న సమాఖ్యనుబట్టి యొకరితోనొకరు యుద్ధము చేయఁగూడ
దని స్థిరపడియున్నను, ఫ్రెంచివారిప్పుడు హాలండుమీఁదికి దాడివెడలిరి-
ఇంతవఱకును పిట్టు ఫ్రాన్సుతో యుద్ధముపొసంగకుండ ననేకప్రయత్నములు
చేసెనుగాని, ఫ్రెంచివారు మీఁదిమీఁదికివచ్చి, హాలండును ముట్టడివేయుట
చేతను, ఆంగ్లజనులు ఫ్రాన్సురాజవధకుఁ జింతాక్రాంతులయి యుద్ధమున
కభిముఖులగుటచేతను, తప్పనిసరిగాపిట్టుయుద్ధమున కొడఁబడెను. 1793సం॥
లో ఫ్రెంచివారు యుద్ధప్రకటనము చేసిరి. అంతవఱకును స్థయిర్యచిత్తముతో
రాజ్యమునునడపిన పిట్టుయొక్కబలము దీనితో నీరసించెనని చెప్పవలసి
యున్నది. పార్లమెంటెట్లున్నను రాజుకోరికలెట్లున్నను, ప్రజల చంచల
చిత్తమెట్లీడ్చినను జలించక తాను దేశక్షేమకరమని స్థిరపఱచుకొన్న
ట్లింతవఱకును రాజ్యమునునడపించిన పిట్టు యీయుద్ధము ప్రారంభమయిననా
టనుండియుఁ గాలగతి యెట్లీడ్చిన నట్లే, ప్రవాహములోఁ గొట్టుకొనిపోవు
తృణమువలె, జడునిభంగి, నడచుకోవలసిన వాఁడయ్యెను. ఫ్రెంచివారిని

జూచి యాంగ్లదేశమందుఁ గూడ సంస్కారపక్షమువా రాయుద్ధహస్తులై విచ్చలవిడిగా బయిలుదేరి పార్లమెంటు సభ్యులను దొరతనమువారిని దోఁచుకొని తలలు బ్రద్దలుకొట్టుదు రేమోయని వెఱపుపుట్టెను- ఈ భయముచేఁ గోర్టులుకూడఁ శాసనవిరుద్ధముగాఁ బ్రజలను ఖయిదుచేయుట కారంభించినవి. పదిమంది కూర్చుండి సభకూడి దొరతనమువారిని గుఱించి మాటాడుకొనుట రాజద్రోహమని వాకట్టుచట్టములు బయలుదేరెను. పత్రికాధిపతులను జీటికి మాటికిని కఠినదండనముపాలుచేయుచువచ్చిరి. ఫ్రాన్సుపక్షముగ మాటాడుకొనువారిని బోలీసువారు ముష్కరముగఁ దరిమివేయుచువచ్చిరి. ఇంతయేల? పార్లమెంటులోని లోపములు సవరణము కావలెనని స్కాట్లండులో వాదించినంతే మాత్రమున నొక సంస్కర్తకు యావజ్జీవ ద్వీపాంతరవాసదండనము విధింపఁబడినది. ఐనను,నిట్టిభయోత్పాతమునకుఁదగినయగత్యము లేకపోవుటచే నీకట్టడిపనులను దొరతనమువారు వెంటనే విరమించిరి. ఫ్రెంచివారి సేతల నామోదించు సంఘమువారిని రాజద్రోహపు నేరమునకు విచారణముచేసి 1794సం॥ లో దోషస్థులు కారని తీర్మానించుటచేఁ బ్రజలకు గుండెకుదుట పడెను. ఫ్రెంచివారి రాజ్యవిప్లవము జరుగునన్న భయము పూర్ణముగా మట్టు పడినను, పార్లమెంటు సభ్యుల విషయమునను, నితరవిషయములందును, ముఖ్యముగా జరుగవలసిన మార్పులనుగుఱించి తలపెట్టుటకే ప్రజలకు మనసొప్పనందున నివి వెనుకఁబడెను.

ఆస్ట్రియా యొకప్రక్కను, జర్మనీయొక మూలను, స్పానియా యొకదిక్కునను ఫ్రాన్సుదేశమును 'ముట్టడింపగా, నింగ్లాండుకూడ శత్రువులకు సాయమయి కొంతకాలము ఫ్రాన్సుతో యుద్ధముచేసెను. మొదట ఫ్రెంచివారు వీరివలన కొంతచిక్కుపడిరి. కాని, తోడనే ధయిర్యము చిక్కఁబట్టి యెదిరించగా నాస్ట్రియావారును వారివెంట జర్మనులును వారివెనుక స్పానియులును ఫ్రెంచివారితో సఖ్యపడిరి. అమెరికాయుద్ధమందు విశేషఋణములపాలగుటవలన నాంగ్లేయులు రక్షకసేనను దగినస్థితిలో



నుంచలేకపోయిరి. అందుచే వీరివంకఁ జేరిన సయినికులకు యుద్ధసంబంధమయిన యనుభవము లేదు. హాలాండు ఫ్రెంచివారి వశమయ్యెను. అందుచేనాంగ్లేయులిప్పుడు హాలాండు స్వాధీనములో నున్న విదేశద్వీపములమీఁదఁ బడి జావా మలాకాదీవులను స్వాధీనము చేసికొనిరి. అమెరికాలో ఫ్రెంచివారి వశమందుండుచువచ్చిన వెస్టిండియా దీవులుకూడ వీరికి వశమయ్యెను. ఆఫ్రికా పశ్చిమ కొననున్న దేశముకూడ నాంగ్లేయుల పరమయ్యెను.

ఫ్రాన్సుదేశమున నిప్పుడు రాజకార్యములను జక్కబెట్టుచున్న ప్రతినిధిసంఘమువారు కొంతవఱకు శాంతచిత్తులై క్రూరదండనములను మానివేసి, డైరక్టరీ యనుపేర నొకసంఘము నేర్పఱచుకొని సుకరముగారాజ్యము నడపుచుండిరి. ఇందుచేఁగొంతయాశపుట్టి ఫ్రాన్సుతో సఖ్యముచేసికొనవలెనని పిట్టు యత్నపడెను. యుద్ధమువలన దివాణమునకు ఋణము పెరుగుచుండెను. యుద్ధ నైపుణ్యముగల సేన లేకపోవుటచే నాంగ్ల ధనమును, ఆస్ట్రియాజర్మని సయినికులను యుద్ధములోఁ బోషించుటకు విశేషముగా వెచ్చించవలసివచ్చెను. పిట్టుయొక్క యాలోచనములను గ్రహించలేకయాంగ్లజనులు మాత్రముయుద్ధముమీఁదనే మనసు పెట్టుకొనియుండిరి. ఒకమూల నైర్లాండు దేశమునఁ బ్రజల యల్లరులు చల్లారలేదు. ఇష్టానుసారముగ రాజ్యము నడపుకొనుటకు వారిపార్లమెంటునకు సర్వాధికారమియ్యఁబడినను, ఆపార్లమెంటులోఁ జేరియున్న ప్రాటెస్టంటులు ప్రజలను మరింత బాధపెట్టుచుండిరి. పార్లమెంటునకు సభ్యులనియమించుకొను స్వాతంత్ర్యము కాథొలిక్కులకు లేదు- ప్రాటెస్టంటులతో సమముగా వర్తకము చేసికొనుటకుగాని, మడిమాన్యములు సంపాదించుకొనుటకుగాని, కాథొలిక్కులకు స్వాతంత్ర్యములేదు. ఇట్టియధికారము కాథొలిక్కులకుఁ గలుగఁజేసినయెడలఁ దాము పొందుచున్నయక్రమలాభమునకు భంగముగలుగునని లార్డులిందునకు సమ్మతింపరైరి. ఇంగ్లాండునుండి యాదేశమునకుఁ బంపఁబడిన

వైసురాయు (రాజప్రతినిధి) లెంతో లంచము లిచ్చినఁగాని లార్డులు వారి దొరతనమును సాగనియ్యకుండిరి. ప్రొటెస్టంటుల మాట కాథొలిక్కులకును వీరిమాట పరిషత్ప్రచారకులకును సరిపడక యొకరేటికిని నొకరు కాటికిని దీయుచుండిరి. వర్తకమున కడ్డముగా నున్న నిబంధనమును దీసివేసి నిర్బాధకముగా వర్తకసదుపాయములను నైర్లండు ప్రజలకుఁ గలుగఁజేయుటకై పిట్టుచేసిన ప్రయత్నముల కైర్లండులోని లార్డులు ప్రతిఘటించుటను బట్టియే చదువరులు వీరిదుర్నయములను గ్రహించఁగలరు. తన సదుద్దేశమున కాటంకము గలుగుటచే నైర్లండు ప్రజల యుపయోగార్థమే పనిజేసినను సాగదని పిట్టు నిరాశచేసికొనెను.

ఐనను ఫ్రాన్సులోఁ గల్లోలము వచ్చిన తరువాత నైర్లాండు దేశమువారి కెట్టులైన నుపకారము చేయవలెనని పిట్టునకుఁ దిరుగ సంకల్పము మొలకెత్తెను. ఐర్లాండులోని లార్డులదుష్పరి పాలనమునకు సహించలేక కాథొలిక్కులతోఁ బరిషత్ప్రచారకు లగు ప్రొటెస్టంటులుకూడఁ గలిసి ఫ్రెంచివారితో నుత్తర ప్రత్యుత్తరము లారంభించి లార్డులపైఁదిరుగఁబడుట కాలోచించు చుండిరి. కడు నికృష్ట దశలోనున్న కాథొలిక్కులకు ఫ్రెంచివారి వీరచరిత్రము మానసోత్సాహము పుట్టించినది. వీరు రహస్యముగ లార్డుల మదమడంచుట కుపాయము లేర్పఱచుకొని, వారిని నిద్రాహారములకు దూరము చేయుచుండిరి. క్రూరహత్యలను జేసియు జనులు కలగుండుపడునట్లు కఠినకృత్యములు చేసియు, జనసామాన్యము నణఁగఁద్రొక్కుటకు లార్డులు పూనుకొనిరి. పార్లమెంటులోని లోపములను సవరణముచేయుట కెన్ని ప్రయత్నములు జరిగినను లార్డులు వానికి సమ్మతింపక జనసామాన్యము నెడల మఱింత కాఠిన్యమును వహించిరి. 1794సం॥ లో కాథొలిక్కు లందఱకును ప్రొటెస్టంటులతో 'సమాన స్వాతంత్ర్యముల నిచ్చుటకు, నాంగ్లరాజప్రతినిధి యుత్సుకుఁ డయ్యెను- పిట్టు, యిందున కామోదించు వాఁడే కాని యాతని మంత్రిమండలివా రిందునకుఁ బ్రతిపక్షు లగుటవలన నైర్లండు దేశ,



మువారు నిరాశచేసికొని యయిర్లండు లార్డులను రూపుమాపుటకు సాహాయ్యము కోరి ఫ్రాన్సునకు 1796సం॥ లోఁ బోయి యాదేశమువారిని శరణు సొచ్చిరి.

ఫ్రాన్సులో రాజ్యభారము వహించియున్న డైరెక్టరీసంఘము వారు తమ దేశములోఁ గయ్యములకుఁ గాలుద్రువ్వు దుండగీడుల వలని కల్లోలము కొంతవఱ కడఁగ వచ్చునని యెంచికొందఱ ఫ్రెంచి సయినికులను సిద్ధము చేసి యయిర్లండునకు సాయముఁ బంపుట కుత్సాహముతో నంగీకరించిరి- ఈవార్త యింగ్లాండునఁ దెలియగా నేసఖ్యముకొఱకు మఱింత శ్రద్ధతో పిట్టు ప్రయత్నము చేసెను- అంతట ఫ్రెంచివారిలో నెపోలియను అను వీరశిఖామణి యాస్ట్రియామీఁద దండయాత్ర నడపి విజయము నందుచుండుట వలన ఫ్రెంచివా రత్యుత్సాహమునఁ దేలుచు, నాంగ్లేయులతోడ సఖ్యమును గుఱించి రాయబారములను బెడచెవిని బెట్టి 25000మంది సేనతో నలువదియోడల నైర్లండున కంపిరి- వాయుదేవుఁ డాంగ్లేయులకుఁ దోడై యాశత్రుసైన్యమును జెల్లాచెదరు చేయుటచే హతశేషులైనవారు మరలి ఫ్రాన్సును జేరవలసి వచ్చెను- ఇఁట నైర్లండునఁ బ్రజలు రాజద్వేషులై ఫ్రెంచివారిని సాయము వేడినందులకై లార్డులు భటులను బ్రజలమీఁదికి విచ్చలవిడిగా విడిచిపెట్టిరి. ఈభటులు నిర్దయులై స్త్రీలను జెఱపట్టియు, ఇండ్లను దోఁచుకొనియు, మనుష్యులను వధించియు దేశమును నరకతుల్యముగఁ జేసివేసిరి. ఈవార్త యింగ్లండునఁ బడఁగానే జనులయందుఁ దల్లర మధికమయ్యెను. బాధింపఁబడుచున్న యయిర్లండు ప్రజలు ఫ్రెంచివారి శరణుఁజొచ్చి వారినే నమ్ముకొని యుండిరి-

ఫ్రెంచివారికిఁగూడ నైర్లాండులకుఁ దోడ్పడుటకుఁగుతూహలము తగ్గలేదు. నెపోలియనుయొక్క మహావీరచరితమువలన ధైర్యముతూలి యింగ్లాండుతో సఖ్యముకూడిన యాస్ట్రియా కూడ ఫ్రాన్సునకు దాసోహమనవలసి వచ్చినది. ఒలందులును స్పానియులును ఫ్రెంచివారియాజ్ఞలను శిర

వహించి యింగ్లాండుపై వ్రాలుటయస్థిరముగానుండిరి. ఇందఱునుగలసి ఫ్రాన్సునకును యింగ్లాండునకును మధ్యగానున్న యింగ్లీషుకాలువ నాక్రమించుకొన్నయెడల నైర్లాండునకును, ఇంగ్లాండునకును, లక్షలకొలఁది సేనలను ఫ్రెంచివారుపంపి దేశములనుముట్టడి వేయఁగలరు. అసహాయ్యులై యాంగ్లేయులిట్లు కంపించుచుండఁగా, స్పానియులయోడలను హాలండువారియోడలను బంపి వారిమూలమున నైర్లాండునకు సాహాయ్యార్థము తమచేఁబంపఁబడు సేనలను గాపాడుకొనుటకు ఫ్రెంచివారు ప్రయత్నము చేసిరి. అంతట స్పానియులును, ఒంలములును, నీటిమీఁద నాంగ్లేయులకోడిపోయిరి. అందుచే ఫ్రెంచివా రైర్లాండునకు సేనను బంపఁలేకపోయిరి. తుద కైర్లాండులువిసికి తామే యుద్ధమారంభించి, కొంతయుద్ధమైనతరువాతఁదమలోఁ దమకున్నమతవైరములనుబట్టి యొకరితో నొకరుఁ బోరాడ మొదలుపెట్టిరి. అందుచే నాంగ్లసేన వీరిననాయాసముగాఁ బరిమార్చెను. ఇక్కడ నైర్లాండులోఁ బ్రజలేయుద్ధమారంభించిరని ఫ్రెంచివారికిఁ దెలియగాఁదొమ్మిదివందలసేనలనువారికి సాహాయ్యముగాఁబంపిరి, అప్పటికేయైర్లాండుకల్లోలము చల్లారిపోయినందున నాంగ్లేయులీ ఫ్రెంచివారి నవలీలగా నోడించిరి. నీటిమీఁదను నేలమీఁదను నిష్ఫలులై ఫ్రెంచివారిఁక నైర్లాండునకు సాయముచేసి యింగ్లాండును వంచింపవలెనను దలంపుమానుకొని, ఇండియాలో నాంగ్లేయులనోడింపఁ దలపెట్టిరి. హైదరాలీప్రభుత్వముక్రింద మైసూరురాజ్య మీకాలమునఁ దక్కినరాజ్యములకంటె బలాధికమయియుండుటచేత, నవాబు కొమారుఁడగు టిప్పుసులతానుతనతండ్రియాంగ్లేయులతోనొంటరిగాఁబోరియపజయమునొందినసంగతి మనసునందుంచుకొని, ఫ్రెంచివారి సాహాయ్యమునపేక్షించి యాంగ్లేయులను గర్నాటకమునుండి వెడలఁగొట్టవలెనను సంకల్పముతోనుండి ముప్పదివేల సైన్యము నంపుడని ఫ్రెంచివారినిగోరెను. ఇండియాకుఁబోకపూర్వమీజిప్టును స్వాధీనముచేసికొని యచ్చటినుండి ఇండియాకుఁ బోవలెనని ఫ్రెంచివా రుద్యమించి, యీజిప్టునుస్వాధీనముచేసికొనిరి. ఫ్రాన్సునుండి నిరాటంకముగా సేననుబిలిపించుకొని, యీజిప్టుమూలముగ నిండియాకు సేననుబంపిటిప్పునకుఁదోడై



యాంగ్లేయులను గర్ణాటకమునుండి తఱుమవచ్చునని నెపోలియను ధైర్యము తెచ్చుకొని సాహాయ్యమునకు వచ్చుచున్నానని టిప్పునకు వర్తమానము నంపి ఫ్రాన్సునుండి సేనవచ్చునని వేచియుండెను. ఈసేనమధ్యధరాసముద్రముగుండ రావలసియున్నది. ఆంగ్లనావిక నాయకుఁడగు నెల్సను ఫ్రెంచివారిరాకగనిపెట్టి వారితో ఘోర యుద్ధముచేసి ఫ్రెంచివారియోడలను దొమ్మిదింటిని బట్టుకొని నాశముచేసియు రెండింటి నగ్నిహోత్రున కాహుతి సల్పియు నైదువేల ఫ్రెంచినావికులనువధించియు, ఫ్రెంచివారి సిగపువ్వుఁద్రుంచివేసెను. నాటంగోలె ఫ్రెంచివారి పతాకము మధ్యధరాసముద్రమునుండి రూపుమాసెను. ఫ్రెంచివారికిని నెపోలియనునకును నెడబాపులయ్యెను. ఈజిప్టుమూలముననిండియామీఁదికి దాడివెడలనాతఁడు పన్నిన వ్యూహముభంగమయ్యెను. తుద కీజిప్టును నిలుపుకొనుటయే కష్టమయ్యెను. అఁట టిప్పుసులతాను ఫ్రెంచివారియాశ వదలుకొని స్వతంత్రముగ నాంగ్లేయులమీఁదికిఁ గవిసి యోడిపోయి హతుఁడయ్యెను,

ఐర్లాండులోనికల్లోలమింకనుజల్లారలేదు. ఆంగ్లపార్లమెంటుతో సంబంధములేకుండ నైర్లాండు పార్లమెంటువారు రాచరికము నడపుకొనుటకు స్వాతంత్ర్యమిచ్చుటవలననవర్థకమే తటస్థించినందున నైర్లాండులోపార్లమెంటు లేకుండరద్దుపఱచి యాదేశమునుండి ప్రతినిధులాంగ్ల పార్లమెంటునకు వచ్చునట్టుల నేర్పాటుచేయఁదలఁచి పిట్టు, ఒకచట్టమును1800సం॥లోఁ జేయించెను. తమ ప్రాభవమునకు భంగము కలుగునని ఐర్లండులోని లార్డులీచట్టమునకనేకయాటంకములను దెచ్చిపెట్టిరి. మఱియొక యుపాయముగానక, యీచట్టమునకడ్డము వచ్చినవారికెల్ల పిట్టు లంచములు విరివిగానిచ్చి వారి యవరోధమును నివారణముచేసెను. ఇఁక ముందు రెండు దేశముల నొక్కటే పార్లమెంటు యింగ్లాండున నేర్పడి యుండెను. ఈపార్లమెంటున కైర్లండునుండి నూరుగురు కామనులును, ఇరువదెన్మండ్రులార్డులును, నల్వురు మతాచార్యులును వచ్చుచుఁ దమ దేశముయొక్క యోగక్షేమములను జక్కఁబెట్టుకొందురు. ఈ రెండు

దేశములవారును వర్తకనిరోధములు లేక స్వేచ్ఛగా వర్తకము సాగించుకొను నట్లేర్పాటు చేయఁబడెను. ఇప్పు డమలులో నున్న చట్టములే ముం దైర్లండులో నమలు జరుగునట్లును, ఆంగ్ల పార్లమెంటు వారగత్యమును బట్టి వానిని మార్చుటకును రద్దుపఱచుటకును, గ్రొత్త చట్టములను చేయుటకును, నధికారము వహించునట్లును, నియమింపఁబడినది. కాథోలిక్కులు ప్రొటెస్టంటులతో సమముగా సర్వస్వాతంత్ర్యముల ననుభవించు నట్లు కూడ జట్టము చేయవలెనని యుదారచిత్తుఁడగు పిట్టుతలపెట్టెను గాని మూర్ఖశిఖామణులగు నైరిషులార్డులాతని ప్రయత్నములను సాగనియ్యరైరి.

ఫ్రెంచివారు నానాటి కితరదేశముల పైఁబడి వాని నాక్రమించుకొనుట కారంభించిరి. చిరకాలము నుండి స్విట్జరులాండు స్వతంత్రముగనుండి యితరరాజులకు స్వాధీనము కాకుండఁ గాపాడుకొనుచుండెను. ఫ్రెంచివారిప్పుడీ దేశముపై దండెత్తి దీనిని స్వాధీనము చేసికొనిరి. వీరిచేష్టలకైరోపా యందలి రాజు లందఱు భయభ్రాంతులై వీరిమదమడంపఁ దలఁపోయు చుండిరి. ఫ్రెంచివారితోడియుద్ధమున కాంగ్లజనులు ముందంజ వేయుచుండిరి. అందుచే 1803 లో ముందు ఫ్రాన్సుతోడను పిమ్మట హాలండుతోడను నాంగ్లేయులు యుద్ధప్రకటనము చేసిరి. 30000 మందిజీతబత్తెములనుగోరకయే కోరనిబంటులై నిలిచిరి. నావిక బలమును బలపఱచియు, విదేశరాజుల నేకముఖము చేసియు ఫ్రాన్సుగర్వమడంచవలెనని పిట్టు వ్యూహము పన్నెను. ఫ్రెంచివారికి నెపోలియను చక్రవర్తియై, ఇటలీకి రాజుగాఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. ఫ్రెంచివారియొక్కయు స్పానియులయొక్కయు నోడలుకలిసి ట్రఫాల్గరునొద్ద నెల్సను అను ప్రసిద్ధనావికయోధునితో యుద్ధము చేసి యోడి పోయెను. అఁట నాస్ట్రియాలో రష్యనులును, ఆస్ట్రియనులును గూడ, నెపోలియను నెదిరించి పోరి యాతని కోడిపోయిరి. ఈపరాజయమును విని గుండె లవిసి పిట్టు స్వర్గస్థుఁ డయ్యెను.



నెపోలియను బోనాపార్టు.

ఆతని పిమ్మట నధికారమును వహించిన మంత్రిమండలి వారు యుద్ధ ప్రయత్నములను సడలించక, ఫ్రాన్సు రేవు పట్టణముల నుండి యింగ్లాండున కెగుమతి యగు సరకుల నాంగ్ల దేశమునకు దిగుమతి కాకుండ నరికట్టు శాసనములను జేసిరి. ఐరోపాఖండమును జాల వఱకుఁ దనపుడిసెట నుంచుకొన్న నెపోలియను, యిందునకుఁ బ్రతిహతముగా నాంగ్లేయుల వర్తకపు సరకు లితరచోటుల కెగుమతి కాకుండ బహిష్కార ప్రకటనము చేసి యాంగ్లవర్తకమును నాశము చేయఁ బూనుకొనెను. రష్యా కూడ ఫ్రెంచివారితో సఖ్యము చేసికొనెను. అందుచే నైరోపాలోని దేశములలో దేనికిని నాంగ్లేయులు సరకుల నెగుమతి చేయుటకు వలను దప్పి పోయెను. ఐరోపాయందలి యుత్తరదేశములతో వర్తకము సాగుటకు బాల్టికు సముద్రమే యాధారము. ఆంగ్లవర్తక పోడ లీసముద్రమునకు రాకుండ హాలండుదేశము వారియోడల నచట ఫ్రెంచివారు కావలియుంచిరి. అందుచే నాంగ్లేయు లచటికొక నావికయాత్ర నడపి యచటి హాలండుల యోడలను ఖయిదు చేసి, యాంగ్లదేశమునఁ జేర్పించుకొని, వర్తక నిరోధమును దొలఁగించుకొనిరి.

పోర్చుగలుదేశము చిరకాలమునుండి యాంగ్లేయులతో మైత్రిగలిగి యుండెను. ఈ దేశముతో నింగ్లీషువారికి విశేషవర్తకముండెను. ఈ దేశమున నింగ్లీషువారిమాట నిరాటంకముగ సాగుచుండెను. ఈ కారణములచే నెపోలియను ఆంగ్లవర్తకనిరోధకముగఁ బ్రచురించిన ప్రకటనమునకు పోర్చుగీసులు లక్ష్యపెట్టరైరి. స్పానియాలో రాజకుటుంబమువారు కల్తలుపడి నెపోలియనుయొక్క సాహాయ్యముకోరఁగా నాతఁడందునకు సమ్మతించి, పోర్చుగలుదేశమును స్పానియులతోఁ దానుసమముగఁ బంచుకొనుట కేర్పఱచుకొని నెపోలియను స్పానియులకు సేనాసాహాయ్యమునిచ్చి, పోర్చుగలు స్వాధీనము చేసికొనుటకు గొందఱ యుద్ధభటులనంపెను. స్పానియారాజు తనరాజ్యమును నెపోలియను జేతులలోఁ బెట్టి రాచరికమును చాలించుకొన్నందున,

నాతనిసోదరుఁడు స్పానియా రాజయ్యెను. స్పానియులుగాని, పోర్చుగీసులుగాని ఫ్రెంచివారి రాచరికము నొల్లక తిరుగఁబడిరి. వీరాధివీరుఁడగు వెల్లింగ్టను నాయకత్వము క్రిందఁబోరి యాంగ్లేయులు ఫ్రెంచివారిని మొదట పోర్చుగలునుండియుఁబిమ్మట స్పానియానుండియుఁ దఱిమివేసిరి. ఆంగ్లవర్తకనిరోధకముగ నెపోలియను జేసినప్రకటనమును మన్నించుట రష్యావారికిని స్వీడనుజనులకును గష్టముగానుండినందున వారిర్వురునుగలిసి ఫ్రాన్సుమీఁదికి డీకొనిరి. వీరితో జర్మనులుకూడఁగలిసిరి. ఇందఱునుగూడి ఫ్రాన్సుఁజొచ్చి నెపోలియను నోడించఁగా నాతఁడు 1814 సం॥లోఁ జక్రవర్తిత్వమును విడిచిపెట్టి, యెల్బాదీవికిఁబోయెను. ఇట్లు పోరినరాజమండలివారు నెపోలియనువలని పీడనువదల్చుకొనుటకేకాక, ఫ్రాన్సుదేశమునజీర్ణమైనరాచరికమునుబునరుద్ధారణము చేయుటకుఁగూడ సంకల్పించినవా రగుటచే, నందఱునుగలిసి పూర్వ రాజకుటుంబములో పదునెనిమిదవ లూయికిఁ బట్టాభిషేకము చేసిరి.

ఇట్లు పదునొకండు మాసములుగడియఁగా. నెపోలియనుమరల ఫ్రాన్సునకువచ్చి, తనవెనుకటిసేనాధిపతులను గూడఁగట్టుకొనెను. రాజుమరల పలాయితుఁడై ప్రాణములు కాపాడుకొనెను. జర్మనీ రష్యామొదలగు వివిధదేశాధీశులాంగ్లేయులతోఁగూడినెపోలియనుతో వాటర్లూయొద్ద1815సంలో ఘోరయుద్ధముచేసి యాతనినోడించిరి. ఆంగ్లవహూధినీ నాయకుఁడగు వెల్లింగ్టను డ్యూకుయొక్క యద్వితీయ పరాక్రమమువలన నైరోపారాజమండలిలో నాంగ్లదేశమునకుఁబ్రఖ్యాతిమిన్నుముట్టెను. నెపోలియను మరలఁ జక్రవర్తిత్వమును వదలుకొనెను. ఆతనిని సెంటుహెలీనాయను నాంగ్లద్వీపమందు జీవితాంతమువఱకు ఖయిదుచేసి, ఫ్రాన్సురాజ్యమునకుఁ బదునెనిమిదవ లూయిని రాజుఁగా స్థిరపఱచిరి.

ఇంతటితో నైరోపాలోని కల్లోలముచల్లారెను. అన్నిదేశములవారును యుద్ధము చాలించుకొని విశ్రాంతినొందిరి. ఉత్తరహాఫ్రికా ప్రాంతములయందలి మహమ్మదీయరాజులు చిరకాలమునుండి దొంగతనములు చేయుచు



సముద్రముమీఁదుగఁ బోవునోడలను దోఁచుకొనుచు నందలి క్రైస్తవులను బానిసలనుగఁ జెఱపెట్టుచుండిరి. ఆంగ్లదేశమునకును ఫ్రాన్సునకును మధ్యనున్న యింగ్లీషు కాలువలోఁగూడఁ గొంతకాల మీదొంగతనము సాగినది. ఇంగ్లాండులో ధార్మికులు తురుష్కుల కుంపవలిచ్చి బానిసలగు క్రైస్తవులకు స్వాతంత్ర్యము కలుగఁజేయునిమిత్తము దానధర్మములు చేయుచువచ్చిరి. పూర్వమువలెఁగాక యీతురుష్క ప్రభువులబలము నానాటికి తగ్గిపోయెను. క్రైస్తవమతాభిమానులైనరాజుల కీతురుష్కులక్రూరకృత్యములుదుర్భరములై తోఁచెను. పూర్వకాలమున జనులకు బానిసతనము నింద్యాచారముగఁ దోఁచలేదు. జనులలో నాగరికతయు నీతియుఁ బెంపొందిన కొలఁది యిది దురాచారముగఁ గన్పడెను. ఆంగ్లేయులు 1807 సం॥లో బానిసలక్రయవిక్రయములవలనలాభమునొందు వర్తకమునుమాన్పుకొనిరి. 1815 సం॥లో నెపోలియనుగూడ బానిసలవర్తకము నడఁచివేసెను. నెపోలియను నోడించినప్పుడు సాంఘిక రాజమండలివారు యోచించి ఆఫ్రికా యుత్తరభూములలో బానిసలైయున్న క్రైస్తవులను దురుష్కుల స్వాధీనమునుండి విడిపించుటకును, ముందెన్నఁడు తురుష్కులీదురాచారము నవలంబించకుండ నిషేధించుటకును, నిశ్చయము చేసికొని యొక నావికబలము నా దేశముమీఁదికిఁబంపి మహమ్మదీయప్రభువునకుఁదమవచ్చిన సందేశమును దెలిపిరి. ఆతఁడు ప్రత్యుత్తరము చెప్పనందున, నాతనిపట్టణమును ముట్టడించి యొత్తుకలుగఁజేసిరి. తుదకాతురుష్కరాజు శత్రులరాపిడికోర్వలేక 1813 సం॥లో క్రైస్తవబానిసలను బంధవిముక్తులఁ జేసి ముందీదురాచారమును మాన్పునట్లు సమయము చేసికొనెను.

ఆకాలమున శిక్షాస్మృతి నాగరికలేని పశుప్రాయులకుఁ దగినట్లు క్రూరదండనముల నియమించుచుండెను. దొంగతనము, అబద్ధపు దస్తావేజులను సృష్టించుట, జేబులలో వస్తువులను హరించుట, మొదలగు స్వల్పదోషములకే యురిశిక్ష విధింపఁబడియుండెను. సామాన్యముగా ననుదినమును జరుగుచుం

డు నిట్టి 160 నేరముల కురిశిక్ష యేర్పడియుండెను. దయాళురగు కొంద ఱుదారచిత్తులు పాటుపడఁగా 1818 సం॥లో బహుశ్రమమీఁద శిక్షాస్మృతి సవరణమునిమిత్తమొక కమిటీవారేర్పడి, నాగరికులకు సరిపడునట్లు దయాదాక్షిణ్యములతోఁ శిక్షాస్మృతి మార్పఁబడినది.

ఈ కాలమున మఱియొక శ్లాఘాపాత్రమైన చట్టము వెలసెను. మనుష్యులను పశువులతోఁ దుల్యముగఁ గ్రయవిక్రయముల పాలుచేసి వారికి స్వాతంత్ర్యమియ్యక, వారి కష్టసుఖములను జూడక పనిచేయించుకొను దురాచారమొకటి బాహుళ్యముగా నలుగడల వ్యాపించియుండెను. దయాగుణమును బెంపొందించుచు, మానవజీవితముయొక్క ఘనతను బోధించుచు, జనసామాన్యమునకుఁ బాపభీతియు నీతిరతియుఁ గలిగించుచు నీశ్వరభక్తినిగఱపు మతబోధకులు పదునెనిమిదవ శతాబ్దమున వెలసిరి. వీరి సదుపదేశములవలన వేలకొలఁది జనులు విశుద్ధవర్తనులై యూరూఢభక్తులైరి. జనులలో నీశ్వరవిశ్వాసము పెంపొంది పాపభీతి యధికమైనది.

అమెరికా దేశములోను వెస్టుయిండియా దీవులలోను ఆంగ్లేయులు పాదుకొన్నప్పుడు, ఆఫ్రికానుండి బానిసలను దెచ్చి యాంగ్లేయులు బానిసలవర్తకమును విరివిగా సాగించుచువచ్చిరి. మార్గమధ్యమున నోడలో నీబానిసలు పడుబాధ లాంగ్లదేశమునఁ దెలిసి కడుఁజాలిపుట్టించి కొంద ఱుదారచిత్తుల యందీదురాచారమును వేళ్లతో రూపుమాపవలెనను బూనిక గలుగఁజేసెను. బానిసలకష్టములను గనుఁగొని రిపోర్టుచేయుటకు 1788 సం॥ పిట్టు ఒక కమిటీవారిని నియమించెను, కడువిషాదకరమైన వీరి రిపోర్టువచ్చినతరువాత బానిసలవ్యాపారము శాసనవిరుద్ధమనియు దండనపాత్రమనియు శాసించునిమిత్తము 'విల్బరుఫోర్సు' అను దయాళుఁడు పార్లమెంటులోఁ బాటుపడఁగా, నీనరవిక్రయమువలన ధనార్జనము సేయుచున్న లివర్పూలు మొదలగు రేవుపట్టణముల వర్తకులిందున కొడఁబడక వానిప్రయత్నము లనేకవత్సరముల వఱకు సాగనియ్యరైరి. ఇందున కొకసంఘమువారేర్పడి, విఘ్నములకు లక్ష్యపెట్టక



సర్వకాలములందును నిట్టిదట్టము పుట్టించుటకు నైరంతర్యముగఁ బూనికతోఁ బాటుపడిరి. బానిస లెక్కడున్నను వీరడ్డుపడి వానిని విడుదలచేయించుచు, విముక్తులగు బానిసలకు వాసయోగ్యముగ నొకకాలనీ నిర్మించిరి. కొంతకాల మిట్లు బానిసలకొఱకు ప్రయత్నములు జరుగుచుండఁగా బానిసలవర్తకములోని బాధలేకాక, బానిసతనపుదురాచారముయొక్క హేయత్వముకూడ లోకవిదితమై బానిసతనము నిషేధింపఁబడవలెనని తోఁచినది. అందుచే 1807 సం॥ లో నీసంఘమువారి ప్రయత్నములు సఫలములై దొరతనమువారు బానిసలవ్యాపారము దండనపాత్రము చేసినప్పుడు, తమప్రయత్నము లంతటితోఁ గడముట్టినవని విరమింపక మఱింత శ్రద్ధాతిశయముతోఁ బనిచేసి, యాంగ్లరాష్ట్రములో నెచ్చటను బానిసలజాతియే లేకుండ పేరుమాయునట్లు 1833 సం॥లో శాసనము జేయించిరి,



## అధ్యాయము. 25.

---

## యుద్ధానంతరమున దేశస్థితి. 1815-1820.

---

### మూఁడవజార్జి.

---

మూఁడవవిలియము రాజ్యమునకువచ్చిన 1688సం॥ మొదలు వాటర్లూ యుద్ధముజరిగిన 1815సం॥ వఱకు 126 సంవత్సరము లెడతెగనియుద్ధములలో నాంగ్లేయులు మునిఁగియుండిరి. ఇందఱువదినాలుగువత్సరములు తీవ్రయుద్ధములందుఁ గడచెను. 1688 సం॥ బూర్వము పదిలక్షలకులోపుగానున్న దివాణపుఋణము1816సం॥నాటికెన్మిదియర్బుదములయ్యెను. రాజ్యతంత్రమునంతను నిర్వహించుటకు దొరతనమువారికిసంవత్సరమునకు డెబ్బదిలక్షలువ్యయపడలేదుగాని యీ యుద్ధవ్యవహారములను సమర్థించుటకుమాత్రము సంవత్సరమునకు డెబ్బదిలక్షలు చాలకపోయెను. దివాణమునకు ఋణమయ్యెననుటవలన దుర్భరములైనపన్నులనుగట్టి దివాణము పోగుచేయఁగలిగిన ధనము వ్యయపడఁగా లోటుపడిన మొత్తమనియే యర్థముగనుక, నీ యుద్ధములవలనఁ బ్రజల కెంతయొత్తుడు కలిగెనో వాచకు లూహించెదరుగాక!

బిడ్డమొగముచూచి ప్రసవవేదనమును మఱచిన తల్లివలెఁ గట్టకడపట వాటర్లూయుద్ధమం దాంగ్లేయులు విజయలక్ష్మిని జూఱఁగొనుటచే, దేశముయొక్క దారిద్ర్యమును విస్మరించి, ఇంగ్లాండుయొక్క మాహాత్మ్యమునకు హద్దులేదని ప్రజలు దర్పించియుండిరి. ఫ్రాన్సుజనులతోడి కడపటియుద్ధము 1793సం॥లోఁ బ్రారంభమైనది. 1762సం॥లో దివాణమునకు రెండుకోట్లకుఁ దక్కువగానున్న రాఁబడి 1814సం॥లోఁ బదియర్బుదములుగానీయుద్ధకాలమందే పెరి



గెను. పూర్వముకంటె 1810-1814 సం॥ల మధ్య నూలుబట్టల యెగుమతి మూఁడురెట్లు వృద్ధియయ్యెను. ధనికకుటుంబములవారును సామాన్యగృహస్థులును నైశ్వర్యముతోఁ దులఁదూగుచు భోగము లనుభవించుచుండిరి. ఎందఱోవీరులను, ఎంతోధనమును గోల్పోయినను దేశమి ట్లభ్యుదయమునం దుట కడువింతగఁ దోచకమానదు.

ఐనను సూక్ష్మదృష్టితోఁ జూచినప్పుడుమాత్రమీయైశ్వర్యము భ్రాంతిమూలకమైన బాహ్యలక్షణమేకాని నిజముకాదని తోఁపకపోదు. యుద్ధసంబంధమైన మితిమీరటినవ్యయమే యిట్టి యాభాసైశ్వర్యమునకుఁ గారణము. ఆదాయములోఁ బదియవపాలుగాఁబడిపన్నుగా దొరతనమువారికిభూస్వాములిచ్చికొంతయుద్ధవ్యయభారమునుదమపైవేచికొనిరి. కాని, కడుభారముగాఁ బెరిగినదివాణపు ఋణమును దరువాతి ప్రజలే తీర్చుకొనవలసినవారైరి. ఈ దేశఋణముపై సంవత్సరమునకు మూఁడుకోట్ల సవరనులు వడ్డియే యచ్చుకోవలసివచ్చెను. ఈ సొమ్ము కూడఁబెట్టుటకు దొరతనమువా రాహార పదార్థముల మీఁదను, చేతిపనులమీఁదను పన్ను లెక్కువచేయుటచే, నొక్కొక్కఁడు సంవత్సరమునకు నిరువది మూఁడు రూపాయల పన్నధికముగా భరించవలసివచ్చెను. ఇంతటితోఁ బ్రజలబాధలు ముగియలేదు. నెపోలియనుతోడి యుద్ధములవలన సేనలకు పరికరములును వస్త్రశస్త్ర సామగ్రియు నమితముగా నింగ్లాండునుండి యెగుమతిచేయఁబడుచుండెను. ఐరోపాఖండమువారందఱును సుఖజీవనాధారములైనపరికరములన్నిఁటిని యాంగ్లేయదేశమునకువచ్చికొనుచుండిరి. యుద్ధముచల్లారినవెనుక నిట్టియైశ్వర్యమునిలువదుకదా! అందుచే 1815సం॥ లో రెండుకోట్ల సవరనుల కిమ్మతుగల నూలుబట్టలయెగుమతి తరువాతి పదిసంవత్సరములలో నొకకోటి యిఱువదినాలుగు లక్షలయ్యెను. ఉన్నిబట్టల యెగుమతియింతకంటెను హీనగతికివచ్చెను. చేతిపనులవలన జీవించువాండ్ర గతియుఁ గడుచింతాకరముగ నుండెను. మగవారు వ్యవసాయము చేయుచుండఁగా, నాఁడువాండ్రు చేతిరాట్నములు పెట్టుకొనినూలు

వడఁకి పొట్టఁబోసికొనుచువచ్చిరి. నూలువడకెడు యంత్రములు వెలయుటచే నీనంసారములును, బట్టలునేయుయంత్రములు బయలుదేఱుటచేఁ జేతిమగ్గములే జీవనాధారముగఁ గలసాలెవాండ్రకుటుంబములును క్షామదేవత వాఁతఁ బడినవి. పందొమ్మిదిరూపాయల వెలగల వస్త్రమునకు ధరయాఱురూపాయలకుఁ దగ్గిపోయినది. 1816సం॥ లో వెలసిన నేఁతయంత్రములు 80 కోట్ల సాలెవాండ్రు యంత్రసాహాయ్యము లేకుండఁ జేయఁగలిగినంతపని చేయుచున్నవి. యుద్ధము ముమ్మరముగానున్నప్పుడితరదేశములీ యంత్రసాధనముల నెఱుఁగమిచే వీనిమూలమున కోటానుకోట్లుగా వస్త్రములు తయారుచేయఁబడుచున్న యాంగ్లదేశమునకు వచ్చివస్త్రములు కొనవలసి వచ్చినందున, వర్తకము వృద్ధియయ్యెను. యుద్ధకల్లోలముడిఁగి దేశముచల్లారినతరువాత నాంగ్లేయులను జూచియితరదేశములవారుకూడ యంత్రసాధనముల నవలంబించుటచే నాంగ్లవర్తకము కాల్మోడ్చి కుంటువడినది. అగత్యమును మీఱివస్తువులు తయారగుటయు కొనువారులేక వస్తువులువిలువ తగ్గిపోవుటయు, ఫాక్టొరీకూలీలను మఱింత బాధించెను.

ఇందునకుఁ దోడుగా సేద్యభూముల విషయమున జరిగినమార్పులు వ్యవసాయదారులను దారిద్ర్యదేవతకు బలియిచ్చినవి. పూర్వము ప్రతిగ్రామమందును భూమిసాముదాయకముగ నుండుచువచ్చుటచే, సేద్యగాండ్రెవరికిఁ గావలసినభూములను వారుసాగుచేసికొని, కొంతభూమిని సాముదాయకముగ దూడలబీడుగా నుంచుకొని మనుగడఁ గడపుకొనుచుండిరి. కృషిశాస్త్రము వృద్ధికాఁగా కొంతభూమినిబంపులక్రింద విభజించుకొని వారుపయిరులను బండించుకొనుటకారంభించిరి. సాముదాయకభూమి కావరణముల నేర్పఱచుకొని యున్నివర్తకులు గొఱ్ఱెలబీడులుగా నుపయోగించుకొనిరి. యుద్ధకాలములో గోధుమల విలువ యమితముగాఁ బెరుగుటచే సాముదాయకభూములు వేగముగ నొక్కసారిపంపులక్రింద విభాగింపఁబడిపోయినవి. విదేశములనుండి దిగుమతిసరకు లాంగ్లదేశమునకు రాకుండ



నెపోలియను నిషేధ ప్రకటనము చేయుటచే, గోధుమలు యవలు మొదలగు నాహారపదార్థములు విదేశములనుండి రాక స్వదేశమందు ఫలించినస్వల్పమే గతియై ధరలుహెచ్చెను. ఇందుచే వ్యవసాయము మిగులవృద్ధియై భూస్వాములకు భాగ్యమెత్తుకొనెను గాని, స్వతంత్రులై బ్రతుకుచువచ్చెడు సేద్యగాండ్రు కూలిజీవనము చేయవలసి స్వాతంత్ర్యమును బోఁగొట్టుకొనవలసినవారైరి. యుద్ధముచల్లారినతరువాత గోధుమలకు ధరతగ్గిపోయి భూస్వాములకును వ్యవసాయదారులకును జాలనష్టముసంభవించెను. ఈభూస్వాములు పార్లమెంటు మెంబరులే కనుక తమకునష్టమురాకుండఁ గాపాడుకొనుటకు గోధుమలు క్వార్టరు 1కి 4సవరనుల చొప్పుననమ్మవలెనని 1815సం॥ లోఁ జట్టమొకదానినిఁ బుట్టించిరి. స్వదేశమందలిగోధుమలీధర కమ్ముడగువఱకును విదేశములనుండి గోధుమ లెగుమతికాకూడ దనికూడ విధింపఁబడెను. 1780-1790 సం॥మధ్య గోధుమల కిందులో సగమైన ధరలేదు. లండను మొదలగుపట్టణవాసు లీబిల్లుపార్లమెంటులోఁ జర్చింపఁబడుకాలమున నట్టిచట్టమును భరింపఁజాలమని మొఱపెట్టుకొనిరి. ఫాక్టొరీలలోఁ గూలిచేసి యార్జించుకొన్న కూలిడబ్బులను వెచ్చించి యాహారపదార్థములను సంపాదించుకొనవలసినవారుగనుక ఫాక్టొరీకూలీల కీచట్టముమిక్కిలిబాధకముగానుండెను. వీరిమొఱాలించక పార్లమెంటువారు వ్యవసాయదారుల పక్షమునుండి యీచట్టమును జేయఁగా, కూలీలుగుంపులుగా బయలుదేరి రొట్టెలుచేయుస్థలములు కొల్లగొట్టియు, ఫాక్టొరీలకుఁబోయియంత్రములనువిఱుగఁగొట్టియు, నల్లరులారంభించిరి. నావికభటులును యుద్ధభటులునుయుద్ధము ముగిసినతరువాత జీవనాధారము లేక యీదొమ్మిరేగినకూలీలతోఁ గలిసిరి. పేదసాదతారతమ్యము లేకసర్వజనులు సమానముగా ధనధాన్యసంపదలను బంచుకొని యనుభవించవలెననుసిద్ధాంతములను బోధించుబోధకులు బయలుదేరిరి. ప్రజలును దొరతనమువారును దేశదారిద్ర్యమును నివారించుమార్గము తోఁపక నిర్భరులైరి.

ప్రజల కష్టసుఖములను గాపాడుపూనికగలవారు పార్లమెంటునకు సభ్యులుగ నియమింపఁబడునట్లు తగినయేర్పాటులు లేకపోవుటవలననే దొరతనమువారి దేశోపద్రవమును నివారింపలేక పోయిరని కనుఁగొని, పార్లమెంటునకు సభ్యులను నియమించుకొను విషయమున మార్పులుకావలెనని వాదించుసంస్కర్తలు కొందఱు బయలుదేరిరి. బహుస్వల్పమగు చందాకు విక్రయింపఁబడుచు, సర్వజనసాధ్యములై వెలసులభముగల వార్తాపత్రికలుతలయెత్తి దొరతనమువారి లోపములను నలుగడల వెదచల్లినవి. కూలీలు సైతమీపత్రికల మూలమున రాజకార్యవ్యవహారములనుబోధపఱచుకొనిపార్లమెంటుసవరణము నిమిత్తము పట్టుదలగలిగియుండిరి. 'విలియముకాబెట్టు' అనుబుద్ధిశాలి విరామములేకుండ నిరువదితొమ్మిదివత్సరము లొకవార్తపత్రికను వెలసులభముగఁ బ్రకటించి జనసామాన్యమునకు రాజకీయవ్యవహారములందు రుచిపుట్టించెను. దొరతనమువారికిఁ బన్నులుచెల్లించు వారందఱు సంవత్సరమునకొకసారికామనులను నియమింపవలెననియు, ఆకాలమునవింతకంటెఁ బ్రజాక్షేమకరమైన కార్యమింకొకటి దొరతనమువారుజేయఁ గలిగినది లేదనియు నీవిలియముకాబెట్టుతనపత్రికలో1816సం॥ బ్రకటింపఁగా, ప్రజలందఱాతఁడు చెప్పిన మార్గమునవలంబించి దొరతనమువారి కొత్తుడుకలుగఁ జేయమొదలుపెట్టిరి. ఇంతకుఁ బూర్వము కూలివాండ్రిట్టి దట్టిదని నిర్దేశింపరాని కోరికనుబెట్టుకొని యల్లరులు. చేయుచు వచ్చిరికాని, కాబెట్టు యొకత్రోవచూపఁగా దానినందుకొని స్థిరమైనపూనికతో పార్లమెంటు సభ్య నియామకత్వమునుగూర్చియు, పార్లమెంటుతోసంబంధించినయితరమార్పులనుగూర్చియుఁ జాటుపడనేర్చుకొనిరి. లాంకషైరు, యార్కుషైరు మొదలగుమండలములలోఁ బ్రతిపట్టణమునందును బల్లెయందును సంస్కరణసంఘము లేర్పడినవి. ఈసంఘములనుండి ప్రతినిధు లేర్పడివా రందఱును గలిసి సంవత్సరమునకొకసారి పార్లమెంటుసభ్యులు నియామకము కావలెననియు, దొరతనమువారి క్రిందియుద్యోగస్థులు సభ్యత్వమున కర్హులుకాకుండ నిషేధింపఁ బడవలెననియు, దొరతనమువారికిఁబన్నులుచెల్లించునట్టిపదునెనిమిదివత్సరములు పైఁబ



డినప్రతి మనుష్యుఁడును సభ్యులను నియమించువిషయమున వోటుసేయుటకర్హతగలిగి యుండవలెననియు, 2000 మందికొకఁడుచొప్పునపార్లమెంటులోని కామనులశాఖలోసభ్యులుండవలెననియు, నీతివర్తనులును బుద్ధిశాలురును నగువారందఱును సభ్యత్వమున కర్హులై యుండవలెననియు, కొన్నిపద్ధతులను నిర్ధారణము చేసికొనిరి.

మొట్టమొదట నీ సంస్కరణ సభవారు దొరతనము వారి యధికారమును దిరస్కరించకుండ నీ సంస్కార కార్యములను గుఱించి చక్కఁగా బోధించుచు, చట్టముల మీఱిన వారిని పోలీసువారి కప్పగించుచు, సాధువృత్తి నవలంబించి పనిచేసిరి. కాని లండనుపట్టణమువా రొకసభలో నీ సంగతులను జర్చించిన మీఁదట 1816సం॥లోఁ బ్రజలు శాంతము దూలి దుకాణములను దోపిడి చేసిరి. అందువలన దొరతనము వారి కాగ్రహము వచ్చి యిట్టి సభలు జరుగఁ గూడదనియు, రాజకీయ విషయములనుగూర్చి ప్రజల కావేశము గలుగునట్లు మాటాడఁ గూడదనియు శాసనము చేసిరి. ఇందుకు సంస్కరణ సభలవారు కంటగించి కొందఱు సామోపాయములను గాని దండోపాయములను గాని యవసరమునుబట్టి యవలంబించి తమపట్టిన కార్యమును నెఱవేర్చుకోవలెనని శపథములు చేసికొనిరి. మఱికొందఱు దండోపాయములు తగవనియు సామోపాయముచే దొరతనమువారిని దమపంకకుఁ ద్రిప్పుకొనవలెననియుఁ బూనుకొనిరి. 1817-1819 సంవత్సరములో నంతకంతకుఁ బ్రజలకును పార్లమెంటువారికిని వైరము బలమయ్యెను. ప్రజలలో దారిద్ర్యము మిక్కుటమయ్యెను. మూఁడవజార్జికి వాకాలమున మతిభ్రమణము తటస్థించుటచేఁ బ్రతినిధియై యేలుచున్న యాతని కొమారుఁడు నాలవజార్జి యనగత్యముగా దివాణపు సొమ్మును, పెన్షనుల క్రిందను, దగిన పనిలేక జీతములుమాత్ర మనుభవించు సాపాటురాముల క్రిందను, దన చుట్టునుండు పరివారము క్రిందను, నమితముగా వ్యయపెట్టుచుండెను. ప్రజల కష్టములను లక్ష్యపెట్టక పార్లమెంటువా రూరకయుండిరి. సభలలో రాజకీయ వ్యవహారములు చర్చించుట దండ్యము

కాకుండ 1816సం॥లో నొక శాసనము మాత్రము పుట్టెను. అందుచే సంస్కరణ సభలవారు సభలలో నల్లరులు జరుగకుండఁగా పాటుటకై ప్రజలకు సిపాయిలకువలె డ్రిల్లు నేర్పిరి. ఆ కాలమున బర్మింగ్ హాము పట్టణము ఇండస్ట్రీకిఁ బ్రసిద్ధి కెక్కియుండెను. ఐనను పార్లమెంటునకు సభ్యుల నియమించుకొనుటకుఁ బల్లెలకున్న స్వాతంత్ర్యము మీ పట్టణములకు లేదు. ఈ లోపమును పార్లమెంటు వారికిఁ దెలియఁజేయుటకై యొక సంస్కార దీక్షాపరుని నియామకము చేసికొనిరి. ఆతఁ డిందున కుప్పొంగి పార్లమెంటునకుఁ బోక పూర్వము దొరతనమువారికి వ్యతిరేకముగా రాజద్రోహమునకుఁ బురికొల్పు నుపన్యాస మొకదాని నియ్యఁగా దొరతనమువా రాతనిని జెఱఁ బెట్టిరి. ఇంతటితో ధైర్యము విడువక మాంచెస్టరు పట్టణవాసులు తమ యిబ్బందులను పార్లమెంటునకుఁ దెలుపుటకు మఱియొక ప్రవక్తను నియమించుకొని యొక సభ చేసి యాతని నందున కధ్యక్షునిగాఁ గోరుకొనిరి. జనులు బారులు తీరి సిపాయిలవలె నడచుచు మందలుమందలుగా సభాస్థలికిఁ జేరుకొనుచుండెరి. దొరతనమువారి మెజస్ట్రీట్లును సేనాసమేతులై కాచియుండిరి. అచటఁ జేరిన మాంచెస్టరుకూలీలు నిరాయుధులై హేలాగతిని సువస్త్రములతో గుమిగూడి, ''స్వాతంత్ర్యము'' సర్వజనులు సమానులు, ''ప్రతిసాంవత్సరికపు పార్లమెంటులు'' సర్వజనులకు సభ్యనియమనాధికారము'' 'ధాన్యాదుల ధరలను శాసనముల నియమించఁగూడదు' అను చిహ్నములతో నలంకరింపఁబడిన జండాలను ధరించియుండిరి. దండోపాయాభిమానులగు కొందఱుమాత్రము ''సర్వజనసమాన ప్రాతినిధ్యము లేక మరణము'' అను చిహ్నముగల జండాను ధరించిరి. ఆ దినమున సభాధ్యక్షత వహించినవా డిదివఱ కొకచోట రాజ నిందాకరముగ మాటాడినందున కాతని బట్టుకొనుట కొకవారంటు జారీయై యుండెను. సభాధ్యక్షుఁ డున్నతాసనము నెక్కి తల చూపగానే యశ్వవారు లాతనియొద్దకుఁ బోయి యాతనిని బట్టుకొనిరి. అచ్చటకూడిన సభవారందఱు చెల్లాచెదరై దొమ్మిచేసిరి. రంగమంతయు విరిగిన పతాకములతోడను, గాయములు తగిలి



దొరలుచున్న జనులతోడను, జీకాకుగానుండెను. ఇంతటితో దొరతనమువారు కలగుండుపడి సభల నరికట్టియు వాకట్టుచట్టములఁ జేసియు; ననేక విధముల బలాత్కారముగఁ బ్రజల కోరికల నడచివేసిరి. ఇందునకుఁ బ్రజలాగ్రహించి, కొందఱు మంత్రిమండలివారిని జంపుటకొక కుతంత్రము పన్నిరి. ఇది పట్టుపడినందున నీకుతంత్రగాం డ్రురిదీయఁబడిరి.

నెపోలియను నోడించిన వెనుక యైరోపాయొక్క స్థితిని గుఱించి కొంత చెప్పవలసియున్నది. ఐరోపాయందలి రాజ్యము లన్నిఁటిలో నాంగ్ల దేశమందున్న రాజ్యాంగపద్ధతులే యున్నట్లు వాచకు లూహింపఁగూడదు. అప్పటి రాజమండలివారు చాల దేశములలో నిరంకుశాధికారము చెల్లించుచుండిరి. అందుచే నాంగ్లేయుల రాజ్యపద్ధతులను జూచి, నిరంకుశాధికారియైన రాజును జంపి, ప్రజాప్రతినిధిపద్ధతిమీఁద రాజ్యమును నడపఁదలపెట్టిన ఫ్రెంచివారి చేష్ట లైరోపారాజమండలి కంతకును గష్టముగా నుండెను. ఫ్రెంచివా రైర్లాండునకు సాయముచేయుటకుఁ బూనుకొన్న నాటనుండియు నాంగ్లేయులుకూడ వారియెడ భయభ్రాంతులయి పార్లమెంటు సంస్కారమునుగూర్చి తలపెట్టుట మానుకొనిరి. అగత్యములైన మార్పులకుఁగూడఁ జోటియ్యని దొరతనమువారి భయకంపమే పైని వివరింపఁబడిన ప్రజాపరివేదనమునకు ముఖ్యకారణము. ఐరోపారాజమండలివారందఱు గలిసి యేదేశమునను బ్రజలు స్వాతంత్ర్యమునిమిత్తము బ్రజాప్రభుత్వమునిమిత్తము నుబాటుపడకుండ నడఁచివేయుటకును, నెపోలియనువలన నితరదేశములందుఁ దెచ్చిపెట్టఁబడినమార్పులను రద్దుపఱచి, వానిని పూర్వపు నిరంకుశాధికార స్థితికిఁ దెచ్చుటకును నొకసమయము చేసికొనిరి. ఆంగ్లేయులు వారితోఁ గలియలేదు. రాజమండలియొక్క యీ పూనికవలన ననేకదేశములం దల్లరులు బయలువెడలినవి. స్పానియాదేశములో రాజును బంధించి ప్రజాప్రతినిధుల నేర్పఱచి సంస్కారపక్షమువారు రాజ్యతంత్రమును మార్చుకొనిరి. రాజమండలివారు స్పానియుల ప్రయత్నములను భంగపఱుపఁ బ్రయత్నించి కొంతసేననంపి సంస్కర్తల నోడించిరి.

ఈసమయమున గ్రీకులు తురుష్క ప్రభువుల యాధిపత్యమును బెడఁ ద్రోసి స్వతంత్రులగుటకుఁ బూనుకొనిరి. ప్రాచీనకాలమందుఁ బ్రపంచమంతయు ననాగరికమై యున్నకాలమున గ్రీకులు సకల కళలందును బ్రఖ్యాతి వహించి స్వతంత్రులయి యనేక మహోన్నత చరిత్రముల నడపించిరి. అట్టి మహనీయుల సంతతివారగుటచే నీ కాలపు గ్రీకులకు స్వాతంత్ర్యభాగ్యము సమకూర్పవలెననియే యైరోపారాజులకంద ఱకును వారియందభిమానముగలిగినది. కొంతకాలము గ్రీకు లసహాయులై తురుష్కులతోఁ బోరి యొకప్పుడు గెల్చుచు మఱొకప్పుడోడిపోవుచు స్వాతంత్ర్యముకొఱకుఁ బోరాటము సల్పుచుండిరి. అంతట రష్యావారును, ఫ్రెంచివారును, ఆంగ్లేయులును, గలిసి గ్రీకులకు సాయముచేసి తురుష్కుల 1872 సం॥ లో నోడించి, వారికి స్వాతంత్ర్య మిచ్చునట్లు తురుష్కుల నొడఁబఱచిరి.

---

# అధ్యాయము 24.

---

## పార్లమెంటుయొక్క సంస్కారము.

---

## నాలవజార్జి, నాలవ విలియము. 1820–1837.

---

మూఁడవ జార్జికి దేహరుగ్ణతవలన రాజకార్యదక్షతతప్పిన 1810సం॥ నాటనుండియుఁ బ్రతినిధిగ రాజ్యము నేలిన నాలవజార్జి,తండ్రి 1820సం॥లోఁ జనిపోయినతరువాత రాజయెను. పార్లమెంటు సంస్కార (reform) మీతనికాలములో జరుగలేదుగాని,వర్తకమున కడ్డుగానున్న కొన్ని నిబంధనము లీతనికాలమున మార్పునొందినవి.

పూర్వకాలమున నొలందులు (Holland) విరివిగా నోడలవర్తకము సేయుచుండిరి. వారి ప్రాభవము నడఁగద్రొక్కి స్వదేశవ్యాపారమును వృద్ధిచేయుటకయి ప్రజాపరిపాలనము (Common wealth) నడపిన క్రాము వెల్లును నిటీవల రెండవ చార్లెసునుగూడ విదేశవస్తువు లాంగ్లేయుల యోడలమీఁదనేకాని యింగ్లాండున కెగుమతి కాకూడదని నిషేధశాసనమును జేసిరి. ఇందునకుఁ బ్రతిఘాతముగా నాంగ్లయోడలమీద నమెరికాకు వచ్చు సరకులకు మితిమీఱిన పన్నులు గట్టఁబడినవి. అందుచే నమెరికానుండి సరకులను దెచ్చుకొనుటకుఁగాను ఆంగ్లయోడలు ఖాళీగా నచటికిఁ బోయి సరకులఁ దెచ్చుకోవలసివచ్చెను. అట్లే యాంగ్లదేశమునుండి సరకులఁ దెచ్చుకొనుట కమెరికాయోడలు ఖాళీగారావలసివచ్చెను. అందుచే

సరకులయెగుమతికగు వ్యయము రెట్టింపుగాఁ బెరిగెను. స్వదేశ పోడలనియు, విదేశపోడలనియు, భేదములేకుండ దిగుమతిసరకు లన్నిఁటికి సమముగాఁ బన్నుగట్టుటకు 1823 సం॥లో నొకచట్టమేర్పడెను. ఇతర దేశములనుండి దిగుమతియగుపట్టు, ఉన్ని మొదలగు సరకులమీఁదఁగూడఁబన్ను లెక్కువగా నుండెను. ఇందువలన నాంగ్లసాలెవాండ్రకుఁ గావలసినంతపట్టునూలు దొరకక ఫ్రెంచివారితో సమముగఁ బట్టుబట్టలను నేయలేకపోయిరి. ఇంగ్లాండున నేయఁబడిన పట్టుబట్టలు దొంగతనముగా ఫ్రాన్సునుండివచ్చిన పట్టుబట్టలేయని నమ్మించి యమ్ముకొనుటకు వర్తకులెన్నో కృత్రిమోపాయముల వెదకుచుండిరి. ఇతర దేశములనుండి వచ్చిన యున్ని కలుపకుండ నింగ్లాండున తయారయిన యున్నితో నేతసాగనందున నీవిషయమునఁగూడ నేతగాండ్రును వర్తకులును బాధపడుచుండిరి. అందుచే, నీకఠినములయిన పన్నులు కూడఁ దొలఁగించఁబడినవి. వెస్టుయిండియా దీవులయందు బానిసలు మిక్కిలి బాధలపాలగుచుండఁగా వారిబాధలను దగ్గించుటకుఁ గొన్నినిబంధనములు చేయఁబడినవి. కూలీలు కట్టుకట్టి పనికిరాక నిర్బంధించి ఫాక్టోరీయధికారులవలన జీతము లెక్కువ చేయించుకొనుచురాఁగా నట్టి నిర్బంధమును గూడదని నిషేధించుచు 'దానిని దండ్యముగాఁజేసిన చట్టములు పుట్టినవి. దీనివలనఁ గూలివాండ్రు నష్టపడుచుండుట కనిపెట్టి 1824-1824 సం॥ లో దొరతనమువారికి వ్యతిరేకముకానంతవఱకు కట్టుకట్టుట దండనార్హముకాదని నిశ్చయింపఁబడెను. దేశదరిద్రమును బాపుటకు విదేశములనుండి గోధుమలు మొదలగు ధాన్యాదు లింగ్లాండున కెగుమతి కావచ్చునని యంగీకరింపఁబడెను. ఈపూర్వులచే దేశమునకు ధనధాన్యాదులు వృద్ధియై ప్రజలకల్లోలము కొంతవఱకు మట్టుబడెను-

పార్లమెంటు సంస్కారము విషయమునఁ గొంతప్రయత్నము జరిగినదికాని పూర్ణముగాఁ గొనసాగలేదు. సభ్య నియమనస్వాతంత్ర్యము (franchise) నాధారముచేసికొని లంచముల కాసించి ధనార్జనము చేయు



'గ్రాంపౌండ'ను ప్రదేశము వారికట్టి స్వాతంత్ర్యము తీసివేయఁబడి యార్కుమండలమువారి కీయ్యఁబడెను. ఈరాజు కాలములో కాథోలిక్కుల యిబ్బందుల్లను దొలఁగించుటకుఁగూడ కొంతప్రయత్నము జరిగెను. ఆరాధన కాలమందు జరుగు ప్రసాదస్వీకార విషయమున ప్రొటెస్టంటులకును కాథోలిక్కులకును భేదముండుటచే ప్రొటెస్టంటులవలె కాథోలిక్కులు ప్రసాదస్వీకారము చేసినఁగాని కాథోలిక్కులు పార్లమెంటులో సభ్యులగుట కర్హులుకారని నిషేధశాసనము లేర్పడియుండెను. ప్రొటెస్టెంటులోఁగూడ దొరతనమువా రవలంబించిన యారాధన పద్ధతులలోఁగొన్ని మూఢాచారము లున్నవని తలఁచు కొందఱు (dissenters) విమతపక్షమువారుండిరి. వీరుకూడ కాథోలిక్కులవలె దొరతనమువారిక్రింద సివిలు మిలిటరీ యుద్యోగముల కర్హులుకారని నిషేధశాసనములు పుట్టెను. ఈచట్టము న్యాయవిరుద్ధముగా నుండుటచే 1828 సం॥లో దానిని రద్దుచేసి మతసహనమున్న చాలునని స్థిరపఱిచి యొకశాసనము చేయఁబడెను. అందుచే విమతులగు ప్రొటెస్టెంటులకే లాభము కలిగెనుగాని కాథోలిక్కుల బాధలు నిలిచియే యుండెను. ఐర్లండులోని కాథోలిక్కులు సభకూడి తమయిబ్బందులను బోఁగొట్టుకొనుటకుఁ బూనుకొని, కాథోలిక్కు మతస్థుఁడైన ఓకానెల్లు అనువానిని పార్లమెంటు సభ్యునిగా నియమించిరి. ప్రొటెస్టెంటు మతాచారానుసారము ప్రమాణము చేసినఁగాని యాతఁడు పార్లమెంటులోఁ గూర్చుండుటకుఁగాని యితరులతోఁబాటు వోటుచేయుటకుఁగాని యాతనికి స్వాతంత్ర్యము లేదు. అందుచే నిట్టి నిషేధమును దొలఁగించుటకు బద్ధులై ప్రమాణము చేసిన ప్రొటెస్టంటులనే కాని తదితరులను పార్లమెంటు సభ్యులనుగా నియమింపఁగూడదని కాథోలిక్కుసభవారు బెదరించిరి. కాథోలిక్కులకు వ్యతిరేకముగా నున్న నిబంధనములను మాన్పినఁగాని పని సాగదని మంత్రిమండలివారు భయపడి ప్రొటెస్టంటులతో సమాన స్వాతంత్ర్యములను కాథోలిక్కుల కిచ్చుచు 1829 సం॥లో నొకశాసనము చేసిరి. ప్రతిమనుష్యునకును సత్యనిరతి యుండవలెననియు, సత్యనిరతుఁడగువానికి స్వగౌరవముండవలెననియు,

నందుచేఁ బ్రమాణము చేయుట స్వగౌరవమునకు భంగకరమనియుఁ దలఁచు క్వేకరు లనఁబడు తెగవారు కొందఱు గలరు. పార్లమెంటు సభ్యులు ప్రమాణము చేయకుండ సభలోఁ గూర్చుండుటకే యర్హత లేనందున, క్వేకరులు పార్లమెంటునకు దూరమైరి. వీరికి పార్లమెంటు సభ్యత్వమున కర్హత గలుగఁజేయుటకై 1833 సం॥ లో పార్లమెంటుసభ్యులు ప్రమాణము చేయ నక్కఱలేదనియుఁ గ్రమముగాఁ బనిచేయుదుమని సభ్యులు మాట చెప్పినఁ జాలుననియు నొకచట్టము చేయఁబడినది. బైబిలు పూర్వభాగము మాత్రము ప్రమాణముగ విశ్వసించు యూదులనఁబడు తెగవారు కొందఱు గలరు. 1858 సం॥లోఁ బుట్టిన చట్టములో వీరికిఁ గూడ పార్లమెంటు సభ్యత్వమున కర్హత గలిగినది.

ఇంగ్లాండుయొక్క పరిమాణ మంతయు 120000 చదరపు మైళ్లకంటె నెక్కువ లేదు. ఆ దేశమున మూఁడుసంవత్సరముల కొక లక్ష జనసంఖ్య పెరుగుచుండును. ఇట్లు పెరిగినజన మితరదేశములకుఁ బోయినఁ గాని యింగ్లాండున నిలువఁ జోటులేకను దారిద్ర్య మెక్కువగుచును గడు పీడాకరమగును. అందుచే దొరతనమువా రితరదేశముల నాక్రమించుటకు నిరంతరము ప్రయత్నములు చేయుచు వచ్చిరి. 1788సం॥ లో ద్వీపాంతరవాస దండనపాత్రులైన దోషస్థు లాస్ట్రేలియా దీవికిఁ బంపఁబడిరి. దోషస్థులా దీవిని బాగుచేసి వాసయోగ్యముగఁ జేయుటచే 1803సం॥ లో మఱికొందఱు వలసపోయిరి. పిమ్మట 130000 జనులు 1826సం॥ లో కనడా ఆఫ్రికా దక్షిణభూములు, ఆస్ట్రేలియా మొదలగుచోట్లకు, వలసపోయిరి. ఇట్లు జనులు వృద్ధియయినకొలఁది, ఆస్ట్రేలియాద్వీప మంతయు నాంగ్లేయులపరమై యైదు మండలములుగా విభక్తమైనది.

ఐరోపా రాజమండలివా రితరదేశములలో నిరంకుశ ప్రభుత్వమును జెల్లించుటకుఁ జేసిన ప్రయత్నములవలన పోర్చుగలు ఫ్రాన్సు మొదలగు దేశములలోఁ గల్లోల మధికముగా నుండెను. ఫ్రాన్సుదేశములో రాజమం



డలివారు నిలిపిన లూయీకుమారుఁడగు పదియవచార్లెసు వార్తాపత్రికాధిపతుల స్వేచ్ఛ నడఁచియు, నదివఱ కేర్పడియున్న రాజ్యపద్ధతులను మార్చియు, నిశ్శృంఖలాధిపత్యము ను (absolute monarchy) నెలకొల్పెను. ఫ్రెంచివారిందునకు సహింపక 1830సం॥ లో [illegible]. చార్లెసు పలాయితుఁడై యింగ్లాండుచేరెను. మఱియొకనికి ఫ్రెంచివారు రాజ్యమిచ్చి ఫ్రాన్సురాజను పేరు మార్చి ఫ్రెంచివారికి రాజని యాతనికిఁ బేరుపెట్టుకొనిరి. ఐరోపాఖండ మంతయు ఫ్రెంచివారినిఁ జూచి వారివలె నిరంకుశ ప్రభుత్వమును బాపుకొని స్వాతంత్ర్యమును సంపాదించుకొనవలెనని కోరికలు గలిగియుండెను. రాజమండలివారు హాలండును బెల్జియమునుగలిపి యొకరాజు నధికారముక్రిందఁ జేర్చిరి. బెల్జియము జనులిప్పుడు హాలండునుండి విడిపోయి స్వతంత్రులైరి. అంతట నాలవజార్జి పరలోకగతుఁడు కాఁగా నాతని సోదరుఁడగు నాల్గవ విలియము 1837 సం॥ లో రాజ్యమునకు వచ్చెను. విదేశములలోఁ బ్రజలు స్వాతంత్ర్యముకొఱకుఁ జేయు ప్రయత్నములను జూచినప్పు డాంగ్ల ప్రజాసామాన్యమునకుఁగూడ రాజకార్యములం దెక్కుడధికారమును సంపాదింప నాశపుట్టెను. రాజును మంత్రులను, దొలగించుకొనవలె నన్నంత ముక్కుటమగు రాజద్వేషము కలుగలేదుగాని, ప్రాముఖ్యత వహించిన బర్మింగాము మాంచెస్టరు మొదలగు గొప్పపట్టణములవారికి నూతనముగా పార్లమెంటువారు శాసనములను జేయునప్పుడు జోక్యములేకుండుట కష్టముగానుండెను. ఇందునకుఁ దోడుగా రాజనీతిధర్మములను బోధించు గ్రంథములు బయలువెడలినందునఁ బ్రజలు రాజ్యాంగపద్ధతుల యుక్తాయుక్తతను గూర్చి యోచించుకొనుటకు మార్గమేర్పడినది. సామాన్యముగా రాజ్యపద్ధతి యొకటి చిరకాలమునుండియాచారముగా స్థిరపడియున్నప్పుడది యోగ్యమైనదనియే ప్రాయికముగ గ్రహింపఁబడును. ఈ నూతనగ్రంథకారుఁ డట్లుకాక యేరాజ్యపద్ధతి ప్రజాబాహుళ్యమునకుఁ బరమసుఖము నిచ్చునో యదియే శ్రేష్ఠమని యొకనియమము నేర్పఱచి, అట్లు సుఖదాయకము కానట్లు కనఁబడిన రాజకీయాచారములు వర్జనీయములని ఖండించెను. ఈ సిద్ధాంతము

ముందలి వాచార ప్రాచీన సమీనవివేచనము చాటునఁబడెను. దేశసామాన్యమునకు రాజానలనఁగాని విశేషభూస్వాములు మొదలగు నమ్మరావులవలనఁగాని ప్రయోజనము లేదనియుఁ, బ్రజాప్రతినిధిపద్ధతిని రాజ్యము నడుపుటయే పరమ సుఖదాయకమనియు, ప్రతిమనుజుఁడును దనపరమసుఖమును దాను గాపాడుకొనుట స్వభావసిద్ధము గనుక ప్రజాబాహుళ్యము వారు సమష్టిసంఘ సుఖపారంపర్యమును గాపాడుకొందురుగాని యందఱిసుఖమును రాజను పేరు పెట్టుకొన్న యొక్కఁడు కాపాడుట స్వభావవిరుద్ధమనియు నీ సిద్ధాంతిరుతము. ఈతని పేరు జెరిమీ బెంథము. ఈతని సిద్ధాంతము యొక్క సత్యాసత్యములు పెట్లున్నను, నీతనివిద్యార్థికోటి యప్పుడములలోనున్న యనేకరాజకీయ దురాచారముల నీ సిద్ధాంతసాహాయ్యమున ఖండించి, వానిని రద్దుపఱచుటకు నిమిత్తము తీవ్రముగఁ బాటుపడిరి. ఇట్టిఖండన వ్యాసములను బ్రచురించుచు పత్రికలు వెలువడియెనవి. ఈ విషయములను గుఱించి వాదప్రతివాదములు సభలలో జరుగుచు రాఁగా నీ సిద్ధాంతపక్షమువారిని ఖండించు ప్రతిపక్షులే లేకపోయిరి.

ఆంగ్లేయులపూర్వాచారపరాయణులు. ఈకాలమున నపుడులోనున్న పార్లమెంటు సభ్యులను నియమించుకొనుపద్ధతి రెండువందల సంవత్సరముల క్రిందట నేర్పడినది. ఈమధ్యకాలములో దేశకాలములు విశేషముగా మార్పు చెందినవి. పార్లమెంటు సభ్యులు 1659 సం॥ లో 424 గురు ధనికులగు కొందఱిచే నియమింపఁబడి పార్లమెంటునకుఁ బంపఁబడినవారే. వీరివలనఁ దమ కష్టసుఖములను గాపాడుకొనవలసిన ప్రజలకును వీరికిని సంబంధమే లేదు. సభ్యులను నియమించు స్వాతంత్ర్యముగల పల్లెలలో నివసించువారు జీవనోపాధి నిమిత్త మెవ్వరినో యొకధనికుని నాశ్రయించుకొని యాతనిచేతి కీలుబొమ్మలవలె నాతఁడు చెప్పినట్లు నడచుకొనుచుండిరి. పార్లమెంటునకు సభ్యుఁడు గాఁగోరువాఁడెట్టిమహనీయులనుగూడఁ గట్టుకొన్నఁగాని సంకల్పసిద్ధుఁడు కాఁడు. ఇందు నిమిత్తమాతఁడు వీరికిరింద 5000 సవరనులకుఁ దక్కువఁగాకుండ వ్యయ



పెట్టవలసియుండెను. ఇంతధనము వ్యయపఱచుకొనియు, సంతుష్టులుకాక, యిట్లు సభ్యత్వమును సంపాదించుకొనువారు పార్లమెంటులోనున్న కాలములో వీరికి సంవత్సరమునకు వేయి సవరనుల చొప్పున వార్షికమిచ్చునట్లు నిర్ణయించుకొనుచుండిరి. ఇంతే కాక పార్లమెంటునకుఁ బంపవలసినసభ్యులసంఖ్యలోఁ గూడనొకచోటికిని వేఱొకచోటికిని మిక్కిలి వ్యత్యాసముండెను. స్కాట్లండువంటివిస్తీర్ణదేశమునుండి పార్లమెంటునకు నలుబదియైదుగురు వచ్చుచుండఁగా, కారన్వాలనునొక్క యాంగ్లమండలమునుండి నలువదినలుగురు వచ్చుచుండిరి. ఇట్లని స్కాట్లండులో వోటరులకుఁ దక్కువలేదు. ఐదువేలువోటర్లుండిరి. ఇంగ్లాండులోనైనను పార్లమెంటునకు సభ్యులను నియమించుకొను స్వాతంత్ర్యము విషయమున నొకచోటికిని మఱియొకచోటికిని కడు వ్యత్యాసముండెను. కొన్నిపట్టణములలో జనులు వోటుచేయు నధికారములేక మునిసిపలాఫీసర్లకుమాత్ర మీయఁబడుచుండినది. కొన్నిచోట్ల గృహస్థులందఱు కట్టిస్వాతంత్ర్యముకలదు. ఇంతేకాక వాణిజ్యము వృద్ధియై కొందఱు ధనవంతులైరి. ఇండస్ట్రివృద్ధియై ఫాక్టరీలు పెరిగినవి. కూలివాండ్రసంఖ్య బలమయ్యెను. వీరికిఁగూడ పార్లమెంటుతోఁ గొంతసంబంధమున్నయెడల దేశమునకల్లరులు లేకుండును. అట్టియవకాశము లేకపోవుటవలన వీరువిరామములేక దొరతనమువారి కాందోళనముఁ గలుగఁజేయుచుండిరి. దొరతనమువారుగాని పార్లమెంటుగాని ప్రజలమొఱలాలించకుండుటయు, దొరతనమువారు దివాణముక్రింద నమితముగా ధనము వ్యయపఱచుటయు, దుర్భరమైన దివాణపు ఋణ మొకవంక బాధించుటయు మొదలగు కారణములన్నియు గుమిగూడి మఱింత వేసటకుఁ గారణములయ్యెను. ఫ్రెంచివారురాజుపైఁ దిరుగఁబడి యాతనిని బదభ్రష్టుని జేసిన 1830-వ సంవత్సరమున నింగ్లాండులయొక్క యదృష్టవశమున నాలవ జార్జి కాలధర్మము నొందినందున, పార్లమెంటుసంస్కారమునకుఁ బ్రతికూలులైన పార్లమెంటుసభ్యు లుద్యోగములు చాలించుకొని క్రొత్తవారికిఁ జోటియ్యవలసివచ్చినది. పిమ్మట రాజ్యమునకువచ్చిన నాలవవిలియము సంస్కార

పక్షమునాఁడు. క్రొత్తగా నేర్పడిన పార్లమెంటువారును సంస్కారమున కనుకూలురే. ఈకారణములచే 1831సం॥లో లార్డుజానురసెల్ పార్లమెంటుసంస్కారణమునకై యొకబిల్లు ప్రస్తావనమునకుఁ దెచ్చెను. ప్రజలందు సంభ్రమ మెక్కుడుగా నుండెను. వేలకొలఁది పిటీషనులు పార్లమెంటులో దాఖలయ్యెను. పార్లమెంటు సభాభవనము జనులతో నిండిపోయెను. లోపల జరుగు వర్తమానములను తెలిసికొనవలెనని వేలకొలఁది జనులు వెలుపలఁ గనిపెట్టుకొనియుండిరి. కీలెనుక వేనవేలీ వృత్తాంతమును దేశమునకంతకుఁ గొనిపోవ గుఱ్ఱములెక్కి సిద్ధముగానుండిరి. పార్లమెంటునకు సభ్యులను నియమించు స్వాతంత్ర్యము ననుభవించుచున్న 60 పల్లెల కట్టియధికారమును దొలగించి, ఇదివఱకిద్దఱు సభ్యులనుబంపుచుండు నుత్రి 47 ప్రదేశములింక నొక్కొక్కనినే పంపుటకేర్పఱచియు, వెనుకనిట్టియధికారము మొదలే లేనిపట్టణములకు గొన్నిటికి 37 గురు సభ్యులనుబంచిపెట్టియు, లండను పట్టణమునకు మఱియెనమండ్రు సభ్యులనువృద్ధిచేసియు, ఆంగ్లమండలములకు 65 గురను స్కాట్లండుమండలములకు 5 గురను, ఐర్లాండు మండలములకు 3 గురను వేల్సుమండలమున కొక్కనిని సభ్యులను గ్రొత్తగానభివృద్ధిచేసియు, నీనవీన సంస్కారణము చేయుటకీబిల్లు ప్రస్తావింపఁబడెను. ఈమార్పులవలన నిదివఱకు 658 గురు గానున్న కామనులసంఖ్య 596 గురకుఁ దగ్గిపోయినది. ఇదివఱకు పట్టణములలో మునిసిపలాఫీసర్లే పార్లమెంటునకు సభ్యుల నియమించుచుండిరి, ఈబిల్లువలన నీపద్ధతి మార్పఁబడి సంవత్సరమునకుఁ బదిసవరనులపన్ను చెల్లించు గృహస్థుల కందఱ కీస్వాతంత్ర్యమియ్యఁబడినది. మొత్తముమీఁద నైదులక్షల జనుల కిందువలనఁ గ్రొత్తగా వోటుచేయుట కధికారము గలిగినది. ఈమార్పులను గూర్చి యేడుదినములు పార్లమెంటులోఁ జర్చజరిగెను. పూర్వాచార పరాయణులగు వారీ మార్పులవలన దొరతనమువారి యధికారమునకును లార్డుల స్వాతంత్ర్యమునకును భంగము కలుగునని వాదించిరి. సంస్కారపక్షమువారీ మార్పులు చాలవనియు సభ్యులకు వోట్లనిచ్చువారనగత్యమైన నిందకుఁ బాలుగాకుండను, దాము కోరిన



సభ్యునిపేరు తెలియకుండను, రహస్యముగానుండు లాగునఁ బెట్టెలో వోటు చీటియుంచునట్లు నియమ ముండవలెననియు, సంవత్సరమున కొకసారి పార్లమెంటుసభ్యులు నియమితులు కావలెననియు, సర్వజనులకును వోటు చేయు నధికారముండవలెననియు వాదించిరి. పిమ్మట నీబిల్లును పార్లమెంటులోని కామను శాఖవారి యెదుటఁ జదువుట కుత్తరు వియ్యఁబడెను. దీనిగూర్చి యభిప్రాయభేదములు మెండుగా నుండెను. లార్డులును, మతాచార్యులును, సేనాధిపతులును, నావికభటులును, కళాశాలాధికారులును, లాయరులును, యీబిల్లున కంగీకరించలేదు. వర్తకులును జనబాహుళ్యమును, నిందునకామోదించిరి. వార్తాపత్రికలు మొత్తముమీఁద బిల్లుయొక్క పక్షముగానేయున్నవి. వోట్లుపుచ్చుకొనఁగా 302 బిల్లున కనుకూలముగను 301 బిల్లునకువ్యతిరేకముగను వోట్లువచ్చినవి. తరువాత మంత్రిమండలి వారీబిల్లులోఁ గొన్ని మార్పులు కావలెనని తెలియఁ జేసిరి. ఈ మార్పులగత్యమా కాదా యని వోట్లుపుచ్చుకొనగా నగత్యమనిచెప్పిన వారికంటె నగత్యములేదనిచెప్పిన వారే 22 రెక్కువైరి అందుచే మంత్రిమండలి వారోడిపోయినందున పార్లమెంటుముగించి క్రొత్తపార్లమెం టేర్పఱచ వలసివచ్చెను. ఇందువలనఁ బ్రజలీబిల్లుయొక్క మంచిచెడ్డలాలోచించుకొని యందున కనుగుణముగాఁ బనిచేయఁగల పార్లమెంటుసభ్యులను గోరుకొనుట కవకాశము కలిగినది.

పిమ్మట క్రొత్తగా నేర్పడిన పార్లమెంటులో సంస్కారపక్షమువారధికముగానుండిరి. అందుచేనీబిల్లు రెండవసారిపార్లమెంటులోఁ జదువఁబడినప్పుడు మూఁడుదినములు చర్చజరిగి, మంత్రిమండలివారును, బిల్లునకుఁ బ్రతిపక్షులును, దెచ్చిపెట్టిన యాటంకములు నివారణములై, తుదకుకామనులచే నంగీకరింపఁబడినది. లార్డులుమాత్ర మీబిల్లునకంగీకరించక దీనిని ద్రోసివేసిరి. ఇందునకుఁ బ్రజలలోఁబుట్టిన యాగ్రహావేశమునకు హద్దులేదు. పార్లమెంటులోని లార్డులశాఖయే లేకుండఁ దీసివేయవలెనని ప్రజలు

ఘోషపెట్టిరి. బిల్లునకు వ్యతిరేకముగనున్న లార్డులను వీధులవెంబడి నడచుటకు వీలులేకుండ ముట్టడివేసిరి. 60000 మంది సంతకములుచేసి రాజునకు పిటీషనుబంపుకొనిరి. లండనులోజనులు దొమ్మిరేగి తలుపులుబ్రద్దలుకొట్టిరి. దేశమంతయు నల్లరులతో నిండియుండెను. కొంచెము శాంతనువహించిన యెడలఁ బ్రజలకోరిక నెఱవేరుననియు, పార్లమెంటుయొక్క సంస్కార ప్రయత్నమును మానుకొనుటకు దొరతనమువారుద్దేశించ లేదనియు, సమ్మఁబల్కి ప్రజలయుద్వేగమునడంచఁగొందఱు లార్డులుప్రయత్నించిరి. ఈయల్లరులు చల్లాఱువఱకు నెలదినములు పార్లమెంటుసభ ముగించఁబడెను. పిమ్మటనైనను రాజకీయవ్యవహారములనుగూర్చి దేశమునసభలుజరుగఁ గూడదని దొరతనమువారు ప్రకటనముచేసిరి. ఈబిల్లునకుఁ బ్రతిపక్షముగా వాదించిన యొకలార్డుపైఁ గవిసి బ్రిస్టలుపట్టణవాసులు ఘోరమైనదొమ్మిచేసి, పోలీసువారిని తఱిమివేయఁగా సిపాయిలదండును బిలిపించిపోరాటము సల్పవలసివచ్చినది. జయిలుఖానాలను బ్రద్దలుకొట్టి ఖయిదీలను విడుదలచేసిరి. మతాచార్యులభవనము లగ్నిహోత్రునకర్పణము చేయఁబడినవి. తుదకీదొమ్మి శాంతపఱచునప్పటికి అనేకులుహతులైరి. ఇంగ్లాండుదేశమంతటను, ఈబిల్లునకుఁ బ్రతికూలురుగానున్న మతాచార్యుల ప్రతిమలు దహనము చేయఁబడెను.

పార్లమెంటుసభ మరల 1831 సం॥ డిసెంబరు నెలలో సమకూడెను. కొన్ని మార్పులతో మూఁడవబిల్లు తేఁబడెను. కామనులసంఖ్య తక్కువ కానక్కఱలేకుండ మునుపటివలె 658 గురను నిలిపిరి. ఈబిల్లునకు కామనులామోదించిరి. లార్డులిందునకు బహుకష్టముమీఁదనంగీకరించి దీనిలోనవశ్యములైన మార్పులను జేయుటకొఱకు కమిటీవారిని నియమించిరి. కమిటీవారుచేసిన మార్పులతోఁ గూడిన బిల్లును దుదకు లార్డులయెదుటఁ బెట్టఁగా వారంగీకరించినట్లు కనఁబడలేదు. ఇప్పుడు రెండు మార్గములున్నవి. మంత్రిమండలివారి యభిప్రాయానుసారము లార్డులు బిల్లునంగీకరించనందున మంత్రిమండ



లివా రుద్యోగములను జాలించుకొనవలెను. లేదా, బిల్లున కనుకూలపక్షము వారిసంఖ్యను వృద్ధిచేయు నిమిత్తము క్రొత్తగాఁ గొందఱకు కామనులకు లార్డు బిరుదునిచ్చునట్లు రాజును వేడవలెను. క్రొత్తలార్డులను దెచ్చిపెట్టుటకు రాజున కంగీకారములేదు. అందుచే మంత్రిమండలివా రుద్యోగములనుజాలించుకొనిరి. బిల్లుప్రకారముచట్టము చేయకుండ విడువఁగూడదని కామనులు రాజును వేడికొనిరి. ప్రజాసంక్షోభ మంతకంతకు విజృంభించుచుండెను. పన్నులను చెల్లించమని నిశ్చయముచేసికొని బర్మింగాములో నొకసభయేర్పడెను. ప్రజలాయుధములను సిద్ధముచేసికొనుచుండిరి. దొరతనమువారితోఁ బ్రజలుయుద్ధమునకు దిగునట్లుసూచనలుగానవచ్చుచుండెను. అప్పుడు వేఱుమార్గము కనఁబడక, రాజుక్రొత్తలార్డుల నేర్పఱచుట కెట్టకేలకు సమ్మతించెను. బిల్లునకుఁ బ్రతిపక్షులుగానున్న లార్డులప్పుడు తమపట్టుదల నిష్ప్రయోజనమని తలఁచి బిల్లుచట్టమగుట కంగీకరించిరి. లార్డులు తెచ్చిపెట్టిన మార్పులకు కామనులుకూడ సమ్మతించిరి. అందుచేబిల్లు చట్టమయ్యెను. రాజిందునకు స్వయముగా నంగీకారమునిచ్చుట కొల్లక కమీషనరుల నేర్పఱచినందున, రాజుస్థానమున వారీచట్టమున కంగీకరించిరి. ఈక్రొత్తచట్టము ననుసరించి పార్లమెంటు యేర్పఱచుట, కనువుగా నదివఱకున్న పార్లమెంటు ముగింపఁబడెను.

పార్లమెంటుసభ్యులలో నిట్టిమార్పులను బుట్టించుటకుఁ బ్రజాబాహుళ్యమున కింతపట్టుదల యేలకలుగవలెనని వాచకులకొకవింత తోఁపక పోదు. ఆకాలమునఁ బ్రజల యూహాపోహలనుగూర్చి యోచించినఁగానియీసంశయము నివారణముగాదు. రాజ్యాంగ స్వాతంత్ర్యములును, ధనధాన్యాది యైహిక స్థితిగతులును, విద్యాసంపదయు, జనులందఱకును సమానముగ లభించినఁగాని జనబాహుళ్యమునకు సౌఖ్యముకలుగదనియు, అట్టిసౌఖ్యమును గలుగఁజేయుట కనుకూలించునట్లు రాజ్యాంగ పద్ధతు లమరియుండవలెడననియు, అట్టిపద్ధతులను నెలకొల్పుట కనుకూలమైన పార్లమెం

టుండవలెననియు, జనులందఱును సమానముగా వోటు చేసి యేర్పఱచిన పార్లమెంటట్టి పద్ధతులను నెలకొల్పవలెననియు, కొందఱు బోధకులు బోధించియు, వార్తాపత్రికలను గ్రంథములను రచించియుఁ, బ్రజాసామాన్యమునకు నాయకులైయుండిరి. అందుచే పార్లమెంటు సభ్యనియామక విషయమున మార్పులు కలిగినయెడలఁ బ్రజాదారిద్ర్య నివారకములైన చట్టములు పుట్టునని ప్రజలు కొండంత యాశ పెట్టుకొనియుండిరి. కూలివాండ్ర జీతములు తగ్గింపఁబడినయెడల నందఱును గట్టుగట్టి పనిమాని ఫ్యాక్టొరీల యధికారుల నిర్బంధించి తగినజీతము లేర్పఱచుకొను నిమిత్తమన్యోన్యసాహాయ్యసంఘము లేర్పడియున్నవి. రాజ్యాంగ వ్యవహారములను జర్చించు సంఘములు కొన్నియున్నవి. ప్రజలకు సులభముగ రాజకీయ వ్యవహారములను గూర్చి తెల్పుట కనువుపడు వార్తాపత్రిక లున్నవి. 1832 సం॥ న వెలసిన క్రొత్త చట్టము ప్రకార మేర్పడిన పార్లమెంటు వారికిఁగూడ ప్రజల సంఘములయందంతగా నిష్టము లేదు. వారి చరిత్రయు నందునకుఁ దగినట్లే యున్నది. లీడ్సు పట్టణమం దేర్పడిన యొకసంఘము వారు పార్లమెంటులో వోటు చేయుట కధికారము లేనివారు దివాణము యొక్క ఋణమును దీర్చ నక్కఱలేదని వాదించుచుండిరి. కూలివాండ్ర నాయకుఁడగు నొకఁ డొక వ్యాసము వ్రాసి కూలివాండ్రందఱును నొక నెలవఱకు పనికట్టిపెట్టవలెననియు, నంతకును బ్రజలు బుద్ధి తెచ్చుకొని ధనధాన్యములును మడిమాన్యములును నందఱకును సమముగాఁ బంచిపెట్టనియెడలఁ గూలీలు బలిమిని బంచుకోవలెననియుఁ గూలీలను హెచ్చరించెను. కూలీలకు నెట్టిపన్నులు నుండఁగూడదని యొకసంఘమువారు వాదించుచుండిరి. ఇండస్ట్రివలనఁ దయారయిన సరకులమీఁదఁగాని, యాహారపదార్థముల మీఁదగాని పన్నుగట్టుటవలనఁ గొందఱకుఁ సుఖోపకరణము లధికముగా లభించుటయు, కూలీలు దారిద్ర్య మనుభవించుటయుఁ దటస్థించుచున్నదనియు, నందుచే నిట్టిపన్నులు మాపుగావలెననియు, ఆస్తినిబట్టి పన్ను తరతరముగా నేర్పడవలెననియు, పార్లమెంటునకు సభ్యులను వోటు చేయ నధికారములేనివారికిఁ బన్నులుండఁ గూడదనియు సేనలోఁ బనిచేయ నగత్యము లేద



నియు వాదించుమఱియొక సంఘమువారు బనాలుజేసిరి. చెప్పఁబూనుకొన్న చోనట్టి సంఘములు వేనవేలుగా దేశమంతటను వ్యాపించియున్నవి. సంఘములన్నియు నేక ప్రయోజనము నిమిత్తము పాటుపడునట్లు సమావేశము చేయుటకై లండను పట్టణము వారొక (నేషనల్) జాతీయసంఘమేర్పఱచియందఱ నేకము చేయఁ బాటుపడిరి. కూలీలకోరిక లిందువలనను సఫలములు కాఁజాలవని యొక కూలీలసంఘము ప్రత్యేకముగ నేర్పడినది. న్యాయార్జితమైన యాస్తిని పవిత్రముగాఁ జూడవలెననియు మనుజులందఱు పుట్టుకచే స్వతంత్రులును సమానులును ననియు, నందుచే నైహికసుఖముల కందఱకు సమానస్వామ్యము గలదనియు, దొరతనమువారిట్టి సహజధర్మములను బాటించి శాసనములను జేయవలెను గాని కొందఱ ప్రత్యేక ప్రయోజనమును గాపాడఁగూడదనియు, నిరువదియొక్క సంవత్సరములు పైఁబడిన ప్రతిమనుష్యుఁడును దివాణము యొక్క యాదాయ వ్యయముల విషయమునఁ బని పుచ్చుకొనుట కర్హుఁడనియు, మనుష్యుని యొక్క స్థితిగతులతో సంబంధము లేకుండ, విద్యావివేక విశుద్ధవర్తనములను బట్టి పార్లమెంటు సభ్యులకు వోటు చేయు స్వాతంత్ర్యముండవలెననియు, నియమముల నేర్పఱచుకొని యీకూలీల సంఘము వారు పనిచేయుచుండిరి. అందుచే పార్లమెంటు సంస్కారపక్షమున బిల్లువిచారణమునకు వచ్చినప్పుడా బిల్లులోని నిబంధనములు చాల వనివిరాక్షేపించిరి. ఇతర కూలీలసంఘములు కూడ నీనిబంధనముల నవలంబించిరి. తుదకు 1632 వ సం॥ నఁ జేయఁబడిన చట్టమునుబట్టి సంవత్సరమునకుఁ బదిసవరనుల పన్ను చెల్లించని వారలకు సభ్యులను నియమించుకొను స్వాతంత్ర్యము లేకపోయెను. అందువన నీపన్ను చెల్లించని పట్టణవాసులకును, వ్యవసాయము విరివిగా జరుగు ప్రదేశములలోని వ్యవసాయపు కూలీలకును పార్లమెంటునకు సభ్యులను నియమించుకొను నధికారము లేకపోయినది. మడిమాన్యములుగల రయితులకు మాత్రము పార్లమెంటులో జోక్యము కలిగినది. సంస్కార దీక్షగలవారత్యావేశముచే నిట్టిలోపము లెన్నింటి నెన్నినను, 1832వ సం॥పు ఆక్టువలనఁ గలుగులాభము లనంతములు.

ఈయాక్టువలన నదివఱకు వోటుచేయు స్వాతంత్ర్యములేని యేఁబది వేలమందికట్టిస్వాతంత్ర్యము కలిగినది. పార్లమెంటులో లార్డ్సులశాఖవారు ప్రముఖులై తమయిచ్చవచ్చినట్లు ప్రజలను లోఁబఱచుకొని వారిస్వాతంత్ర్యమున కడ్డుపెట్టి సభ్యులను నియమింపఁ జేయుచువచ్చిరి. ప్రజల కిట్టియవరోధము తొలఁగిపోయెను. లార్డ్సులశాఖవారే యిదివఱకు సర్వాధికారులై యేలుచుండిరి. ఇప్పుడుప్రజానిధులతో నిండియున్న కామనుశాఖవారే సర్వాధికారులైరి. ఈ చట్టమునుగుఱించి లార్డ్సులు ప్రతిపక్షులై యడ్డము రాఁగా, రాజు ప్రజలపాలిటనుండి, క్రొత్తలార్డ్సులను దెచ్చిపెట్టి, యిదివఱకున్న లార్డ్సులనోడింపఁజలపెట్టి, లార్డ్సులను లోఁబఱచుకొన్నందున, లార్డ్సుశాఖవారి బల ముడిఁగిపోయి, ఇఁకముందు వారి గర్వమడఁచునుపాయము వెల్లడియయ్యెను. తీవ్రముగాఁ బ్రజలుపట్టుపట్టినయెడల రాజును దమపంకకుఁ దెచ్చుకోవచ్చుననియు, రాజుమూలమున లార్డ్సులను లొంగుబాటునకుఁ దేవచ్చుననియు, ప్రజలకు స్పష్టమయ్యెను. అందుచేనిఁకముందుఁ బ్రజలు రాజుయొక్కగాని లార్డ్సులయొక్కగాని యధికారమును దొలఁగఁ ద్రోయుటకుఁ బ్రయత్నముచేయక, కామనులయధికారమును వృద్ధిచేయుటకుఁ బాటుపడ నారంభించిరి. ఈకారణముచేతనే ఫ్రాన్సు మొదలగు నితర దేశములందువలె నిగ్లాండునందు దొరతనమువారియెడల జనుల కంతద్వేషము కలిగినను, రాజునుదొలఁగించుటకుఁ బ్రజలు బూనుకొనక, చిరకాలమునుండి స్థిరపడిన రాజకీయసామోపాయముల నాధారముచేసికొని రాజ్యతంత్రములను గాలానుగుణముగ మార్చుకొనిరి. కామనులను గూడఁగట్టుకొని తీవ్రముగా రాజ్యతంత్రములందగత్యములగు మార్పులను జేయించుకొనుటకుఁ బాటుపడినయెడల రాజుగాని లార్డ్సులుగాని ప్రజలకోరికల కెదురాడఁజాలరను నమ్మకము ప్రజలయందు స్థిరపడినది. అందువలననే, సంస్కారదీక్షతో నేర్పడిన ప్రజాసంఘములకు 1832 సం॥ రపు ఆక్టువలనఁ దనివితీఱకపోయినను, ఘోరకృత్యములకుఁ బ్రజలయందుఁ దిగువపుట్టక, మఱికొన్ని సంస్కారములకొఱకు నమ్మికతోఁ బాటుపడు ధైర్యముకలిగినది.



నూతనశాసనప్రకార మేర్పడిన పార్లమెంటువారగత్యములైన మార్పులను జేయుటకు సమ్మతించినవారేకనుక కొన్ని ముఖ్యములైన సంస్కారములీ రాజుకాలమున జరిగినవి. ఆంగ్లదొరతనమువారి రాష్ట్రములో నెచ్చటను బానిసతనముగాని బానిసలవ్యాపారముగాని లేకుండ నిషేధించి, యిట్టినిషేధము వలన నష్టపడినవారికి నష్టముకూడఁ దీయునిమిత్తము దొరతనమువారు 20000000 సవరనులు పరిహారద్రవ్యమిచ్చిరి (1833). నోరులేని జంతువుల బాధించువారిని దండించునిమిత్తము మిదివఱకే 1824 లో నొకచట్టము చేయఁబడినది. ఆకాలమున నెడ్లనుబోట్లాడించియుఁ గోళ్లకుఁ గత్తులఁగట్టి పందెములు వేసియు వినోదించుచుండిరి. దయార్ద్రహృదయులు భరింపరానివగుటచే నిట్టివినోదములనిషేధించుచు 1833సం॥లో నొకచట్టమునుజేసిరి. ఇండస్ట్రీవృద్ధియైనకొలఁది ఫ్యాక్టరీలేర్పడి నిర్దయగా లేఁబ్రాయమునన్న బాలురచేఁ గఠినముగాఁ బనిచేయించుచుండిరి. 13 సంవత్సరములకు లోఁబడిన వయస్సుగలపిల్లలచే దినమున కెనిమిదిగంటలకంటెను, 13-18 సం॥ల లోపు వయస్సుగలబాలురచే దినమునకుఁ బండ్రెండు గంటలకంటెను నెక్కుడుపని చేయించఁగూడదని 1833 సం॥లో నొకచట్టము చేయఁబడెను.

హిందూదేశమునందువలె నింగ్లాండునందు యాచ్ఞావృత్తిలేదు. ఎలిజబెత్తురాణికాలమందు దారిద్ర్య మెక్కువకాఁగా, నే యూరిపేదల నాయూరివారే పోషించుకొనవలెనని చట్టము చేయఁబడెను. సోమరులను బలవంతపెట్టిపనిచేయించుటకును, గ్రామస్థులకుఁ బేదలనిమిత్తము పన్నుగట్టి దానినిగూర్చి పేదల పోషణార్థముపయోగించుటకును నిబంధన మేర్పఱుపఁబడెను. కొన్నిగ్రామములలో నిట్టియేర్పాటులనుకూలముగా జరుగుచువచ్చుటచే, నంతసదుపాయము లేనిగ్రామముల పేదలట్టిగ్రామములందుఁ జేరుచువచ్చిరి. ఇందువలన నీకడపటిగ్రామస్థులకు భారమధికముకాఁగా నొకయూరిపేదలు మఱియొకయూరికిఁ బోకుండ నియమములేర్పడెను. అందుచేఁ గూలిచేసికొని జీవించునుద్దేశముతోఁ గూడఁ బేదలొకచోటినుండి

మఱియొకచోటికిఁబోవుట కాటంకముగలిగెను. ఫ్రెంచివారితోడి దీర్ఘకాల యుద్ధదినములందు క్షామమధికమైన కొలఁదినీ నిబంధనములు దుర్భరము లయ్యెను. అప్పుడు దేశమున నక్కడక్కడ బయలువెడలుచున్న ఫ్యాక్టొరీలకు విస్తృలవిషిగాఁ గూలిపనినిమిత్తము బోవునట్లుచట్టములుచేయించుకొనఁ బాటుపడినయెడలఁ గొంతభారము తగ్గియుండును. గ్రామస్థుల కీయుపాయము తోఁచక, ఆహారపదార్థముల ధరలనుబట్టియుఁ జీవసంసారికుండు కుటుంబభారమునుబట్టియు నుపకారవేతనములనిచ్చుట కారంభించిరి. పేదలకుఁ గాయకష్టముచేసి జీవించవక్కఱలేకుండ నన్నదాన హిరణ్యదానములిచ్చుట మనదేశమునాచారమువలనసోమరిపోతులు పెరిగినట్లే, యీయుపకారవేతనముల వలన దేశమందు మితవ్యయము, ముందుచూపు, కలిగినంతలోఁ గడపుకొనుట, మొదలగు గృహస్థధర్మము లడుగంటినవి. కుటుంబమును బోషింపఁగల సామర్థ్యము నాలోచించుకొనక పాటకజనులు కండ్లుమూసికొని వివాహము లాడి సంతానవృద్ధిచేసి భూభారమును బెంచుచుండిరి. కూలి యెక్కువగ నున్నదని భూస్వాములు కూలీలనుమాన్పించి, కూలిలో రెండువంతులు మాత్ర మిచ్చి పనిచేయించుకొనుచుండిరి. తక్కువపడిన మూఁడవవంతు గ్రామాధి కారు లుపకారవేతనముల క్రింద నిచ్చుచుండిరి. ఈ దురాచారములవలనఁ బన్నిచ్చువారు దరిద్రులగుటయు, దరిద్రులాత్మగౌరవములేక పరాన్నభక్షకులగుటయుఁ దటస్థించెను. అందుచే దొరతనమువా రీదురాచారమును మాన్పుట కుపాయముల నాలోచించునిమిత్తము కమీషనరుల నేర్పఱచిరి. వారిరిపోర్టు ననుసరించి యొకచట్టము (1834) చేయఁబడెను. ఇంతటనుండి దొరతనమువారే యీ వ్యవహారమును సమర్థించిరి. గ్రామమునకొక్కటి చొప్పుననున్న ధర్మసత్రములను దీసివేసి, కొన్నిగ్రామముల నొకయూని యనుగాఁ జేసి యూనియనుకొక్కటిచొప్పున ధర్మసత్రముల నేర్పఱచి, వానిని గాపాడునిమిత్తమొక బోర్డువారిని నియమించిరి. దృఢకాయులగు పేదలకు సాహాయ్యవేతనములనిచ్చు నాచారము మాన్పఁబడినది. కాయ కష్టముచేసికొనఁగలిగిన కూలివాండ్రు కష్టార్జననిమిత్త మన్యగ్రామములకుఁ



బోవుట కాటంకములేకుండఁ దొలఁగింపఁబడెను. నానాఁటి కినుపకర్మి దారులు విరివియైనకొలఁది కూలివాండ్రు ఫ్యాక్టొరీలున్న చోటులకు మూగిరి. అందుచే నదివఱకధికముగా జీతములుపుచ్చుకొన్న కూలీలకు జీతములు తక్కువయ్యెను. ఇంతవఱకు దొరతనమువారివలన ధనసాహాయ్యమును బొందుట కలవాటుపడిన పేదలకిప్పుడు పాటుపడి స్వతంత్రులై జీవించుటయు, లేనియెడల ధర్మసత్రములకుఁబోయి యచ్చట బహుకష్టమైన కూలిపని చేయుచుసగమాకలిగానన్నముగుడుచుటయు రెండేమార్గములేర్పడియుండెను.

ఇట్టి కాయకష్టముల కలవాటుపడినవారు కాకపోవుటచేతను, ధాన్యాదులనుగుఱించి చట్టములు కఠినముగానుండుటచేతను, పేద లుదరపోషణార్థము కడుబాములపాలైరి. దైవవశమున 1834-36 సం॥లలోఁ బంటలు పుష్కలముగా ఫలించినందున, దేశముకొంత సుభిక్షముగనే యుండెను గాని కిమ్మటఁ దటస్థమయిన క్షామోపద్రవ మైదువత్సరములవఱకుఁ బ్రజలను మిక్కిలి బాధించెను. 1837 సం॥ లో విలియము స్వర్గస్థుడైనందున, మూఁడవజార్జి యొక్క తృతీయపుత్రిసంతానమగు విక్టోరియామహారాజ్ఞి పదునెనిమిదేండ్ల ప్రాయమున సింహాసనమునకువచ్చెను.

నుత్తరప్రత్యుత్తరములనుజరుపుకొనుటకుసామాన్యప్రజలకుఁ గష్టముగా నుండెను. ఉత్తరముచేరవలసిన స్థానముయొక్క దూరభారములతో నిమిత్తములేకుండ స్వల్పమొత్తమును టపాకూలిగా నేర్పఱచుటవలన వర్తకము వృద్ధియై, యుత్తరప్రత్యుత్తర సౌకర్యము కలిగెను. ఇంతవఱకును బ్రజల విద్యాభివృద్ధినిమిత్తముదొరతనము వారుధనము వెచ్చింపనెఱుఁగరు. 1835 సం॥ లో పార్లమెంటువారీపనికిఁ గ్రొత్తఁగాఁ బూనుకొనిరి. పాఠశాలలందు జరుగుచున్న విద్యాభ్యాసము యుక్తముగా జరుగునట్లు నడపించుటకు 1839సం॥ లో నినస్పెక్టరులను నియమించిరి. రాజ్యమునందలి ప్రజలకందఱకును జరుపునేర్పాటు దొరతనమువారిది యని విద్యాధికులు బోధించుచుండిరి. ఆకాలమున నిట్టివ్రాతలు విపరీతముగాఁ దోఁచెనుగాని నేఁటికిసర్వజనుల విద్యాభ్యాసవిషయమునఁదగు నేర్పాటులు చేయఁబడెను.

విక్టోరియారాణి సింహాసనమునకు వచ్చిన మొదటి యైదువత్సరములును దేశమందు క్షామమత్యుత్కటముగ నుండెను. కాయకష్టజీవులగు కూలివాండ్రదుర్గతి మేరమీఱెను. పంటలుక్షీణించుటచే దుర్భిక్షము వృద్ధియై ధాన్యముల ధరలు హెచ్చెను. ఉదరపోషణార్థమై కూలీలు ఫ్యాక్టరీల చుట్టును గుంపులు గుంపులుగా మూఁగుటచేత వాసయోగ్యములైన వసతులు లేక జనసమ్మర్దమెక్కుడై వ్యాధులును దరిద్రతయు నధికములయ్యెను. ఫ్యాక్టరీ యధికారులనేకక్రూరోపాయములను బన్ని కూలీలను జీతబత్తెములియ్యక బాధపెట్టుచుండిరి. ఫ్యాక్టరీలలోను గనులలోను బనిచేయుకూలీలుపడు బాధలు వర్ణింపశక్యముగాకుండెను. వీరిదుర్గతిని బరిశీలించి రిపోర్టు చేయుటకు కమీషనులేర్పడెను గాని యారిపోర్టులఁజూచియు పార్లమెంటువారేమియుఁ జేయ లేకపోయిరి. కూలీలకుపార్లమెంటులో సభ్యత్వము దొరికినయెడలఁ దమబాధలుతొలఁగవచ్చుననియుఁ, గూలీలు పార్లమెంటుసభలో నున్నయెడల ధనవంతులనొద్ద ప్రోగుపడియున్న మడిమాన్యములును ధనధాన్యములును బేదలకు బంచిపెట్టవలెననియుఁ గూలీలు తలఁచుచుండిరి. ఆకాలమున నింగ్లాండు



స్కాట్లాండు, ఐర్లండు దేశములలో నిజవసంఖ్యలో 6023752 గురు యుక్తవయస్సువచ్చిన పురుషులుండిరి. ఇందులో 839519కి మాత్రము వోటుచేయు నధికారముండెను. కొన్నిచోట్ల 2011గురు వోటరులిరువదిమంది సభ్యులను నియమించుచుండిరి. మఱికొన్నిచోట్ల 86072 గురు వోటరులున్నఁగాని యిరువదిమందిసభ్యులేర్పడరైరి. ఈసంగతుల నాధారము చేసికొని 3000 మందిలండనుపురవాసులు సభకూడి యాఱువిషయములలో పార్లమెంటు పద్ధతి మార్పు కావలెనని యొకచార్టరులిఖించి పార్లమెంటువారికిఁ బంపుకొనిరి. యుక్తవయస్సువచ్చిన ప్రతిపురుషునకును వోటుచేయు నధికారముండవలెననియు, పార్లమెంటులో సభ్యుఁడగుటకువసతి యుండనక్కఱలేదనియు సంవత్సరమున కొకసారి పార్లమెంటునకు సభ్యులు నియమింపఁబడవలెననియు, సభ్యులను నియమించుటకు వోటరులసంఖ్య దేశమంతటను సమముగానుండవలెననియు, పార్లమెంటులోఁ బనిచేయు [illegible] జీతములేర్పడవలెననియు, వోటరులు [illegible] సభ్యుల పేళ్లు తెలియకుండ వోటుల నొకపెట్టెనుంచునట్లొక యేర్పాటు కావలెననియు, నీచార్టరుపత్రికలోని యాఱు విషయములై యున్నవి. విక్టోరియాకుఁ బూర్వము నాలవవిలియముయొక్క రాజ్యపాలనసమయమున లండను కూలీలసభ (London Working Men's Association), వారీచార్టరునులిఖించి తమలో నార్వుర నొకకమిటీగా నేర్పఱచి సంస్కారపక్షమువారగు నాలుగురు పార్లమెంటు సభవారితోఁ గూడి యీ యాఱువిషయములను గుఱించియు నొకశాసనమును బుట్టించుకొను బిల్లును వ్రాయుటకు వారినినియమించిరి. 1838 సం॥ నొకబిల్లు సిద్ధముచేయఁబడి ప్రచురింపఁబడెను. దీనిని బట్టి చట్టమును జేయించవలెనని ప్రజలు చేసిన ప్రయత్నములు ప్రారంభదశలో నల్లరులకుఁ జోటియ్యక కొన్ని కట్టుబాటులకు లోఁబడి గౌరవనీయముగా నుండెను. ఈ బిల్లులోని నిబంధనములననుసరించి చట్టము పుట్టినంతమాత్రముచేతనే దేశమునకు క్షేమము కలుగదుగదా! ఆ నిబంధనములవలని లాభములను గ్రహించి వానివలనవచ్చు లాభమును బొందుటకుఁ దగినవివేకమును గార్యదక్షతను బ్రజలు నేర్చుకొనవలెను.

అందుచే నిట్టి ప్రయత్నములందుఁ బాటుపడుచున్న ప్రజానాయకులు కూలీలకు విద్యావివేకములు గలుగఁజేయుటకు గ్రంథమాలములను వార్తాపత్రికల మూలమునను బాటుపడుచుండిరి. యుక్తప్రవర్తనము గలిగి త్రాగుబోతుతనము లేక నీతిమంతులగు కాయకష్టజనుల నొకచోటఁ జేర్చి వారికి పుస్తకాగారముల (libraries) నేర్పఱచి వారికి జ్ఞానోపదేశమును గలుగఁజేయుచుండిరి. ఈ సంఘములలో రాజకీయవ్యవహారములను గూర్చి వాదప్రతివాదములు జరుగుచుండెను. కల్లంగములలోఁ జేరినందునను శిక్ష లేర్పడియుండలేదు. ఇట్టినియమములకు లోఁబడి ప్రజలు నివసింపవలసియుండుటచే చట్టములలో స్వాతంత్ర్యములను గురించి యెన్నిమార్పులు జరిగినను లార్డులనుగాని ఫ్రాన్సుదేశమునందువలె నడపవలసిన స్వతంత్రపరచుచున్నది. రాజుయొక్కయు లార్డులయొక్కయు [illegible] గడగట్టించి ప్రజాస్వాతంత్ర్యమున కనుకూలముగాఁ [illegible] వ్యవస్థను [illegible] స్టుకొనిరిగాని ఫ్రాన్సుదేశస్థు లట్టి రాజనీతి [illegible] పడకపోవు [illegible] పుటచే నన్యోన్య సమరసముతోఁ జేసుకొనిన రాజ్యవ్యవస్థలని నియమించుకొన సుఖమైన రాజకార్యములను జక్కఁజేసుకొనలేక యుండెను. మన్నింపరదండోపాయములకుఁ దలయొగ్గవలసినవారైరి. కాఁబట్టి యీకాలమునఁ బ్రజానాయకులు కూలీలను నీతిమంతులనుగాఁ జేయుటకుఁ దలపెట్టిన మార్గములు కడుశ్లాఘనీయములనుటకు సందేహములేదు. పార్లమెంటుసభవారెప్పటికైనఁ దమకోరికల నెఱవేర్తురను పూర్వవిశ్వాసము ప్రజానాయకుల కుండెను. కాని, నానాటికిఁ బ్రజల దారిద్ర్యము వృద్ధియగుచుండుటచేతను, పార్లమెంటుసభవారు ప్రజలమొఱ లాలింపకుండుటచేతను, కూలీల సభలలో పార్లమెంటునెడల విశ్వాసము తొలఁగిపోయి ప్రవక్తలు తెగువతో మాటలాడ మొదలుపెట్టిరి. సామోపాయములను విడిచిపెట్టి దండోపాయములను జేపట్టినఁగాని కార్యసాఫల్య మగునట్లు వారికిఁ దోఁచలేదు. విద్యావివేకములను వృద్ధిఁజేసికొని నీతివంతులై సురాపానాది దురాచారములను విడనాడవలెనను సాత్విక ధర్మములను విడిచి



పెట్టి, సర్వోపాయములచేతను పార్లమెంటునిర్మాణములోఁ బైనిచెప్పఁబడిన విషయములను గూర్చి మార్పులను బొందవలెనని కూలీలు బద్ధకంకణులైరి. ఈయుద్దేశములతో నగరపట్టణములందు రాజకీయసభలు తలలెత్తి యంత్రకంపమువలె వ్యాపించి భయాకంపములను బుట్టించుచుండెను. నానాఁటికిఁ గూలీలయుద్దేశములు భయానకములగుచు వర్తకులను గూడఁ బ్రాకెను. వార్తాపత్రికలకిదియే ప్రస్తావనాంశముగ నేర్పడెను. సామోపాయములనే నమ్ముకొనియుండినవారందరు వీరిప్రయత్నములు కాలక్రమమున నెఱవేరియుండును. అంతవఱకు శాంతములేక వీరిలోఁగొందఱు దండోపాయముల శరణుసొచ్చిరి. 1838-42 సం॥ వఱకు ననేక సభలలో వీరియుద్దేశములు చర్చింపఁబడి ప్రసిద్ధమగుచు వచ్చెను. ఇవను దేశమందలి సంస్కారపక్షమువారుగాని పూర్వాచార పక్షమువారుగాని యీకూలీలప్రయత్నములకు సాహాయ్యము చేయుటకుఁ బూనుకొనక పోవుటచేతను, వీరనిగ్రహమయిన మార్గమున నడచి గౌరవనీయముగఁ బనిచేయు ఘనపురుషులు లేనందువలనను, వీరిసభలు దొమ్మికిదిగి పార్లమెంటుసభవారి యాదరమును సంపాదించుకొనలేకపోవుటచేతను, వీరియెడ దొరతనమువారికంతగా లక్ష్యము కలుగదయ్యెను. లక్షలుగను కోట్లుగను సంతకములతో నిండిన పిటీషనుల నెన్నింటిని వీరుపార్లమెంటు సభవారికిఁ బంపుకొన్నను, వారిచే నవి చులకనగాఁ జూడఁబడెను. 1842 సం॥లో పార్లమెంటునకు వచ్చిన పిటీషనులో ముప్పదిలక్షల మంది సంతకములుండెను. దొరతనమువారియెడ మిక్కిలి నిందాస్వభావముగల మాటలతో నీపిటీషను వ్రాయఁబడుటచే పార్లమెంటు సభవారు దీనిని పుచ్చుకొనక నిరాకరించిరి.

ఆంగ్లేయ వర్తకులకును వస్తునిర్మాణకులకును దగుప్రోత్సాహము కలిగించునిమిత్తము విదేశములనుండి దిగుమతియగు వస్తువులమీఁద కఠినముగాఁ బన్నులు కట్టఁబడెను. దేశమందు పంటలు తక్కువగుటచేతను విదేశములనుండి వచ్చునాహారపదార్థముల మీఁదపన్ను విశేషముగానుండుట

చేతను, ప్రజల కేకభుక్తికైన వోరకక భాగ్యపసుముంచుట నుండి 1842సం॥లో 750 తిను బండారపు వస్తువులమీఁద దిగుమతిపన్ను తగ్గింపఁబడెను, దీని వలన దివాణమునకు రాఁబడి తగ్గినందున పార్లమెంటు సభవారయిదుసంవత్సరములు మాత్రము వసూలు చేసెదమని వాగ్దానముచేసి, ఇన్కంటాక్సు పన్ను క్రొత్తగాఁ గట్టిరి.

ఐర్లాండు నింగ్లాండుతోఁ గలిపి యిర్లాండునుండి యాంగ్లపార్లమెంటునకు సభ్యులను రప్పించుట కిదివఱలో నేర్పాటు చేయఁబడెనని చెప్పియుంటిమి. ఆంగ్లదేశ వ్యవహారముల కుంగల నైర్లాండు దేశ రాజకార్యములు కడు న్యూనములై యుండుటచేతను, పార్లమెంటులో నధిక సంఖ్యాకులుగా నున్న యాంగ్లసభ్యుల కైర్లండు వ్యవహారములందు శ్రద్ధలేకపోవుటచేతను, నైర్లండుదేశవ్యవహారములనుజక్కఁబెట్టుట కా దేశమునందే వేఱుగ నొక పార్లమెంటేర్పడవలెనని వాదించువారు కొందఱు బయలుదేరిరి. వీరిని నడపిన నాయకుఁడు సామోపాయములనే యవలంబించి బోధించుచుఁ గొంతకాలము పని చేయఁగా నీతని ప్రయత్నములు సఫలములు కాకుండుటఁ జూచి 1842 సం॥లో యౌవనపురుషులుకొందఱుయౌవన సంఘములోఁ జేరి దండోపాయములను బోధింపసాగిరి. 1843సం॥లో ననేకలక్షలజనులు కూడినసభలో నైర్లాండునకుఁ బ్రత్యేకపు పార్లమెంటేర్పడి, యాంగ్లపార్లమెంటునకు లోఁబడకుండ స్వతంత్రముగ రాజకార్యములను నెఱవేర్పవలెనని పట్టుదలతోఁ దీవ్రముగ సంభాషణములు జరుగఁగా నాసభలోని ప్రముఖులను రాజద్రోహపు నేరమునకు క్రిమినలు కోర్టులో విచారణము చేసిరి. తుదకీవిచారణములో వీరికి విడుదలయినను, ప్రజలకు భీతికలిగి వారి యుద్యోగ మడఁగెను.

1842 సం॥ లో నాహార సంబంధములైన దిగుమతి సరకులమీఁదఁ జాలవఱకుపన్ను తగ్గించఁబడినను, ధాన్యాదులమీఁదవిధింపఁ బడిన పన్నులు మాత్రము తగ్గింపఁ బడలేదు. అందుచేఁ బేదలకుఁ గూటికిఁ గఱవయ్యెను. ఈకఠినపుపన్నుల వలన వ్యవసాయపుదారులును భూస్వాములును భాగ్యవంతు



లైరి. ఆకాలమునఁ బ్రధాని యీ దుర్భరంపుపన్నులను దొలఁగింపఁ దలఁపు గల్గియు, పార్లమెంటులోని భూస్వాములయు సేద్యగాండ్రయుఁ బ్రతికూల ప్రయత్నములవలన నేమియుచేయలేక పోయెను. అంతట 1845 సం॥ లో నైర్లండు దేశస్థుల ప్రధానాహార ద్రవ్యమగు నురలగడ్డల పంటకుఁ దెగులుగొట్టుటచే క్షామము మిక్కుటమయ్యెను. దిగుమతిధాన్యాదులమీఁదఁ బన్నులను దీసివేసినయెడల, ధరతగ్గి కొంతక్షామము మట్టుపడునని ప్రధాని పార్లమెంటుసభవారికి నచ్చచెప్పి బహుకష్టము మీఁద 1846 సం॥ లో నీక్రూరములైన పన్నులనుదీసివేసెను. ఇంతటితో నీకష్టములు గట్టెక్కలేదు. ఏఁబది వత్సరములలో నైర్లండు ప్రజలు 5000000 గా నుండువారు .800000 గానయిరి. ఇంతజనవృద్ధికిఁ దగినట్లు ధనాకర్షణ సాధనములు వృద్ధి కానందున దారిద్ర్య మెక్కువయ్యెను. 1846 సం॥ లోఁ గూడ నురలగడ్డలపంటకుఁ దెగులు గొట్టినందున 4000000 మంది కూటికి మొగమువాచిరి. జనవృద్ధియయినకొలఁదిఁ, కుటుంబభారము వహించుటకుఁ దెరువుగానక పేదసంసారులు, భూస్వాముల నాశ్రయించి స్వల్పముగా భూములను గుత్తకుఁ గొని తమ కుటుంబ పోషణమునకుఁ జాలినను లేకున్నను భూముల పంటకు మించిన నధాయిచ్చుట కొడఁబడి చిన్నచిన్న సేరీలు సాగుచేయుచువచ్చిరి. ఈ సేరీలు పండని వత్సరములలో జీవనాధారమునకుఁ దప్పి సేద్యగాండ్రు క్షుధార్తులగుచుండిరి. వేలకొలఁదిజనులీ 1845-1846 కఱవులలోఁ జచ్చిపోయిరి. దొరతనమువారు కఱవు మరమ్మతు లారంభించిరి. అదియుఁజాలక 1847 సం॥ లో వంటశాలలను దేశమంతటను బెట్టించి యాహారము పంచిపెట్టిరి. ఇప్పటికే వేనవేలు క్షామదేవత వాతఁబడినందున దొరతనమువారిపైఁ బ్రజలకు ద్వేషము వేళ్లుపాఱెను.

కఱవుదినములు గడచినతరువాత, సేద్యభూములను జిన్న సేరీలుగాఁ బంచి యమరికము చేయుటవలన, కర్షకులకుఁదగిన ప్రతిఫలము దొరకక దారిద్ర్యమునకు దారి తీయుచున్నట్లు కనిపెట్టి భూస్వాములు కర్షకులను

వెడలఁగొట్టి భూములను స్వాధీనము చేసికొన నారంభించిరి. హిందూ ధర్మ ప్రకారము పుట్టినతోడనే కుటుంబమాస్తియందుఁ బుత్రునకుఁ దండ్రితో సమానస్వామ్యము గల్గినందున నభియోగము వేసి పుత్రుని సగపాలు పంచుకొను నవకాశము కలుగుచున్నది. సోదరులందఱును సమానముగాఁ గుటుంబమాస్తి పంచుకొనుటకర్హులు. పాశ్చాత్యుల ధర్మప్రకారమట్లుకాక జ్యేష్ఠపుత్రునకే తండ్రియాస్తి వారసత్వముచే సంక్రమించును. అందుచే నొకప్పుడు విస్తారము మాన్యములనుగలిగియున్న వంశములో మనదేశమునందువలె రెండు మూడు తరముల నాటికావనతులు ఖండ ఖండములుగాఁ జీలిపోవుటకుమారుగా, నింగ్లాండు మొదలగు దేశములందు వంశ పరంపరముగా జ్యేష్ఠానుక్రమమున విశేషవసతులొక్కొక్కని యందే నిలిచియుండును. అందుచే స్వల్పపు సేరీలపద్ధతియందు దోషములు గనఁబడిన యీ కాలమందు భూస్వాము లట్టి సేరీలను రూపుమాపి సేద్యగాండ్రను వెడలఁగొట్టుట కవకాశము కలిగినది. ఇట్లు లక్షలకొలదిగా వెడలఁ గొట్టఁబడిన సేద్యగాండ్రు దొరతనమువారి యెడను భూస్వాములయెడను స్థిరవిద్వేషులై యమెరికా దేశమునకు వలసపోయిరి. కొందఱు దేశమందేయుండి దొరతనమువారిపైఁ దిరుగఁబడి యోడిపోయి యదాయదలై నలుగడలకుఁ బాఱిపోయి (1848) కొండొకనికిఁ బట్టువడి విదేశవాస దండనమునకుఁ బాత్రులైరి.

ఈ పాడు 1848 సం॥ లో యూరోపా ఖండమంతయు నల్లరులతో నిండియుండెను. జనులందఱకును పార్లమెంటు సభ్యులను నియమించుకొనుటకు స్వాతంత్ర్య మియ్యనందుకు ఫ్రాన్సుదేశస్థులు రాజును దేశమునుండి వెడలనడచి ప్రజాప్రభుత్వపద్ధతిని నెలకొల్పిరి. ఆస్ట్రియాలోఁ బ్రజలాయుధములను ధరించి చక్రవర్తిపైఁ దిరుగఁబడి స్వాతంత్ర్యములను సంపాదించుకొనఁ బోరాడుచుండిరి. ఆస్ట్రియాచక్రవర్తి స్వాధీనములోనున్న యిటలీలో జనులు ప్రభుత్వమువారి నెదుర్కొని వారినిఁదఱిమి స్వతంత్రులగుటకుఁ బ్రయత్నించుచుండిరి. ఖండఖండములుగా విడిపోయి చిన్నచిన్న రాజులకు లోఁబడియున్న జర్మను రాష్ట్రములోఁ బ్రజలీ రాజమండలిని దొ



లఁగించి రాష్ట్రసమష్టిమీఁద ప్రజాప్రతినిధుల యాధిపత్యమును స్థాపించుకొనుటకుఁ బాటుపడుచుండిరి. ఈ యలజడిలో నాంగ్లకూలీ లూరకుండఁజాలక పార్లమెంటున కొక పిటీషనుబంపి 5000 మందితో నాయుధ సహితముగా పార్లమెంటు మీఁదకు దాడివెడలెదమని భయపెట్టిరి. వీరియల్లరిని సహించనివారై కృషివాణిజ్య జీవనులగువా రాయుధములనుధరించి దొరతనమువారిపక్షము వహించి రెండు లక్షలమంది పోగుపడిరి. వీరినిఁజూచి కూలీల సైన్యమువారు భయభ్రాంతులైరి. వారినాయకుఁడు తలదాఁచుకొనెను. నాటనుండియుఁ గూలీలపీడ చాలవఱకు మట్టుపడెను. ఐరోపాయందు స్వాతంత్ర్యముకొఱకుఁ బాటుపడిన దేశములగతియు నిట్టిదేయయ్యెను. ఇటలీ, ఆస్ట్రియా, జర్మనీదేశములందలి ప్రజాప్రయత్నము లాయాయిరాజులవలనఁ దుదముట్టింపఁబడెను. ఫ్రాన్సుదేశమందుఁ బ్రజాప్రతినిధులవలన రాజ్యము నడపుకొనలేక ప్రజలు నెపోలియను సంతతివాని నొకనిని ప్రెసిడెంటుగా నేర్పఱచుకొనిరి. అతఁడు ప్రజాప్రతినిధులను జంపివేసి, స్వాతంత్ర్య రక్షణార్థ మాయుధములను జేపట్టినవారి నందఱను సంహరించి నిరంకుశుఁడయ్యెను.

స్వదేశమందును విదేశములందును నల్లరులిట్లు మట్టుపడుటచే సర్వజనులును బరస్పర కలహములులేకుండ మైత్రితో నుండఁదగినకాలము వచ్చినదనియు, నొక దేశమునకును మఱియొకదేశమునకును వైరకారణములు పొసఁగినప్పుడు పూర్వమువలె యుద్ధమునకు డీకొనక యితరరాజుల పంచాయితీ తీరుమానమునకుఁ గట్టువడి సఖ్యపడుదురనియు జనులు తలంచుచువచ్చిరి. దేశమునందలి పనివాండ్రకుఁ బ్రోత్సాహము కలిగించుటకు వివిధదేశముల నుండి చేతిపనులను శిల్పనైపుణ్యమును దెలుపు వింతవస్తువులను దెప్పించి 1851 సం॥ లో వస్తుప్రదర్శనము చేసిరి. నీటియావిరియొక్క శక్తివలన నోడలను బండ్లను నడపుటకు జనులు నానాటికలవాటుపడిరి. జనులలోరాకపోకలు వృద్ధియై వాణిజ్యము హెచ్చినది. ఆ కాలమున పొగబండి గంట కెనిమిది మైళ్ళు చొప్పునఁ బోవుచుండెను. ప్రతినూతన విషయమునకును బూర్వా

చారపరాయణులు వెనుకంజవేయుచుండుట సహజము గనుకఁ గొంతకాలమా బండిపై నెక్కుటకే కొందఱు వెఱచుచుండిరి. 1844-45 నాటి కిట్టి మూఢభిప్రాయములు మారిపోవుటచే నింగ్లాండున నలుగడల నినుపదారు లల్లుకొన్నవి. ఫ్యాక్టరీలలోని కూలీల దుర్గతినిగూర్చి యిదివఱకు వ్రాసియుంటిమి. మొగవారు కూలి పనిచేయుకాలములో సగముకాలమే యాడువారును బాలురును గూలిపని చేయునట్లును, బదునెనిమిది వత్సరములకులోఁబడిన యాఁడుగల బాలురు దినమునకుఁ బండ్రెండు గంటలకంటె నెక్కుడుకాలము పనిచేయఁగూడదనియు, బాలురను స్త్రీలును గనులలో భూమిక్రిందఁ బనిచేయఁగూడదనియు 1832-52 సం॥ లలోఁ గూలీల సంరక్షణార్థము చట్టములు చేయఁబడెను.

ఆ కాలమున టర్కీదేశపురాజు బలహీనుఁడై యుండెను. గిల్లికజ్జా పెంచి రష్యారాజు టర్కీరాజు నోడించి యాతనిదేశము నాక్రమించుకొనవలెనని సమయము వెదకుచుండెను. టర్కీదేశములోని క్రైస్తవులు స్వల్పవిషయములందు వివాదములు పెంచుకొని రెండుతెగలుగా విడిపోయిరి. టర్కీరాజువీరిలో నొకతెగవారి పక్షమునుబట్టెను. దీనినిఁ గనిపెట్టి రష్యారాజు రెండవతెగవారి పక్షమును జేపట్టి టర్కీరాజుతోఁ గయ్యమునకుఁ గాలుద్రువ్వెను. అట ఫ్రాన్సుదేశమున నిరంకుశాధికారము వహించియున్న నెపోలియను యుద్ధములో మహావీర ప్రతాపమును జూపి ప్రఖ్యాతి నొందవలెనని సమయము వేచియున్నందున టర్కీరాజుతోఁ గూడెను. ఇంగ్లాండున కీ యుద్ధములో జోక్యముకలుగఁజేసికొని రష్యాతోడ వైరము పెంచుకొన నిష్టములేదుగాని 1853 వ సంవత్సరాంతమున రష్యాచక్రవర్తి టర్కీరాజుతో యుద్ధప్రకటనము చేసినప్పు డాంగ్లేయులు ఫ్రాన్సురాజుతోఁ గలిసి రష్యామీఁదికిఁ గవియవలసి వచ్చెను. నెపోలియనుతోడి యుద్ధము ముగిసిన నలువది సంవత్సరములనుండి యుద్ధప్రమేయ మాంగ్లభటులకు లేకపోవుటచేతను, ఫ్రెంచిభటులు యుద్ధభారము నాంగ్లేయులమీఁదికిఁద్రోచి ముమ్మారముగాఁ బనిచేయకపోవుటచేతను, ఆంగ్లేయులు రష్యావారిని వెనువెంట



నడచలేక 1855 సం॥ వఱకును నొంటరిగాఁ బోరాడవలసి వచ్చినది. ఆ సంవత్సరమున రష్యావారు పూర్ణముగా నపజయము నొంది ఫ్రెంచివారితోడను, ఆంగ్లేయులతోడను సంధిచేసికొనిరి (1855)

హిందూదేశమునకుఁ బరరాజులు దండెత్తి వచ్చుటకుఁ గాబూలు, ఆఫ్గనిస్థానము, నను దేశములు ముఖ్యమార్గములు. ఫ్రాన్సుదేశస్థులుగాని, రష్యాదేశస్థులుగాని మధ్యధరాసముద్రమును దాటి ఈజిప్టు, టర్కీ, పరిషియా దేశములగుండ కాబూలు, ఆఫ్గనిస్థానములమార్గముననిండియాకుఁ జేరవచ్చును. ఈశత్రువులనుండి యిండియాను గాపాడుకొనుటకు నాంగ్లేయు లనేక ప్రయత్నములు చేయుచువచ్చిరి. నెపోలియను టిప్పుసుల్తానునకు సాహాయ్యమునుబంపి యాంగ్లేయులనిండియా నుండితఱుమవలెననితలపెట్టియుండుగా నీజిప్టును స్వాధీనము చేసికొనఁగా, నాంగ్లేయు లాతనిప్రయత్నములను విఫలీకరించిరి. రష్యారాజున కిదివఱకే పరిషియాదేశమునఁ గొంతభాగము స్వాధీనమయ్యెను. ఇందునకుఁ దోడుగా టర్కీదేశమునుగూడ స్వాధీనము చేసికొను నుద్దేశముతోఁ బయిని వివరింపఁబడిన క్రిమియాయుద్ధమును బ్రారంభింపఁగా నాంగ్లేయులాతనితోఁ బోరి యోడించిసంధిచేసికొనిరి. ఇప్పుడు పరిషియాదేశమున నారాజు తన సభాకూటముననున్న యాంగ్లమంత్రి నవమానపఱచి యాఫ్గనిస్థానము మీఁదికి దాడివెడలెను. పరిషియాదేశములో రష్యావారు సామంతులై యుండుటచే, పరిషియాప్రభువు హిందూదేశమునకు దండయాత్ర నడపుట కాంగ్లేయులుసహింపక, హిందూదేశమునుండి సేననుబంపి పరిషియాలో దక్షిణభాగ మాక్రమించుకొనిరి. ఇంతటితో పరిషియాప్రభువు బుద్ధితెచ్చుకొని యాంగ్లేయులతో సఖ్యము చేసికొనెను (1857)

ఆస్ట్రియాచక్రవర్తి యిటలీదేశమును జక్కఁగాఁ బాలించక ప్రజలను బాధపెట్టుచున్నందున విదేశపరిపాలనమును దొలఁగించుకొని స్వారాజ్యమును సంపాదించుకొనుటకు దేశీయులు ప్రయత్నములు చేయుచుండిరి.

ఫ్రాన్సుదేశము నేలుచున్న నెపోలియను యిటలీదేశమువారికి సాహాయ్యపడుటకు సమ్మతించియు జాగుచేయుచున్నందున, కాలవిలంబమునకు సహింపలేక, కొందఱిటలీదేశస్థు లింగ్లాండునఁజేరి ఫ్రాన్సుదేశ చక్రవర్తిని జంపుటకు మందుగుండు సామానులను తయారు చేసిరి. ఈసంగతి ఫ్రాన్సుదేశమువారికిఁ దెలిసి, యింగ్లాండుపై దండెత్తెదమని బెదరించిరి. ఇందున నాంగ్లేయులు భయభ్రాంతులయి, దొరతనమువారు నిలిపిన రక్షకసేనయు, నావికబలమును, ఫ్రెంచివారి నెదిరించుటకుఁ జాలవని తలఁచి, ప్రజలు స్వంతసొమ్ము వ్యయపెట్టుకొని యాయుధములను గూర్చుకొని యుద్ధవిద్య నేర్చుకొనుటకు సమ్మతించినందున వాలంటియరులనుభటులసంఘము తేర్పడినది. 1859 సం॥లో నిట్లుప్రతిజ్ఞ చేసినవారు 170000 లుండిరి. ఐనను, ఫ్రాన్సుచక్రవర్తి యింగ్లాండుదేశముమీఁదికి దాడి వెడలుటకు మారుగా నిటలీ దొరతనమువారగు నాస్ట్రియనులమీఁదికి వెడలి వారినోడించి వెంటనే వారితో సఖ్యపడి యుద్ధమును విరమించెను. ఆకాలమున నిటలీదేశములో మాజినీ, గరిబాల్డియను నిద్దఱు దేశభక్తులు మిన్నుముట్టిన దేశాభిమానముతో విదేశరాజ పరిపాలనమునుండి దేశమును విడిపించి స్వరాజ్యలక్ష్మిని నెలకొల్పుటకుఁ దీవ్రముగాఁ బాటుపడుచుండిరి. ఆశాభంగ మొనరించిన ఫ్రాన్సుచక్రవర్తి పనులకు దైన్యమునొందక, యీ యుదారచరితుల ప్రోత్సాహముచే ముప్పిరిగొన్న యుత్సాహముతో నిటలీదేశమువారు మహావీరులయి యాస్ట్రియా దొరతనమువారితో యుద్ధము చేసి స్వాతంత్ర్యమును సంపాదించుకొనిరి (1860)



# అధ్యాయము 26

## విక్టోరియామహారాజ్ఞి

## 1867–1901

పార్లమెంటు సభ్యులలోఁ గొందఱు కాలానుగుణముగాఁ గ్రొత్త మార్పులను జేసి దేశము నభివృద్ధికిఁ దీసికొని రావలెనని పాటుపడువారయి విగ్గులనియు, నట్టి సంస్కారములచే రాజకీయాచారములకు స్థిరత్వము తప్పిపోవునని వారి ప్రయత్నముల నడ్డుపెట్టి యంతలిలోపములను వెదకుటయందే పనిగలిగ యుండువారయి టోరీలనియును రెండుపక్షములుగా విడిపోయి, వారివారి పక్షములగానున్న జనాభిప్రాయమును బట్టి యేర్పడిన కామనుల సాహాయ్యమును సంపాదించుకొని యొకప్పుడు విగ్గులును మఱియొకప్పుడు టోరీలును రాజ్యతంత్రమును నడపించుచున్నారని యిదివరలోఁ జెప్పియున్నాము. మన రాణికాలములో నీపార్టీలవారి కీనామములు మారిపోయి సంస్కారకాములు లిబరలనియు, సంస్కారవిముఖులు కన్సర్వేటివులనియు వాడఁబడుచుండిరి. న్యాయైక దీక్షతోడను, ఈశ్వరభక్తితోడను, మితిలేని దేశాభిమానముతోడను నీరాణికాలమునఁ జిరకాలము ప్రధానిగానుండి రాజ్యతంత్రమును నడపిన గ్లాడ్‌స్టను లిబరలుపార్టీవారికి నాయకుఁడుగా నుండెను. కన్సర్వేటివు పార్టీవారికి డిస్రాయెలి నాయకుఁడు. పార్లమెంటు సభ్యనియామక విషయమునను, ఇతర రాజకీయ వ్యవహార విషయములను నగత్యములైన మార్పులను జేసి కూలీలకుఁగూడ పార్లమెంటులో జోక్యము కలుగఁజేయవలెనని లిబరలపార్టీవారి సంకల్పము. ప్రజాక్షేమమునకు సాధకములగునట్లు చట్టములను మార్చవలెననియు నైరోపాఖండమందలి రాజమండలిలో నింగ్లాండుమిన్నయై యెచ్చట దుర్నయములు జరిగిన నడంచుచు, కాలొనీలను దనలో నిముడ్చుకొని యేకఛత్రాధిపత్యముగా రాజ్యము చేయవలెనని కన్సర్వేటివు పార్టీవారిప్రతిజ్ఞ.

విదేశ వ్యవహారములలో జోక్యము పుచ్చుకొనక దివాణమునకు వ్యయము తగ్గించవలెనని లిబరలు పార్టివారు తలంచుచుండఁగా, వ్యయమగునని లోభింపక కాల్బలమును నావికబలమును వృద్ధిజేసి విదేశమందును స్వదేశమందును ధర్మసంస్థాపనార్థము పాటుపడి దిగ్విజయము చేయవలెనని కన్సర్వేటివులు తలపోయుచుండిరి.

ఈ కాలమున వ్యవసాయపు కూలివాండ్రును ఫ్యాక్టరీ కూలీలును పార్లమెంటు వ్యవహారములలో సంబంధము కలుగఁజేసికొనుటకు ముమ్మరముగాఁ బ్రయత్నములు చేయుచుండిరి. అందుచేఁ బట్టణములందు 5 సవరను లద్దెనిచ్చెడు గృహ యజమానులకును, పదిసవరనుల నద్దెనిచ్చు కాపురమువారలకును పార్లమెంటు సభ్యులను నియమించు నధికార మియ్యఁబడినది. జనపదము లందు (Counties) 12 సవరను లద్దెనిచ్చువారికిఁ గూడ నిట్టిస్వాతంత్ర్యమియ్యఁబడినది (1867). ఈ యాక్టువలన నిట్టిస్వాతంత్ర్యము 1000000ల జనులకుఁ గ్రొత్తగాఁ గలిగినది. ఐనను, దీనివలన సామాన్యగ్రామములో నివసించు కాయక్లేశజనమున కిట్టియధికారము లేకపోయినది. చేతిపనులు విశేషముగాఁ దయారుచేయఁబడుచోట్ల జనులకుఁ దగినవోటులులేవు. మొత్తముమీద 7000 మంది జనమైనలేని 42 పల్లెలకొక్కింటికి ఒక్కఁడు చొప్పున పార్లమెంటుసభ్యులుండిరి; 1751000 మంది జనసంఖ్య గల 142 గ్రామములకు 172 గురు సభ్యులు మాత్రముండిరి. చేతిపనులకు విశేషముగాఁ బ్రసిద్ధికెక్కి 1832000 మంది జనము గలిగిన లివర్పూలు, మాంచెస్టరు బర్మింగాము, గ్లాస్గో పట్టణములకు 4 గురు మాత్రము సభ్యులుండిరి. ఇంతియకాక పంటలుచెడిపోయి కఱవులు హెచ్చినకొలఁది భూస్వాములకు స్వామ్యము తొలఁగించి భూములుతమకు స్థిరపఱచుకొనవలెనని రయితులకుఁ గోరికలు వేళ్లుపారినవి. ఈలాభములు పార్లమెంటువారు తమకుఁ గలుగఁజేయుట కొడఁబడనందునఁ దామే పార్లమెంటులో సభ్యులై యట్టిలాభమును బొందవలెనని రయితులకుఁ బట్టుదల కలిగినది. ఈ ప్రజాభిప్రాయమున



కనుగుణముగా లిబరలుపార్టివారును కన్సర్వేటివు పార్టివారును గూడ పల్లెలలోని రయితులకు పార్లమెంటునకు సభ్యులను నియమించుకొను స్వాతంత్ర్యమిచ్చుట కంగీకరించిరి. దివాణపుద్యోగస్థులకును వారినౌకరులకును గూడ నిట్టిస్వాతంత్ర్యమియ్యఁబడెను. 15000 మందికి తక్కువ జనులు గల పట్టణములకు సభ్యుల లేకుండఁ జేసి, 1600-50000 ల వఱకు జనముగల పట్టణములకొక్క సభ్యుని బంపుట కధికారము స్థిరపఱుపఁబడెను. ఈ కారణముచే నిదివఱకు 658 గా నున్న కామనుల సంఖ్య 670 వఱకు పెరిగెను. (1884-1885) విద్యావివేకములులేని స్వాతంత్ర్య మనర్థదాయకమే కాని క్షేమకరముకాదు గనుక పార్లమెంటుతో సంబంధము సామాన్యజనులకుఁ గలుగఁజేయునిమిత్తము పుట్టిన చట్టములను సార్థకపఱుచ నుద్దేశించి, దేశమునందలి బాలురందఱును విధిగాఁ బాఠశాలలకుఁ బోయి విద్యాభ్యాసము చేయవలెనని శాసించి, వారి సుఖావాసమున కనువగు మందిరములను దేశమంతటఁ గట్టించిరి (1870).

పార్లమెంటులోని సభ్యుల యేర్పాటునుగూర్చి యెన్నిచట్టములు పుట్టినను సభ్యులను నియమించు స్వాతంత్ర్యముగలవారు లంచములు పుచ్చుకొని నీతితప్పి వర్తించుచుండిరి. పార్లమెంటులో సభ్యత్వము సంపాదించుకొన నాశించువారు వోటరులకు లంచమిచ్చి తమ పేరు వ్రాయించుకొనుచుండిరి. ఇందున కవకాశము లేకుండఁ జేయుటకై వోటరుల కిష్టమైనవారి పేరు చీటిమీఁద వ్రాసి గోప్యముగా నొకపెట్టెలో నుంచు నట్లేర్పఱుపఁబడెను. ఇంతటితోడను లంచములుగొను దుర్భ్యాసముపోలేదు. వోటుచీటిమీఁద వ్రాయఁబడిన పేరును నితరులు తెలిసికొనుటకు వీలులేకపోవుటచే నిద్దఱుసభ్యత్వమునకుఁ బ్రయత్నములుచేయునప్పు డెవరికిఁ దగినట్లువారికినచ్చఁజెప్పి, యుభయులయొద్దను నీతిమాలినవోటరులు లంచములుపుచ్చుకొనుచు వచ్చిరి. ఇటీవల పదిసంవత్సరములనాఁడు లంచమిచ్చిన వారికిని బుచ్చుకొన్నవారికిని కఠినదండనమును విధించుచుఁ జట్టములు చేయఁబడువఱకు నీ దురాచారము తొలఁగలేదు.

ఐర్లాండు దేశము వారివలన మనరాణికాలములో మిగుల కల్లోలము జరిగెను. ఆంగ్లపార్లమెంటు సభవారితో సంబంధములేకుండ స్వతంత్రముగా రాజకార్యములను దీర్చుకొనుట కైర్లాండులో పార్లమెంటు కావలెనని వీరుచేయుచున్న సంరంభమునుగూర్చి యిదివఱకే చెప్పబడియున్నది. ఇప్పుడమెరికా దేశమునుండి యుద్ధభటులను సాహాయ్యము తెచ్చుకొని యైర్లాండు నలుగడలను, అమెరికాలో కనడాయను నుత్తర భూములయందును, ఇంగ్లాండునందును నొక్కసారిగా దొమ్మిపెంచి, దొరతనమువారికి నొత్తుడు కలుగఁజేసి తమ యభీష్టమును దీర్చుకొనవలెనని యయిర్లండు దేశమువారు కుట్రచేసిరి. జనబాహుళ్యముయొక్క కూటమిచే జరుగవలసిన యిట్టికుతంత్రములు బయలుపడక దాగవుగనుక దొరతనమువారుపీరిజాడ పొడఁగని యెదిరించఁగా మబ్బువిడిపోయినట్లీ మూకలు విడిపోయిరి (1867). అయిర్లాండు ప్రజలలో నూటికి డెబ్బది యయిదుగురు కాథోలిక్కుమతస్థులు. తక్కిన పాతికమందియు ప్రొటెస్టంటులు. ఈప్రొటెస్టంటుల యారాధనార్థము మాదేశమున నేర్పఱుపఁబడిన దేవాలయములను, ఆచార్యులను, బోషించునిమిత్తము మామతమునకుఁ బ్రతిపక్షులైన కాథోలిక్కు మతస్థులనుండి పన్నువసూలు చేయఁబడుచుండెను. మఱియు కాథోలిక్కులకుభూములుండఁగూడదని రాజశాసనముండుటచే ప్రొటెస్టంటు భూస్వాములు క్రూరులై విధించిన కఠినమైన నఘా యిచ్చుటకొడఁబడి ప్రొటెస్టంటుల భూములనుగొని కాథోలిక్కులు సాగుచేసికొని బ్రతుకవలసిన వారైరి. పంటలు చెడిపోయినప్పుడు బ్రతుకుతెరువుగానక యాకటిపెల్లున నిసేద్యగాండ్రు మఱింత బాధలపాలగుచుండిరి. అయిర్లండుప్రజల యల్లరులకీ రెండును బ్రధానకారణములని యూహించి వాని నివారణమునకై గ్లాడుస్టను మొదలగు లిబరులపార్టివారు ప్రయత్నము చేయుచుండిరి. అందుచే పార్లమెంటులో నీపార్టివారి యధికారము స్థిరపడినతోడనే 1869 సం॥ లో కాథోలిక్కులు ప్రొటెస్టెంటుల దేవాలయములకుఁబన్నలియ్యనక్కఱలేకుండ శాసింపఁబడెను. సేద్యభూముల విషయమై అయిర్లండు రయితులక్షేమముకొఱకు 1870 సం॥ లో నొక



చట్టముపుట్టెను. కవులుభూములను మరమ్మతుచేసిన రయితులు కవులు వదలుకొన్నను, ఇనాందారులవలన భూమినుండి తొలఁగింపఁబడినను, చేసినమరమ్మతునకుఁ దగిన పరిహారము రయితులు భూస్వాములవలనఁ బొందునట్లును, ఇనాందారులువిక్రయించుట కొడఁబడినయెడల రయితులు మాన్యమును విలుచుటకు వలయుధనము దొరతనమువారు రయితులకప్పిచ్చునట్లును, నీశాసనము విధించుచున్నది. ఐననింతటితో రయితులకుఁ దృప్తి కలుగలేదు. తాముసేద్యముచేయు భూములయందుఁ బూర్ణమైనస్వామ్యము తమకే కలుగవలెనని రయితు[illegible]ంచి యుండిరి. ఇంతవఱకుఁ దమకోర్కెలను దొరతనమువారు నెఱవేర్పలేదని రయితులు మఱింతయల్లరులకు దిగిరి. ఆంగ్లేయులగోడు విడనాడి స్వరాజ్యమును సంపాదించుకొనుటకు వారు బద్ధకంకణులైయుండిరి. తమ కోరిక నెఱవేర్పఁబడునఱకును వాంగ్లపార్లమెంటులో నేపనియు జరుగకుండున ట్లైర్లండునుండి వెళ్లినసభ్యులు ప్రతివిషయమును గుఱించియు విరామము లేకుండ నధికప్రసంగములు చేసియు, నేపనితలపెట్టినను బహుభంగుల నాక్షేపములను, ఖండనములను జేసియు, ననేకవిధములపనిఁ జెడఁగొట్ట నారంభించిరి. ఇట్లుచేసినయెడల విసిగివేసారి తమకోర్కెల నెఱవేర్చెదరని వారియభిప్రాయము. ఇంతటితో నూరకుండక, రయితుల సేద్యములో నున్న భూములయందుభూస్వాములకుస్వామ్యము లేకుండఁజేసితమకే స్వామ్యము నిలుపకొనవలెనని వారియభిప్రాయము. ఈయుద్దేశము నెఱవేర్చుకొనుటకుఁ బయలుమాఱు దొమ్మిజరిగించిరి. వీరియుద్యోగమునడఁచుట కప్పుడు రాజ్యభారమును వహించియున్న కన్సర్వేటివుపక్షమువారసమర్థులని యూంగ్లేయులకుఁ దోఁచినందున వారియాధిపత్యముపోయి లిబరలు పార్టివారి ప్రాభవము బయలుపడినది.

ప్రజాక్షేమకరముగాఁ జట్టములను జేసినయెడల నైర్లండు[illegible]స్థుల కల్లోలమడఁగునని గ్లాడుస్టను పలపోసి క[illegible]ను కొత్త[illegible]వానిని నూ

తనముగా స్థాపించి రయితులు భరింపరాకుండఁ గట్టఁబడిన శిస్తులనుగూర్చి విచారణముచేసి తగ్గించునట్లేర్పఱచెను. ఈకోర్టువారువిచారణముచేసి, రయితులకు భూస్వాములచేఁ గట్టఁబడిన శిస్తు నిజముగా దుర్భరమై యున్నట్లు తేలినందున, నూటికి ముప్పది మొద లేబదివఱకు శిస్తులను దగ్గించివేసిరి. తమ యల్లరివలన నిట్టి లాభము కలిగినది గనుక మఱింత గోలపెట్టిన యెడల దొరతనమువారు కంపితులై భూస్వాములకుఁ బరిహారమిచ్చి సేద్యభూముల యందు వారికిస్వామ్యము రద్దుపఱచిరయితులకేభూములను గట్టిపెట్టుదురని దురాశపుట్టి రయితులు మఱింత దుండగములకు సిద్ధపడిరి. వీరి నడఁచు తెరువు దొరకక దొరతనమువారు నాయకులగువారిని నలువదిమందిని బట్టుకొని ఖయిదుచేసిరి. అందుపై జయిలునుండి వీరు ప్రజలను మఱింతరేపి, దొరతనమువారు పాదాక్రాంతులై రయితులకోరికలను నెఱవేర్చువఱకు భూస్వాములకు శాసయయిన శిస్తు వసూలియ్యవలదని రయితులనుబ్రోత్సాహపఱచిరి. దేశములోఁ జాలవఱకు రయితులు శిస్తు వసూలియ్యక నిరాకరించిరి. దొరతనమువారు కఠినదండనములుచేసి వీరి మూఁకల నడంచ మొదలు పెట్టిరి. ఇందునకుఁ బ్రతిఘాతముగాఁ బ్రజలు చిత్రవధలారంభించిరి. కారాగృహమందున్న ప్రజానాయకులీయల్లరులను శాంతపఱచెదరని యూహించి దొరతనమువారు వారిని విడుదలచేసిరి. భూస్వాములకు శిస్తు వసూలియ్యకుండ రయితులేర్పఱచుకొన్న కట్టుబాటును రద్దుపఱచెద మనియు, సాధ్యమగునంతవఱ కల్లరులును మాన్పెదమనియు ఖయిదీలు శపథము చేసిరి. ఈ రాయభారములుజరుగుచుండఁగానే యాంగ్ల రాజప్రతినిధిని, (Viceroy) నాతని సాహాయ్య కార్యదర్శిని (Under Secretary) రయితులు క్రూరవధ చేసిరి. (1882). తుదకు సామోపాయములు నిష్ప్రయోజనములై లో[illegible]నందున, దొరతనమువారు కఠినతవహించి, శిక్షాస్మృతిని నిర్ద[illegible]తో నమలు జరిపి దుష్టులను దండించుచు వచ్చిరి. ఐనను బ్రజల దౌష్ట్యము [illegible]మ సం[illegible]గఁ జల్లారలేదు.



స్వరాజ్య స్వాతంత్ర్యము కొఱకు పాటుపడుచున్న యైర్లాండు జనులకు స్వతంత్రముగ నొకపార్లమెంటు నిచ్చి కొన్నికట్టుబాటులతో దానినాంగ్ల పార్లమెంటుయొక్క సార్వాధిరాజ్యముక్రింద నుంచినయెడల, నాదేశస్థుల కల్లోలమడఁగునని గ్లాడ్‌స్టను 1886 సం॥లో నీవిషయమున నొకబిల్లును పార్లమెంటుయెదుటఁ బెట్టినప్పుడు మంత్రిమండలివారు భిన్నాభిప్రాయులై వాదప్రతివాదము లారంభించి యిద్దఱు పనిచాలించుకొనిరి. ఈ బిల్లు శాసనము కాకూడఁదని కన్సర్వేటివు పార్టివారు మీటింగులుచేసి జనులకు బోధింపనారంభించిరి. ఐర్లాండునుండి పార్లమెంటునకు సభ్యులుగా వచ్చినవారిలో ప్రొటెస్టంటు లీబిల్లు శాసనమైనయెడల కాథొలిక్కుల ప్రాభవమువృద్ధియై తమవాసిమొక్కపోవునని భయపడి బిల్లునకుఁ బ్రతిపక్షముగా గోలచేసిరి. అందుచేఁ నీబిల్లు రెండవసారి పార్లమెంటులోఁ జదువఁబడినప్పుడు లిబరలుపార్టివారిలోఁ గొందఱు కన్సర్వేటివులతోఁగలిసి బిల్లును నిరాకరించిరి. గ్లాడుస్టను పార్లమెంటును ముగించెను. క్రొత్తపార్లమెంటునకు నియమింపఁబడు సభ్యులనుబట్టి యైర్లండుస్వరాజ్యము నంగీకరించువారధికముగా నియమింపఁబడినయెడల జనాభిప్రాయ మట్టి స్వరాజ్యమునకు సుముఖముగా నున్నట్లును, దప్పినయెడల విముఖముగానున్నట్లును, దేలునని పార్లమెంటు ముగింపఁబడెను. తుదకేర్పడిన పార్లమెంటుసభ నైర్లాండు స్వరాజ్యప్రతిముఖులే యగుటఁ జేసి గ్లాడుస్ట[illegible]ను పని చాలించుకొనవలసివచ్చెను. ఇందునకునిరుత్సాహులై యైర్లాండుదే[illegible]ము మరలరయితులీనాందారులకు శిస్తువసూలీయకుండఁ గట్టుకట్టించఁ [illegible]పడిరి కాని దొరతనమువారు కఠినముగా నిగ్రహదీక్ష వహించి పనిచేయుటచే వీరిప్రయత్నములు విఫలములయ్యెను.

వీరికెట్టులైన స్వరాజ్యమిచ్చి తనివిపఱచి ధన్యుఁడనుగావలెనని గ్లాడుస్టను బద్ధకంకణుఁడై యెనుబదిమూఁడు వత్సరముల వార్ధక్యదినములుపయిఁబడినను, మరలఁబ్రధానమంత్రిపదవినంగీకరించిపార్లమెంటులో నైర్లండుస్వరాజ్యమునకైనబిల్లును పెట్టి కామనుశాఖవారి యంగీకారమును బొందిలార్డుశాఖవారి

యెదుటకుఁ బంపెను. లార్డులు తమ యాధిక్యమునకు భంగము కలుగునని భయపడి యీబిల్లును నిరాకరించిరి (1893). ఇప్పుడు గ్లాడుస్టనునకు రెండుమార్గములున్నవి. పార్లమెంటును ముగించి, క్రొత్త పార్లమెంటునకు సభ్యులను నియమింపుఁడని ప్రజలకుఁ దెలియఁజేసి, వారు నియమించు సభ్యుల యభిప్రాయము తనబిల్లున కనుకూలముగా నుండునో మాఱుగా నుండునో చూడవలెను. అప్పుడు పార్లమెంటులో బహుసంఖ్యగలవారైర్లాండుస్వరాజ్య పక్షమున నున్నయెడల, లార్డుల ప్రతిబంధకము బాధించదు. 1832 సం॥లో శాసనముగఁ జేయఁబడిన మొదటి రిఫార్మ్ బిల్లునాటి ముచ్చటయే యిప్పుడును జరుగును. కాలము తప్పిపోవచ్చినదని సాలుకగలమకొని విసుగుకొనుచునైన లార్డులు బిల్లు శాసనముగుట కంగీకరింపవలెను. లేనియెడల పార్లమెంటులోని బహుసంఖ్యాకుల మాట పాటించి రాజు యీబిల్లున కనుకూలముగా నున్నవారికి లార్డుపదవులను నిచ్చి లార్డులసంఖ్య పెంపుచేసినయెడల తుదకు బిల్లున కంగీకరించినవారి సంఖ్యయే బలమై బిల్లు శాసనమగును.

ప్రజాభిప్రాయము తానుతలపెట్టిన యైర్లాండుస్వారాజ్యము పక్షమున నుండదేమోయని గ్లాడుస్టనునకు సంశయము కలిగినయెడల, ప్రస్తుత మప్పటి కాబిల్లుసంగతి తలపెట్టక చాటునఁ బెట్టి కొంతకాలమునకుఁ బ్రజానురాగము తనవంకకు మరలునట్లు ప్రజాక్షేమకరముగఁ గొన్ని చట్టములను జేయించి, ప్రజలు తనబిల్లున కామోదింతురను ధైర్యము కలుగఁగానే తిరుగ నీబిల్లును పార్లమెంటునెదుటఁ బెట్టుట ప్రధానమంత్రి యవలంబించవలసిన రెండవ పద్ధతి.

ఆకాలచక్రమును బరీక్షించి చూచినచో నీబిల్లును బ్రజలామోదించెదరను నమ్మకము ప్రధానికిఁ గలుగలేదు. అందుచే నీవ్యవహారము చాటునఁ బెట్టియితరవ్యవహారములను గూర్చి ప్రధాని పనిబుచ్చుకొని యొకసంవత్సరము పనిచేసి 1894సం॥లోఁ బనిచాలించుకొనెను. తరువాత ప్రధానియైనరోజుబరీ ఇంగ్లాండు



దేశమువారీయైర్లాండువారి స్వరాజ్యమునకుఁ బ్రతికూలురుగానున్నంత కాలమైర్లాండునకు స్వరాజ్యము సిద్ధించదని విడిచిపెట్టెను. వర్తమానమందు రాజ్యతంత్రమును నడపుచున్న లిబరలపార్టివారు కూడ నైర్లాండునకు స్వరాజ్యమిప్పించవలెనని పాటుబడుచున్నారు. కానియింకను గార్యసాఫల్యము కాలేదు.

ఇంగ్లాండునుండి యిండియాకు మెట్టమీఁద నీజిప్టుగుండ వచ్చుట కొక మార్గము గలదు. ఈజిప్టుదేశమునకుఁ దూర్పుగా నరుణసముద్ర (red sea) మున్నది. మధ్య ధరాసముద్రమున కరుణ సముద్రమునకు మధ్య సూయజు కాలువ గలదు. ఈ కాలువ తఱచుగాఁ బూడిపోవుచుండును. 1869సం॥లో నీ కాలువ యిట్లు పూడిపోకుండఁ దగునేర్పాటులు చేయుటకు జాయింటు స్టాకు కంపెనీ యొకటి యేర్పడి కాలువ త్రవ్వఁబడెను. నాటనుండి నింగ్లాండునుండియు నిండియాకుఁ బ్రయాణము సుకరముగా జరుగుటకు సదుపాయము కలిగెను. దీనిని గనిపెట్టి యాంగ్లదొరతనమువారు సూయజు కెనాలు కంపెనీలో సగము భాగము నా దేశము ప్రభువునొద్ద 4000 000 సవరనులకుఁ విలిచిరి. ఇంతకుఁ బూర్వము ఈజిప్టు ఫ్రెంచివారి స్వాధీనమందుండెను. ఈసూయజు కాలువ త్రవ్వఁబడక పూర్వమింగ్లాండు మొదలగు దేశముల నుండి యిండియా, చైనా, ఆస్ట్రేలియా మొదలగు దేశములకుఁ బోవు వర్తకుల యోడలాఫ్రికాఖండమునకు దక్షిణపు కొననున్న 'గుడుహోపు' అగ్రమునుజుట్టి సముద్రముమీఁదఁ బ్రయాణము చేయుచు వచ్చినవి. ఈ కాలువ త్రవ్వఁబడినతరువాతఁ బూర్వపు చుట్టుదారిని విడిచిపెట్టి వర్తకులీ మెట్టదారి నవలంబించిరి. ఇంగ్లాడునుండి పూర్వ మాఱుమాసములకుఁ గాని కలకత్తాకుఁ జేరఁజాలని యోడ లిప్పుడాఱువారములలోఁ జేరుచున్నవి. ఈ కారణముచే సూయజు కాలువ కంపెనీలో నాంగ్ల దొరతనము వారు భాగములను విలుచుటకు వెచ్చించిన ధనమునకు వడ్డీగా దివాణమునకు విశేషము రివిన్యూ వసూలగుచున్నది. ఈ విక్రయమునాటనుండియాంగ్లేయులకీజిప్టు వ్యవహారములందు శ్రద్ధపుట్టినది.

1879సం॥లో ఈజిప్టుదేశప్రభువుయొక్క దుష్పరిపాలనము ప్రజాపీడాకరమయ్యెను. ఆంగ్ల దొరతనమువారికిఁ బూర్వమే ఫ్రెంచిదొరతనమువారీదేశమందుఁ బ్రబలియుండిరి. వారితోఁగూడి యాంగ్లదొరతనమువారు గూడ నీజిప్టు రాజకార్యములందు జోక్యముపుచ్చుకొని 1879 సం॥లో నీజిప్టు ప్రభువును బదభ్రష్టునిఁ జేసి యాతని కుమారుని ప్రభుస్థానమున నిలిపి యాతనికి ఫ్రెంచి వారొకమంత్రిని, నాంగ్లేయు లొకమంత్రిని సాహాయ్యమిచ్చి, వారిని దప్పించుట కా ప్రభువున కధికారము లేకుండఁజేసి, యాదాయవ్యయముల నీమంత్రిద్వయము చక్కబెట్టు నట్లేర్పఱచిరి. ఈ యేర్పాటు రాజునకునష్మకమేకాని, అంతదనుకఁ దమయిచ్చవచ్చినట్లు జనులను బీడించి ధనవంతులగుట కలవాటుపడిన స్వదేశోద్యోగస్థులకు సరిపడలేదు. స్వరాజ్యము నిలిపెదమని ప్రతిజ్ఞలు పలుకుచు నొక స్వదేశ సేనానాయకుఁడు బయలుదేరి కాల్బలమును గూడఁ గట్టుకొని, క్రొత్తగా నిలుపఁబడిన ప్రభువును ఖయిదుచేసి, విదేశమంత్రులను దేశమునుండి వెడల నడచెను (1882). ఈతని మదమడంచుటకు ఫ్రెంచివా రాంగ్లేయులతోఁ గలసిరాక వెనుకపట్టిరి. అంతట స్వదేశీయులు పెచ్చుపెరిఁగి యూరోపియులను బేరులేకుండ వధించిరి. ఆంగ్లేయు లందుమీఁద నాగ్రహముగొని సేననంపి దేశము నాక్రమించుకొనిరి. స్వరాజ్య ప్రతిష్ఠాపనాచార్యుఁడగు నా సేనానాయకుని, నాతనికి సహకారులగు ప్రముఖులను, ఖయిదుచేసి సింహళద్వీపమునకు వెడలఁగొట్టి పదభ్రష్టుఁడైన రాజపుత్రుని మరల సింహాసనమందుంచిరి. ముందిట్టి దుండగముల కవకాశము లేకుండ నాంగ్ల దొరతనమువా రీజిప్టునం దొక రక్షకసేనను నిలిపిరి. అంతట సూడను ప్రాంతములందు మతావేశపరవశుఁడొకఁడు తాను ప్రపంచాంశమం దవతరించునని మహమ్మదీయులు నమ్మెడు 'మహాది' యను ప్రవక్తనని చెప్పుకొనుచు, నా కాలమునఁ బ్రజలను బాధించుచున్న యీజిప్టు రాజకీయాధికారులనుండి దేశమును రక్షించెదనని బయలుదేరెను. ఈతనిచుట్టును మూగిన ఫకీరుల దండీజిప్టు దొరతనమువారి బంట్లనోడించెను. ఆంగ్ల సేనానాయకు లిద్దఱు వారికడ్డమురాఁగా వారి నిద్దఱను దునుమాడి



తుదకు విసివి వేసారి ఆంగ్ల దొరతనమువారు సూడను ప్రాంత భూములను వానిగతికి వదలిపెట్టిరి.

ఈజిప్టురాజు 1896 సం॥ ప్రాంతములయందు సూడను మండలమునుండి ఫకీరులదండును వెడలఁగొట్టి స్వాధీనము చేసికొనవలెనని ప్రయత్నము చేయఁగా నందున కాంగ్లదొరతనమువా రామోదించిరి. ఫ్రెంచిదొరతనమువారి కీవార్త కర్ణశూలమై సోకినందున దీని నడ్డుపెట్టుట కనేక ప్రయత్నములు చేసి తుదకీయుద్ధమున నీజిప్టురాజునకు వలయు ధనము దొరకకుండఁ గుతంత్రములఁ బన్నిరి. ఆంగ్ల దొరతనమువా రారాజునకు 5000 సవరను లప్పిచ్చి యాతని యుద్ధయాత్రను సాగించిరి. ఈ దండయాత్ర జయప్రదముగా ముగిసెను (1898). అందునకుఁ బ్రతిహతముగ నాంగ్ల వర్తకులేర్పఱచుకొన్న దారుల నడ్డుపెట్టి ఫ్రెంచివారు కొంత ప్రదేశము నాక్రమించుకొనుట కనేక భంగుల సేనాసమూహములను నంపుచువచ్చిరి. అట తూర్పుతట్టున నీ ఫ్రెంచివారు సాయము దేశముమీఁదికి దఱుముకొనివెళ్లి దాని నాక్రమించుకొనుట కారంభించి కొండొకవడి కాంగ్ల దొరతనమువారితో 1898 సం॥లో సఖ్యపడిరి. మఱికొంత కాలమునకు ఫ్రెంచిసేనాపతి యొకఁడు నూఱ్వుర సైనికులవెంటఁబెట్టుకొని, 'ఆఫ్రికామధ్య భాగమును దాటి ఫషోడాపట్టణము నాక్రమించుకొనెను. ఈరూపమునఁ గ్రమక్రమముగా నైలునదీప్రాంతములయందుఁ గొంతప్రదేశమును స్వాధీనమం దుంచుకొనవలెనని ఫ్రెంచివారు సమకట్టిరి. ఈ సేనాపతి కాఫ్రికావదలి ఫ్రాన్సునకు మరలివచ్చునట్లుత్తరువు చేయనియెడల యుద్ధము ప్రారంభమగునని నిశ్చయముగా నమ్మవచ్చునని యాంగ్లప్రధాని ఫ్రెంచిదొరతనమువారికి వర్తమానము పంపెను. అందుపై ఫ్రెంచిదొరతనమువారు పర్యాలోచనచేసి, తమమిత్రముగు రష్యారాజు తమకుసాహాయ్యము చేయుట కొడఁబడకపోవుటచేతను, స్వదేశమందలి రాజకార్యము లప్పుడు తమకాందోళనము కలుగఁజేయుటచేతను, నాంగ్లేయులతో ఫ్రెంచివారు 1889సం॥లో సఖ్యముచేసికొని నైలునదీప్రాంతభూముల

యం దాంగ్లేయులు రాజ్యమును జెల్లించుకొనునట్లంగీకరించిరి. ఇండియా దేశమునకు ఫ్రెంచివారివలన నాపద గలుగకుండఁ గాపాడుకొనుటకే యాంగ్ల దొరతనమువారి కిన్ని కష్టములు గలిగినవి.

1887 వ సంవత్సరము జూను 21 వ తేదితో రాజ్ఞిగారి ప్రభుత్వ కాల మేఁబదిసంవత్సరములునిండెను. ఈసుదినజ్ఞాపకార్థముగా సకలదిగంత వ్యాప్తమైన విశాలరాజ్య విస్తారమం దెల్లెడలను బండుగలు చేయఁబడెను. రాజ్ఞిగారిసామంతదేశములనుండియుత్తమాధికారు లనేకు లానాఁడు లండను నగరమున జరిగినయుత్సవము నలంకరించిరి. ఈరాజ్ఞీమతల్లిని దలఁచుకొనుచు నామె యేలుఁబడిలో నారోగ్యైశ్వర్యములననుభవించుచుఁ గృతజ్ఞులై యున్న కోట్లప్రజలు పండుగలుచేసికొని యామె నకళంక హృదయములతోఁ గీర్తించి వినోదించిరి. ఎల్లెడల నైకకంఠ్యముగఁ బ్రజలు కనఁబఱచిన యుత్సాహమే యామె సామ్రాజ్యత్వమును (Imperialism) జాటినది.

ఈయుత్సవములో నాంగ్లేయుల ప్రాభవము బయలుపడుటకును దొరతనమువారు పరరాజులతో నెయ్యము నపేక్షించి జాగ్రత్తతో మసలుకొనుచువచ్చిరి. ఈనాటనుండియు స్వశక్తి విశ్వాసము హెచ్చి, ధైర్యముతోఁ బరరాజులతో వ్యవహరించుచుండిరి. 1870 సం|| ప్రాంతములందు నాంగ్లేయులు ఫ్రాన్సు, ఇటలీరాజులతో నెయ్యముగూర్చుకొనియుండిరి. జర్మని, ఆస్ట్రియా, రష్యారాజులేకమై విదేశవ్యవహారములలో నొకరికొకరు సాహాయ్యము చేసికొనుచుండిరి. 1882 సం||లో నీజిప్టుయుద్ధము పొసఁగినప్పుడు ఫ్రెంచివారు శ్రద్ధతప్పియుండుటచే నాంగ్లేయు లభిమానించుకొని యుద్ధము కొనసాగించి యాదేశములోఁ దమయాధిపత్యమును బలపఱచుకొనుటచే ఫ్రెంచివారిబలము నామమాత్రమైనది. ఇదికారణముగ్గాఁగొని యాంగ్లేయులపై ఫ్రెంచివా రసూయాగ్రస్తులైరి. ఐనను ఆంగ్లదొరతనమువారిని జీటికిని మాటికిని విసిగించుటయేకాని ఫ్రెంచివా రసాహాయ్యు లగుటఁజేసి, భీతిగలుగనట్లేదియుఁ జేయఁజాలకపోయిరి.



అంతట రష్యాచక్రవర్తి రాజద్వేషము వహించిన కొందఱుప్రజలచే 1881 సం||లోఁ జంపఁబడెను. ఆతనికొమారునికిని జర్మనుచక్రవర్తికిని సఖ్యము కూడలేదు. అందుచే జర్మను, ఆస్ట్రియా చక్రవర్తులు రష్యాచక్రవర్తినివిడిచి పెట్టి, ఇటలీరాజును దమలోఁ జేర్చుకొనిరి. మారుత్రోవ కనఁబడక రష్యాచక్రవర్తి ఫ్రాన్సురాజుతో నెయ్యము చేసికొనెను. ఇదివఱకే ర[illegible] చక్రవర్తి యిండియామీఁదఁ బడునేమోయని యాతనియెడ నాంగ్లేయులు శంకాశీలురై యుండిరి. ఈజిప్టు వ్యవహారములనుబట్టి యాంగ్లేయులకును ఫ్రెంచివారికి నెడమొగము పెడమొగములుగా నుండెను. అందుచే నీరాజకూటములతో సంబంధము పెట్టుకొనక యాంగ్లదొరతనమువా రుదాసీనులై యుండిరి. అదను గలుగునెడ నాస్ట్రియా, జర్మను, యిటలీ, రాజత్రయము వంకకే యాంగ్లేయు లొరగవలసియున్నది. ఐనను జర్మనుల కాంగ్లేయు లంతగఁ బ్రేమాస్పదులుకారు. ప్రపంచమంతయు నాంగ్లేయు లావరించుకొనియుండగాఁ, జర్మనులుకూడ జనము స్వల్పముగానున్నచోటులను వెదకి వారిని నాక్రమించుకొన మొదలుపెట్టిరి. ఏకఫలాపేక్షులై పనిచేయుచున్న వీరిద్దఱకును నెయ్య మంతగాఁ గుదురుననుటకు వలనుపడదు. అందుచే దొరతనమువారటు రష్యా, ఫ్రాన్సు, రాజద్వయకూటమును గాని, యిటు జర్మనీ, ఆస్ట్రియా, యిటలీ, రాజత్రయకూటమును గ్గాని చేపట్టక మాధ్యస్థులై యెవ్వరినినొప్పించక, తామునొవ్వక, తప్పించుక తిరుగుచుండిరి.

విదేశవ్యవహారములలోఁ గొంతకల్లోల మీకాలమునఁ బుట్టినది. ఐరోపాదేశమందలి టర్కీసుల్తాను, అర్మీనియాదేశములో నున్న జనులను వధించుట కుత్తరువు చేసెను. ఈచిత్రవధ 1895-97 సం|| లలో బాహుళ్యముగా జరిగెను. రష్యాదొరతనమువారి కీయర్మీనియా ప్రజలనాశము సమ్మతమైనందున నూరకుండిరి. టర్కీదేశములో వర్తకము పెంచుచున్న జర్మనుచక్రవర్తి వీరినాశమువలన వర్తకము పెరుగవచ్చునని తలంచి యూరకుండెను. ఫ్రాన్సు, ఇటలీ, అమెరికాదొరతనములవారు కల్లవగపులతో నూరార్చి, అర్మీనియా ప్రజానాశమునునివారణము చేయుటకుఁ దలపెట్టరైరి. ఇంగ్లాండుదొరతనము

వారి కిందువిషయమై జోక్యము కలుగఁ జేసికొనవలె నని తలఁపు గలిగినది గాని, అట్లుచేసినయెడల రష్యాజర్మను ప్రభుత్వములవారితోఁ బోరాటము తెచ్చిపెట్టుకోవలసి వచ్చునని భయము కలుగుటచే వారును నుదాసీనులైరి.

అఁట దక్షిణప మెరికాదేశములో నాంగ్లకాలొనీయైన గయానాకును, యునైటెడుస్టేట్సు అనఁబడు నమెరికా దొరతనమువారి వశమందున్న వెనిజులా రాజ్యమునకును మధ్యగానున్న యడవిప్రదేశములో బంగారు గనులున్నవను వదంతి పుట్టినందున, సరిహద్దునుగుఱించి తగవువచ్చెను. ఈతగవు యుద్ధమునకు దారితీయునట్లు బహ్వారంభసంభ్రమము కలిగినదిగాని, ఆంగ్ల మంత్రిమండలివారు వేగిరపాటు విడచి దూరదృష్టి గలవారై శాంతముతో బ్రవర్తించినందున, పంచాయితీదారుల తీరుమానమూలమున తగవు పరిష్కృత మయ్యెను.

మఱియొకమూల గ్రీకురాజు టర్కీప్రభువుతో యుద్ధమారంభించి గ్రీకుదేశమున కుత్తరమున టర్కీప్రభువు స్వాధీనమందున్న మాసిడోనియా మీఁదికి దాడివెడలెను. టర్కీసుల్తాను ముందర గ్రీకురాజు కడునల్పుఁడగుటచే నీయుద్ధమున 1887 సం॥ నోడిపోయి సఖ్యము చేసికొనెను.

1897 వ సంవత్సరము జూన్ 20 తేది విక్టోరియా రాజ్ఞియొక్క రాచరికమునకు షష్టిపూర్తియయ్యెను. 1887 వ సం॥ నాటి యుత్సవములవలెనే యీసుదిన జ్ఞాపకార్థ మాంగ్లరాజ్య విస్తారమంతయుఁ బండుగులతో నిండిపోయెను. సామంతదేశములనుండు ప్రభువులు రాజ్ఞిదర్శనము చేసి యుత్సవదినమునందు జోహారువులొనర్చి ప్రభుభక్తి ప్రకటనము చేసిరి. ఈయుత్సవమును డైమండుజూబిలీ యందురు.

ఇంతటితోనైన విదేశరాజకార్యముల యాందోళనము చల్లారలేదు. చైనాదేశముతో వర్తకము చేసి తమదేశములోఁ దయారుచేయఁబడు వస్తువుల నాదేశమున దిగుమతిచేయుటకు నదుపాయములను గుదుర్చుకొను



టకై చీనాదేశమందలి రేవుపట్టణములను రష్యా, జర్మనీ, ఫ్రాన్సు, జవాను దేశముల దొరతనములవా రాక్రమించుకొనిరి. ఈవిషయమున నాంగ్లేయులీరాజమండలికిఁ దీసిపోలేదు. కాని, యాంగ్లేయుల వర్తకపద్ధతులును, ఇతరరాజుల వర్తకమర్యాదలును, భేదముగానుండును. ఆంగ్లేయులస్వాధీనమందున్న రేవుపట్టణములకొక్క యాంగ్లేయులేకాక యేదేశమువారైనను దిగుమతిసరకులను బంపవచ్చును. తక్కినరాజులట్లుకాక తమస్వాధీనమందున్న రేవుపట్టణములకు దిగుమతియగు తమదేశపువస్తువుల పయిని పన్నులేకుండఁ జేసికొని ఇతరదేశవస్తువులు దిగుమతియైనయెడల వానిపైఁ గఠినముగాఁ బన్నులుకట్టుదురు. ఇందువలనఁ దమదేశపువర్తకుల సరకులు స్వల్పధరలకు విక్రయింపఁ బడుట కవకాశముగలిగి యితరదేశస్థులసరకులు దిగుమతి కాకుండ నాగిపోవుననియు, నందువలనఁ దమదేశస్థులవర్తకము పెంపగుననియు, నాయాప్రభువుల సంకల్పము. ఆంగ్లేయులీమర్యాద నవలంబించక, సర్వదేశములనుండియు సరకులేవిధములైన యడ్డములునులేకుండఁ దమదేశమునకును దమస్వాధీనమందున్న దేశములకును దిగుమతియగునట్లు వర్తకపద్ధతి నేర్పఱచుకొనిరి. విదేశీయులను రూపుమాపవలెనను సంకల్పముతో చైనాదేశపు ప్రజలు దొమ్మిరేగి వారిని జంపనారంభింపఁగా నచ్చట యుద్ధముచేసి వారి నోడించిరి.

ఇంకను విదేశకల్లోలము ముగియలేదు. దక్షిణాఫ్రికాలో బోయరులతో 1899సం॥లో నొకయుద్ధము ప్రారంభమై 1902 సం॥తో ముగిసెను. ఈయుద్ధప్రారంభమందు బోయరులాంగ్లేయులఁ బెక్కుసారు లోడించి [illegible]బాధ పెట్టిరి. ఇన్నిఁటినోర్చుకొని, తుదకు జయప్రదముగా యుద్ధము ముగించుప్రయత్నములను జేయుచు శత్రుల ముఖ్యపట్టణములను స్వాధీనము చేసికొనునప్పటికి, యుద్ధము సాంతమగు లోపలనే 1901 వ సం॥ జనవరి 22 వ తేదిని విక్టోరియా మహారాజ్ఞి స్వర్గస్థురాలగుటవలనఁ బ్రజలందఱు దుఃఖసాగరమున మునిఁగిరి. ఆంగ్లసింహాసనము నీసాధ్వీమణి యఱువదిమూఁడు వత్సరము లలంకరించెను. మూఁడవజార్జి యేఁబదితొమ్మిది వత్సరములకంటె నధికముగ రాజ్యము చేయలేదు.

## అధ్యాయము 27

## వలస దేశములు.

ఆంగ్లేయులు విదేశములకు వలసపోయి వాని నాక్రమించుకొని యాంగ్లదొరతనము వారి యాధిపత్యముక్రిందికి లోఁబఱచుకొన్న సామంత భూములనే మరియొక పేరులేక యాంగ్లనామముతో కాలొనీలని యీ గ్రంథమున వాడఁబడును. ఆంగ్లదొరతనమువా రమెరికాలోని వర్జీనియా మండలమునకు బోవఁ దమదేశస్థులకు 1606 సం॥లో నిచ్చిన మొదటియాజ్ఞా పత్రికతో కాలొనీలు ప్రారంభమయి పదునేడవ శతాబ్దమందు విరివియై పదునెనిమిదవ శతాబ్దమునాటికి విజృంభించినవి. ఇప్పు డాంగ్లదొరతనము వారికి యుద్ధమందు విడిపోయిన సంఘరాష్ట్రము (United States) లనఁబడు నమెరికా దేశముగాక, యైదుచోట్ల నీకాలనీలల్లుకొని యున్నవి. (1) అమెరికాలో నుత్తరదిశనున్న కనడా డొమినియను, (2) దక్షిణపమె రికాకుఁ దూర్పుగా నుత్తరపార్శ్వముననున్న వెస్టు యిండియా దీవులు, (3) కేపుకాలొని కలుపుకొని దక్షిణ పాఫ్రికాభూములు, (4) ఆస్ట్రేలియా ద్వీపము, (5) న్యూజీలండు ద్వీపము, ఈ యయిదును ప్రసిద్ధివడసిన గొప్ప కాలొనీలు. కనడా డొమినియనులో (1) అప్పరు కనడా, (2) లోవరు కనడా, (3) న్యూబ్రన్సువిక్కు, (4) నోవస్కోషియా, (5) నార్తు వెస్టరన్ టెరిటరీ, (6) బ్రిటిషుకొలంబియా, (7) ప్రిన్సు యెడ్వర్డుద్వీపము అను నేడు సంస్థానములుకూడి యున్నవి. ఇందు ప్రతి సంస్థానమునకును ప్రత్యేకముగ నొక్కొక్కస్థానికప్రతినిధిసంఘ ముండి స్వతంత్రముగా నాస్థాన రాజకార్యములను జక్కఁబెట్టుచుండును. సంస్థానములన్నిఁటి సమష్టి మీఁదను రాజకార్యములను బరిపాలించుటకు గవర్నరు జనరలొకఁడు వేలువేలుసంస్థానములవారిచే నియమింపఁబడి యావజ్జీవము పనిచేయు సినెటు అనఁబడు సభవారి స్థిరసంఘ మొకటియు నేర్పడియున్నవి. ఒక్కొక సంస్థానమున కిందఱని నియమితులైన ప్రతినిధులతోఁ గూడి



యున్నను పార్లమెంటువంటి ఆలోచనసభ యొకటియు, కనడా డొమిని యను సమష్టివ్యవహారముల విషయమై యీసమష్టి ప్రతినిధి సభవారే సర్వస్వతంత్రులయినను కొన్ని విషయములలో వాంగ్లదొరతనము వారికి లోఁబడియుందురు అందుచే వారి పరిపాలనపద్ధతి కలొనియలుగవర్న మెంటు, ఫిడరలుగవర్నమెంటు అనివాడఁబడును. దీనిని దెనుగునవిశిష్టస్వరా జ్యపద్ధతియని చెప్పవచ్చును. రాజకార్య స్వాతంత్ర్యము గలుగుటచేఁ బ్రజలు కృషివాణిజ్యాదులను వృద్ధిచేసికొని దినదినాభివృద్ధిగాంచిసుఖించుచున్నారు.

వెస్టిండియాదీవు లనెడు రెండవ కాలొనీజనుల కంత యభివృద్ధి లేదు. ఈదీవులఁలో జెఱకు కాఫీపంటలు విశేషముగాబైరగును. బానిసల వ్యాపారము విరివిగా సాగుచున్నప్పు డీదీవులకు వలసివచ్చిన యాంగ్లేయు లీబానిసలను గూలీలుగా నుపయోగించుకొని స్వల్పవ్యయమునకే విలువగల పంటలను బండించుకొని భాగ్యవంతులైరి. 1832 సం॥లో బానిసలవ్యాపారము మాన్పఁబడిననాఁటనుండియు వ్యవసాయవ్యయ మధికమై వీరికి లాభముకొంత తగ్గిపోయినది. ఇంతియుకాక విదేశవస్తువులపయిని దిగుమతిపన్ను వాంగ్లే యులు కట్టక యితరదేశములవారికి వర్తకసౌకర్యము కలుగఁజేయుటచే, జర్మనుఫ్రాన్సుదేశములవారు చెఱకుపంటల శ్రమపడిపండించ నక్కఱ లేకుండ, బీటుమొక్కలనుండి పంచదారవంటి తియ్యనిపిండి తయారుచేసి పంచదారకంటెఁ దక్కువధరకు విక్రయింప నారంభించిరి. ఇందువలన దీవులలోనున్న కలొనియనులు మఱింతదుర్గతికిఁ బాలైరి. ఇటీవల పొగాకు, కోకో, కొన్నిపండ్లజాతులు, విశేషముగా నీదీవులయందు బండిం చఁబడుచు వచ్చినవికాని, అందువలన వీరిదుర్గతి మూలమట్టుగాఁ దొలఁ గినదని చెప్పవీలులేదు.

దక్షిణఫ్రాఫ్రికా కాలొనీలనఁబడు మూఁడవకాలొనీలస్థితి దినదిన ప్రవర్ధ మానముగనే యున్నది. 1815 సం॥ నాటికి కేపుకాలొనీయను ఆఫ్రికా దక్షిణ భాగమును, పశ్చిమోత్తరదిశనున్న యైదాఱు రేవుపట్టణములును, తూర్పుకొన సమీపమున నున్న మారిషసు అను దీవులను మాత్రమాంగ్లేయుల వశమందుండెను.

కేపుకాలొనీ హాలండుదేశమువారికాలొనీయగుటచే నచట నాంగ్లేయులున్వల్పముగా నుండుచువచ్చిరి. 1815సం॥లో నీకాలొనీ హాలండునుండి విడిపోయి యాంగ్లేయుల పరమైనది. నాటనుండియు వీరు గుంపులు గుంపులుగా నచటికి వలసవచ్చి తూర్పుభాగము నాక్రమించుకొని విస్తరించిరి. వీరికిని డచ్చి (హాలండు జనుల నీపేరుతో వాడుదురు) వారికిని తగవులుఁ బ్రబలినవి. 1838 సం॥ లో నచ్చట స్థిరపడిన యాంగ్లేయులకుఁ జోటుచాలక యుత్తరముగాఁ బోయి 'ఆరెంజిరివరుకాలొనీ, నేటాలు' అను రెండు రాజ్యములను స్థాపించుకొనిరి. వారిని వెన్నుదన్ని డచ్చివారుకూడ నచటికిఁ బోయి వారి రాజ్యములను దమకేపుకాలొనీలోఁ గలుపుకొని మఱింత యుత్తరముగాఁ బోయి ట్రాన్సువాలుకాలొనీ యొకటి స్థాపించుకొనిరి. ఆంగ్లేయు లీప్రాంతములందుఁ గాలు పెట్టినది మొదల లాదేశమునందలి స్వదేశజనులగు జూలూజాతివారు వీరితో నిత్యమును గలహము పెంచుకొని పోరాడుచుండిరి. జూలూజాతివారు కొంత నాగరికత ననుభవించువారై బుద్ధిశాలురగు రాజుల యేలుబడిలో నుండి చుట్టుప్రక్కలనున్న యితరజాతులవారిని లోఁబఱచుకొనిరి. వారి రాజాంగ్లేయులను గూడ బెదిరింపనారంభింపఁగా నాంగ్లసేనాపతి యుద్ధమునకు దిగి యాదేశస్థులను సాహాయ్యము చేసికొని పోరి యోడిపోయెను. అందుపై నింగ్లాండునుండి మఱియొక సేనాధిపతి గొప్పదండుతో వచ్చి జూలూరాజు నోడించి యాతనిరాజ్యమునాంగ్లదొరతనమువారి పరముచేసెను.

ఈ యుద్ధమునకుఁ బూర్వమే ట్రాన్సువాలు రాజ్యము నాంగ్లేయులు స్వాధీనము చేసికొనిరి. డచ్చి దొరతనమువారిందున కంగీకరించక తగవులాడి కార్యము కానక 1880 సం॥ లో యుద్ధమునకుడీకొని యాంగ్లేయుల బలగమును రూపుమాపిరి. కేప్రకాలొనీలోను నేటాలులోను నున్న యాంగ్లసేనలు ట్రాన్సువాలులో వారికిసాహాయ్యార్థము బయలుదేరఁగా, డచ్చివారడ్డగించివేసి మజూబా మెట్టయొద్ద నాంగ్లసేనాని నోడించి యాతఁ



జంపివేసిరి (1881). అందుపై గ్లాడుస్టన్ డచ్చివారితో సంధిచేసికొని వారి స్వాతంత్ర్యము నంగీకరించెను(1884).

ఇట్లుండఁగా ట్రాన్సువాలులో బంగారుగనులు బయలుదేరుటచే నాంగ్లేయులు మూకమూకలుగా నచటికిఁ జేరికొనిరి. ఈరాజ్యమునకు 'జోహానేసుబర్గు' అనునది ముఖ్యపట్టణము. ట్రాన్సువాలు రాజ్యము నేలుచున్న డచ్చిదొరతనమువారీగనులను ద్రవ్వి లాభమునొందలేకపోయిరి. అయిన నాంగ్లేయు లట్టిలాభమునుబొందుట కిష్టపడ్డైరి. విద్యావివేకసంపదయెంతయున్నను ఆంగ్లేయులను గొప్పయుద్యోగములకు దూరముచేసిరి. రాజకార్యములలోను, ఆదాయవ్యయములలోను ఆంగ్లేయులకు జోక్యమియ్యరైరి. పన్నులుకట్టుటలో నాంగ్లేయుల యభిప్రాయములనుగాని కష్టసుఖములనుగాని పాటింపరైరి. ప్రభుకోటిలోనివార మనియు, రాజకార్యైకదక్షులమనియు, పాలితప్రజలకుఁ దమతో సమాన స్వాతంత్ర్య స్వామ్యము (Rights) లు లేవనియు మూఢాభిప్రాయములను బాటించి, డచ్చిదొరతనమువా రాంగ్లేయులను గ్రించుదనముతోఁ జూచుచువచ్చిరి. డచ్చివారి దుష్పరిపాలనమునకాంగ్లేయులు సహింపఁజాలక 1895సం॥లో 'జమైసను' అను వాని నాయకత్వముక్రింద నైదువందల యాశ్వవారులను బోగుచేసికొని ట్రాన్సువాలురాజ్యముమీఁదికి దాడివెడలిరి. డచ్చివారి నిఁకబోయరులని వాడుదము. బోయరు లాంగ్లేయ యాశ్వికసేన నోడించి ఖయిదుచేయఁగా వారాయుధములను శత్రువులకర్పణచేసి ప్రాణములను దక్కించుకొనిరి.

జమైసనుయొక్క దండయాత్రతో నాంగ్లదొరతనమువారికాఫ్రికాలో ననేకకష్టములు సంప్రాప్తములయ్యెను. బోయరుల కాంగ్లేయులమీఁద జాతివైరము ప్రబలమయ్యెను. బోయరుల కధ్యక్షుఁడు క్రూగరు ఆంగ్లేయులతో యుద్ధము తప్పదని నిశ్చయించుకొని యైరోపానుండి యాయుధములను విరివిగాఁ దెప్పించి యాతఁడు యుద్ధసన్నాహమునం దుండెను. ట్రాన్సువాలు రాజ్యమునకు దక్షిణముననున్న ఆరెంజిరాజ్యమువారీతనికి

దోడ్పడి యాంగ్లేయులతో యుద్ధము చేయుట కొడఁబడిరి. ఆరెంజ రాజ్యమునకు దక్షిణముననున్న కేపుకాలొనీలోని బోయరులుకూడ వీరితోఁ గలసిరి. ఆంగ్లేయుల ప్రభుత్వము బోయరులంపటకును గంటక ప్రాయముగనుండి స్వరాజ్యాభిమానము మిన్నుముట్టెను. జమైసను దండయాత్ర జరిగిన రెండుసంవత్సరములవఱకు నాంగ్లేయులు రాజ్యాంగ స్వాతంత్ర్యములను బోయరులతో సమముగాఁ బొందుటకు రాయబారములు నడపుచుండిరి. ఆంగ్లేయుల కెట్టిస్వాతంత్ర్యము నియ్యఁగూడదని బోయరుదొరతనము వారికిఁ బిట్టుగియుండెను. అందుచే బోయరులవలన దమకుఁ గార్యసిద్ధి కాదని నిశ్చయించుకొని, విక్టోరియా రాజ్ఞి కాంగ్లేయులు 21000 మంది సంతకములతో నొకపిటీషను బంపుకొని తమకు బోయరు ప్రభుత్వమువారివలన రాజకీయస్వాతంత్ర్యమిప్పింపుమని కోరుకొనిరి. (1899). 1884 సం॥ లో గ్లాడుస్టను బోయరుల స్వాతంత్ర్య మంగీకరించినప్పుడు, ఆంగ్లదొరతనమువారికి బోయరుదొరతనమువారిమీఁద నెంతవఱకధిరాజ్యము నిలబెట్టఁబడినది? ప్రస్తుతమాఫ్రికాలోనున్న యాంగ్లేయుల కష్టములెట్టివి? — అను రెండువిషయములనుగూర్చియు బోయరు ప్రెసిడెంటు క్రూగరును, ఆంగ్లరాజప్రతినిధియు నొకచో సభచేసి చర్చించిరి. ఆంగ్లేయులకు రాజకీయస్వాతంత్ర్యమునిచ్చువిషయములో నుభయులకును భిన్నాభిప్రాయములేర్పడినవి. ఐదుసంవత్సరములాఫ్రికాలో నివసించిన యాంగ్లేయులకు బోయరులతో సమానస్వాతంత్ర్యము లుండవలెననియు, బోయరుల ప్రతినిధి సభలో నాంగ్లేయప్రతినిధులుకూడఁ జే[illegible]వలెననియు నాంగ్లరాజప్రతినిధి పట్టుపట్టెను. బోయరుల ప్రతినిధిసభలో ముప్పదియొక్కరు సభ్యులుండిరి. ఈసభకయిదుగురు నాంగ్లసభ్యులనుమాత్ర మంగీకరించెదననియు, నేడుసంవత్సరములాఫ్రికాలో నివసించిన యాంగ్లేయులకు మాత్రమే బోయరులతోడి సమాన స్వాతంత్ర్యమిచ్చెదననియు, నట్టియాంగ్లేయులు మఱికొన్నికట్టుబాటులకు లోఁబడవలెననియు క్రూగరు పట్టుపట్టెను. ముందెన్నఁడైన బోయరులకు నాంగ్లేయులకును దగవులు పుట్టినయెడల నుభయులును నొక విదేశరాజును



బంచాయితీదారుగాఁ గోరుకొనవలెననికూడ క్రూగరు కోరెను. బోయరులాంగ్లదొరతనమువారికి లోఁబడినవారేయని యాంగ్లేయులనమ్మియుండుటచే వారితోఁ దగవువచ్చినప్పుడు మఱియొక దేశపురాజుయొక్క పంచాయితీకి లోఁబడుట ఆంగ్లదొరతనమువారికిఁ దలవంపులుగా దోఁచెను. అందుచే క్రూగరుకోరిన పంచాయితి పద్ధతి కంగీకరించినయెడల, బోయరులమీఁద నాంగ్లేయులాధిరాజ్యత వదలుకొనినట్లగును. ఆకారణముచే క్రూగరు చెప్పినపద్ధతుల కాంగ్లరాజప్రతినిధి యంగీకరింపఁడయ్యెను. కాఁబట్టి బోయరులతో యుద్ధము చేయవలసి వచ్చెను.

దక్షిణాఫ్రికాలోనున్న యాంగ్లేయులసేన 6000మాత్రముండెను. బోయరు వీరులు 75000 మంది యుండిరి. బోయరులబలమింతఁగా నుండునని యెఱుఁగక యాంగ్లదొరతనమువారు 20000 మంది యుద్ధభటులను మాత్రము యుద్ధమునకుఁ బంపిరి. నెటాలు మండలములో మాఫికింగు, కింబర్లె పట్టణములందున్న 12000 మంది యాంగ్లసేనమీఁదికి బోయరులుగవిసి వారినోడించిరి. ఆంగ్లసేన రెండుభాగములుగావిడిపోయి డండీ, లేడీస్మిత్తు, అను స్థానములకు బోఁగా బోయరులుమార్కొని మఱిరెండుయుద్ధములలో నాంగ్లేయుల నోడించిరి. ఓడిపోయిన యుద్ధభటులనుఁగూడ దీసి యాంగ్లనాయకుఁడు తిరుగ బోయరులను దలపడెనుగాని వారిధాటికి నిలువలేక లేడీస్మిత్తు పట్టణమునకుఁ బారిపోవలసివచ్చెను. వీరు గమ్యస్థానమును జేరుకొను లోపలనే మఱియొక బోయరుసేన యడ్డమై వారిని చెఱఁబెట్టిరి.

అట లేడీస్మిత్తులోని యాంగ్లసేనను బోయరులు ముట్టడించి ఫిరంగులను వారిపై బారుపెట్టి కాల్చుచు వెలుపలినుండి వారికాహారపదార్థములు కాని, సేనాసాహాయ్యమును గాని చేరకుండ నడ్డగించిరి 1896సం॥లో 9 తేది సెప్టెంబరు మొదలు తే 16 ది సెప్టెంబరువఱకు ఆంగ్లసేన మిక్కిలి కష్టములనుభవించెను. వీరిసాహాయ్యార్థము పంపఁబడిన యాంగ్లభటులు మూఁడు చోట్లబోయరులవలన నోడింపఁబడిరి. ఈ వార్త యింగ్లాండున దెలిసి యుద్ధభటుల నందఱను సమ

కూర్చియుఁ గాలోనిలను సాహాయ్యముకోరియు, దేశమందలి వాలంటరు భటులను బిలిపించియు నాంగ్లదొరతనము వారు మహాట్టహాసముచేసి, లార్డు లాబర్టును అను వృద్ధసేనాధిపతిని నాయకునిగా నియమించి, అతనికి లార్డు కిచనరును దోడుచేసి ఆఫ్రికాకుఁబంపిరి. 1900సం॥ జనరలు బుల్లరను నాంగ్లేయుఁడు లేడీస్మిత్తులో బాధలపడుచున్న సేనకు సాహాయ్యార్థము బయలుదేరి మూఁడుదినములు బోయరులతో యుద్ధము చేసి యోడిపోయెను. మఱి రెండుసార్లు వేఱువేఱు త్రోవలగుండ లేడీస్మిత్తునకుఁ జేరఁబ్రయత్నము చేసెనుగాని బోయరుల ధాటికాగలేక వెనుకకు మరలెను. నాలుగవసారి మఱియొకమార్గముపట్టి యెనిమిదదినములు బోయరులతోఁ బోరి క్షామపీడితులై దిగులుపడియున్న యాంగ్లభటుల కన్నపానముల నిచ్చి బుల్లరు రక్షించెను. బోయరు లంతట లేడీస్మిత్తుముట్టడిని జాలించి యందుండి మరలిపోయిరి.

బోయరుల భటసమూహము లంతయు 75000 కంటె నెక్కువలేదు. యుద్ధప్రారంభమునుండియు నాంగ్లేయుల కపజయమే కలుగుచుండుట చూచి, లార్డులాబర్టను 200,000 మంది యశ్వారూఢులతో 'ఆరెంజిఫ్రీస్టేటును' ట్రాన్సువాలు రాజ్యమును ముట్టడించి, బోయరుల ప్రెసిడెంటగు క్రూగరును నోడించెను. అందుపై వాఁడు హాలెండుదేశమునకుఁ బోవలసివచ్చెను. క్రాంజి మొదలగు బోయరుల మహావీరులునుగూడ నిట్లే యోడిపోయిరి. అందుచే 1902 సం॥ మే నెలలో బోయరులుసంధిచేసికొని, ఆత్మరక్షణార్థము కొన్నియాయుధములను మాత్రముంచుకొని తక్కిన యుద్ధపరికరముల నాంగ్లేయులకిచ్చివేసిరి. యుద్ధప్రారంభమునుండియు బోయరులాంగ్లేయులకుఁ జేసిన యపకృతులను క్షమించి, దేశమునందున్న బంగారుగనులనుస్వాధీనముచేసికొని ఆంగ్లేయులు యుద్ధసమయమున నాశముచేసిన బోయరుల వసతులను బాగుచేసికొనునిమిత్తము 3000000 సవరనులను బోయరుల కాంగ్లదొరతనమువా రనుగ్రహించిరి.

ఆస్ట్రేలియాద్వీప మాంగ్లేయుల నాలుగవకాలొనీ. ఆంగ్లదేశమున ద్వీపాంతరవాసదండనపాత్రులైన దోషుల నీద్వీపములకుఁ బంపుచుండెడివారు.



అందుచేఁ గొంతికాలము వఱకు నీద్వీపములకు వలసవచ్చుట నిందాపాత్రముగా నుండుటచే నాంగ్లేయు లిచ్చటకు వచ్చుటకు వెనుకఁదీయుచుండిరి. 1864సం॥లోదండింపఁబడినదోషస్థులనీద్వీపమునకుఁబంపుటకొరతనమువారు మానుకొని దానికిఁ బట్టియున్న నిందనుదొలఁగించిరి. అప్పటినుండియు నాంగ్లేయులు వేలకొలఁదిగా నిచ్చటఁజేరి కాలక్రమముల నాదేశవాసులను రూపుమాపిరి. న్యూసౌతువేల్సుఅను నీద్వీపముయొక్క దక్షిణభాగమునందు లోకమునందలి బంగారుగనుల నన్నిఁటిని మించిన సువర్ణపు గనులు బయలుపడినవి. ఇచటమూగిన జనసంఖ్యనుబట్టి యీభాగమును దక్కినభాగముల నుండి వేఱుచేసి విక్టోరియా యను పేరుపెట్టిరి. ఈగనులనుండి 4000000 సవరనుల విలువగల బంగారము ప్రతిసంవత్సర మెగుమతి చేయఁబడును. ఈద్వీపముయొక్క యితరభాగములయందునుగూడఁ గొలఁదిగనో గొప్పగనో బంగారుగనులుబయలుపడినవి. అందుచే ద్వీపమంతట పల్లెలువృద్ధియై పట్టణములుగా మారిపోయినవి. ఈగనులలోఁ బనిచేయుటకుఁ గావలసినవారికంటె నధికముగా జనసంఖ్యవృద్ధియైనది. ఈబంగారుగనులు బయలు పడకపూర్వ మీద్వీపమునఁ బ్రవేశించినవారు సేద్యముచేసికొని గొఱ్ఱెలను బెంచుటతప్ప మఱియొక వృత్తిలేక యొక్కొక్కఁడు వేయియకరముల చొ॥ భూమినాక్రమించుకొని నివాసము లేర్పఱచుకొనిరి. గనుల కాశించి యీద్వీపమును జేరిన మిక్కిలిప్రజలకు వ్యవసాయమే గతియై పూర్వపు మాన్యస్వాములతోఁ బోరాటములు పెట్టికొని భూమికొఱకుఁ దగవులాడుచువచ్చిరి. ఇట్టిమాన్యస్వాముల సంఖ్యకంటె వ్యవసాయపు నేలకొఱకుఁదగవులాడు రయితుల సంఖ్యయే యెక్కువయ్యెను. ద్వీపమంతయు న్యూసౌతువేల్సు, టాస్మేనియా, వెస్టు ఆస్ట్రేలియా, సౌతుఆస్ట్రేలియా, విక్టోరియా, క్వీన్సులాండు— అను నాఱుభాగములుగా విడిపోయియున్నది. దక్షిణభాగములు శీతలప్రదేశములగుటవలన నాంగ్లేయులకు వాసయోగ్యములయి యున్నవి. ఉత్తరభూము లుష్ణప్రదేశములగుటవలనఁ జైనావారిని గూలీలనుగాఁ బెట్టుకొని ధాన్యాదులను జెఱుకుపంటను పైరుచేయించుదురు. ద్వీపముయొక్క

మధ్యభాగములకు నీటివసతి తక్కువగుటచే వ్యవసాయమునకు వలను గాక యడవిచే నిండియుండును. పైనిజెప్పఁబడిన యాఱుభాగములును బ్రతినిధి సభలమూలమున దేనికదిస్వతంత్రమై రాజకార్యములను జరుపుకొనుచున్నది. అన్నిభాగములకును సమష్టిమీఁద నొకప్రతినిధి సభయొక్క యాధిపత్యముక్రిందఁ గనడా డొమినియనువలె ఫిడరల్ దొరతనము నేర్పఱుపఁ బ్రయత్నములు జరుగుచున్నవి.

ఆస్ట్రేలియా దీనికి దక్షిణ దిక్కునఁ దూర్పుకొననున్న న్యూజీలండు ద్వీపము నైదవగొప్ప కాలొనీ. ఇం దుత్తరమున నొకటియు, దక్షిణమున నొకటియు, దీనికి దక్షిణమున చిన్నద్వీపము మఱియొకటియు మూఁడుద్వీపములు గలిసియున్నవి. విక్టోరియారాజ్ఞి కాలములోనే 1839 సం॥ లో మొదట నాంగ్లేయు లీ ద్వీపములకు వలసవచ్చిరి. ఆస్ట్రేలియాలో స్వదేశవాసులంతఁగా లేకుండుటచే దానినాక్రమించుకొనుట కాంగ్లేయులు విశేషశ్రమపడ నక్కఱలేకపోయినది. ఈ న్యూజీలండు దీవులయం దట్లు కాక, మెయోరీలను స్వదేశవాసులు వేనవేలు వసించియుండిరి. వీరుక్రూర స్వభావము గలవారును, కడుబుద్ధి శాలురును బరాక్రమ మహితులు నగుటచే నాంగ్లేయు లీద్వీపములలోఁ గాలుపెట్టినదిమొదలు మున్నూరు యుద్ధము చేసి యాంగ్లేయులను వెడలఁగొట్టి స్వదేశమును గాపాడుకొనవలెనని మహా బలపరాక్రమములతో యుద్ధము చేసిరిగాని బలాఢ్యులగు నాంగ్లేయుల ముందఱ నిలువఁజాలకపోయిరి న్యూజీలండువారికి పార్లమెంటులో నలుగుర సభ్యులను నియమించుకొను నధికారమిచ్చి వారికిఁ గొన్ని మడిమాన్యములిచ్చి ఆంగ్లదొరతనమువా రీద్వీపము నేలుచుండిరి. ద్వీపములు మూఁడును నాఱు వేఱ్వేఱు భాగములుగా విభజింపఁబడి యొక్కొక్క దానికిఁ బ్రత్యేకముగ నొక్కొక్క ప్రతినిధి సభయేర్పడెను. ఈసభలే రాజకార్యములను గొంతకాలము నెఱవేర్చెను. 1875 సం॥ లో నీవేఱ్వేఱు ప్రతినిధి సభ లొక్కటిగాఁ జేయఁబడినవి. ఆస్ట్రేలియావలెఁ గాక యీదీవులయందు నీటివసతి బాగుగానుండుటచే సమశీతోష్ణములు గలిగి యాంగ్లేయు



లకు వాసయోగ్యముగా నుండును. ఈదీవుల నుండియే మాంసము విశేషముగా నింగ్లాండునకు నెగుమతి యగుచున్నది. మనదేశమునందు నల్లమందు, సురాపానద్రవ్యములు, ఉప్పు, వ్యాపారములు దొరతనమువారిచేఁ జేయఁబడుచున్న ట్లీదీవులలో (ఇండస్ట్రీ) వర్తకము మొదలగు పనులన్నియు దొరతనమువారిచేతనే చేయఁబడును.

పైనిజెప్పిన కాలొనీలుకాక సుమాత్రా జావా మొదలగు నీస్టిండియా దీవులును, ఇండోచీనామలయభూములును, పినాంగుమలాకా సింగపూరు దీవులును గూడ నాంగ్లేయుల యాధీనములో నుండెను.

కలోనియను లొకప్పు డాంగ్లదేశమునుండి కాలొనీలకు వలసపోయిన వారలే కనుక నింగ్లాండు దేశస్థులతో నేకభాషాచారములును, ఏకమతాభిమానములును, ఏకజాతి సంభూతులునైయుండిరి. అందుచే వారిలో వారి కన్యోన్యానురాగమును నభిమానమును విడిపోలేదు. దూరభారమును దగ్గించుటకు నిమపదారులును తంతిమార్గములును నేర్పడియున్నవి. ఎచ్చటనే దేశమునను న్నను ఆంగ్లజనుల కపాయము గలుగకుండ నాంగ్లదొరతనము నారభిమానించుకొని కాపాడుచున్నారు. ఆంగ్లదొరతనమువారికి బోయరులతో యుద్ధము సంప్రాప్తమై పరాజయము గలిగినప్పుడు కాలొనీలలోనున్న యాంగ్లేయులు మాతృదేశముపై నభిమానముంచి ఆఫ్రికాకు సాహాయ్యము సేనల నంపిరి. ఈకారణములచేఁ బైనివివరింపఁబడిన కాలొనీలనుండి యాంగ్లపార్లమెంటునకును బ్రతినిధులను దెచ్చుకొని ఆంగ్లరాష్ట్ర సమష్టి రాజకార్యములను నందఱకనుకూలముగాఁ బరిష్కరించుకొనుచు, నాంగ్లదేశరాజే యాంగ్లజనవాసితమయిన ప్రదేశముల కన్నిఁటికి రాజై యాజ్ఞ చెల్లించుచుండునట్లును, ఏకాలొనీ వారా కాలొనీయొక్క ప్రత్యేక రాజకార్యములను బ్రత్యేకము జక్కఁబెట్టుకొనుచు నాంగ్లదొరతనము వారికిఁ బన్నులనియ్య నక్కఱలేకుండ స్వతంత్రముగఁ బనిచేసికొనునట్లును, రాష్ట్రసమష్టిమీఁద ఫిడరల్ పాలనాపద్ధతిని నెలకొల్పవలెనని యాంగ్లరాజకార్య దీక్షులు ప్రయత్నములుచేయుచున్నారు. లార్డు కిచనరును నిట్టిఫిడరల్ పాలనావ్యూహమునకు నాయకునిగాఁ గొలఁదిదినముల క్రిందటనే యేర్పఱచుటచే నాంగ్లేయుల సంకల్పములు నెఱవేరుచున్నవని చెప్పుటకు సంతోషమగుచున్నది.

కూర్చియుఁ గాలొనిలను సాహాయ్యముకోరియు, దేశమందలి వాలంటరు భటులను బిలిపించియు నాంగ్లదొరతనమువారు మహాప్రయాసముచేసి, లార్డు లాబర్ట్సు అను వృద్ధసేనాధిపతిని నాయకునిగా నియమించి, అతనికి లార్డు కిచనరును దోడుచేసి ఆఫ్రికాకుఁబంపిరి. 1900సం॥ జనరలు బుల్లరను నాంగ్లవీరుఁడు లేడీస్మిత్తులో బాధలపడుచున్న సేనకు సాహాయ్యార్థము బయలుదేరి మూఁడుదినములు బోయరులతో యుద్ధము చేసి యోడిపోయెను. మఱి రెండుసార్లు వేలువేలు తోప్రిపలగుండ లేడిస్మిత్తునకుఁ జేరఁబ్రయత్నము చేసెనుగాని బోయరుల ధాటికాఁగలేక వెనుకకు మరలెను. నాలుగవసారి మఱియొకమార్గముపట్టి యెనిమిదిదినములు బోయరులతోఁబోరి క్షామపీడితులై దిగులుపడియున్న యాంగ్లభటులకన్నపానముల నిచ్చిబుల్లరురక్షించెను. బోయరు లంతట లేడీస్మిత్తుముట్టడిని జాలించి యందుండిమరలిపోయిరి.

బోయరుల భటసమూహము లంతయు 75000 కంటె నెక్కువలేదు. యుద్ధప్రారంభమునుండియు నాంగ్లేయుల కపజయమే కలుగుచుండుట చూచి, లార్డులాబర్ట్సు 200,000 మంది యశ్వవారులతో 'ఆరెంజిఫ్రీస్టేటును' ట్రాన్సువాలు రాజ్యమును ముట్టడించి, బోయరుల ప్రెసిడెంటగు క్రూగరును నోడించెను. అందుపై నాతఁడు హాలండుదేశమునకుఁ బోవలసివచ్చెను. క్రాంజి మొదలగు బోయరుల మహావీరులునుగూడ నిట్లే యోడిపోయిరి. అందుచే 1902 సం॥ మేనెలలో బోయరులుసంధిచేసికొని, ఆత్మరక్షణార్థము కొన్నియాయుధములను మాత్రముంచుకొని తక్కిన యుద్ధపరికరముల నాంగ్లేయులకిచ్చివేసిరి. యుద్ధప్రారంభమునుండియు బోయరులాంగ్లేయులకుఁ జేసిన యపకృతులను క్షమించి, దేశమునను న్న బంగారుగనులనుస్వాధీనము చేసికొని ఆంగ్లేయులు యుద్ధసమయమున నాశముచేసిన బోయరుల వసతులను బాగుచేసికొనునిమిత్తము 3000000 సవరనులను బోయరుల కాంగ్లదొరతనమువారనుగ్రహించిరి.

ఆస్ట్రేలియాద్వీపమాంగ్లేయుల నాలుగవకాలొనీ. ఆంగ్లదేశమునద్వీపాంతరవాసదండనపాత్రులైనదోషస్థుల నీద్వీపములకుఁబంపుచుండెడివారు.



అందుచేఁ గొంతికాలమువఱకు నీద్వీపములకు వలసవచ్చుట నిందాపాత్రముగా నుండుటచే నాంగ్లేయు లిచ్చటకు వచ్చుటకు వెనుకఁదీయుచుండిరి. 1864సం॥లోఁ దండింపఁబడినదోషస్థులనీద్వీపమునకుఁబంపుటదొరతనమువారు మానుకొని దానికిఁ బట్టియున్న నిందనుదొలఁగించిరి. అప్పటినుండియు నాంగ్లేయులు వేలకొలఁదిగా నిచ్చటఁజేరి కాలక్రమమున నాదేశవాసులను రూపుమాపిరి. న్యూసౌతువేల్సుఅను నీద్వీపముయొక్క దక్షిణభాగమునందు లోకమునందలి బంగారుగనులనన్నిఁటిని మించిన సువర్ణపుగనులు బయలుపడినవి. ఇచటమూగిన జనసంఖ్యనుబట్టి యీభాగమును దక్కినభాగముల నుండి వేఱుచేసి విక్టోరియా యను పేరుపెట్టిరి. ఈగనులనుండి 4000000 సవరనుల విలువగల బంగారము ప్రతిసంవత్సరము మెగుమతి చేయఁబడును. ఈద్వీపముయొక్క యితరభాగములయందునుగూడఁ గొలఁదిగనో గొప్పగనో బంగారుగనులుబయలుపడినవి. అందుచే ద్వీపమంతటపల్లెలువృద్ధియై పట్టణములుగా మారిపోయినవి. ఈగనులలోఁ బనిచేయుటకుఁ గావలసినవారికంటె నధికముగా జనసంఖ్యవృద్ధియైనది. ఈబంగారుగనులు బయలు పడకపూర్వమీద్వీపమునఁ బ్రవేశించినవారు సేద్యముచేసికొని గొఱ్ఱెలను బెంచుటతప్ప మఱియొక వృత్తిలేక యొక్కొక్కఁడు వేయియకరముల చొ॥ భూమిని నాక్రమించుకొని నివాసము లేర్పఱచుకొనిరి. గనుల కాశించి యీద్వీపమును జేరిన మిక్కిలిప్రజలకు వ్యవసాయమే గతియై పూర్వపుమాన్యస్వాములతోఁ బోరాటములుపెట్టికొని భూమికొఱకుఁ దగవులాడుచువచ్చిరి. ఇట్టిమాన్యస్వాముల సంఖ్యకంటె వ్యవసాయపు సేరీల కొఱకుఁదగవులాడు రయితుల సంఖ్యయే యెక్కువయ్యెను. ద్వీపమంతయు న్యూసౌతువేల్సు, టాస్మేనియా, వెస్టు ఆస్ట్రేలియా, సౌతుఆస్ట్రేలియా, విక్టోరియా, క్వీన్సులాండు— అను నాఱుభాగములుగా విడిపోయియున్నది. దక్షిణభాగములు శీతలప్రదేశములగుటవలన నాంగ్లేయులకు వాసయోగ్యములయి యున్నవి. ఉత్తరభూము లుష్ణప్రదేశములగుటవలనఁ జైనావారిని కూలీలనుగాఁబెట్టుకొని ధాన్యాదులను జెఱకుపంటను పైరుచేయించుదురు. ద్వీపముయొక్క

మధ్యభాగములకు నీటివసతి తక్కువగుటచే వ్యవసాయమునకు వలనుగాక యడవిలో నిండియుండును. పైనిజెప్పఁబడిన యాఱుభాగములున్బ్రతినిధి సభలమూలమున దేనికదిస్వతంత్రమై రాజకార్యములను జరుపుకొనుచున్నది. అన్నిభాగములకునుసమష్టిమీఁద నొకప్రతినిధి సభయొక్క యాధిపత్యముక్రిందఁ గనడా డొమినియనువలె ఫిడరల్ దొరతనము నేర్పఱుపఁ బ్రయత్నములు జరుగుచున్నవి.

ఆస్ట్రేలియా దీనికి దక్షిణ దిక్కునఁ దూర్పుకొననున్న న్యూజీలండు ద్వీపము నైదవగొప్ప కాలొనీ. ఇం దుత్తరమున నొకటియు, దక్షిణమున నొకటియు, దీనికి దక్షిణమున చిన్నద్వీపము మఱియొకటియు మూఁడుద్వీపములు గలిసియున్నవి. విక్టోరియారాజ్ఞికాలములోనే 1839 సం॥ లో మొదట నాంగ్లేయు లీద్వీపములకు వలసవచ్చిరి. ఆస్ట్రేలియాలో స్వదేశవాసులంతఁగా లేకుండుటచే దానినాక్రమించుకొనుట కాంగ్లేయులు విశేష శ్రమపడ నక్కఱలేకపోయినది. ఈ న్యూజీలండు దీవులయం దట్లు కాక, మెయోరీలను స్వదేశవాసులు వేనవేలు వసించియుండిరి. వీరుక్రూర స్వభావము గలవారును, కడుబుద్ధి శాలురును బరాక్రమ మహితులు నగుటచే నాంగ్లేయు లీద్వీపములలోఁ గాలుపెట్టినదిమొదలు ముమ్మారు యుద్ధము చేసి యాంగ్లేయులను వెడలఁగొట్టి స్వదేశమును గాపాడుకొనవలెనని మహా బలపరాక్రమములతో యుద్ధము చేసిరిగాని బలాఢ్యులగు నాంగ్లేయుల ముందఱ నిలువఁజాలక పోయిరి న్యూజీలండువారికి పార్లమెంటులో నలుగుర సభ్యులను నియమించుకొను నధికారమిచ్చి, వారికిఁ గొన్ని మడిమాన్యములిచ్చి ఆంగ్లదొరతనమువా రీద్వీపము నేలుచుండిరి. ద్వీపములు మూఁడును నాఱు వేఱ్వేఱు భాగములుగా విభజింపఁబడి యొక్కొక్క దానికిఁ బ్రత్యేకముగ నొక్కొక్క ప్రతినిధి సభ యేర్పడెను. ఈసభలే రాజకార్యములను గొంతకాలము నెఱవేర్చెను. 1875 సం॥ లో నీవేఱ్వేఱు ప్రతినిధి సభ లొక్కటిగాఁ జేయఁబడినవి. ఆస్ట్రేలియావలెఁ గాక యీదీవులయందు నీటివసతి బాగుగానుండుటచే సమశీతోష్ణములుగలిగి యాంగ్లేయు



లకు వాసయోగ్యముగా నుండును. ఈదీవుల నుండియే మాంసము విశేషముగా నింగ్లాండున కెగుమతి యగుచున్నది. మనదేశమునందు నల్లమందు, సురాపానద్రవ్యములు, ఉప్పు, వ్యాపారములు దొరతనమువారిచేఁ జేయఁబడుచున్న ట్లీదీవులలో (ఇండస్ట్రి) వర్తకము మొదలగు పనులన్నియు దొరతనమువారిచేతనే చేయఁబడును.

పైనిజెప్పిన కాలొనీలుకాక సుమాత్రా జావా మొదలగు నీస్టిండియా దీవులును, ఇండోచీనామలయభూములును, పినాంగుమలాకా సింగపూరు దీవులును గూడ నాంగ్లేయుల యాధీనములో నుండెను.

కలోనియను లొకప్పు డాంగ్లదేశమునుండి కాలొనీలకు వలసపోయిన వారలే కనుక నింగ్లాండు దేశస్థులతో నేకభాషావాచకులును, ఏకమతాభిమానులును, ఏకజాతి సంభూతులునైయుండిరి. అందుచే వారిలో వారికన్యోన్యానురాగమును నభిమానమును విడిపోలేదు. దూరభారమును నగ్గించుటకు నీనావదారులును తంతిమార్గములును నేర్పడియున్నవి. ఎచ్చటనే దేశమునన్నను ఆంగ్లజనుల కపాయము గలుగకుండ నాంగ్లదొరతనము నారభిమానించుకొని కాపాడుచున్నారు. ఆంగ్లదొరతనమువారికి బోయరులతో యుద్ధము సంప్రాప్తమై పరాజయముగలిగినప్పుడు కాలొనీలలోనున్న యాంగ్లేయులు మాతృదేశముపై నభిమానముంచి ఆఫ్రికాకు సాహాయ్యము సేనలనంపిరి. ఈకారణములచేఁ బైనివివరింపఁబడిన కాలొనీలనుండి యాంగ్లపార్లమెంటునకును బ్రతినిధులను దెచ్చుకొని ఆంగ్లరాష్ట్ర సమష్టి రాజకార్యములను నందఱికి ననుకూలముగాఁ బరిష్కరించుకొనుచు, నాంగ్లదేశ రాజే యాంగ్లజనవాసితమగు ప్రదేశముల కన్నిఁటికి రాజై యాజ్ఞ చెల్లించుచుండునట్లును, ఏకాలొనీ వారా కాలొనీయొక్క ప్రత్యేక రాజకార్యములను బ్రత్యేకము జక్కఁబెట్టుకొనుచు నాంగ్లదొరతనము వారికిఁ బన్నులనియ్య నక్కఱలేకుండ స్వతంత్రముగఁ బనిచేసికొనునట్లును, రాష్ట్రసమష్టిమీఁద ఫిడరల్ పాలనాపద్ధతిని నెలకొల్పవలెనని యాంగ్లరాజకార్యదీక్షులు ప్రయత్నములు చేయుచున్నారు. లార్డు కిచనరును నిట్టిఫిడరల్ పాలనావ్యూహమునకు నాయకునిగాఁ గొలఁదిదినముల క్రిందటనే యేర్పఱచుటచే నాంగ్లేయుల సంకల్పములు నెఱవేరుచున్నవని చెప్పుటకు సంతోషమగుచున్నది.



ఎడ్వర్డు చక్రవర్తిం

# అధ్యాయము. 28.

## ఉపసంహారము

### ఇండియా దేశము — స్వరాజ్యము.

ఆంగ్లదేశ రాజ్యాంగనిర్మాణచరిత్ర మింతవఱకు సవిస్తరముగ వివరింపఁబడినది. ప్రపంచమందలి యితరదేశము లం దిప్పుడు వెలసియున్న రాజ్యపద్ధతులన్నిటికంటెను నాంగ్లరాజ్యపద్ధతి బహుశ్లాఘాపాత్రమున, ప్రజలకు నెక్కుడు శ్రేయోదాయకమును నని నిశ్చయముగఁ జెప్పవచ్చును. రాజువలనఁ బ్రజలకుఁగాని, ప్రజలవలన రాజులకుఁగాని, సంపన్నులవలనఁ బేదలకుఁగాని, యధికారాధిక్యతవలన నెట్టియాపదయుఁ గలుగకుండఁ గాపాడుట కాంగ్లరాజ్యపద్ధతికంటె నుత్తమసాధనము లేదు. పరరాజులవలని యపాయము గలుగకుండ దేశమును రక్షించుకొనుట కాంగ్లమహాజనులయందున్న దేశాభిమానమే పెట్టనికోటవంటిది. మతభేదము లెన్నియున్నను, పేదసాదల తారతమ్య మెంత యున్నను, దేశీయు లందఱియందును జాత్యభిమానము (National feeling) నైకమత్యమును జక్కఁగఁ బాదుకొనియున్నవి. ప్రప్రథమమున జమీదారులే ప్రముఖులై రాజు నిరంకుశాధికారమును జేపట్టకుండఁ బ్రతిఘటించుటయుఁ దరువాత జమీదారులంతరించి ధనాధికులును భూస్వాములును వారిస్థానమునఁ బ్రవేశించి ప్రజాక్షేమమును గాపాడుటయు, నానాటికి కృషివాణిజ్యాదులు వృద్ధియైన కొలఁది కోటీశ్వరులును గాక కూటిపేదలును గాక యైశ్వర్యవంతులగు మాధ్యమికగృహస్థులు ప్రముఖులై రాజ్యతంత్రమును దేశమునకు క్షేమకరముగ నడపుటయు, మొదటి 'రిఫారము అక్టు' వలన నిట్టి రాజకార్యదక్షత సామాన్యజనులకుఁగూడ వ్యాపించుటయుఁ గట్టకడపట పట్టణవాసులలోఁ బ్రతిగృహస్థునకును, పల్లెలలో వ్యవసాయమే జీవనముగాఁగల ప్రతిరయితునకును, ఫాక్టొరీలయందుఁ గూలిచేసికొని జీవించు కూలివాండ్రకునుగూడ, నిట్టి రాజకీయ వ్యవహారస్వాతంత్ర్యము గలుగుటయు, నాంగ్లదేశీయులపాలిటి మహా



భాగ్యమని నొక్కిచెప్ప వలసియున్నది. ఇట్టిభాగ్యలక్ష్మి వీరికి లభించుటకు వీరు జర్మనీదేశమునుండి వలసవచ్చి యాంగ్లభూమియందుఁ గాలుపెట్టినది మొదలుగా నేటివఱకును నిరంతరాయముగాఁ బాటుపడి, రాజనీతిని బ్రజాప్రతినిధిప్రభుత్వ పక్షముగా మార్చుకొని ధన్యులైరి. ఇప్పుడు వర్థిల్లుచున్న రాజ్యాంగనిర్మాణము వీరు మఱియొక దేశము వారినుండి క్రొత్తగాఁ దెచ్చిపెట్టుకొన్నది గాక, యాంగ్లదేశమునకు రాకముందే వా రనుభవించుచున్న రాజకీయాచారములను గాలానుగుణముగ వృద్ధిచేసికొని యేర్పఱచుకొన్నదే యని వేఱె చెప్పనక్కఱలేదు. అన్నిదేశము లందువలెనే యాంగ్లదేశమునందును రాజులు దైవాంశసంభూతులనియు, వారు చేసినదెల్లను ప్రజలచే శిరసావహింపఁబడవలెననియు, మతాచార్యులు దేవునికి సాక్షాత్ప్రతినిధులనియు, మూఢసిద్ధాంతములు బయలుదేరి కొంతకాలము దేశమును బాధించినవి. ఆంగ్లజనుల నలంకరించుచున్న సుగుణసంపదయే వారిని గాపాడి వారిదేశమున కీపీడలు లేకుండఁ దొలఁగించినది. కాఁబట్టి యాంగ్లేయుల గుణసంపదకు మూలబీజమును వాచకులు గ్రహించవలెను.

మనుష్యునకు నితరప్రాణులతోఁ బాటు స్వార్థపరుఁడై పరుల కష్టసుఖముల నాలోచింపక పాటుపడు ప్రవృత్తిధర్మ (Principle of struggle for existence) మొకటియుఁ బరార్థప్రాప్తిని గోరి యైహికార్థమును లక్ష్యపెట్టని శీలముగలిగి ప్రవృత్తిధర్మమునకు విరుద్ధమగు నివృత్తిధర్మ (Principle of altruism) మొకటియు, నీరెండుధర్మముల నేదోయొకదాని నవలంబించుటకు స్వాతంత్ర్యముగల యిచ్ఛా (Freedom of will) శక్తియు, నివృత్తిధర్మమును బ్రవృత్తిధర్మమునుండి వేఱుచేసి మనస్సునకు గోచరింపఁజేయు సాక్షిచైతన్యమును (Conscience) గూడనున్నవని హిందూవేదాంతులును పాశ్చాత్య పరిణామవాదులును (Evolutionists) సిద్ధాంతీకరించి యున్నారు. ఈరెండు ధర్మములను సమానములుగా నుపయోగించుకొనుచు, నివృత్తిధర్మముల కనుకూలముగాఁ బ్రవృత్తిధర్మములను నడపుకొన్నయెడల, మనుష్యుఁడు పురుషార్థపరుఁడై, స్వతంత్రుఁడై, న్యాయైక

శీలుఁడై, పరోపకార సంకల్పుఁడై, ధైర్యసాహసములు గలవాఁడై, పరాక్రమశాలియై స్వశక్తివిశ్వాసమును, నాత్మగౌరవమును గలవాఁడై యిహపరసౌఖ్యముల ననుభవింపఁగలఁడు. కేవలము ప్రవృత్తిధర్మములనే ప్రధానము చేసికొని నడచుకొన్నయెడలఁ దామసగుణము వృద్ధియై యహంభావము, దంభము, లోభము, స్వప్రయోజన పరత్వము, స్వజాత్యభిమానము, పరద్వేషము, క్రౌర్యము, గర్వము మొదలగు రాక్షసగుణములు పట్టువడి, కీర్తిపౌరుషములకుఁ జెడి, యధోగతి పాలగును. కేవలము నివృత్తిధర్మములను బాటించి ప్రవృత్తిధర్మముల నాచరింపనియెడల, నేలవిడిచి సాముచేయువాఁడై, యిహపరములకుఁ జెడి, తామసగుణము వృద్ధియై, దైన్యము, దాస్యము, దురభిమానము, పిఱికితనము, కుత్సితము, నిష్పౌరుషము, క్రియాశూన్యత, జడత, మొదలగు హేయగుణముల కాటపట్టగును. ప్రవృత్తిధర్మము మనుష్యునకు స్వస్వధర్మములను (Personal rights) బోధించును. నివృత్తిధర్మము పరులయెడలఁ బాటింపవలసిన విధులను (Duties) బోధించును.

ఆంగ్లేయులకును, హిందువులకునుగల తారతమ్యమును సుకరముగాఁ దెలియజేయుట కీతత్త్వవివరణ మిచట చేయఁబడినది. నివృత్తిధర్మములను లక్ష్యముగా నుంచుకొని ప్రతిమనుష్యునకుగల మనోబుద్ధులను వృద్ధిచేసికొనవలెననియు, నిట్టికృషిలో మనుష్యుఁడు పరతంత్రుఁడుగాక స్వతంత్రుఁడై స్వబుద్ధినడపినట్లు నడచుకోవలెననియు, నీశ్వరునికిని నీశ్వరాంశమైన యాత్మసాక్షికిని (నివృత్తిధర్మమునకును) దప్ప పురుషుఁడు పరశక్తికిదాసుఁడుకాఁగూడదనియు, నాంగ్లేయులు నమ్మివర్తించు పరమధర్మములు. స్వేచ్ఛానుసారము మతవ్యవహారములను జరుపుకొనుట కాంగ్లరాజ్యములో నాటంకములు గలుగగాఁ గొందఱాంగ్లేయు లమెరికా దేశమునకు వలసపోయియచ్చట తమ స్వాతంత్ర్యమును గాపాడుకొనుటయుఁ దమయాలోచనము నంగీకారమును లేక యాంగ్లపార్లమెంటువారు తమపయిన విధించిన పన్నుకట్టుకోమని నిరాకరించి, యాంగ్లదొరతనమువారి నెదిరించి తాము స్వతంత్రరాజ్యమును సంపాదించుకొనుటయు, పార్లమెంటుయొక్క యధి



కారములు దిగఁద్రొక్కి నిరంకుశముగ నేలఁదలఁచుకొన్న రాజులతో నిరంతరముగాఁ జిరకాలము ప్రజలు పోరి సిద్ధసంకల్పు లగుటయు, మతవిషయమున పోపుయొక్క నిరంకుశశ్రీముఖములను లక్ష్యపెట్టక యతని యాచారత్వమును దొలఁగించుకొనుటయు, నిట్టిమహావీరచరితము లన్నియు వీరియందుఁ బాదుకొనియున్న చిత్తప్రవృత్తిధర్మ స్వాతంత్ర్యశీలముచేతనే వారునడపఁగలిగిరి. ఈగుణము వారియందుండుటచేతనే వారికాత్మగౌరవము, స్వశక్తివిశ్వాసము, దృఢప్రతిజ్ఞయు, ధైర్యమును మెండుగానున్నవి. ఇట్లని వీరాత్మప్రవృత్తినే (Individualism) కేవలము పాటించినవారుగాక నివృత్తిరూపములైన యంతరాత్మధర్మములను బ్రవృత్తిధర్మముతో సమముగాఁ బాటించువారుగనుకనే, వారిచరిత్రలో వారి స్వేచ్ఛావృత్తి కెన్నియడ్డములు వచ్చినను వారించుకొని, ప్రపంచమునెక్కడ యేజాతివారు స్వేచ్ఛాసంపాదనకొఱకుఁ బాటుపడుచున్నను, వారికిశరణమిచ్చి, పరోపకారమే పరమార్థముగాఁగలిగి బానిసలవ్యాపారమును మాన్పించి, దేశకంటకులగు నధికారులను రూపుమాపి, విషయలోలురై చెడిపోక, ప్రపంచచరిత్రలో నిరుపమాన యశోవిశాలురై వర్ధిల్లుచున్నారు. స్వశక్తి విశ్వాసము గలవారగుటచే, వారియందుపాయకల్పనము, సాధనసంపాదనము, క్రియాదీక్ష మొదలగుక్రియాంగకలాపము వారిసొమ్మై విజయలక్ష్మిని వారికి వశవర్తినిఁజేసెను. ప్రవృత్తిధర్మములకుఁ దోడునీడలై వారిలో నివృత్తిధర్మములు పెంపొందుటచే వారియందుఁ బరోపకారశీలము (Altruism) వృద్ధియై, యెండలనక, కొండలనక, నాగరికులనక, ముష్కరులనక, వారిమతాచార్యులు సకలదేశములకునుబోయి, సకలభాషలను నేర్చి, ప్రపంచమంతయు వ్యాపించి, వారుకాలుపెట్టిన ప్రదేశములను దమబుద్ధిబలముచే బాగుచేసి విద్యావివేకములను వెదజల్లినారు. వీరికిమనోనిగ్రహము మెండుగానుండుటచే, వీరు ప్రాయికముగాఁ బూర్వాచార పరాయణులుగా నుందురు. ఐనను నివృత్తిధర్మ సంపద యెక్కుడుగాఁ గలిగిన యొక తెగవారు కాలానుగుణముగ మనసాంఘిక రాజకీయాచారములను

మార్పుచేసి, దేశమందుజడత్వము (Stagnation) పీఠము గట్టుకొనకుండఁ గాపాడవలెనని సంకల్పించుచుండుటయుఁ బ్రవృత్తిధర్మసంపద యొక్కుడుగాఁగలిగిన పటీయొకతెగవారు రెండవతెగవారి ప్రయత్నములలోని లోపములను గనఁబఱచుచువారు విశృంఖలముగాఁ బోకుండ జాగ్రతపెట్టుచుండుటయు, నుభయపక్షములవారును, దమతమయభిప్రాయములను జెల్లించుకొనవలెనని పూనుకొని ప్రజాబాహుళ్యమునకు హితబోధ చేయుటయు, నీ చరిత్రలోమనము చూచియున్నాము. ఇందువలననే వారుజడత్వము లేక యభివృద్ధిపరంపరల నందుచున్నారు.

ఆంగ్లేయులకున్న స్వతంత్రతా శీలముయొక్క ఫలముగావారిప్రవర్తనమునకు దారిచూపినడపుటకుఁ దమహృదయము నేనమ్ముకొందురుగానిపరతంత్రమును జోరనిచ్చి యితరుల నిబంధనలను గౌరవించరు. మనదేశీయులలో నట్లుకాదు. ప్రతిమనుష్యునకును, బ్రవృత్తిధర్మములతోఁబాటు నివృత్తిధర్మములుండుటవలన, నెంతవఱకుఁ బ్రవృత్తిధర్మముల నడపవలెనో, యెంతవఱకు నివృత్తిధర్మముల మూలమునఁ బ్రవృత్తిధర్మములను నిగ్రహింపవలెనో, యెవరిబుద్ధికివారికే తోఁచునని యాంగ్లేయుల మతము. మనదేశస్థుల కట్టి స్వశక్తి విశ్వాసములేదు. మనలో బయలుదేరిన స్మృతులు మన ప్రవృత్తిధర్మములను నడపుటకు మార్గము లేర్పఱచుచున్నవనియు, సంసారులకట్టి మార్గములను గనుగొనుటకు శక్తిలేదనియు, శాస్త్రనియమముల ననుసరించి మతసాంఘిక వ్యవహారములను మనము జరుపుకొనవలెననియు వేలకొలది సంవత్సరములనుండి మనలోఁ బాటింపఁబడుచున్నపరమధర్మమై యున్నది. ఆంగ్లేయులవలె మనకాత్మగతులు ప్రమాణములు కావు. శాస్త్రమో, ఆచారమో, దయ్యమో, దేవతయో, పురోహితుడో, జ్యోతిషమో, పంచాంగమో, మనకన్నివిషయములందును నిదిదారియని చూపినవిధి (Duty) ననుసరించి మనము నడచుకొనుటకే యలవాటు పడియున్నాము గాని, తినుటకుగాని, తిరుగుటకుగాని, బట్టకట్టుకొనుటకుగాని మనకు స్వతంత్రము లేదు. ఇట్లుమనకున్న స్వస్వధర్మములను (Personal



rights) బట్టి వర్తించుట కలవాటుతప్పి, మనయందున్న నివృత్తిధర్మములను గాక, మనకంటె నితరము లగు శాస్త్రవిధుల (Duties) యందుఁ బరమ గౌరవముతో మనము యుగములనుండి నడచుకొనుచున్నాము. అందుచే రాజకీయ వ్యవహారములందు మన రాజుల కాలములో మనకుజోక్యము లేదు. ఈకారణములచే మనవారి మనోవృత్తులు పోయినదారినే పోవుచు, జడత్వము (Stagnation) నొంది నూతన పర్యాలోచన కవకాశము నియ్యకపోయినవి. శాంతము, వైరాగ్యము, పరాపరాధ సహనము మొదలగుకొన్నియుత్తమ సాత్వికగుణములు మనకుఁ బట్టుపడినవి కాని, కేవలము నివృత్తి ధర్మములు పాటించినవారికిఁ బ్రాప్తించు పైని వివరింపఁబడిన తామస గుణములుకూడ మనలోఁ బీఠముగట్టుకొనియున్నవి. మనలోఁ బారమార్థికవృత్తి (నివృత్తిధర్మము) బ్రాహ్మణులకును, ఆర్థికప్రవృత్తి క్షత్రియాదులకును నాచారముగా స్థిరపడుటచే బ్రాహ్మణులకు గౌరవమధికమై బ్రాహ్మణ ధర్మములందు క్షత్రియులకునీర్ష్యపుట్టించి క్షత్రియులను గూడ రాజర్షులనుగా మార్చివేసినది. అందుచేఁ జారిత్రముల కందని పూర్వకాలమునందే క్షత్రియులు దేశరక్షణాది క్షాత్రధర్మములకుదూరగులై, కేవలము మానదీక్షాప్రధానమైన యుపనిషద్విద్యలకుఁ గారకులైరి. అందుచే విద్యావివేక సంపదగల వారియందే మనలో నంతఃకరణ విజృంభణము కలుగక పురుషార్థ ప్రవృత్తి యడుగంటి క్షాత్రము రూపుమాసి, స్వగౌరము ; తప్పిపోయి పారతంత్ర్యము మనదేశమునకు సంప్రాప్తమయినది.

గ్రీకులు, మహమ్మదీయులు, ముసల్మానులు, ఫ్రెంచివారు, పోర్చుగీసులు, ఒలందులు, ఇంగ్లీషువారు మొదలగు విదేశీయులెందరో మనదేశము నాక్రమించుకొని ప్రభుత్వము నడపినారు. ఈవిదేశీయులందఱిలో నాంగ్లదొరతనము వలననే మనదేశ మభివృద్ధికి వచ్చినది. పశ్చిమ ఖండమునుండి వచ్చినవారిలో నాంగ్లేయులుతక్క తక్కిన ముగ్గురిలో నెవ్వరు మనదేశమున రాజ్యము చేసినను, వర్తమాన మందు మనదేశమునకబ్బిన యభివృద్ధి కలుగక పోవును. వారివారి దేశముల చారిత్రములనుబట్టియే, ఫ్రెంచివారు

గాని, ఒలందులుగాని పోర్చుగీసు వారుగాని యాంగ్లదొరతనము వారివలె మన దేశమును వృద్ధిచేయఁజాలరని నిశ్చయముగఁ జెప్పవచ్చును. కాఁబట్టి యాంగ్లేయులు మనదేశముపయి రాజ్యభారము పూనుట యిండియా దేశమునకు మంచిదినములు సంప్రాప్తమగుటకు నీశ్వరసంకల్పము కలిగినట్లే మనమెంచవలసియున్నది. మనవలన వారు వినయము, శాంతము, వైరాగ్యము, ఆత్మవిద్య మొదలగు నివృత్తిధర్మములను నేర్చుకొనుటకును, వారివలన మనము రాజ్యకార్యదక్షత, ఆర్థికకళలు మొదలగు ప్రవృత్తిధర్మములను నేర్చుకొని తిరిగి తలయెత్తుకొనుటకును నవకాశము కలిగినది.

ఆంగ్లేయులు మనదేశమును స్వాధీనము చేసికొనుట కారంభించిన కాలములో రాజ్యము చేయుచున్న తురకలు భోగపరాయణులై రాజ్యభారమును వహించ శక్తిలేనివారైయున్నారు. స్వదేశ సంస్థానాధీశ్వరులైకమత్యములేక సంఘీభూత రాజకార్య దక్షతలేనివారై యున్నారు. బందిపోట్లు, హత్యలు, ఘాతుకకృత్యములు, స్త్రీలను జెఱపెట్టుట, మతాంతర సహనము లేకుండుట, మొదలగు ననర్థశతము లెల్లయెడలను దేశమును బీడించుచున్నవి. దేశమందలి యిట్టి యల్లకల్లోలముల నణఁచి సుభిక్షమగు సెంట్రిలు గవర్నమెంటు పద్ధతిని నెలకొల్పి, జయైశ్వర్యతోఁబోరాడు విదేశరాజులను బలముడిగించి లోఁబఱచుకొని, దేశమునకు విదేశరాజుల దండయాత్రలవలనిపీడ తొలగించుటకుఁదగు ప్రయత్నములుచేసి, ఆంగ్లేయులు మనదేశమున కెంతేని మహోపకారము చేసియున్నారు. బుద్ధివికాసమున కవకాశము నియ్యక, పోయినదారినే పోవుటకు వలను గలుగఁజేయు పూర్వకాలపు విద్యాభ్యాసము నొకమూలఁబెట్టి మనోవిజృంభణము గలుగఁజేసి వివేకసంపదను బుట్టించు నాంగ్లవిద్యాభాగ్యమును మనదేశమునకుఁ దెచ్చిపెట్టినారు. మనుష్యునకున్న సహజస్వాతంత్ర్య ధర్మములను, నంతఃకరణము యొక్క మహద్గౌరవమును సువ్యక్తముగా బోధించు నాంగ్ల గ్రంథరాజములను మనదేశమందు వెదజల్లినారు. కృషి వాణిజ్యాదులకు వలయు సదుపాయములను వేనవేలుగా సమకూర్చినారు. విక్టోరియామహారాజ్ఞిగారు చక్రవర్తినీ బిరుదమునంది యిప్పటి



కెబువదివత్సరములు నిండకపోయినను నాంగ్లేయుల సంసర్గ భాగ్యముచేత మనకిప్పు డంతఃకరణశక్తియు, స్వామిత్వధర్మ విజృంభణమును, ఆత్మగౌరవమును, స్వాతంత్ర్య ధర్మమాహాత్మ్యమును, బోధపడి నానాటికి లౌకికపారమార్థిక విషయములందుఁ బ్రాచీనమార్గములను సవరించుకొని పురోవృద్ధికి ముందంజవేయవలెనని సంకల్పించుచున్నాము. వేయి సంవత్సరములనుండి ప్రజల విద్యాభివృద్ధులకయి శ్రద్ధపుచ్చుకొను రాజులులేక నిద్రాముద్ర వహించియున్న హిందువుల మనస్సు లిప్పుడు మేల్కొనఁ గనుచున్నవి. పోయినదారినేపోయి జడత్వము నొందియున్న హిందువుల యంతరంగము లిప్పుడు నూతన సంకల్పముల సందడిచేఁ గదలికగలిగి తొట్రుపడుచున్నవి. అభివృద్ధిలేక మ్రాన్పడియున్న వీరిహృదయము లిప్పుడు నూతనోజ్జీవము నొంది పల్లవించుచున్నవి. చెప్పఁబూనుకొన్నచో నాంగ్ల మహాజనులతో మనకు సంబంధము కలుగుటవలన మనదేశమునకుఁ గలిగిన లాభశతము లనేకములు కలవు. అన్నిటికంటెను బ్రధానమైన యొక్క మహద్భాగ్యమును మాత్రమిచట వక్కాణించి యీవిషయమును విరమించెదము. ఆంగ్లేయవిద్యాబీజములు మనలో నాటుకొనకపూర్వము, మనదేశవాసులు లెక్కలేని వర్ణభేదముల చేతను, మతభేదముల చేతను, జాతిభేదముల చేతను, శాఖాభేదముల చేతను, విడిపోయి భేదబుద్ధితో నున్నారము. ఇప్పుడు దైవవశమున నిట్టి భేదబుద్ధికిఁ దీవ్రతతగ్గి భావనారూపమున నైన విద్యాధికులలో సర్వజన భ్రాతృభావ మొకింత మొలకెత్తుచున్నది. మఱియుఁ బూర్వమువలె, నేది యెట్లు పోయిన నేమియని యూరకుండి, కాలగతియు, దేశాధిపతుల చేష్టలును, ముష్కర ప్రజల ఘోరములును నెట్లున్నను బని గలుగఁజేసికొనక, స్వప్రయోజనమునకు మాత్రము పాటుబడుచుండు ప్రమత్తత యిప్పుడు విద్యావివేకములగల వారియందు నానాటికి క్షీణించుచు, దేశక్షేమముకొఱకుఁ బరోపకారశీలముతోఁ గ్రియాదక్షులై పనిచేయుటకు మనవారు నేర్చుకొన్నారు. అయినను జనబాహుళ్యము వారికి జడత్వముపోయి, సాంఘిక రాజకీయ వ్యవహారములందు జ్ఞానాభివృద్ధియుఁ బూనికయుఁ గ్రియాదక్షతయు, జాగరూకతయుఁ బొడముకొని వారిమూలమున నిండియాకు సుదినములు వచ్చుటకుఁ జిరకాలము పట్టును.

ఆంగ్లేయులకు మనదేశము స్వాధీనమైనకొలఁది మనదేశస్థులకును దమకునుగల తారతమ్యమును గనిపెట్టి యిప్పుడు మనదేశములో వెలసియున్న రాజ్యపద్ధతులే మనదేశస్థుల చిత్తవృత్తికిఁ దగినవనియు, వారిదేశమందున్న ప్రజాప్రతినిధిపాలనాపద్ధతులు మనకు సరిపడవనియు నిశ్చయముచేసికొని ప్రెసిడెన్సీకొక్కగవర్నరును, గవర్నరునకులోఁబడినడచుకొన శాఖోపశాఖలుగల యుద్యోగస్థులను నియమించి, దేశసమష్టిమీద నన్నిప్రెసిడెన్సీలకును నాయకత్వముపూని యాంగ్లదేశమునందున్న రాజుయొక్కయు, పార్లమెంటువారియొక్కయుఁ జట్టముల నమలుజరుపుటకు గవర్నరుజనరలును నిలిపి సెంట్రలు గవర్నమెంటును స్థిరపర్చి, పరస్పరవైరములతో నొక పరగణావారు మఱియొక పరగణాలను బాధించకుండ రాజ్యముచేయుచుండిరి. వీరికిఁ బూర్వమిట్టి యేకచ్ఛత్రాధిపత్యము లేకపోవుటచే దేశమునందు నలుగడలను నల్లుకొన్న నల్లకల్లోలమంతయుఁ దొలగిపోయి జనులు సుఖజీవనముచేయుచు విద్యాభివృద్ధియుఁ గృషివాణిజ్యాదులును జేసికొని నానాటి కైశ్వర్యవంతులగుటకు మార్గమేర్పడినది. ఇట్లుకొంతకాలము విద్యావివేకములను సంపాదించుకొని యాంగ్లేయుల గ్రంథరాజములను జదివినకొలఁది మనదేశీయులలో విద్యాధికులు మత సాంఘికాచారసంస్కారముల నారంభించిరి. ఆంగ్లదొరతనమువారు మనదేశమును దేశస్థులను బాగుచేయవలెనని యెంతతలపెట్టినను మనయాచార వ్యవహారములు వారికి బోధపడుట సులభముగా సాధ్యముకానందున, నాంగ్లేయులలోఁ గొంద ఱుదారచిత్తులు మనలోని విద్యాధికులను సాహాయ్యముచేసికొని ప్రజలకష్టములను దొరతనమువారికి దెలిఁజేయుటకై యిండియా నేషనలు కాంగ్రెసు సభనుస్థాపించి దాని ముఖమున దొరతనమువారికి సాహాయ్యభూతులుగా నుండి పనిచేయుచువచ్చిరి. ఈకాంగ్రెసు సభవారి కోరికలు చొప్పున దొరతనమువారు కొన్ని మార్పులను జేసి రాజ్యపద్ధతిని సవరించికొనిరి.

అమెరికా దేశస్థులు తమదేశపాలనావ్యూహములో నాంగ్లదొరతనమువారికి జోక్యములేకుండ విడిపోయి విశుద్ధ స్వరాజ్యపద్ధతిని స్థాపించు



కొనిరి. కనడా మొదలగు వలస భూముల వారాంగ్ల దొరతనమువారి యాధిరాజ్యమునకు లోఁబడి విశిష్ట స్వరాజ్య పద్ధతిని బాటించుచున్నారు. ఆంగ్లచరిత్రకోవిదులైన మనదేశభక్తులు కాంగ్రెసుసభాప్రయోజనము స్వరాజ్యసంపాదనమేయని గ్రహించి, అట్టిస్వరాజ్యమమెరికాదేశస్థులనుభవించుచున్న విశుద్ధస్వరాజ్యముగా నుండవలెనని కొందఱును, కనడా మొదలగు కాలొనీలనుభవించుచున్న విశిష్ట స్వరాజ్యముగా నుండవలెనని కొందఱును భిన్నాభిప్రాయులై యున్నారు. వీరి యభిప్రాయము లెంతవఱ కాదరణీయములో నీచరిత్రాంశములను మనము మనస్సునందుంచుకొని యాలోచించుకొనవలెను.

ఈశ్వరావస్థకూడ దాటి యద్వితీయ పరబ్రహ్మానుభవము కలిగినఁగాని జీవునకు ముక్తిలేదని వాదించు విశుద్ధాద్వైతుల (వీరినే వాడుకలో నద్వైతులందురు) వలె, విశుద్ధ స్వరాజ్య పక్షము వారాంగ్లేయులకు మనదేశపరిపాలనములో నెట్టిసంబంధమును నుండఁగూడదనియు, సర్వవిషయములందును సంపూర్ణ పాలనాధికారము మనచేతిలోనే యుండవలెననియు, అప్పుడుగాని దేశస్థులకును, దేశమునకును, నిజమైన స్వాతంత్ర్యభాగ్యమును, ఐశ్వర్యమును, గౌరవమును, గలుగవనియు వాదించుచున్నారు. ఈ మతమువారి ప్రయత్నములను గొనసాగించుకొనుటకుఁ గొందఱు దండోపాయశరణ్యులై (physical Force Swarajists) బాంబులు, హత్యలు చిచ్చుపెట్టుట, రాజ్యవిప్లవమున (Revolution) కుద్రేకము పుట్టించు ప్రజాబోధలు చేయుట, మొదలగు ఘాతుక కార్యకరణమునకుఁ బూనుకొనిరి. ఇంగ్లీషువారినందఱను బలాత్కారముగాఁ జంపి దేశమున వారిపేరే లేకుండఁ జేయవలెనని వీరిమహాసంకల్పము. సామోపాయ శరణ్యులగు మఱికొంద (Moral Force Swarajists) ఱుదాసీనులై యాంగ్లదొరతనమువారికిఁ బ్రజలు పన్నులియ్యఁగూడదనియు, వారిచేనియమింపఁబడిన యుద్యోగములు చేయఁగూడదనియు, వారుదేశమందులేనట్లే ప్రవర్తించుచు వారిరాజ్యపద్ధతిని నడుపుటకుఁ బ్రజలేవిధమున సాహాయ్యపడఁగూడదనియు, తటస్థమార్గము

ను బోధించుచున్నారు. ఈయుభయ పక్షములవారికిని నాంగ్లదొరతనము వారియెడల విశ్వాసములేదు.

వీరి మతము సమాదరణీయము కాదు- ఆంగ్లదొరతనమువారిపై విశ్వాసము విడిచిపెట్టుటకు వీరికిఁ బ్రబలకారణములేవు. మన దేశమున కాంగ్లవర్తకులు క్రొత్తగా వచ్చి దేశము నాక్రమించు కొన్నప్పుడు వా రవినీతులై స్వప్రయోజనపరులై మనదేశస్థుల యార్థికకళాసంపదను దుదముట్టించి మన దేశమున కెంతేని యపకారమొనర్చివారనుటకు సందేహము లేదు. కాని, వీరి దుష్క్రియల కాంగ్లేయజనసామాన్య మంగీకరించినవారు కారు. రాబర్టుక్లయివు మొదలగు నాంగ్లపురుషసింహులొకరివెనుక నొకరుమనదేశమునకువచ్చిన యాంగ్లేయులు న్యాయవర్తనులై నడచుకొనునట్లు తగుపద్ధతులను నెలకొల్పుటకెంతో పాటుపడిరి. మొదటిగవర్నరు జనరలగు వారనుహేస్టింగ్సుపయి నిందమోపిబర్కు కామనులయెదుట నుపన్యసించినప్పుడాంగ్లేయప్రజలకాతనిపయిఁబుట్టిన క్షాత్రమే యాంగ్ల మహాజనులసౌశీల్యమును న్యాయరతిని జాటుచున్నది. ఎంతటిసత్పురుషునకును నధికారగర్వ ముండకపోదు. అనాయాసముగా నాంగ్లవర్తకులు మనదేశము నాక్రమించు కొనుచుండఁగా మృతజీవులవలె మనదేశస్థులు చూచియూరకున్నప్పుడు స్వార్థపరులైవచ్చిన యావర్తకులు మన కపకృతులు జేయుటయొకవింతగాదు. కాఁబట్టి సెంట్రలు గవర్నమెంటు పద్ధతి యేర్పడక పూర్వమాంగ్లవర్తకులు జరిపిన ఘోరకృత్యములకు దొరతనమువారినుత్తరవాదులనుజేసి, వారిపైవిశ్వాసమువిడిచి పెట్టుటకు మనకుఁ గారణము లేదు. ఇప్పుడురాజ్యభారమును వహించియున్న దొరతనమువారు సాధ్యమైనంత వఱకు మనల నభివృద్ధికిఁ దెచ్చుటకుఁ దగుప్రయత్నములు చేయుచున్నారు. జడత్వమునొంది జీవకళతప్పియున్న మన దేశస్థులకువారు పునర్జీవము గలుగఁ జేసినారు. మనలో బీఠముగట్టుకొని యున్న జాతిమతశాఖాభేదములతో సంబంధములేక తటస్థులైన యాంగ్లేయులే మనల సుఖముగ పాలించి యభివృద్ధికిఁ దీసికొనిరాగలరుగాని సర్వజనసోదరభావముగాని, పరాక్రమముగాని, క్రియాదక్షతగాని, రాజకీ



యవిద్యావివేకముగాని, లేని మనవారు వర్తమానస్థితి యందు రాజ్యభారమును వహింపఁజాలరు. ఆంగ్లేయులరాజరికము క్రింద మనము జాతిమతభేదములను జాలవఱకు మఱచిపోయి, దేశాభిమానమును వృద్ధిచేసికొని, సంఘీభూతకార్యదక్షతనలవఱచు కొనవలసి యున్నది. అంతవఱకు శాంతము వహింపఁజాలక తొందరపడి మనదేశీయుల కలవాటు లేని స్వాతంత్ర్యరాజ్యధర్మములను మనము తెచ్చిపెట్టు కొన్నయెడల, ఫ్రెంచివారు మొదలగు పశ్చిమఖండదేశములవా రాంగ్లేయుల ప్రజాప్రతినిధి పాలనాపద్ధతిని దెచ్చిపెట్టికొని వ్యర్థసంకల్పులై దానిని నిలుపుకో లేక విడిచి పెట్టవలసి వచ్చినట్లే మన ప్రయత్నములును ఫలహీనములగును. ఆంగ్లేయుల ప్రజాప్రతినిధి పరిపాలనాపద్ధతికిఁ జారిత్రములకందని ప్రాచీనకాలమునందే మూలబీజములేర్పడి యున్నవి. ఆబీజములను బెంచివానినాటికి వృద్ధిచేసికొని వానిని యుచితరీతి నుపయోగించుకొని వానివలని లాభము నొందుటకు వారు చిరకాలమునుండి యలవాటు పడియున్నారు. ఇట్టి యనుభవమనెడు పాదులేక స్వాతంత్ర్యబీజములు మొలకలెత్తవు. పెరుగవు. ఫలప్రదములుకావు. మఱియు నిట్టివిశుద్ధస్వరాజ్యపాలనాపద్ధతికి సాధారణముగా మూఁడంగములుకలసి పని చేయవలయును. జనులందఱేకభాషావాచకులుకావలయును. ఏకమతావలంబులుకావలెను. ఏకజాత్యభిమానముగలిగి యుండవలెను. అనుభవములేక, యేకభాషావ్యవహారములేక, యేకమతాభిరతిలేక, యేకజాత్యభిమానములేక, ప్రజాప్రతినిధి వ్యవహారమునకు విలక్షణమైన పారతంత్ర్యమే ప్రధానముగాగల సాంఘికరాజకీయాచారముల కలవాటుపడియున్న హిందువుల కీవిశుద్ధ స్వరాజ్యము కంటె ననర్థదాయకమైన పాలనాపద్ధతి మఱియొకటిలేదు. ప్రజలలవాటుపడియున్న రాజకీయాచారములను మూలముట్టఁగఁ దీసివేసి క్రొత్తవానిని దెచ్చిపెట్టుకొన్న ఫ్రెంచివారిచరిత్రమును జూచియున్నాము. ఉన్నయాచారములను నిర్మూలము చేసికోకుండఁ గాలానుగుణముగ జనుల స్థితిగతుల కనుకూలించునట్లు రాజ్యతంత్రమును మార్చుకొనుచు నాంగ్లేయులు వర్ధిల్లిరని చూచియున్నాము. విశుద్ధస్వరాజ్యపద్ధతి యిప్పుడున్న యాంగ్లరాజ్యపద్ధతికి విలక్షణమైనది గాని యల్పదేహము దీర్ఘదేహమయినట్లు

సహజముగ దానినుండి క్రమాభివృద్ధినొందు స్వభావముగలదికాదు. పూర్వా
పరసంబంధమును గాపాడని రాజ్యపద్ధతి మనదేశమునకేకాక యేదేశమునకును
సరిపడదు. ఇంతియకాక రష్యా,జర్మనీ,అమెరికా,జపాను,ప్రభుత్వములవా
రితరదేశములనార్జించుకొని వర్తకసౌకర్యమును సంపాదించుకొనవలెనని కృత
సంకల్పులై యదనువెదకుచున్నారు. మన హిందూదేశమున కన్ని వైపుల
నుండియు నితరరాజులు దండెత్తుట కవకాశమున్నది. అన్ని దారులను
గాపాడు దుర్భరభారము దొరతనమువారి పయిఁబడును. ఆంగ్లేయులీభారము
యొక్క గురుత్వమును బాగుగా గ్రహించి సూయజుకాలువలో సగముభాగ
ములను గ్రయముపొందియు, ఈజిప్టు దేశపరిపాలనమునందుఁ బ్రవేశముకలుగఁ
జేసికొనియు, పరిషియాదేశమునఁదలి దారులను జేతఁబట్టియు, ఆఫుగనిస్థాన
ప్రాంతములను గాపాడుకొనియు టిబెట్టుప్రభువును సుముఖునిజేసికొ
నియు, మనదేశముపయి నాశఁబెట్టుకొనియున్న పరరాజులతో నెయ్యము
గూర్చుకొనియు, నెన్నియోవిధముల మనదేశమునకు శ్రీరామరక్షఁ జేయుచు
న్నారు. మనదేశమునకు శత్రువుకాదగిన రాజమండలియంతయు నాంగ్ల
రాజ్య విస్తారముతో నెచ్చటనో యొకచోట సంబంధము గలవారగుటచే
నాంగ్లేయులే సింహావలోకనము చేయుచు మనదేశమునకు రాగల యాపద
లను మున్ముందుఁగనిపెట్టి కాపాడఁగలరు. కాఁబట్టి విదేశసంబంధములందుఁ
బనిగలిగి నడపుచుండు రాజ్యాంగమును( foreign office ) దేశరక్షకమైన
యుద్ధభటశాఖయు, (war office) జగదేకబలాఢ్యులై యున్నయాంగ్లేయ
దొరతనమువారి యాధిపత్యము క్రిందనే యుండుట యత్యావశ్యకము. అందు
చేవిశిష్ట స్వరాజపద్ధతియే మనకు శరణ్యము. కాఁబట్టి దేశాభిమానులగు వారిశు
ద్ధస్వరాజ్య పక్షము వారిని నాంగ్లదొరతమువారికే కాక హిందూమహాజనుల
కుఁ గూఢబద్ధవైరులని భావించి స్వలాభాపేక్ష చేతనైన వారిని నిర్మూలనముచే
యుటకుఁ దొరతనమువారికిఁ దోడ్పడవలయును.

హిందూదేశముయొక్క భాగ్యవశమున విశిష్ట స్వరాజ్య వాదులగు
రెండవతెగవారు దేశమందు బాహుళ్యముగానున్నారు. వీరాంగ్ల దొరతన



మువారియాధిరాజ్యము నొప్పుకొనుచు, స్వదేశ రాజ్యకార్యములందుమాత్ర
ము స్వరాజ్య స్వాతంత్ర్యమును గాలక్రమమున జనులొనందునకుఁ దగిన
విద్యా విక్రమములును గార్యదక్షతయుఁగలిగినకొలఁది నాంగ్లదొరతనమువారి
యంగీకారముతో సంపాదించుకొనఁ గోరువారయినందున వీరిమతమునకు మూ
లసిద్ధాంతము రాజభక్తి. (Loyalty.) ఈ ప్రధానలక్ష్యమును దప్పక,
స్వదేశ స్వరాజ్యమును సంపాదించుకొనుటకు వీరుచేయవలసిన తీవ్రప్రయ
త్నమెంతకాలము పట్టినను, నెంతనెమ్మదిగాఁగొనసాగినను నాంగ్లదొరతనము
వారినే నమ్ముకొనుచు కార్యసాఫల్యము నొందగలమని వీరికి దృఢవిశ్వాస
ముకలదు. కాంగ్రెసు ముఖమున వీరుదొరతనమువారికిఁ దెలియజేసికొను
గోరికలను వారువెనువెంట దీర్చకపోయినను, దొరతనమువారికి హిందువుల
కార్యసమర్థతను గూర్చి తగిననమ్మకము కుదుర్చుటకుఁ బాటుపడవలెను-
విశిష్ట స్వరాజ్య స్వాతంత్ర్యమును బొందుటకుఁ దగినగుణసంపదయు రాజ్య
తంత్ర విజ్ఞానమును సంపాదించుకొనవలెను. ఇట్టిలక్షణములనుసముకూ
ర్చుకొనవలసిన భారము మనపయి నెంతోఘనముగానుండగా దొరతనమువా
రిపయి ద్వేషము వహించుట వివేకముకాదు. మనలనిప్పుడు పాలించుచున్న
యెడ్వర్డు చక్రవర్తిగారును, వీరితల్లిగారగు విక్టోరియా మహారాజ్ఞిగారును
దగినసమర్థతగలిగినకొలది నాంగ్లేయులతో సమముగా హిందువులకుఁ గూడఁ
దగిన స్వాతంత్ర్యముల నిచ్చెదమని వాగ్దానములను జేసియున్నారు. ఆం
గ్లరాజ్య భారమును వహించియున్నవారిలో మనచక్రవర్తిగా రొక్కరేకాక,
ఆయన కాలోచనను చెప్పువారు పార్లమెంటువారుకూడఁ గలరు. పార్లమెం
టులో లిబిరలుపార్టీ వారు ప్రాయికముగా నివృత్తిపరులై యితరులకు స్వా
తంత్ర్యము నిచ్చుటకు వెనుదీయువారు. కన్సర్వేటివు పార్టివారు ప్రాయి
కముగాఁ బ్రవృత్తి పరులై మార్పులకు జంకుచు, నున్నపద్ధతిలోని సుగుణము
లనే పరిపరి గణించుచుందురు. ఇందునకుఁదోడుగా మాటలయందును మర్యా
దలందును నాచారమునందును మనమాంగ్లేయులకు విలక్షణముగానుండుటచే
వారుసామాన్యముగా మన కష్టసుఖములను గ్రహింపఁజాలరు. ఇట్టియపరో

ధములెన్నియో మనసంకల్ప సిద్ధికిఁ బ్రతిబంధకములుగా నుండగా వేగిరపాటుకూడదనియు శాంతము వహించి విశ్వాసముతోఁ బాటుబడినయెడల కన్సర్వేటివుల వలనఁ గాకపోయినను లిబరలు పార్టీవారి వలననైన మనకు స్వరాజ్యము లభించుననియు నీవిశిష్ట స్వరాజ్య వాదులకుఁ బూర్ణవిశ్వాసమున్నది.

మనదేశమందుఁ బూర్వరాజులెన్నఁడు నేకచ్ఛత్రాధిపత్యము చేసి నడిలేదు. అశోక వర్ధన మహారాజునుగూర్చియు చంద్రగుప్తుని గూర్చియు, నట్టి ప్రతీతికలదు గాని యాసేతు హిమాచలము వఱకువారు రాజ్యమేలిరని చెప్పుటకు విశ్వాసార్హమైనయాధారములేదు. అందుచే మనదేశవాసుల కేకభాషా వాచకము గాని, యేకజాత్యభిమానముగాని వేళ్లుపారలేదు. మీఁదుమిక్కిలి వర్ణమత శాఖాభేదములు స్థిరపడియున్నవి. ఇట్టిచో నీభేదము లున్నంతకాలము మనకు రాజకీయస్వాతంత్ర్యము లందని పండ్లేయని తలంపఁ గూడదు. కనడమండలముల వర్తమాన యితివృత్తమెంతయు మనదేశమువారికి మార్గ ప్రదర్శకముగనున్నది. ఆంగ్లేయులు, ఫ్రెంచివాళ్లు, జర్మనులు, రష్యావారు, నార్వేస్వీడను దేశీయులు మొదలగు భిన్నజాతులవారును భిన్నమతముల వారును భిన్నవర్ణముల (దేహచ్ఛాయ) వారు నాదేశమును గాఁణాచిగాఁ జేసికొని, దేశాభిమాన మాననీయులై సకలదేశములకంటెఁ దమదేశమే సర్వవిషయములయందును వాసికెక్కునట్లు వృద్ధి చేయవలెనని పాటుపడుచున్నారు. వీరి నేకముఖముగఁ జేసి యన్యోన్యభేదములను మరపించి యేకప్రయోజనము కొఱకు సంఘీభూతులను జేయు మహాశక్తి దేశాభిమానమే. ఆంగ్లేయుల యాధిరాజ్యముక్రింద స్వదేశ స్వరాజ్య పద్ధతిని రాజ్యము నడపుకొనుచుండుటచే దేశమందన్యోన్య కలహములు గలుగునని కాని, విదేశస్థులు దాడివెడలి స్వదేశమందున్న భిన్నజాతులవారిలో వైషమ్యములు పెంపుచేయుదురని కాని వారికి భయములేదు. ఇట్లు భిన్నభావము మఱచి యేకీభావముతో నేకప్రయోజనము కొఱకుఁ బాటుపడునట్లా దేశస్థులఁబురికొల్పుచున్న దేశాభిమానమే మనకునుశరణ్యము.



ఆదేశము వారందఱును గలిసి దేశప్రయోజనము కొఱకుఁ బాటుపడుటకు సాధనము వారిపార్లమెంటు. మనదేశమునకట్టి సాధనములేదు. కనడాప్రజలు వేర్వేరు జాతులవారైనను, నందఱును గొలదిగనో గొప్పగనో రాజ్యాంగ స్వాతంత్ర్యధర్మము లందభ్యాసము గలిగి యాదేశమునఁ జేరినవారగుటచే వారుపార్లమెంటును స్థాపించుకొని రాజ్యతంత్రమును నడపుకొనుచున్నారు. ఒక్కరాజే పరమాధికారిగనుండి యేలినరాజ్యపద్ధతి కలవాటుపడి ప్రజాప్రతినిధి ప్రభుత్వ మర్యాదలకుఁ జిరకాలమునుండి దూరగులమై యున్నమన కిప్పుడట్టి పార్లమెంటును దొరతనమువారియ్యజాలరు. కాఁబట్టి యేకప్రయోజనాపేక్షతో భిన్నవర్ణ మతశాఖలవారగు మనదేశస్థులు కూడి రాజకీయ వివేకమును గ్రియాదక్షతయు సంపాదించుకొనుటకు నేషనలు కాంగ్రెసు తప్పమఱియొక అచ్చపట్టు మనకులేదు.

కాంగ్రెసు మహావ్యూహమున కంగనిర్మాణము చేయుటకు మనదేశము తొమ్మిదిభాగములుగా విభజింపఁబడినది —అవి, చెన్నపట్టణము, బొంబాయి, యూనైటెడు బంగాళాదేశము, యూనైటెడు ప్రావిన్సులు(సంఘపరగణాలు) నార్తు వెస్టరను ప్రావిన్సులు కలుపుకొని పంజాబు, సెంట్రి ప్రావిన్సులు (మధ్య పరగణాలు), బేహారు బీరారు. బర్మా. వీనికాంగ్లభాషలో ప్రావిన్సులనిపేరు. మనభాషలో పరగణాలని వాడవచ్చును. ఈపరగణాలలో నేబదియైదు లక్షల గ్రామములున్నవి. ప్రతి గ్రామమువారును గొందఱ ప్రతినిధుల నేర్పఱచుకొని స్వరాజ్యము సంపాదించుకొనవలయునను మహాసంకల్పము ముందుంచుకొని, దానికిసాధనముగామనము దొరతనమువారివలనఁ బొందవలసిన స్వాతంత్ర్యములను గూర్చి చర్చించుటకు గ్రామకాంగ్రెసు కమిటీయొకదాని నేర్పఱచుకొని యీకమిటీవారు తీరుమానములను తాలూకా కాంగ్రెసుకమిటీవారియొక్కయు, వీరుజిల్లా కాంగ్రెసుకమిటీవారియొక్కయు నాలోచనమునకుఁ దీసికొనివచ్చుచుండవలయును. గ్రామకాంగ్రెసుకమిటీలనుండి కమిటీలకొకరుచొప్పునఁ బ్రతినిధు లేర్పడి, యట్టిప్రతినిధులందఱుకలసి, తాలూకా కాంగ్రెసు కమిటీగాను, వీరినుండి యిట్లే జిల్లా

కాంగ్రెసు కమిటీగాను నేర్పడవలెను. ఇట్టిన్ని గ్రామములవారును, అన్ని తాలూకాలవారును, నొక్క జిల్లాకమిటీగా నేర్పడుటకు భారముగాఁ దోచినయెడలఁ గొన్ని తాలూకా కాంగ్రెసుకమిటీల ప్రతినిధులు కూడి జిల్లాసబు కాంగ్రెసు కమిటీలుగా నేర్పడవచ్చును. జిల్లాయొక్కటికి గొందఱు చొప్పునఁ బ్రతినిధులేర్పడి, యిట్టి ప్రతినిధులందఱును జేరి పరగణా కాంగ్రెసుకమిటీగా నేర్పడవలెను. పైని వివరించిన తొమ్మిదిపరగణాలనుండి నియమింపఁబడిన ప్రతినిధులు కూడి సమష్టి నిండియా నేషనలు కాంగ్రెసు సభగా నేర్పడవలెను. ఇట్లు సంవత్సరమాద్యంతముగాఁ బరగణాకమిటీలును, జిల్లాకమిటీలును, తాలూకా కమిటీలును, గ్రామకమిటీలును, జేసిన కార్యకలాపమంతయు సంవత్సరాంతమునందు జరుగు నేషనలు కాంగ్రెసు మహాసభయందుఁ జర్చింపఁబడి నిర్ధారణము చేయఁబడిన తీరుమానములు మాత్రము దొరతనము వారికి నివేదింపఁబడును. ఇట్లేర్పడిన కాంగ్రెసు మహా ప్రవాహము శాఖోపశాఖలుగఁ బూనికతోడను బట్టుదలతోడను బనిచేయుటకలవాటు పడినయెడలఁ బ్రజాబాహుళ్యమునకు స్వరాజ్యప్రభుత్వము వారిపయిఁ బడు రాజ్యభారము యొక్క స్వరూప స్వభావములు బోధపడును. ప్రతి గ్రామమువారును దేశసమష్టి ప్రయోజనమే ప్రధానముగాఁ గలిగి స్వప్రయోజనమును మాత్రము చూచికొనక, బహుజనాభిప్రాయమునకు దాసోహము చేయునలవాటుపడి స్వరాజ్య భారమును నిర్వహింపఁగలుగుదురు. జాతిమత వైషమ్యములుమట్టుపడును. ఆంగ్లేయులచే దిగ్విజయము చేయించి, ఆంగ్లమహారాష్ట్రములో సూర్యుడస్తమింపడను నట్లు రాష్ట్రవిజృంభణము కావించినది యాంగ్ల మహాజనుల సంఘీభూతరాజ్యకార్యదక్షత్వమే కాని వేఱు కాదు ప్రపంచములో నేదేశమందును నాంగ్లేయుల నలంకరించుచున్న యీ కార్యదక్షత చూడరాదు. స్వతంత్ర రాజ్యతంత్రమును నడపుటకలవాటు పడిన యాంగ్లేయు లిట్టి క్రియాదక్షత్వము మనలో వర్ధిల్లువఱకు మనకు స్వరాజ్యస్వతంత్రమెట్లు ప్రసాదింపగలరు? కాఁబట్టి స్వరాజ్యభారము వహించుటకు వలయు కార్య దక్షత్వమును మనము పయిని వివరింపఁబడిన దేశీయమహాజన సదస్యాంగ నిర్మాణము ననుసరించి పని



చేసి నేర్చుకొన్నయెడల మన సంకల్పతీవ్రతను బట్టియు, మన పట్టుదలను బట్టియు, మన రాజభక్తినిబట్టియు మనము కాలక్రమమున నాంగ్లదొరతనము వారే కనడా మొదలగు వలసదేశములకిచ్చి నట్లే మనకును విశిష్టస్వరాజ్య స్వాతంత్ర్యమును బ్రసాదింతురని నిశ్చయముగఁ జెప్పఁగలము.

సంపూర్ణము.



# శుద్ధపత్రిక

:o:

| తప్పు | ఒప్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| రాచకి | రాజకీ | 3 | 4 |
| రుసేరము | రుసుసేరము | 5 | 2 |
| గానుగొని | గాంగొని | 6 | 16 |
| వారేకీభవము | వారేకీభావము | 6 | 17 |
| కాలము స్థిరపడి | కాలమునకుస్థింపడి | 7 | 12 |
| వర్ణపరంపర | కర్ణపరంపర | 8 | 5 |
| మతావలంబులైనయుద్ధ | మతావలంబులైయుద్ధ | 8 | 21 |
| రాచకార్య | రాజకార్య | 41 / 13 | 25 / 4 |
| పద్ద సేర్పఱదు | పద్ధతి సేర్పఱదు | 13 | 15 |
| పట్టణమునకడు | పట్టణముకడు | 14 | 6 |
| యచ్చినది | యబ్బినది | 15 | 17 |
| పరిపాలనకంటె | పరివారకులకంటె | 15 | 22 |
| రాజప్రిజా | రాజాప్రిజా | 16 | 15 |
| ప్రిభువులై | ప్రిభువై | a | 18 |
| భూతాధి | భూంతాద్రి | a | 21 |
| ఘనులు | గనులు | a | 22 |
| రాజులే | రాజువే | a | 23 |
| సమాజమునగసేర్ప | సమాజమేర్ప | 19 | 8 |
| రుజుకైనట్లెం | రుజువుకానట్లె | 20 | 23 |
| రతనికిపట్టి | రతనికేపట్టి | 22 | 12 |
| లేకుండి | లేకుండ | 24 | 14 |
| పగ | పద | 25 | 5 |
| శైన్యము | సైన్యము | 25 | 9 |
| తిరుగఁబడి | తిరుగఁబడినప్పుడు | 25 | 10 |
| డ్రిగుట | దునగుట | 27 | 1 |
| రాజులును | జూరాలును | 29 | 13 |
| షుబేదారు | ఁదాబేదారు | 31 | 9 |
| దీనితరువాత | దనలెరువాత | 33 | 1 |
| దుర్న్యయము | దుర్గము | 33 | 24 |
| చేషిన | చేసిన | 35 | 25 |
| గట్టుదేశము | గట్టినదేశము | 41 | 17 |
| రాచకార్య | రాజకార్య | 23 | 25 |
| బడివను | బడుటచే | 41 | 19 |
| స్వతంత్రి | స్వాతంత్ర్యి | 42 | 13 |
| స్వాతంత్రి | స్వాతంత్ర్యి | 43 | 15 |
| గోరి | గోరెను | 44 | 9 |
| సేనాక | సేతాక | 44 | 7 |
| వశవర్తుఁడై | వశవర్తియై | 44 | 19 |
| శాసనానుబంధము | శాసననిబంధన | 46 | 6 |
| నిరపాయ | నిరుపాయ | 47 | 1 |
| జీపన్ను | జేపన్ను | 50 | 25 |
| మీదగులాబి | మీఁదనున్న గులాబి | 60 | 65 |
| ట్యూడరును | ట్యూడరునకు | 61 | 12 |
| గరువము | పరువము | 66 | 25 |
| పీరిపైని సహిష్ణు | పీరిపైనసహిష్ణు | 67 | 5 |
| పదమూడు | పదుమూఁడు | 71 | 12 |
| జనప్రీలిని | జనప్రీతిని | 72 | 13 |

| | | | |
|---|---|---|---|
| ఏలెననిపట్టు | ఏలెననిరాణిపట్టు | 74 | 14 |
| కోర్టులు | కోర్టులో | " | 15 |
| ట్యూడరువంశ రాజులు | ట్యూడరురాణులు | 80 | 2 |
| సహాయు | సాహాయ్య | 83 | 13 |
| గాచకార్య | రాజకార్య | 22 | 25 |
| ధర్మప్రిత్ని | ధర్మపత్ని | డి | 13 |
| పాలెమెంటు | పార్లిమెంటు | 85 | 25 |
| నమ్మఁగూదని | నమ్మఁగూడదని | 86 | 3-4 |
| ఆది | అది | డి | 22 |
| డేశము | దేశము | డి | 24 |
| స్పర్ధ | స్పర్థ | 89 | 9 |
| వీరనృషులు | వీరపురుషులు | 90 | 18 |
| కాలములో | కాలములలో | 91 | 7 |
| యొకటి | యొకటి | 94 | 10 |
| మాంత్రిత్వము | మంత్రిత్వము | డి | 20 |
| స్వశక్తి | స్వశక్తి | 98 | 1 |
| యెడ | యెడ | 101 | 16 |
| పట్టు | పుట్టు | 102 | 22 |
| కక్ష | కక్షి | 104 | 22 |
| కొనిరి | కొనెను | 105 | 16 |
| కాథో | కాథో | డి | 17 |
| నరకము | వరకము | 106 | 9 |
| రపీ | వీరి | 108 | 1 |
| ప్రితిక | ప్రతి | డి | 18 |
| రాచకార్య | రాజకార్య | 23 | 25 |
| యుద్ధము | యుద్ధము | 122 | 5 |



| | | | |
|---|---|---|---|
| కముగ | కముగ | 124 | 3 |
| స్వేచ్ఛా | స్వేచ్ఛా | 125 | 2 |
| సిద్ధాంతము | సిద్ధాంతము | డి | 8 |
| నిర్ల | నిర్ణ | 146 | 21 |
| తటస్థిం | తటస్థిం | 153 | 17 |
| జర్మనీ | జర్మనీ | డి | 20 |
| శాశింపించి | శాసింపించి | 156 | 1 |
| మటలాడు | మాటలాడు | 158 | 17 |
| స్టూవర్టు | స్టూవర్టు | 159 | 7 |
| దనవంతు | ధనవంతు | 162 | 12 |
| భిదము | భేదము | 171 | 23 |
| పశ్చిమ | పశ్చిమ | 183 | 14 |
| కాథోలిక్కులు | కాథోలిక్కులు | 188 | 5 |
| వృద్ది | వృద్ధి | 193 | 6 |
| పారమెంటు | పార్లమెంటు | 206 | 16 |
| చక్రివర్తి | చక్రవర్తిని | 212 | 13 |
| రావారుఆస్ట్రియా | వారాస్ట్రియా | 214 | 13 |
| గలిసిన | గవిసిన | 217 | 5 |
| రాజయెను | రాజయ్యెను | 238 | 3 |
| బుట్టించు | బుట్టించు | 249 | 18 |
| 1632 | 1832 | 251 | 15 |
| పుం | పుర | 258 | 6 |
| నంత్రమాము | నంతమాత్రము | డి! | 24 |
| ముష్మ | ముష్మ | 265 | 24 |
| 1884. 1885 | 1864. 1865 | 270 | 8 |

## ఆంధ్రభాషాభివర్ధని ప్రచురముల పట్టిక.

ఆంధ్రభాషయందు, సనాతనాధునికేతిహాసములు, ప్రకృతిశాస్త్రములు, అన్యదేశదార్శనిక గ్రంథములు, మహాపురుషుల జీవితములు, గణితశాస్త్రములు, రాజనీతిశాస్త్రములు, అర్థికశాస్త్రములు, వృత్తులను పరిశ్రమములను, వాణిజ్యమును, నడుపు విధమును దెల్పు గ్రంథములు, నవలలు, లేని లోపమును నివారింపనెంచి రు 10000-0-0 మూలధనముతో, ఆంధ్రభాషాభివర్ధనీసంఘము' (లిమిటెడ్) అను పేరస్థాపించిన కంపెనీవారివలన ప్రచురింపబడి విక్రయమునకు సిద్ధముగానుండు గ్రంథములు.

1. **భారతధర్మదర్శనము:**— నిర్మల దేశానురాగమును, బ్రబోధించు పద్యకావ్యము. సుప్రసిద్ధుండగు, నొకయాధునికకవివరుచే మృదుమధురముగ రచియింపబడిన 119 పద్యములిందుఁగలవు వెల రు 0-2-0 శాశ్వితచందాదారులకు 0-1-6 మాత్రమే.

చ॥ మతములు సొచ్చినిల్లు జన మాన్యచరిత్రులు పుట్టినిల్లు న
ప్రతిమదయాశమాదిగుణ రత్నసమృద్ధికి రోహణాద్రి శా
శ్వతనిరపాయమోక్షఫల భాసురవల్లికి నాలవాలమై
యతులవిభూతిఁ బొల్తు విల నంబరో! నీసరిధన్యు లుందురే? ॥

ఈపద్యమునుబట్టి, శైలియును, భావములను గ్రహించనగును.

6. **విద్యాసాగరుని చరిత్ర:**— నిర్మలవిజ్ఞాన విశారదుండు ననిర్వచనీయ కళ్యాణగుణాకరుండు, నార్తజన సంత్రాణ పరాయణుండునగు నిట్టిమహనీయుండు త్రికాలంబులం గలఁగఁడంచు విబుధప్రపంచంబు సంభావింపం జెన్నారిన పుణ్యపురుషుని చారిత్రంబు. ఆంధ్రభాషం జదువనేర్చినందుల కీపొత్త మొక్కండ సంపూర్ణప్రతిఫలం బొసంగుటకుం జాలియుండు. 150 పుటల గ్రంథము. పటముతో

వెల రు 0—9—0; చందాదారులకు రు 0—6—0.

7. **రామమోహనరాయచరిత్ర:**— నిర్మల బ్రహ్మజ్ఞాన ప్రభాకరోదయంబుఁ గావించి, అనాథలగు యువతులను బట్టి బలవంతముగఁ గాల్చివేయు సతి యను భయంకరాచారంబు నడంచి తన మాతృభూమియగు భరతవర్షంబు నుద్ధరింపఁ దత్పూర్వమెన్నఁడు హిందువులెవ్వరును వెళ్లుటకు సాహసించని ఖండాంతరమునకనేకమాసములు మహార్ణవముపై బయనమొనర్చి యచట మకోటి ననేక యుపన్యాసములనిచ్చి కార్యవిజయము గాంచువరకుఁ బట్టువిడువక తన దేశవాసుల కొఱకు పాటుపడుచుండిన మహాపురుష పూజ్య చారిత్రము. 200 పుటల గ్రంథము. పటములతో,



వెల రు 0—12—0; చందాదారులకు రు 0—8—0.

8 **స్వాతంత్ర్యదర్శనము:**— జాన్‌స్టూవర్టుమిల్లు అను ఆంగ్లేయ పండితోత్తముని, లిబర్టీ, అను సుప్రసిద్ధ గ్రంథము యొక్క భాషాంతరీకరణము మనోవాక్స్వాతంత్ర్యము, వ్యక్తిస్వాతంత్ర్యము, స్వాతంత్ర్యపరిమితి, మొదలగు సాంఘికశాస్త్ర సిద్ధాంతము లీగ్రంథమునందు, చరిత్రాంశములతోడ, వివరింపబడినవి. ఈగ్రంథము పాశ్చాత్య వాఙ్మయమునం దుత్కృష్టగ్రంథముగ పరిగణింపబడుచున్నది బందరు నోబులుకాలేజియం దుత్తమాధ్యాపకులగు మ॥ రా॥ రా॥ దుగ్గిరాల రామమూర్తిపంతులు బి. ఏ. యల్. టి. గారిచే సుబోధకముగ తెనిగింపఁబడినది. కాలికోకవరు 175 పుటలు.

వెల రు 0—12—0; చందాదారులకు రు 0—7—0. మాత్రమే

## 9 మహారాష్ట్ర చరిత్ర

ఇరువది రెండు చిత్రపటములు.

—:0:—

భరతవర్షపు భూమీపటము

—:0:—

ప్రథమభాగము,

**విషయసూచిక** దేశాచారవర్ణన

దక్కను మహమ్మదీయ రాజ్యములు.

మహారాష్ట్ర విజృంభణము.

శివాజీ వంశము.
శివాజీ లేఖలు.
శివాజీ రాజకీయ జీవితము.
శివాజీ పరిపాలనా పద్ధతులు.
మహారాష్ట్రుల జాతీయ స్వాతంత్ర్యము.
సాహు
బాలాజీ విశ్వనాథుడు.
మహారాష్ట్ర రాజ్య పునర్నిర్మాణము.
బాజీరావు పీష్వా.
బాలాజీ బాజీరావు పీష్వా.
పీష్వా మాధవరావు శక్తి.

<u>చిత్రపటములు</u>

శివాజీ- రామదాసుస్వామి.
శివాజీ-నవాబు కూతురు.
ప్రతాపగడకోట
రాజా వెంకాజీ
గోలకొండ దుర్గము.
తారాబాయి
సాహు మహారాజు
పీష్వా బాజీరావు.
అహల్యాబాయి
పార్వతీ దేవాలయము
పీష్వా మాధవరావు.
నారాయణరావువధ.

మొదలగు చిత్రపటముల తోడను, అనేకకథావిశేషములతోడను, రాజనీతివిచారణలతోడను, నీగ్రంథము విరాజిల్లుచున్నది. సామాన్య చదువరులకు రంజకమును, విమర్శకులకు కావలసినంత చరిత్రసామగ్రియు, పొందుపరుపబడియున్నది.

వెల చందాదారులకు మాత్రమే. రు 1-4-0



## 10 ఆంగ్లేయ రాజ్యాంగ నిర్మాణ చరిత్ర.

ఇంగ్లండు దేశీయుల రాజ్యపరిపాలన, నాగరికతయు, విపులముగ నిందువర్ణించc బడియున్నది.

ప్రాచీన వృత్తాంతము, విదేశ రాజులపరిపాలనము. స్వాతంత్ర్యనిర్ణయమహాశాసనము, నిరంకుశ ప్రభుత్వమునకు పార్లమెంటునకు పోరాటము. ప్రజాప్రభుత్వము. అమెరికాయుద్ధము. శిల్పకళల ప్రాభవము, పార్లమెంటుసంస్కారము. విక్టోరియామహారాజ్ఞి, కాలనీలు హిందూదేశము. స్వరాజ్యము మొదలగు విషయములు గలిగి గవర్నమెంటు తెలుగు ట్రాన్సులేటరుగారగు, గోటేటి కనకరాజుపంతులు బి. ఏ. బి. యల్ గారిచే ప్రౌఢముగ రచియింపబడిన గ్రంథము, ఇందు 6 చిత్రపటములును 2 దేశపటములునుగలవు. 300 పుటలు. ప్రశస్తమగు కాలికో బైండు. వెల రు 1—4—0 చందా దారులకు రు 0—12—0 లు మాత్రమే.

## 11 పశుశాస్త్రము.

పూర్వ, నవీన పద్ధతులతోడను, ఉపమాన, ఉపమేయములతోడను, పశుసంరక్షణకు వలయుమార్గము లిందు విపులముగా వర్ణింపబడినవి దీనియందు సహదేవ పశుశాస్త్రము గూడ చేర్చబడినది. వ్యవసాయపత్రికాధిపతులగు టేకుమళ్ల రాజగోపాల రావు గారిచే వ్రాయబడినది.

[అయిదుపటములుగలవు]

## 12 ఆరోగ్య శాస్త్రము.

ఈ క్రింది సూత్రములను గమనింపుడు

1. ఆరోగ్యమును గాపాడుటకు వ్యాధిచికిత్సకన్న వ్యాధి నివారణమే (శ్రేష్టతరమగు) పరమ సాధనము
2. దేహము వ్యాధులకు లోనగుటకు రెండులోపములుండవలెను.

(i) దేహదౌర్బల్యము.

(ii) వ్యాధికారణములగు సూక్ష్మజీవులను, విషకరపదార్థములన

3. స్వారోగ్యరక్షణ విధానమును, గృహారోగ్య నిర్మాణమును, జక్కఁగ గమనించిన దేహదార్ఢ్యమును నిలుపుకొనగలము.

(iii) సూక్ష్మజీవు లాహార జలవాయువు లగుండ దేహములోనికి బ్రవేశించి సాంక్రామిక వ్యాధుల నుత్పన్నము సేయును.

4 ఆరోగ్యశాస్త్రమున నీయంశములన్నియు చర్చింపబడినవి.

"వాయువను" శీర్షికక్రింద వాయువునందుండు కల్మషములును, వాయువు ప్రచారమును దానివలని ప్రయోజనములన, వాయువును శోధించు విధమును, వివరింపబడినవి

'జలమను' శీర్షికక్రింద పానీయజలమునకు మూలాధారములును. వాని తారతమ్యములును, జలమునందుండు రసాయన కల్మషములును, సూక్ష్మజీవులును, జలమును శుభ్రపఱచు పద్ధతులును, శోధించు విధానమును, తెలియజేయ బడినవి.

'ఆహారమను' శీర్షికక్రింద ఆహార విధానము. ఆహారాంశములు, దేహమునకు వానివలని ప్రయోజనములు, వానియందుండు కల్మషములును, కల్మషములను నివారించు విధమును ఆహార ద్రవ్యములను శోధించు నిర్ణయము విరళింపబడినవి.

'గృహములను' శీర్షికక్రింద గృహముల నెట్టి స్థలములయందును, నెవ్విధమునను, నేయేసూత్రములను గమనించియుఁ గట్టవలెనో యవన్నియు వర్ణింపబడినవి.

మఱియు చెత్త మొదలగు వ్యర్థపదార్థముల నెట్లు పరిష్కరింపవలసినదియు, సాంక్రామిక వ్యాధులను, అనగా మశూచి విశూచి జాడ్యములు తాపజ్వరము, బొబ్బతెగులు, వానికారణములు, వానిని నివారించుపద్ధతులును, అనుదినమారోగ్య రక్షణమునకు మనము గమనింపవలసిన సూత్రములను ప్రజాసంఖ్య ప్రతిసంవత్సరము నెట్లు హెచ్చునదియు, భీమాకంపె



లేనియామకలపై నాధారపడి యున్నదియు, ఇంకను దినదినము వా[illegible]రింపవలసిన యనేక ధర్మములును, సులభశైలిని, సవిస్తరముగ మ॥ రా॥ రా॥, డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య బి, ఏ. యం. బి. సి. యం గారిచే రచింపఁబడినయీ గ్రంథము. వెల రు 1-4-0 లు. చందాదారులకు 0-12-0 లు మాత్రమే.

## పునర్ముద్రణమందున్న గ్రంథములు.

(2) అక్బరుచరిత్ర (3) పీష్వానారాయణరావు (4) వివేకానంద స్వామిజీవితము (5) సిక్కులచరిత్ర.

## ముద్రణమందున్న గ్రంథములు.

(13) అశోకునిచరిత్ర (14) చీనాచరిత్ర. ఔరంగజేబుచరిత్ర,

## ముద్రింపఁ బడవలసిన గ్రంథములు.

ఆంధ్రచరిత్ర, అమెరికాచరిత్ర, జపాన్ చరిత్ర, మహారాష్ట్రచరిత్ర 2వ భాగము, జ్యోతిష శాస్త్రము మొదలగునవి.

N. *B.* మాశాశ్వత చందాదారులకు 100 పుటల గ్రంథములు పోస్టేజీకాక 0-4-0లు చొప్పున నిచ్చుచుందుము. 0-4-0 ప్రవేశ కట్నము చెల్లించవలయును. దరఖాస్తులు చేయువారు వివరముగ విలాసము వ్రాయవలయును.

మేనేజరు,

ఆంధ్రభాషాభివర్ధనీసంఘము

(లిమిటెడ్,) మచిలీపట్నం.

## ఆంధ్ర పత్రిక

ఈ పత్రికను ఆంధ్ర స్త్రీ పురుషులు చదివి తీరవలయును. ఒక్కసారి చదివినవారికి ఎల్లప్పుడు చదువ వలయునను కోరిక పుట్టక తప్పదు. చక్కని వ్యాసములతోను, వార్తలతోను, హాస్యములతోను, వినోదములతోను నిండియుండి చదువరులకు విందొనరించుచుండును. ఆంధ్రపత్రికలన్నింటిలో చవుకయయిన పత్రికయే కాక ఎక్కువ వార్తలతో నిండియుండును. ఆంధ్రభాషలో దేశభక్తుల పటములను బ్రకటించు పత్రిక ఆంధ్ర పత్రికయొక్కటియే. ఒక్కపత్రికను ఉచితముగ తెప్పించుకొని చదువుఁడు. ఆపయిన మీరే చందాదారులు కాగలరు.

చందా సం॥ 1కి 2-2-0 ఆఱుమాసములకు 1-3-0 లు

చిరునామా—ఆంధ్రపత్రిక మేనేజరు గారు

ఫోర్టు, బొంబాయి.

## శ్రీ ప్రబోధిని

ఇది ప్రతిమాసమును ప్రథమ దినమునఁ బ్రచురింపఁబడును. ఇందలి యర్ధభాగమున విశ్వబ్రాహ్మణ సంస్కరణోపన్యాసములు, శిల్పశాస్త్ర వ్యాఖ్యానములు, కర్మవిద్యా విషయకోపన్యాసములు, చేతిపనుల రీతులు, పౌరుషేయాన్వయ మహాపురుష జీవిత చరిత్రలు, నీతి, మత, విద్యా, బోధకములగు ప్రసంగములు, మొదలగునవియు, చక్కని యర్ధభాగమునందు రసవంతములగు నాటకములు, కావ్యప్రబంధములు, మున్నగునవియుఁ గలిగి రమారమి నలుబది పుటలకంటె నెక్కువగఁ బ్రకటింపఁబడును.

| | | | | |
|---|---|---|---|---|
| పోషకులకు సంవత్సరమునకు అంచెకూలితో | | | | ౧౦-౦-౦ |
| సహాయ్యులకు | ,, | ,, | ... | ౫-౦-౦ |
| చందాదారులకు | ,, | ,, | ... | ౨-౦-౦ |
| విడిపత్రిక యొకటికి | ,, | ,, | ... | ౦-౩-౦ |

వలయువారు,

ప్రబోధినీ మేనేజరు,

గుంటూరు.

అని వ్రాయవలెను.

